# ఢిల్లీ దర్బారు

సంపాదకుడు కే. వి. లక్ష్మణరావు

చెన్నపట్టణము, 1912.

Record no. 15

# Ḍhillī darbāru

Kē. Vi. Lakṣmaṇarāvu (ed)

Cenna paṭṭaṇamu, 1912.

Record no. 15

## Bibliographic Record Target

ఢిల్లీ దర్బారు / సంపాదకుడు కే. వి. లక్ష్మణరావు. - చెన్న పట్టణము : జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, 1912.

xvi, vi, 2, 387, 2 (24) p., (24) leaves of plates : maps, ports. ;18 cm.
Record no. 15

Ḍhillī darbāru / sampādakuḍu Kē. Vi. Lakṣmaṇarāvu. - Cenna Paṭṭaṇamu : Jyōtiṣmatī Mudrākṣaraśāla, 1912.

xvi, vi, 2, 387, 2 (24) p., (24) leaves of plates : maps, ports. ;18 cm.
Record no. 15

# డిల్లీ దర్బారు

కొమరాజు లక్ష్మణరావు

ప్రచురింపఁబడిన గ్రంథములు.

# హిందూ మహాయుగము.

ఇది హిందూదేశ కథాసంగ్రహముయొక్క మొదటిభాగము. మనపూ ల రాజ్య విస్తారంబును, అప్రతిమశౌర్యంబును, అకలంక స్వదేశభక్తియు నిసికొనగోరు వారీగ్రంథము తప్పక చదువ వలయును. అత్యంతపురాతన కా లమునుండి మహమ్మదీయుల దండయాత్ర వరకుగల చరిత్రమంతయు సవిస్తర ంపఁబడినది. గ్రంథకర్త, కే.వి. లక్ష్మణరావు ఎం. ఎ. మా చందా రులకు పోస్టేజితో 0-11-0 ఇతరులకు పోస్టేజిగాక రు. 1-0-0.

# రాణీసంయుక్త.

జగద్విఖ్యాతమై, నాటకరచనలకు మార్గదర్శకమై శైలియం దును, వర్ణనలయందును, కథాచమత్కారమునందును నిరుపమానమై పండితుల చేతను పామరులచేతను పొగడ్తగన్న ఈఅద్భుత నవలను గురించి ఎంతవ్రాసి నను నివిదీంద. దీనిం జదివి యిందలి సారస్యమును పాఠకులే గ్రహింతురు గాక. చందాదారులకు. పోస్టేజితో 0-9-0 ఇతరులకు పోస్టేజిగాక 0-12-0 ంథకర్త వేలాల సుబ్బారావుగారు.

# విమలాదేవి.

ఇది విచిత్రమైనక్రొత్త నవల. రంగుపటములు కలిగియున్నది. రాజసిం ని యొక్కయు అతని భార్యయగు విమలాదేవి యొక్కయు, శౌర్యము, ర్యము, మతాభిమానము మొదలయినవిందు చక్కగ ప్రదర్శింప బడినవి. ఇం దుర్గాదాసుల రాజభక్తి, దేశభక్తి, ధర్మాసక్తి, గోలకొండలోని యక్కన్న దన్న గారి వైభవమును, వైకుంఠచోగిచేసిన యద్భుత కృత్యములును మిగుల మణీయముగ వర్ణింపబడినవి. కథాసందర్భము (Plot) అత్యద్భుతము. ర్ణనలు అశ్రుతపూర్వములు. మా చందాదారులకు 0-13-0 ఇతరులకు 1-2-0 ంథకర్త బాలకవి, భోగరాజు నారాయణమూర్తిగారు.

మేనేజరు- విజ్ఞానచంద్రిక- చింతాద్రిపేట- మద్రాస్

# రసాయనశాస్త్రము. (Chemistry).

ప్రకృతి శాస్త్రాభ్యాసముచేయువారీశాస్త్రమును ముందు నభ్యసింపవలెను. ఈ గొప్పశాస్త్రము మనతెలుగువారికికూడ లభ్యమగుటకై పెక్కు చక్కని పటములతో సులభశైలిని తయారు చేయించినారము. రెండవకూర్పు ప్రతులుగూడ చాలవరకు కర్చగుటయే దీని ప్రాశస్త్యమును దెలుపగలదు. చక్కని క్యాలికోబైండు చేయబడినది.

శ్రీయుత వి. విశ్వనాథశర్మ ఎం.ఏ. గారిచే వ్రాయబడినది.

చందాదారులకు పోస్టేజితో 0-13-0. ఇతరులకు పోస్టేజిగాక రు 1-4-0.

# భౌతికశాస్త్రము.

దీనినింగ్లీషులో ఫిజియాగ్రఫి (Phisiography) అందురు. అనేక చక్కని పటములుకలవు. "ప్రకృతి రహస్యములను దెలిసికొని సృష్టి విచిత్రములయొక్క మహిమను జ్ఞాననేత్రముతో జూచి యానందించుట కిది చాల సహాయపడును. ఇదికేవలము శాస్త్రీయ విషయమైనను సామాన్య జనులు సహ గ్రహించునట్లుగ పటములతో బహు సులభముగ రామణీయకముగను వ్రాయబడియున్నది." అని దీనినిగూర్చి 'ఆంధ్రభారతి' వ్రాయుచున్నది.

శ్రీయుత మైనంపాటి నరసింహము బి. ఏ. బి. ఎల్. ఎల్. టి. గారిచే రచింప బడినది. చందాదారులకు అంచెకూలితో రు 1-0-0 ఇతరులకు పోస్టేజిగాక రు 1-8-0.

# కలరా.

ఈజాడ్యమును గూర్చిన సమగ్రమగు పుస్తకము. డాక్టరు ఆ. లక్ష్మీపతి బి. ఏ. ఎం. బి. సి. ఎం. గారిచే వ్రాయబడినది. చందాదారులకు పోస్టేజితో 0-4-0 ఇతరులకు పోస్టేజిగాక 0-6-0.

## పునర్ముద్రణమగుచున్న గ్రంథములు.

అబ్రహాములింకను, జీవశాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము.

---

మేనేజరు విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మదరాసు.

**Vijnana Chandrika Series**

EDITED BY

K. V. LAKSHMANA RAO, M.A.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం । న్యాయ్యేన మార్గేణ మహీంమహీశాః.



శ్రీరాజదంపతులు

# ఢిల్లీ దర్బారు.

ఇది

కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ.

గారిచే సంపాదితము.



చెన్నపట్టణము

జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె

1912

—

Rs.100/-

చందాదారులకు 1-0-0]



[ఇతరులకు 1-8-0

# రాజపోషకులు.

శ్రీ బొబ్బిలి మహారాజుగారు

జి. సి. ఐ. ఇ.

శ్రీ పిఠాపురము రాజాగారు

శ్రీ మునగాల రాజాగారు





**To**

**COMMEMORATE**

The 12th of December 1911,

**The Day of**

**The Coronation Durbar**

of

**HIS IMPERIAL MAJESTY GEORGE V.**

AT DHELI.

# Foreword.

His Majesty Emperor George V's Coronation Durbar is now a historical fact. Millions of people have rejoiced over the event and hundreds and thousands of them have expressed their intense pleasure in prose, verse and song. All have realized that the Durbar of the 12th of December 1911 is the most auspicious event in the history of our land. The time has now come for the Indian and the Briton to realize fully the responsibilities on either side and work together towards a common goal in complete trust and comradeship. Our Sovereign and his advisers, Lord Crewe and Lord Hardinge, have unmistakeably declared *his will* and made our millions throb with a new hope and a new life. His Majesty has by one of his boons indicated without doubt that the immediate work before us is the education of the people of our mother-land. And it is but right that those who have been engaged in that Department of work, be they among the rulers or the ruled, should treat the 12th of December last as a landmark in the history of India, more especially so, in the history of Indian Education. As a token of the humble ap-

preciation of the events that happened on that historic day in that historic city of Dheli, we feel happy in presenting this book to the public.

The plan of the book does not require much explanation. We have had in mind the idea that the book should be really historical. We have attempted to give a brief history of the city of Dheli, the biographies of their Majesties, the histories of Representative Native States whose princes were the most prominent at the homage ceremony, and the history of the more important Durbars held at Dheli.

Much less need there be said about the title of the book. The contents of it and the immediate cause of its publication do explain how it came to be named 'Dheli Durbar.'

In the preparation of this work a very large number of books and papers has had to be consulted. The more important among them are given in a separate list. We have great pleasure in acknowledging our indebtedness to all the authors and editors and offering them our sincerest thanks.

We have to express our thanks to Mr. V. Ramadoss Pantulu, B. A., B. L., High Court Vakil, for the kindness with which he perused the manuscript, to the Proprietors of the Guardian Press for lending some of the blocks used in this book, to Mr. Vedam Vencataraya Sastriar who



with his usual cheerfulness bore all the trouble that the rapid execution of the printing gave him while the book was passing through his press and finished the whole work in a very short time indeed and to Mr. A. Veerabhadra Rau for the most patient manner in which he went through the proofs.

*The Editor.*

# SELECT BIBLIOGRAPHY.

## GENERAL.

Treaties, Engagements and Sannads—Aitchinson.
Native States of India—Malleson G. B.
Princes, protected of India—Lee-Warner.
Two Native States—J. D. B. Gribble.
Chiefs, Rajas, Zamindars—Ghose.
India (British) Prosperous—Digby.
India, History of Hindu and Muhammadan Periods—Elphinstone.
India, History of—H. G. Keene.
India Comprehensive History—Beveridge.

## DHELI PAST AND PRESENT.

History of Indian Architecture—Fergusson.
Seven Cities of Dheli—Hearne.
Dheli or Indraprasth—(Maharatti) B. Parsanese.
All about Dheli—G. A. Natesan.
Epigraphia Indica.
History of India, Muhammadan Period (Telugu) K. V. Lakshmana Rau. M. A.

BIOGRAPHIES OF THEIR MAJESTIES.

Our King and Queen—David Williamson.
Queen Mary—Sir C. Kinlock-cooke.
With the Prince through India—Abbot.
Prince of Wales Tour—Times of India.
Amrita Bazaar Patrika.

HYDERABAD.

Carnatic War, Committee to inquire into the Causes [East India Company].
Curzon, Lord—Notable Speeches.
India, History as told by its own inhabitants—Elliot.
India, Men and events of my time—Temple.
Journals kept in Hyderabad, Kashmere, Sikkim and Nepal—Temple.
Military transactions of the British Nation in Indostan—Orme.
Mogul Empire—Keene H. G.
Nizam, Origin and Future of Hyderabad—Mac Auliffe.
Nizam, Our Faithful ally—Fraser.
Nizam's Dominions, Photographic History—Campbell.



Rulers of India Series—Hyder Ali & Tippu
Imperial Gazetteer—Hyderabad State.
The Hindu—1902.
Administration Reports of Berar.
Times of India, Illustrated Weekly.
Parliamentary Paper relating to Berar [1902]

BARODA.

Maharattas, History—Grant Duff.
Maharatta power, Rise—Ranade.
Representative Indians—Parameswaram Pillai.
Bombay Gazetteer.
Imperial Gazetteer—Baroda State.
Baroda—C. S. Raghunatha Rau.

MYSORE.

India, Hindu Period (Telugu) K. V. Lakshmana-Rau. M. A.
Mysore, Brief History—Krishna Rau
Mysore, Historical Sketches—Wilks.
Mysore,—C. S. Raghunatha Rau.
South India Dynasties, Sketch—Sewell.
History of the Andhras [Telugu]—Ch. Veerabhadra Rau.

Mysore Gazetteer—P. L. Rice.
Epigraphia Carnatica
State Papers Published by the Standard Press, Bangalore.

**HISTORY OF DURBARS.**

Mahabharata (Telugu.)
Jaimini Bharata (Telugu)
Indian Review—Coronation Number.
Life of Queen Victoria [Telugu]—K. Veerasalingam Pantulu.
Fort St. George Gezette—1908 Dec.
The Hindu—Dec. 1911.



# భూమిక.

మన యైదవజార్జి చక్రవర్తిగారి పట్టాభిషేకమహోత్సవపు దర్బారు గడచిన మాసముననే నడచినదే యైనను దాని ప్రబల ఫలములంబట్టి యది ముఖ్యచారిత్రికాంశములలో నొక్కటియని యంగీకరింపఁబడి యున్నది. కోట్లకొలఁది జనులు దర్బారు నాఁటి కార్యములకు మహానందంబు నందిరి. ఆయానందంబుం వెలిఁబుచ్చ విద్యావంతులును కవులును వేనవేలు గద్యరూపములును పద్యరూపములును గద్యపద్యాత్మకములును నగు వివిధకృతుల నొనర్చియున్నారు. అందును పందొమ్మిదివందలపదునొకండవ సంవత్సరము డిసెంబరుమాసము పండ్రెండవ తేది మంగళవారము అగునాదినము మహా సుదినంబని గ్రహించియున్నారు. ఆంగ్లేయులును భారతీయులును దమతమ కర్తవ్యములఁ బూర్ణముగ నెఱింగి పరస్పర గాఢానురాగముతో నేక పరిణామమునకయి నిండు ప్రయత్నములఁ జేయ నదను గలిగినది. మనసార్వభౌముండును ఆతని మంత్రిసత్తములగు లార్డుహార్డింగు లార్డుక్రూలును ఆతని యుదారహృదయమును వెల్లడించి మనయందు నూతనభావములఁ గల్పించి మనకొక నూతనవికాసము గల్గునట్లొనర్చి

యున్నారు. మనము మనమాతృదేశమునకై ప్రస్తుతము సేయవలసిన ‘ఏకపరిశ్రమ’ విద్యాప్రసారణంబని మన చక్రవర్తిగారు తమవరములలో నొక్కఁటిచేఁ జాటియున్నారు. కావునఁ దత్కార్యబద్ధులగువారు పాలకులైనను పాలితులైనను గడచిన డిసెంబరు మాసము 12 వ దినమును భరతవర్ష చరిత్రమునందు, అందును ముఖ్యముగ భరతవర్ష విద్యాచరిత్రమున, పరిస్ఫుటాంకముగ నెన్నవలసియున్నది. ఇట్టి చారిత్రిక సుప్రసిద్ధికి నర్హంబగునాదినమందు చిరకాల సుప్రసిద్ధంబగు ఢిల్లీనగరమున జరిగిన కార్యములయెడ మాకుంగల గౌరవమును సూచించు నుద్దేశముతో నాకార్యములకుఁ గొంత మునుపటి నుండియే మాచే రచియింపం బడుచుండిన ఈ గ్రంథమును ఇప్పుడు వాచక ప్రపంచమునకు సమర్పించుచున్నారము.

ఈగ్రంథ విషయమును గుఱించి విశేషము వ్రాయుట అనవసరము. ఇద్దానిని నిశ్చయ చరిత్రాధికారానుసరణము చేయుటకు పాటుపడియున్నారము. సంక్షిప్తముగ ఢిల్లీనగర చరిత్రమును, శ్రీరాజదంపతుల చరిత్రమును సమ్మాననతు లొనర్చిన సామంత ప్రభువులలో ప్రముఖులగు వారి రాజ్యచరిత్రమును, ఢిల్లీయందు నడచినముఖ్యమగు దర్బారుల చరిత్రమును, మాశక్తికొలఁది ప్రదర్శింప పరిశ్రమఁ జేసినారము.

గ్రంథనామమును గుఱించియు నెక్కుడు వ్రాయఁబని లేదు. పైనిసూచింపఁబడిన విషయములను బట్టియు ప్రకటన



కారణమును బట్టియు నీగ్రంథమునకు ‘ఢిల్లీదర్బారు, అనినామకరణముసేయుట సహజమని మాచదువరులకు విశదము గాకపోదు.

ఈగ్రంథము రచించుటయందు అసంఖ్యేయపుస్తకములయుఁ బత్రికలయు సాహాయ్యము గొనవలసివచ్చినది. అందు ముఖ్యములగునవి వేరొకచో నాంగ్లేయభాషయందుఁ బేర్కొనఁబడినవి.

గ్రంథనిర్మాణమునఁ దోడయిన గ్రంథకర్తలకును విలేఖకులకును, వ్రాతప్రతి నవలోకించి సాహాయ్యమిచ్చిన మ. రా. వేమవరపు రామదాసుపంతులు బి. ఏ., బి. ఎల్. గారికిని, ఇందలి కొన్ని పటముల దిమ్మెల (Blocks) నొసంగినందులకు గార్డియన్ ముద్రాక్షర శాలాధిపతులకును, తమముద్రాక్షరశాలయందు నీగ్రంథము ముద్రితమగునెడ నెంతో శ్రమ ప్రయాసలకోర్చి బహుస్వల్పకాలమున నుల్లాసముతోఁ దీనిని సంపూర్తిచేసి యిచ్చిన బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రుల వారికిని, మిక్కిలి యోర్పుతో అచ్చు చిత్తులను దిద్ది సాయపడిన శ్రీయుత ఆదిరాజు వీరభద్రరావు గారికిని వందనము లొనర్చుచున్నారము.

సంపాదకుఁడు.

—ఢిల్లీ కోట దర్బారము.—

# విషయసూచిక.

## మొదటి ప్రకరణము.

### ఢిల్లీపూర్వ వృత్తాంతము.



## రెండవ ప్రకరణము.

### ప్రస్తుతపు ఢిల్లీ.



## మూడవ ప్రకరణము.

### శ్రీరాజదంపతులు

## నాలుగవ ప్రకరణము.

### హైదరాబాదు సంస్థానము.

## అయిదవ ప్రకరణము.

## బరోడారాష్ట్రము.







## ఆరవ ప్రకరణము.

## మైసూరు రాజ్యము.

## ఏడవ ప్రకరణము.

### పూర్వపు దర్బారులు.



## ఎనిమిదవ ప్రకరణము.

### బ్రిటిషు దర్బారులు.



---



# పటముల సూచిక.

---

* ఈ పటములన్నియు హాఫ్టోన్ పద్ధతిని చేయబడిన శ్రేష్ఠమైన దిమ్మెలు.



శ్రీహరింజిత్ప్రభువుగారు.



శ్రీత్రీప్రభువుగారు

శ్రీ వంకల లక్ష్మీదేవిగారు.
Peddapuram
East Godavari District
Andhra State.



# ఢిల్లీ దర్బారు.

## ఢిల్లీనగరచరిత్రము.

# ఢిల్లీ దర్బారు.

## మొదటి ప్రకరణము

## ఢిల్లీ పూర్వవృత్తాంతము.

ఆర్యావర్త చరిత్రమునఁ బ్రసిద్ధినొందినఁ బట్టణములలో నగ్రగణ్యము ఢిల్లీ. ఇది యనేకులచే ననేకయుగముల ననేక నామములచేఁ బిలువఁబడుచుండెడిది. దీనికి నాధునిక సుప్రసిద్ధ నామము ఢిల్లీయే యైనను, బ్రాచీనకాలమున సుప్రసిద్ధమయిన పేరు ఇంద్రప్రస్థపురము.

### ఇంద్రప్రస్థము.

ఈనగరము పుట్టుటకుఁ బాండవులు కారణము. కురుసంతతి హస్తినాపురమున రాజ్యమేలుచుండిరి. పాండురాజు పరలోకమున కేగినపిదపఁ గొంతకాలమునకు ధృతరాష్ట్రుఁడు పాండుకుమారులకుఁ బాలు పంచియిచ్చెను. వారిభాగమునకు వచ్చినది కురుక్షేత్రమునందలి ఖాండవప్రస్థము.

ఖాండవప్రస్థమనఁగా వ్యాప్తిగల యడవి. ఈయటవిప్రదేశమున మూలనివాసు లుండెడివారు. వారనార్యులు.

వారికి దక్షకులని పేరు. యుధిష్ఠిరుఁ డార్యసిద్ధాంత సంరక్షకుఁడు. అగ్ని బ్రాహ్మణరూపమును ధరించి ఖాండవదహనము నపేక్షించుటవలనను, అనఁగా ఆర్యులగు బ్రాహ్మణుల ప్రేరేపణవలనను, దిగ్విజయాపేక్షఁ జేసియు, యుధిష్ఠిరానుజుండగు నర్జునుఁడు కృష్ణసాహాయ్యమున మూలనివాసులను సాధించి యడవిప్రదేశముగనుండిన ఖాండవప్రస్థభాగమునంతయు నివాసయోగ్యముగ నొనర్చెను. తన్మధ్యమునఁ గట్టఁబడిన ధర్మరాజు ముఖ్యపట్టణమే ఇంద్రప్రస్థము. ఇంద్రుని సంరక్షణ దానికిఁ గలదను నమ్మకమువలనను నీనగరమూతని, యమరావతికి సౌందర్యమున నీడగుట వలనను దీనికీపేరు గలిగినట్లు తోఁచుచున్నది. పాండవులకాలమున నీపట్టణరాజము మిక్కిలి వృద్ధియయి 'పురోత్తమ' మనిపించుకొనియెను. ఇచ్చటనె ధర్మరాజునకు మూలనివాసులలో నుత్తమోత్తముండగు మయుఁడను శిల్పకళాధురీణుఁడు సాటిలేని సభామంటపమును నిర్మించి యిచ్చెను. అందే ధర్మరాజు రాజసూయయాగము చేసెను. ముందావిషయము వ్రాయఁబడును. భరత వంశజులగు వీరులు రాజ్యముచేసినంతకాల మింద్రప్రస్థపురము దలయెత్తికొని యుండెను. కృష్ణుని ప్రపౌత్రుఁడగు వజ్రనాభుఁడు, దక్కినయదు వంశమంతయు నశించినతరువాత, నిటనే రాజ్యాభిషిక్తుం డయ్యెను. శకవంశజులకిదియె రాజధానిగ నుండెను. క్రీ. శ 395 సం॥ మున విక్రమాదిత్యుఁడను బిరుదువహించిన రెండవ



చంద్రగుప్తుఁడు ఢిల్లీనగరమున నిలిపిన లోహస్తంభముమీఁది శాసనమునుబట్టి యిదియె గుప్తరాజులకుఁగూడ ముఖ్యపట్టణముగ నుండెనని తెలియుచున్నది. గుప్తులకుఁ దరువాత నిది రాజధానిగా నుండినదియు లేనిదియుఁ జెప్పనలనుపడదు. కనింగ్హాముగారి వ్రాతననుసరించి తోమరవంశమునందలి యనంగపాలుఁడు పుట్టు నప్పటికి ఢిల్లీ నామావశేషమై యుండెనని తెలియవచ్చుచున్నది.



అజమీర్ పట్టణము.

అతఁడు దీనికి మరలఁ బ్రాణముపోసి ప్రజలను జేర్చినట్లును తోఁచెడిని. ఇది పదునొకొండవ శతాబ్దమునందలి సమాచారము.

## పృథ్వీరాజు.

ఇతని సంతతి వారొక శతాబ్దకాలము పరిపాలించి యజమీరు రాజ్యాధిపతులగు చౌహాణులలోని వీసలదేవునిచే

నోడింపఁబడిరి. నాఁటినుండి చౌహాణ్ రాజులు ఢిల్లీకి నాథులయిరి. వీసలదేవుని మనుమఁడే లోకప్రసిద్ధిగనిన పృథ్వీరాజు. ఇతఁడు అజమీరు ఢిల్లీల రెంటికిని రాజయి ఢిల్లీయందు 'లాల్కోట'యును, దానికి బలమొసఁగ, మఱియొక కోటయును గట్టించెను. కొంతకాల మీక్రొత్తగ నేర్పడిన పట్టణమునకుఁ బృథ్వీనగరమని పేరుండెడిది. నేఁటికిని కుతుబ్ మినారు చుట్టుపట్ల నితనిచేఁ గట్టఁబడిన దుర్గపు శిథిల కుడ్యములు చూపట్టుచున్నవి. ఇతఁడు కనూజ్ రాజును తనకు విరోధియు నగు జయచంద్రుని పుత్రికయగు సంయుక్తను గాంధర్వ వివాహమున క్రీ॥ శ. **1175**-సంవత్సరమునఁగొని తరువాత మామగారితో ప్రచండముగఁ బోరి భార్యశౌర్యము వలన జయమందెను. *

**1182**-సం॥ మున నితఁడు చందెరాజును జయించెను. కాని యీతని యశస్సునకు హేతువు లివి యెవ్వియుఁగావు. భరతవర్షము నాక్రమింపఁ బ్రారంభించి దాడివెడలి బయలుదేరి వచ్చిన మహమ్మదీయ సైన్యమహాసముద్రమున కడ్డకట్టగా నిలిచి, ధైర్యస్థైర్య పరాక్రమములతోఁ బోరుటయె యీతని కజరామర కీర్తిని సంపాదించి పెట్టినది.

---

* (మహమ్మదీయ మహాయుగమున నీవిషయమంతయుఁ జక్కఁగ వర్ణింపఁబడియున్నది. విస్తరభీతిచే నిట విరమించితిమి).



పాంచాలదేశము మహమ్మదుగోరి స్వాధీనమై యుండెను. బిటుండా వఱకును నతని పటాలములు వ్యాపించి యుండెను. పృథ్వీరాజనేకులగు నాయకుల సమకూర్చుకొని గొప్ప సైన్యముతో నాపట్టణముపైకి వెడలెను. మహమ్మదుగోరి యితని నెదిర్చెను. స్థానేశ్వరమునకును గర్నాలునకును మధ్య ప్రదేశమున నిప్పుడు 'తిరారి' యనఁబడు 'నారాయణ్' వద్ద ఘోరయుద్ధము జరిగెను. పృథ్వీరాజు గోరీపైకురికి కుడిభుజమున ఖడ్గముఁ జొప్పించెను. 'ఇతని భటుఁడొక్కఁడితనినిం దక్షణమె మోసికొని పోవకున్న నా దెబ్బతోడనె యితఁడు చచ్చినవాఁడె" యని ఫెరిస్తా లిఖించి యున్నాఁడు. మహమ్మదీయ సైన్యము చెల్లాచెదరయి పోయెను. పృథ్వీరాజు సంపూర్ణవిజయమందెను. హిందూ చరిత్రకారులు గోరీ యీ విధమున నేడుసారు లోడిపోయి యేడుసారులు వదలిపెట్టఁబడెనని వ్రాయుచున్నారు. ఇది యెట్లున్నను గోరీ గొప్ప పరాభవ మందెననుట మాత్రము నిజము. పృథ్వీరాజునకు వైరులగు జయచంద్రుఁడాదిగాగల ననేకావనీశులు మొదటి నుండియు గోరీకి సాయమొనర్చిరి. కాని వారికి క్రీ॥ శ. **1193**-వఱకును మనోభీష్ట మీడేరలేదు. ఆ సంవత్సరమున గోరీ **1,20,000** సైన్యమును జేర్చుకొని పృథివీరాజునకు "నీవు మహమ్మదీయుఁడైనను గమ్ము. లేకున్న సమర మొసంగు"మని వార్తఁబంపెను.

అతఁడి ద్దానిని తృణీకరించి రెండుసంవత్సరములకు మున్ను గోరీని ప్రాణావశేషునిఁ జేసి వదలిన స్థలమునందె మరల యుద్ధమునకు సన్నద్ధుఁడయి "నీకు నీప్రాణములపై యాశ లేదేని నీ సైనికులకైననుండదా! వారికైన సుఖంబుగ నుండనీరాదా" యని పరిహసించుచుఁ బ్రత్యుత్తర మంపెను. గోరీ విశ్రమమునకుఁ గొంతకాలమడిగెను. ఆ యొడంబడికను నమ్మి రాజుసైన్యములు హాయిగ నిదురఁజెంది యుండెను. అట్టి తరుణమున గోరీ మోసముచేఁ దన భటులను హిందువులమీఁదికిఁ గవియించెను. హఠాత్తుగ మైఁబడిన మహమ్మదీయ మహాంభోనిధిని దరియింప రాజుబలము లసమానశూరత్వముతోఁ బోరిరి. కాని ఫలము లేదయ్యె. పృథ్వీరాజును మహమ్మదీయులు చెఱపట్టి చంపివేసిరి. ఢిల్లీనగరము మహమ్మదుగోరీ బానిసీఁడగు కుతుబుద్దీను వశమయిపోయెను. ఇంతటితో భరతఖండంబున హిందూసామ్రాజ్య మంతరించెను.

బా ని స వం శ ము.

క్రీ. శ. 1206 వ సంవత్సరమున ఢిల్లీరాజధానిగఁ జేసికొని కుతుబుద్దీను రాజ్యము ప్రారంభించి తనపేరఁబరగు మసీదును గట్ట మొదలిడెను. కుతుబ్ మినారును నిర్మించెను. ఇతని యల్లుఁడగు నల్తమషు దీనిని బూర్తిగావించెను. ఈవంశములోని నాసిరుద్దీను కాలమున రాజ్యములోపలను వెలుపటను దిరుగుబాటులును కలహములును జరిగెను. కాని యితఁడు దనకంటెఁ



బూర్వమునందలి రాజులవలె దుర్మార్గుఁడును వృథావ్యయపరుఁడునుగాక నిర్మలమగు నడవడిక గలవాఁడు. ఇతఁడొక విషయమున నెల్లరకును నాదర్శకుఁడనియే చెప్ప నొప్పును. ఢిల్లీరాజ్య పరిపాలకుఁడుగనుండియు నితఁడు దన స్వార్జితము వలననే జీవయాత్రఁగడపెను. పారసీ భాషయందలి గ్రంథముల ప్రతులు వ్రాసి యితఁడు దన కర్చులకు సంపాదించుకొనుచుండెను. ఇతని ప్రోత్సాహముననె పారశీక భారత వర్షముల చరిత్రయగు 'తాబకాతినాసరి' యనునది రచింపఁబడెను. ఇతనికిఁ దరువాత నితని బానిసయు దండనాయకుఁడును నగు గ్యాసుద్దీన్ బల్బను రాజ్యమునకు వచ్చెను. ఇతని కాలము సరికి మొగలాయీల దాడి యెక్కుడయినందునఁ బన్నెండుగురు మహమ్మదీయప్రభువు లితనికడఁ జేరియుండిరి. ఢిల్లీయందలి వీధుల కితఁడు వీరిపేరులఁ బెట్టెను. క్రీ. శ. 1288 లో నీ బానిసవంశపురాజును జంపించి జలాలుద్దీన్ ఖిల్జీ సింహాసనము నాక్రమించుకొనెను.

ఖి ల్జీ వం శ ము.

జలాలుద్దీన్ ఖిల్జీ బహుపరాక్రమశాలి. ఢిల్లీద్వారము వఱకును నాలుగుమారులు ప్రయాణమై వచ్చిన మొగలాయీల నితఁడు తిరుగఁగొట్టియు యం దనేకులను దనమతమునకుఁ జేర్చుకొని తనకొలువునందే యుంచుకొనెను. వారికిఁ బ్రత్యేకించి యొకపుర భాగమును గట్టించి దానికి 'మొగల్పుర'మని పేరిడెను. ఇతనిని జంపించి గద్దెనెక్కిన యల్లాయుద్దీను మొగలాయీ

యాలను రెండుమారు లెదిర్చి యోడించి తన విడిదిని బలపఱుచుకొనుటకుఁ గోటను గట్టుకొనెను. (క్రీ. శ. 1299). ఇదియె నూతన ఢిల్లీ. దీనిని బురాతన ఢిల్లీతో జహానపానా అనుపేట గలిపి వేయుచున్నది.

## తుఘలఖ్ వంశము.

ఖిల్జీవంశ మంతరించి గ్యాసుద్దీన్ తుఘ్లఖ్ రాజ్యారూఢుఁడయిన తోడనే యతఁడు (క్రీ. శ. 1321) ఢిల్లీకి నాలుగు మైళ్లదూరమున తుఘ్లఖాబాదును నిర్మించెను. కాని యిప్పుడది నిర్జనముగా నున్నది. క్రీ. శ. 1325 లో మహమ్మదు తుఘ్లఖ్ సింహాసనమునకు వచ్చెను. అతని రాజ్యకాలములో బటూటాయను ప్రవాసికుఁ డొక్కఁడు ఢిల్లీని దర్శింప వచ్చెను. అతఁడప్పటి ఢిల్లీనిగూర్చి యిట్లు వ్రాయుచున్నాఁడు:—

"అది గొంచె మించుమించుగ నెడారివలె నుండెను. అందుఁ గట్టడములు చాలతక్కువ. గృహస్థులింట్లు వదలిపోయి యుండినందున నది పూర్తిగఁ బాడుపడి యుండెను. ... అందువలన లోకమునందలి యత్యుత్తమ నగరమున నత్యల్పసంఖ్యగల గృహస్థులుండుట తటస్థించెను." ఇందతిశయోక్తి యేమియును లేదు. "పేరువహించిన ఢిల్లీనగరము గుడ్లగూబలకు నివాసముగను, అటవి మృగముల కాస్థానముగను వదలిపోవుచున్నాను." అని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. ఇట్లున్నను "ఇది మిక్కిలి మహత్వముగల పురము. సౌందర్యమును బలమును



దీనియందు మేళవమాది యున్నవి. దీని గోడలకు సమానమగునవి లోకమున మఱియెచ్చటను గానము. హిందూస్థానమున నిద్దియె విశాలతమము. హిందూస్థానమునసేల, మహమ్మదీయ మతము వ్యాపించిన పౌరవాత్యదేశములనెల్ల యనియే చెప్పవచ్చును. నాలుగునగరము లొక్కటితో నొక్కటి చేరి యీ నగరమయియున్నది. దీని కోటగోడల వెడలుపు పదునొకండు మూరలు...ఇందుండు మసీదు మిక్కిలిగొప్పది. కట్టడపు వైశాల్యమునను సొంపునను దానిని జయించున దింకొకటుండదు. ఢిల్లీమహమ్మదీయులకు లోఁబడక మున్నిది హిందువుల 'ఎల్ బుర్ఖానా' యను దేవాలయముగ నుండెడిది. తరువాత నిది మసీదుగ నుపయోగింపఁబడెను. దీని యంగణము నందొక ఖానా గలదు. మహమ్మదీయ నగరములం దెచ్చటను దీనికిఁ బ్రతివచ్చునది లేదు. దీనిపైనుండి క్రిందికిఁ జూచిన వయోవంతులగు మనుష్యులు చిన్నబిడ్డలవలెఁ గానుపింతురనిన దీని యౌన్నత్యము దెలియఁగలదు. ఆయావరణమునందే యొక స్థూలస్తంభము గలదు. సప్త ఖనులనుండి దీనినిగట్టుటకు శిలలు గొనిరాఁబడెనఁట. దీనిపొడవు ముప్పది మూరలు చుట్టుకొలత యెనిమిది మూరలు. ఇది యత్యద్భుతముగదా" అని బటూటా వ్రాయుచున్నాఁడు. ఈ స్తంభ మశోకుని స్తంభమని తోఁచుచున్నది. క్రీ. శ. 1351 లో ఫిరోజుషా ప్రస్తుతము హుమాయూను సమాధి యెల్లగఁ గల ఫిరోజాబాదును గట్టెను. అతని కాలమునఁ బ్రజలు

మిక్కిలి సౌఖ్యముందిరి. కాని యతనికిఁ దరువాతి రాజులు బలహీనులు నవివేకులు నైనందున లోకప్రసిద్ధుండగు 'తయమూరులంగు' ఢిల్లీజొచ్చి యవాచ్యంబగు క్రౌర్యముతోఁ క్రీ. శ. 1398 లోఁ జన్నలు పెద్దలు, స్త్రీలు పురుషులు, నను వివక్షత లేకుండ నందఱను ఖడ్గమువాతనఱకి, నగరమునందలి ద్రవ్యము నంతయుఁ గొల్లకొట్టుకొని పోయెను. అతఁడు దీసికొని పోయిన ధనమింత యని లెక్కపెట్టుటకుఁ గూడఁ గాదని చరిత్రకారులు వ్రాయుచున్నారు. ఇతఁడు వెడలి పోయిన రెండు మాసముల వఱకును ఢిల్లీయరాజకముగనుండెను. ఇక్బాలనువాఁడు గొంత పరిశ్రమచేసి ఢిల్లీయందలి యల్లకల్లోలమును మాన్పెను. బాదుషాహ యగు మహమ్మదీతని మరణానంతరము మరల సింహాసనము నెక్కెను. కాని ఢిల్లీకి బయట నితని శక్తిసాగలేదు. (1412)


తైమూరులంగ్.

ఆఫ్గన్ రాజవంశావసానము

ఇతఁడు పరలోకగతుఁడైన తరువాత సయ్యదు వంశము వారు పరిపాలించిరి. వారిని లోడివంశము మ్రింగివేసెను. ఈ



వంశములో రెండవవాఁడగు సికందరులోడి ఢిల్లీని వదలి యాగ్రాను రాజధానిగ నేర్పఱచుకొనియెను. ఇతని కుమారుఁడు సికందరు మిక్కిలి దుర్మార్గుఁడై నిరంకుశాధికారముతో మెలఁగఁ బ్రారంభించుట వలన తయమూరు వంశస్థుఁడగు బాబరు హిందూస్థానసామ్రాజ్యమును గైకొనుట సులభసాధ్యమయ్యెను. లోడీ బాదుషాహ పానిపత్ కురుక్షేత్రమున నోడింపఁ బడెను. జహీరుద్దీన్ మహమ్మదు బాబరు బాదుషాహ యయ్యెను.

మొగలాయివంశము

బాబరు నాలుగుసంవత్సరములు (1526-1530) రాజ్యముచేసి చనిపోయెను. తదుపరి యతని పుత్రుఁడు హుమాయూను బాదుషాహయై దన రాజధానిని మరల ఢిల్లీకి మార్చి యచ్చట నింద్రప్రస్థముండిన ప్రదేశముననె ఒక్క కోటను గట్టించెను. దానినె 'పురానాఖిల్లా' (ప్రాతకోట) యందురు. ఇతనిని ఓడించి క్రీ॥ శ॥ 1540 లో 'కాబూలు' నగరమునకుఁ బారఁదోలి, షేర్


బాబరు.

షాహా యనునతఁడు పురమును సంరక్షింపఁ బ్రాతకోట నొక దానిని నిర్మించెను. లాల్దర్వాజా యను దుర్గద్వార మిప్పటికిని



ఢిల్లీ కోట

యతని కార్యవైభవమును జాటుచున్నది. ఇతని పుత్రుఁ డిప్పటి





హుమాయూను.

కిని గల సాలింఘురు కోటను గట్టించెను. హుమాయూను రెండవ మారు రాజ్యమునకు వచ్చెను. అతని సమాధి యీసాలింఘురుకుఁ బ్రక్కన నే యున్నది. అక్కాలపు శిల్ప కళాభివృద్ధిని యిది బహు బాగుగఁ బ్రదర్శింపు చున్నది. అక్బరు చక్రవర్తి హుమాయూను మరణము నకు దరువాత క్రీ.శ. 1556 లో సింహాసనా రూఢుఁడయ్యెను. ఇతఁడు సర్వసాధారణముగ నాగ్రాయందె నివసించుచుండెడి వాఁడు. ఇతని యాస్థాన కవీశ్వరుఁడును మంత్రియు నగు 'అబుల్ ఫజలు' దన 'అయినీ అక్బరీ'లో ఢిల్లీని వర్ణించి యున్నాఁడు గాని యావర్ణనవలన నది రెండవపట్టణమని గోచరము గాక మానదు.

జహాంగీరునూర్జహానుల వివాహ సంవత్సరము (క్రీ. శ. 1611) న విల్లియముఫించు ఢిల్లీని దర్శించెను. అప్పటి రాజధానియగు నాగ్రానుండి యతఁడు లాహూరునకుఁ బ్రయాణము సాగించుచుఁ ద్రోవయందు ఢిల్లీలో నిలచెను. "నవ

దుర్గములును నేబదిరెండు ద్వారములును గలదను ప్రఖ్యాతిఁ గాంచిన ప్రాచీన ఢిల్లీశిథిలాంగములు వలపటఁగాన నగును. అందిప్పుడు నివసించునవి గుడ్లగూబలు. దీనికి ననతిదూరమున యమునా నదిపై పదునెకండు కమానులతో నొప్ప చిన్న వంతెన యొకటి గలదు. ఇటనుండి గొప్ప ప్రాకుల నల్లని చల్లని



జహంగీరు.



అక్బరు.

నీడలచే నాకరింపఁబడిన రాచ బాటఁ బట్టి పోయిన, నిప్పటి రాజుగారి తాతయగు హుమాయూను సమాధి చేరుదుము. మిక్కిలి విలువ గల రత్నకంబళములు పఱువఁబడిన యొక విశాలమగు భవనమధ్యమున నితనిగోరీ యున్నది. దీనిపై నెప్ప



డును స్వచ్ఛమగు తెల్లని పచ్చడము గప్పియుందురు. దీని కెదుటి పార్శ్వమునను, దీని నడినెత్తికి సూటిగను నమూల్య మగు 'షామియా' ( Semiane)విందులు గురిపించు చుండును. అచ్చటచ్చట చిన్నచిన్న మేజాలపై నొకకొన్ని గ్రంథములు గాన నగును. వీనిప్రక్కననె హుమాయూను వరకత్తి, పాద



హుమాయూను గోరీ.

రక్షులు మున్నగునవి ప్రదర్శింపఁ బడియున్నవి. ... ... ... ఈ నగరమునను నగరప్రాంతములను రమారమి యిరువదిగురు పఠానురాజుల దివ్యసమాధులు గలవు. భరతవర్షపురాజు లెల్లరును నీ పురమునందె పట్టభద్రులు గావలెను. లేకున్న వా రాక్రమికులుగ నెన్నఁబడుదురు. సుందరోద్యాన వనములచేతను ప్రాచీనశోభాచిహ్నములగు కట్టడములచేతను జుట్టఁబడిన బయ

లు ప్రదేశమున నీ ఢిల్లీ నగరమున్నది" యని వ్రాయుచున్నాఁడు.



షాహ జహాను

జహాంగీరు కుమారుఁడు షాహజహాను దన తండ్రితాతలు ఢిల్లీకిఁ గనుపఱచిన యలక్ష్యమును రద్దుపఱచనో యన నిప్పటి ఢిల్లీని క్రీ॥ శ॥ 1638లో షాహజహానాబాద్ అనుపేరఁ గట్టించి దానిలోఁ దనమహాలును జుమ్మామసీదును నెలకొల్పెను. ఇతని కాలమునకుఁ దరువాత నెప్పుడో యొక కొద్ది దినములు దప్ప నెల్లప్పుడును నీ నగరమె మొగలాయీల రాజధానిగ నుండెడిది. షాహజహాను ఆ గ్రామవదలి ఢిల్లీని జేరుటకే పుర మెక్కుడు సమశీతోష్ణస్థితులు గలదగుటచేతనని తెలియవచ్చుచున్నది. షామషాహయును వర్తకులును షాహజహానాబాదులో నివసింతురు.



ఔరంగజేబు.



ప్రభువులలో ననేకులును బీదసాదలును పురాతన ఢిల్లీలో నిండ్లు గట్టుకొనిరి.



నాదిరుషాహ.

శ్రీశివాజి యీనగరమును క్రీ॥ శ॥ 1666 లో దర్శించెను. ఔరంగజేబు బాదుషాహ కాలమున ఢిల్లీ పూర్వవైభవమున నుండెడిది. ఈవంశమునందుఁ గడపటివాఁడు మహమ్మదుషాహ. ఇతని కనంతరము సింహాసనారూఢులయిన మొగలాయీలు నామమాత్ర చక్రవర్తులు. మహారాష్ట్రులు మొగలసామ్రాజ్యమునం దెక్కుడు భాగమును లోఁబఱచుకొనుచుండిరి. ఇంతలో (1739) తయమూరులంగు సంతతివాఁడగు నాదిర్‌షాహ దాడెత్తి వచ్చి తయమూరుమాదిరి నితఁడును గొల్లకొట్ట మొదలిడెను. నలుబదియెనిమిది దినములు పురమును దోఁచుకొని, షాహజహాను బాదుషాహ వలనఁ జేయింపఁబడి లోకప్రసిద్ధిఁ జెందిన మయూరాసనము నితర ద్రవ్యములతోఁ గూడ నపహరించుకొని పోయెను. క్రీ॥ శ॥ 1759 లో ఢిల్లీ

సంపూర్ణముగ మహారాష్ట్రుల స్వాధీన మాయెను. కొంత కాలము ఢిల్లీకై పోట్లాటలు జరిగెనుగాని 1788 లో మహారాష్ట్రసైన్యము బాదుషాహానగరున స్థిరముగ స్థాపింపఁబడెను. పదునారు సంవత్సరముల కాల మీమహారాష్ట్ర వీరు లేక చ్ఛత్రాధిపత్యముగ నుత్తర హిందూస్థానమునంతయు నేలిరి. క్రీ॥ శ॥ 1803 లో లార్డులేకు ఢిల్లీ యుద్ధమున వీరినోడించి నగరము నాక్రమించుకొని యదివఱకు బొత్తిగ నంతరింపక నామావశేషుఁడై యుండిన రెండవ షాఆలం బాదుషాహాను దన సంరక్షణమం దుంచుకొనెను. క్రీ. శ. 1857 వ సంవత్సరమున జరిగిన సైనికుల తిరుగుబాటు వఱకును నాంగ్లేయులు బాదుషాహా పేరుతోడనే ఢిల్లీ నేలుచుండిరి. ఆమహాక్షోభకథ యిట వ్రాయు టనవసరము. దానిని బ్రిటిషువా రణఁచుట యందు విజయులై తమచేతినుండి యూడి పోయిన ఢిల్లీని మరల వశపఱచుకొనిన తోడనె బాదుషాహా నామమును దుడిచివైచిరి. కొంతకాల మాపట్టణమును సైనిక పరిపాలన (Military Government) క్రింద నునిచిరి. బ్రిటిషుభటులనేకులు చంపఁబడుచు వచ్చినందున ఢిల్లీ పౌరులందఱును బట్టణమునుండి వెడలఁ గొట్టఁబడిరి. కాని యచిరకాలములోనె హిందువులును, 1858 సంవత్సర ప్రారంభమున మహమ్మదీయులునుఁ జేర గలిగిరి. అప్పుడె సైనికరాజ్యాంగము పోయి దివానీ పరిపాలన (Civil Government) ప్రారంభమాయెను. నాఁటినుండి నేఁటివఱకును ఢిల్లీనగరము శాంతిమెయి నూతన మార్గములఁ దనకాలము గడపుచున్నది.



క్రీ॥ శ॥ 1876 వ సంవత్సరమున యువరాజుగనుండి నిన్న నేఁడు గతించిన సప్తమెడ్వర్డుగారు దమసాన్నిధ్యముచే నలంకరించిన దీనగరమునే. క్రీ॥ శ॥ 1877 వ సంవత్సరారంభ దినమున విక్టోరియామహారాజ్ఞి భరతఖండమునకుఁ జక్రవర్తిని యయ్యెననుటఁ జాటిన దీనగరమె. దాని కిరువదియాగు సంవత్సరము లీవల సప్తమెడ్వర్డు చక్రవర్తిత్వము నెఱుకపఱుప రాజప్రతినిధియగు లార్డుకర్జను మహాదర్బారుచేసిన దిచ్చటనె.

ఇట్టి చరిత్రముగల ఢిల్లీని గుఱించి యింకఁ గొన్ని సంగతులు ముందు ప్రకరణమునఁ గనుఁడు.

———



ఆకాశమునుండి కనబడు ఢిల్లీ

రెండవ ప్రకరణము.

# ప్రస్తుతపు ఢిల్లీ.

ఢిల్లీనగరము పంజాబుపరగణాలో యమునానది యొడ్డున నున్నది. ఇది కలకత్తానుండి 956 మైళ్లు; బొంబాయి నుండి 982 మైళ్లు; చెన్నపట్టణమునుండి 1100 మైళ్లు. ఇందుగల జనసంఖ్య 1901 సంవత్సరపు జనాభాననుసరించి 208, 575; ప్రస్తుతము 232, 859. ఈపురమున ననేకములగు యంత్రశాల లేర్పడి యుండుటవలన నానాటికిని జనసంఖ్య యెక్కుడగుచున్నది. మనజార్జిచక్రవర్తిగారి అభీష్టము ననుసరించి యిక ముందిదియె భరతఖండమునకు రాజధానియగుటంబట్టి మఱల నిది తన పూర్వోన్నత్యమును పొంది మఱల 'బురోత్తమ' మనిపించుకొనుననుటకు సందియము లేదు.

## పరిశ్రమలు.

ఢిల్లీ జనుల ముఖ్యవృత్తులనేకములు. అచ్చట చేతిపనులునుమెండు. ఆభరణములుచేయుట, వెండిపని, రాగియిత్తడుల యుపయోగము, దంతముపై చెక్కుట, కుమ్మరపని, గుడ్డలనేత, వెండిబంగారు జరీలతో బుటేదారుపని, చిత్రలేఖనము, వర్ణలే

పనము, మొదలగునవి ఢిల్లీకిసామాన్యములు. శతశతాబ్దములుగ ఢిల్లీయాభరణములనిన ప్రపంచమంతయు గనులెత్తి చూచుచు వచ్చుచున్నది. అయిన నిక్కాలమందచ్చట సిద్ధమగు భూషణములు మొగలాయి యుగమునందలి వానియంతటి యపూర్వమయినవని చెప్పనొప్పదు. దంతముపై చెక్కడపుఁబని నొకటిరెండు కుటుంబములవారు మాత్రము చేయుచున్నారు. ఇటీవల నీవస్తువుతోఁజిత్రమగు బహుమాన పేటికలు (Caskets) మున్నగునవి చేయఁబడినవి. అత్యద్భుత సంపూర్ణతాశక్తి (Power of finishing) చే నమర్పఁబడిన రేఖావృత విశాలరూపములే (Open-work Geometric pattern) వీనియందలి విశేషాంశము. కుమ్మరిపని యింకను నవీనము. ఇప్పుడిప్పుడే యొకరిద్దఱు పనివారలు నాణ్యతయంతగలేని పింగాణీ సామానులఁ జేయుచున్నారు. వెండిబంగారు జరీతో జరుగుబుటేదారు పనిమాత్రము గొంచెమెక్కుడు ప్రాముఖ్యతగలది. ఇది చాందిని చౌకులో విశేషము నడుచుచున్నది. పాశ్చాత్య సంబంధమచ్చటచ్చటఁ గానుపించుచున్నను మొత్తముమీఁద దీనియందలి పౌరవాత్య కళాకౌశల్యమింకను దలయెత్తికొనియే యున్నది. ఈపనికొఱకువలయు జరీసిద్ధపఱుచుటలో ననేకులకు జీవనముదొరకుచున్నది. వీరుమాత్రము గ్రామరక్షకసంఘమునకు (Municipality) సంవత్సరమునకు 25, 000 రూప్యముల పన్నునిచ్చుచున్నారు. సంఘమువారు ప్రత్యుపకృతిగ ముఖ్య





చాందినిచౌకు.

కార్యస్థాన మొక్కటి నేర్పఱచి యచ్చట జరీకి గాను కఱఁగఁబడు సువర్ణరజతములను బరీక్షించి జరీని నాణ్యము సెడకుండఁ జేయుచున్నారు. దానివలననే భరతవర్షమున నెచ్చటను ఢిల్లీ జరీకిఁ బేరు పెట్టువారు లేరు. నవీనయంత్రాలయ నిర్మాణము ఢిల్లీయందు బాగుగ వృద్ధియగుచున్నది. దూదివడుకు యంత్రశాలలును గుడ్డలు నేయు యంత్రశాలలును నాలుగు గలవు. పిండిచేయు యంత్రశాలలు 3 గలవు. చెఱకునాడు యంత్రశాలలు మూఁడు గలవు. అచ్చుయంత్రశాలలును, బిస్కత్తులు చేయు యంత్రశాలలును, ఇనుము ఇత్తడిమున్నగు లోహములతోఁ బనిసేయు యంత్రశాలలును గలవు.

రాజపుత్రస్థానమునకును కలకత్తా బొంబాయిలకును గల వ్యాపారమంతయు ఢిల్లీమార్గమున నడచుచున్నది. కావున నిది వాణిజ్యమున నెంతేని వన్నెకెక్కియున్నది.

ఢిల్లీకోటయందు కొంత ఆంగ్లేయసైన్యము నిలుపఁబడి యున్నది. తోపుఖానా (ఫిరంగులుండుప్రదేశము) యొకటియు, స్వల్పసంఖ్యాకులగు సైనికులును గలరు. సిపాయీలకాల్బలమును అశ్వికసైన్యమును మఱియొకచోట గలవు.

ప్రాచీన ఢిల్లీప్రదేశమున నొక్కెడ నిప్పటి ఢిల్లీకిఁ బదునొకండు మైళ్లదూరమునఁ బ్రతివర్షర్తు వందును గొప్పసంత జరుగును. బహుదూరమునుండి వేలకొలఁది జనులా స్థలమునఁ జేరుదురు.



లోకమునందలి యద్భుతములలో ముఖ్యము లేడు గలవని పాశ్చాత్యులలో నొక వాడుకగలదు. ఆ యేడింటిలో నొక్కటియగు కుతుబ్ మినారను జయస్తంభము. ఢిల్లీ నగరమున నున్నది. విశ్వకర్మ స్తుతి యీ కట్టడమునఁ గానవచ్చుటఁ బట్టియు దీని స్వరూపము హైందవ శిల్పికాపద్ధతిని స్పష్టముగఁ గనుపఱచుచుండుట వలనను నిది పృథివీరాజు వలనఁ బ్రారంభింపఁ బడెనను వారి వాదమునకు సమ్మతింప వలసి యున్నది. క్రీ॥ శ. 1191 లో మహమ్మదీయుల నోడించి వారిపైఁ దానొందిన విజయమును సూచింప నీతఁ డీమినారును బ్రారంభించెనని కొందఱును, నితని పుత్రిక యమునానదిని ప్రతిదినమును దర్శింప నభిలాషగల దగుటచే నాయమ ప్రీత్యర్థమై యిది ప్రారంభింపఁ బడెనని మఱికొందఱును జెప్పుచున్నారు. ఏది యెట్లున్నను శిల్పికాపద్ధతిని బట్టి యిది హైందవనిర్మాణమని నిశ్చయింపక తీరదు. పృథివీరాజున కనంతరము కుతుబుద్దీను దీనిని దనయవసరములకుఁ దగురీతిని మార్చి యుపయోగించి యుండును. అతని కిది రెండువిధములఁ బనికివచ్చెను. హైందవరాజుల నోడించి వేయించిన జయస్తంభముగను దన మతస్థులగు నాచార్యులు సాయంసమయముల భక్తులను దైవప్రార్థనకుఁ బిలువ నుపయోగకరమగు మినారుగను నతఁ డిద్దానిని బ్రవర్తింపఁ జేసెను.

దీనిప్రక్కన నొకదివ్యమగు హైందవదేవాలయ ముండెడిది. దానినిగూడ కుతుబుద్దీను కుతుబ్ మసీదుగ మార్చివేసెను. బానిస వంశీకుఁడయ్యును కుతుబుద్దీను చూపిన బుద్ధి కౌశల్యముచే నతఁడుత్తమ పరిపాలకులలో నొక్కఁడుగఁ బరిగణింపఁబడ నర్హుఁడు. సుందరవస్తువును మతావేశముచే నశింపఁజేయుట మాని యుపయుక్తమగు భంగి సంస్కరించి నిలువఁజేయుట యందఱకును సాధ్యముగాదు కదా!

ఇప్పుడు కుతుబ్ మినారు 238 అడుగల యెత్తుగలదు. క్రీ॥ శ. 1794 లోఁ గొలిచినప్పుడు 242 అడుగులుండెడిది. పిడుగులును భూకంపములును నిట్టియున్నతమగు కట్టడములకు వైరులు కావున నప్పటికే వీని ప్రభావము వలన దీని శిఖర మూడిపోయి యుండెను. అందువలన శిఖరమునకుగాను ఇంకను పదియడుగులు, పదియన నేల ఇరువదిగూడ, జేర్చవలసి యుండును. క్రిందిభాగమున దీని చుట్టుకొలత 48 అడుగుల 4 అంగుళములు. ఈమినారైదు భాగములుగఁ గట్టఁబడియున్నది. మొదటి 97 అడుగులొకమందము; 97 నుండి 148 వఱకును మఱియొకమందము; 148 నుండి 188 వఱకును వేరొకమందము; 188 నుండి 214 వఱకును నాలుగవ మందము; తరువాత కడపటి భాగము. పీఠమునుండి శిఖరమువఱకును బోనుపోను మందము క్రమక్రమముగఁ దగ్గుచుండును. ఒక్కొక్కయంతస్థును వేరుపఱచి మినారున కలంకారము నొసఁగుటకై





కుతుబుమినారు.

యీయాచోట్ల స్తంభమును జుట్టివచ్చు విశాలములగు 'సజ్జ'* (Balconies) లమర్పఁబడినవి. సజ్జలకు మధ్యప్రదేశము నందలి స్తంభోపరిభాగము కోణాకృతులును(angular)వలయాకృతులును నై పరస్పరానువర్తులగు పట్టెలతో శోభిల్లుచున్నది. ఈపట్టెలమీఁదఁ జూచువారల ననిమిషులఁ జేయఁగలుగునంతటి చిత్రమగు చెక్కడపుపని చేయఁబడి యున్నది. భారతవర్ష శిల్పికాచరిత్రను రచించిన ఫెర్గుసనను ప్రసిద్ధ గ్రంథకారుఁడిద్దానిని గుఱించి "ఈ జాతి కట్టడములలో నింత సౌందర్యము గల దింకెచ్చటను లేదని చెప్పుటలో నేమాత్రమును నతిశయోక్తి లే"దని వ్రాసియున్నాఁడు.

## కుతుబ్ మసీదు.

---

కుతుబ్ మీనారున కనతి దూరమున కుతుబుద్దీను వలన నిర్మింపఁబడిన ప్రాచీనమగు మసీదొకటిగలదు. దీనికి కుతుబ్ మసీదనియు 'కుదత్-ఉల్-ఇస్లామ్' అనియు పేర్లు. రెండవ దానికి 'ముసల్మానుల ధర్మపుశక్తి' అనియర్థము. ఈమసీదు 150

* మద్రాసునందు లైట్ హౌసుపైకెక్కి దీపముండు అరను చేరిన తరువాత జనులుచుట్టుంగల నగరప్రదేశమును జూచుటకయి ఆ అరనుండి బయటికివచ్చి నిలచుటకు ఆ అరచుట్టును గొంచెము వెడలుపున లైట్ హౌసను స్తంభమునుండి నిక్కపొడుచుకొనుచున్నదో నాఁ దోపింప జేయు బయలు అటక వేయఁబడినది. దానిచివర రక్షణార్థము కమ్ములతోఁ గటక మమర్పఁబడినది. ఈవిధమగు శిల్పములకు సజ్జలని పేరు.





కుతుబుమినారు సింహద్వారము.

అడుగులపొడవుగలది. ఇందున సగము వెడలుపు. అంతర్భాగమం దలి విడిస్థలము 142 అడుగుల నిడుపును 108 అడుగుల వెడలుపునుగలది. ఉత్తరద్వారమును బూర్వద్వారమును నిప్పటికిని మంచిస్థితియం దున్నవి. అచ్చటనె ఈకట్టడపు జన్మచరిత్రం దెలుపు శాసనములు గనుపట్టుచున్నవి. ఇది మొట్టమొదట హిందువులదేవాలయముగ నుండెననుట నిర్వివాదాంశము. ఇది పృథ్వీరాజు దేవాలయమని ప్రతీతి. పఠానులు ఢిల్లీనగరమును స్వాధీనపఱచుకొనిన తరువాత కుతుబుద్దీను, అతనికివెనుక అల్తమషు, అతనికిఁ బిదప నల్లాయుద్దీను ఈమసీదును గ్రమక్రమముగఁ బూర్తిచేసినట్లు అగుపించుచున్నది. దేవాలయమును మసీదు సేయుటలో మహమ్మదీయులు దమ మతసిద్ధాంతములకు విరుద్ధమని తోఁచిన విగ్రహములను గొన్నిటిని బూర్ణముగఁ బగులగొట్టిరి. మరికొన్నిటిని గానరాకుండఁ జేయు తలంపుతో నాయాభాగముల పయి దట్టముగు సున్నముపూతఁబూసిరి. కాలక్రమమున నా పూత చెదరిపోయి ప్రథమమున మహమ్మదీయులు హిందూ దేశమును బ్రవేశించునాఁటికి హైందవశిల్పకలాచాతుర్య మెంత యాన్నత్య దశయందుండె ననుటను స్పష్టముగ బోధించు విగ్రహాదులు బయల్పడినవి. స్తంభములపై నిప్పటికిని చూడనగు చిత్రస్వరూపములు గన్నులపండు వొనర్పఁగలవు. ఒక్కెడఁ బత్రఫలపుష్పములతోఁ బ్రేగు లతామతల్లికలు గుబురులు గుబురులుగ సుందరపాత్రముల నుండి వెలువడి





కుతుబుమసీదు, లోని, పృథ్వీరాజు దేవాలయము.

పించుట ప్రౌఢిమతోఁ బ్రదర్శింపఁబడియున్నది. మఱియొక్కెడ పూమాలలతో నొప్పు చిరుతపులియఱ్ఱులును, వేరొక్కెడ సంకెలలకు వ్రేలఁగట్టఁబడిన గంటలును దృష్టిని దనుపుచున్నవి. ఇంకొక్కెడ దివ్యమంచకములును ప్రసూనదామపరంపరలును ప్రేక్షకుల నాకర్షించుచున్నవి. అన్నిటికంటె మిన్నయయియొక స్తంభము కామధేనువును గోవత్సంబును జూపఱులముందఱకు ద్రొబ్బి యిల్లిదె నీయభీష్టములఁ దీర్పఁగల నేనిట నున్నదానను రమ్మని చీరుచున్నది. మా చదువరు లింతకంటె నపూర్వంబగుఁ బ్రేక్షణీయము నాశింతురే? ఇంకొక్కటి మాత్ర మీమసీదున గలదు. ఉత్తరపు గోడన బహిర్భాగమందు రెండవ గవాక్షము పైని శిలమీఁదఁ జెక్కఁబడిన కృష్ణజన్మఘట్టము సొంపులు గులికించుచున్నది.

ఇదియంతయు హిందువుల దేవాలయ ముండినభాగము. ఇఁకఁ గ్రొత్తఁగ మహమ్మదీయులు చేర్చినదేమన నత్యద్భుతముగు కమానుల వరుసలు. ఇవి మసీదునకు పశ్చిమభాగమున గలవు. వీనిపొడవు 385 అడుగులు. ఇందు మూఁడు గొప్పవి; ఎనిమిది చిన్నవి. నట్టనడుమనుండు కమాను వెడలుపు 22 అడుగులు; ఎత్తు 53 అడుగులు. దీనికావల నీవల నుండునవి యింత యెత్తే గాని వెడలుపునమాత్రము రెండడుగులు గొప్పవి.

పఠానులు శిల్పులనుదమ వెంటఁబెట్టుకొని రాలేదు. కాని శిల్పకళయందభిరుచి గలవారగుట వీరు దమ హైందవపౌరు



లలోని చతురులతోఁ బనినంతయుఁ జేయించుకొనుచుండిరి. కావున మున్ను దేవాలయమును గట్టినవారలే యీ కమానులను గూడ నిర్మించియుందురు. అట్లగుట దేవాలయమందలి యలంకారమే యిచ్చటను గానవచ్చుచున్నది. కాని యిట విగ్రహములకు మారుగ కొరాను గ్రంథమునుండి బహుజాగరూకతతో నేరఁబడిన వాక్కులు గన్పించుచున్నవి. సంపూర్ణతాశక్తితో సూక్ష్మతమమగు చిత్రరచనా చాతుర్యమునుజూపి తన్మధ్యమునఁ బైకెగయుచుఁ గ్రిందికి దిగుచు చక్షురానందదాయకములగు ధార్మికవాక్యములను జెక్కిపెట్టిన నేభక్తుని హృదయము ప్రబోధమందదు? ఈకమానుల ముఖమునఁగానగు కొరానువాక్కుల ధోరణిఁజూడ కొరాను భూలోకమునుండి పోయి భగవంతుని దర్శింపుచు భగవంతునుండి భూప్రజకు జ్ఞానామృతమును గొనివచ్చుచుండునట్లు తోఁచుచున్నదని యొకానొక మహమ్మదీయుఁడు నుడివియున్నాఁడు.

## జుమ్మామసీదు.

ఢిల్లీరాచబాట నవలోకించుచుఁ బురమును జొచ్చుట తోడనె దృష్టినాకర్షించు ప్రథమవిషయము జుమ్మామసీదు. భరతవర్షమునందుత్తమనిర్మాణములలో నిదియునొక్కటి. క్రైస్తవులకు రోముపట్టణమందలి సెయింటుపీటరు చర్చివలెను, హిందువులకు ఒరిస్సాయందలి జగన్నాథాలయమువలెను, మహమ్మదీయుల కనుకరించున దీమసీదె. ఆగ్రాయందలి తాజ్మహాలు

సౌందర్యమున సర్వోత్కృష్టమైనదే గాని, దానికిఁ దరువాత మసీదులలో నిదియెన్నఁబడవలసియున్నది. ఇదియంతయు నెఱ్ఱరాతితోఁ గట్టఁబడి మధ్యమాత్రము కొంతసంగమర్మరు చూపట్టుచున్నది. మంచిసంగమర్మరు శిలలతోఁ బూర్తిగఁ గట్టఁబడియుండినచో నిదియును నాగ్రాతాజ్‌మహాలువలెనే



జామ్మామసీదు.

తన ధవళప్రభలచేత జనులమనముల నాక్రమించుకొని యుండును. ఇట్లనుట నిప్పుడిది ప్రేక్షణీయము గాదనుటగాదు. సర్వఢిల్లీమధ్యమున నత్యుచ్చముగఁ దలయెత్తుకొని తన భవ్యత్వమువలనను రక్తిమప్రభల వలనను నితర స్వల్పభవనముల నిది

→ ప్రస్తుతపు గాయికవాడగు ←



→ శ్రీసయాజిరావు బహదూరు. ←

కేరడము లాడుచున్నదనిన నిద్దాని ప్రాముఖ్యతను వర్ణించిన వార మగుదుము.

ఇది కట్టఁబడిన స్థలము మిట్టప్రదేశము. అక్కడ మున్నుండిన గుట్టను చదరముచేసి యాచదరము పయినిది నిర్మింపఁబడినది. దీనికి నాలుగువైపులను మార్గములుకలవు. కాని ప్రవేశద్వారములు తూర్పు, ఉత్తరము, దక్షిణము, ఈమూఁడు పార్శ్వములందుమాత్రమేగలవు. పశ్చిమద్వారము బొత్తిగనశించిపోయినందున నచ్చట నున్నతములగు భిత్తులుమాత్రమె కానవచ్చుచున్నవి. ద్వారములుగల మూఁడువైపులను నదీఘట్టములఁ జూపట్టు సోపానపరంపరలఁ దిరస్కరించు పడికట్లు కట్టఁబడియున్నవి. ముఖ్యద్వారము లిత్తడితోఁ బోయఁబడినవగుటచే మిక్కిలి ఘనమై విశాలముగఁ గన్పట్టుచుండును. అందులోఁ బూర్వద్వార మెక్కుడు సౌందర్యము గలదియు దళమైనదియునై మహాద్వారమని పిలువ నర్హముగ నున్నది. ఈద్వారమునఁ జొచ్చి లోపలికినడచినచో గొప్పయంగణమొకటి గానవచ్చును. ఇది 1400 చదరపు గజములు గలదు. దీని నట్టిల్లోక (Floor) విధముగు నెత్తురాతిపఱపు గలిగియున్నది. తన్మధ్యమున సంగమర్మరశిలలతో నిర్మితమయిన కృతకసరోవరం బొండొప్పుచుండును. దీనిలోని కీ గుట్టపయినుండు జీవఝురములనుండి శుద్ధోదకము ప్రవహింపఁజేసియున్నారు. ఇట్లలంకృతమయిన

యీచతుష్కోణాకృతియగు నంగణమున నైదువేలసంఖ్యగల ముసల్మానులు ప్రార్థనార్థము చేరుటకు వీలుగలదు.

ఈమసీదునందు ముఖ్యాంగమగు నంతరాలయ మీచదరమునకు పశ్చిమభాగమున నున్నది. ఇది పశ్చిమమున నుండుటకుఁ గారణము మక్కాపడమర నుండుటయె. ప్రతిమహమ్మదీయుఁడును దైనమును బ్రార్థించునెడ మక్కాప్రక్కకు దిరుగవలయునని యొకసిద్ధాంతము. కావున నీయంతరాలయముఁ జొచ్చుటతోడనె భక్తులు పశ్చిమాభిముఖులై యుండునట్లుల సౌకర్యముకలుగఁ జేయుటకు పడమట చివరనె యిది గట్టఁబడినది. ఈ యంతరాలయము దీర్ఘచతుష్కోణాకృతి కలదయి పొడవున 201 అడుగులును వెడలుపున 120 అడుగులును నున్నది. దీనిశిరోభాగమున మూఁడు గొప్పగుమ్మటములు గలవు. వీనిపై బంగారు నీరుతో వ్రాయఁబడిన చిత్తరువులున్నవి. ఇంతియెగాక యీయంతరాలయపు రెండుచివరలను రెండు మినారులు 130 అడుగుల యౌన్నత్యముగలవి ప్రౌఢముగఁ గన్పించుచుఁ బ్రక్కప్రదేశమునఁ గలమేడలకంతకును మేమె రాజులమని చాటుతెఱంగున నర్థవర్తులాకారములై కిరీటములఁ బోలుచిన్న గుమ్మటములను ధరించియున్నవి. మసీదుముందరి భాగము మహాద్వారమున కీవలనావల నైదేసి సొంపులు గులుకు కమానులచే నలంకరింపఁ బడియున్నది.



ఈకట్టడపు మధ్యమున నొకచోట శుభ్రమగు నల్లరాతిపయి స్వచ్ఛమగు సంగమర్మరుశిలలతో నక్షరములు దీర్పఁబడియున్నవి. ఈశాసనమున నీమసీదునకై నవ్యయమును మసీదు ప్రారంభించి ముగించిన తేదీలును నీయఁబడియున్నవి. దీని ననుసరించిచూడ క్రీ॥ శ॥ 1344 లోఁ బ్రారంభమయి 1350 మధ్యమునకు నీమసీదు పూర్తియయినట్లు తేలుచున్నది. సుమారాఱేండ్లకాల మీకట్టడమునకయి 5000 పనివారలు చమట నూర్చుచుండిరి. అప్పటిలెక్కల ననుసరించి దీనికి పదిలక్షల రూపాయిలు పట్టినట్లు తెలియుచున్నది.

ఈమసీదు మధ్యభాగమున నొకచోట నట్టిల్లంతయు సంగమర్మరము పఱచిన ప్రదేశమున మూఁడడుగుల పొడవును ఒకటినరయడుగు వెడలుపును గల కమానులు దీర్చఁబడియున్నవి. వీనిమొత్తము సంఖ్య 900. ఇట్లు ప్రత్యేకించి పెట్టఁబడిన స్థలముల బాదుషాహాలును నమీరులును నవాజుసేయుటకుఁ గూర్చొనుచుండిరి. ఢిల్లీయందు బాదుషాహా నగరున నెచ్చటను మసీదుగానరాదు. కావుననతఁడు ప్రార్థనార్థము దన సర్వసామంతులతో నీమసీదునకే వచ్చుచుండినట్లును నీస్థలములట్టి యూహతోడనె కట్టఁబడియున్నట్లును నిశ్చయముగఁ జెప్పవచ్చును. మధ్యగుమ్మటపు క్రింది భాగమున నక్షిపని సర్వోత్కృష్టముగఁ జేసియున్నారు. దీనికెదుట ముఖ్యమతాచార్యుల పీఠ మఖండమగు నొక్కసంగమర్మరశిలతో నిర్మింపఁబడియున్నది.

ఇచ్చట నొక గోడమీఁద షహాజహాను, బహదూరుషహాల స్వహస్తాక్షరములు చెక్కఁబడియున్నవి.

ఈమసీదు గదులలో నొక్కెడ మహమ్మదీయుల కత్యంత పవిత్రమగు మహమ్మదుమహాపురుషుని జ్ఞాపక చిహ్నములైన వస్తువులు భద్రము చేయఁబడియున్నవి. ఇందు మూలాచార్యుల పాదరక్షలును, రాతియందు చెక్కిన యాతని చరణాకృతియును, నమూల్యరజత పేటికయందు మహాదరముతో గుప్తీకరించిన మహమ్మదు గడ్డమునుండి దీసిన రక్తవర్ణపు వెండ్రుకయును గలవు. ఏడవ శతాబ్దమున వ్రాయఁబడిన కొరానుగ్రంథపుఁ బ్రతియొక్కటిగూడ నీ చిన్నగది కలంకారములలో నొక్కటిగ నున్నది.

జుమ్మా మసీదును గుఱించి రస్సెలను నొక ఐరోపియను గృహస్థుఁడు "ఈకట్టడపు విశుద్ధశోభయు, దీనిరచనయందలి ప్రమాణసౌందర్యంబును, మఱియు నిర్మాణమునందలి యుదాత్తకల్పకతయు, మనక్రైస్తవ ప్రార్థనమందిరముల క్షుద్రమును దరిద్రమును నగు స్వరూపములతోఁ బోల్చిచూచిన ఖేదముతోఁ దలవంచుకొనవలసినంతటి వైపరీత్యము గానుపించు"నని వ్రాసియున్నాఁడు.

### లోహస్తంభము.

కుతుబ్ మినారు సమీపమున మఱియొక ప్రేక్షణీయమగు వస్తువుగలదు. దాని పేరు మనమిదివఱకే వినియున్నారము.





లోహస్తంభము.

లోహ స్తంభమనిన తోడనే, మా చదువరు లద్దాని స్మరియింపఁ గలరు. హైందవసామ్రాజ్య కాలమందు క్రీస్తుశకమునం దైదవ శతాబ్దమున. ఢిల్లిని వీక్షింపఁబోవు ప్రవాసికులందఱును బహు కాలముగ దీనిని బ్రశంసించుచునే వచ్చుచున్నారు. కుతుబ్ మసీదు ప్రాంతమునఁ జూడవలయు ముఖ్యతమములగుఁ జిత్రములలో నొక్కటియని పెర్గుసను వ్రాసియున్నాఁడు.

“ఇది యిప్పుడు భూమిపై నిరువదిరెండడుగుల యెత్తున్నది. భూమిలోనుండు భాగము 20 అంగుళములు మాత్రమే యని మనకు విస్పష్టముగఁ దెలిసియున్నది. కావున మొత్తమున కిద్దాని పొడవు 23 అడుగులు ౮ అంగుళములు. పీఠమున దీనిచుట్టుకొలత 164 అంగుళములు; శిరోభాగమున 12. 08 అంగుళములు......క్రీ॥ శ॥ 363 లేక 400 ప్రాంతములందలి గుప్త వంశజులగు చంద్రరాజుల కాలమున నియ్యది నెలకొల్పఁబడెనని నా నమ్మకము. క్రీ॥ శ॥ 400 సంవత్సరమున నిది స్థాపింపఁబడెననుకొనినను మనమిదివఱకెప్పుడు నూహింపనైన నూహింపని యంశ మొక్కటి బయలుపడుచున్నది. నిన్న నేఁటివఱకును నైరోపాఖండవాసులు నిర్మింపనేరక యిటీవల నొకటిరెంటిని మాత్రము నిర్మింప గలిగిన స్తంభజాతిలోఁ జేరిన ఈ లోహ స్తంభమును హిందువు లంతప్రాచీనకాలముననె పోతపోసిరనుట విశదమగుచున్నది...ఇంతియెగాదు. పదునాలుగుశతాబ్దములు వర్షమునకును వాయువునకును దలయొగ్గి యీ యినుప కంబము రవ్వంతయేని త్రుప్పుపట్టకుండుటయు దీనిమీఁది శాసనములందలి లిపులు కొంచెమైనఁ దఱుగుడు వడి మాసిపోక స్పష్టముగ నగుపడుచుండుటయు మిక్కిలి వింతగ నున్నది. ఈ స్తంభముమీఁది శాసనమును బట్టి యిది విష్ణువునకు సమర్పింపఁబడినట్లు తెలియుచున్నది. కావున దీని చివర గరుత్మంతుని విగ్రహముండియుండును. మహమ్మదీయులవలన నిర్మూలనమందియుండును. కాని యీ స్తంభము నిలుపుటకు ముఖ్యోద్దేశము సప్తసింధువు తీరమున బాహ్లీకులను హిందూ రాజులోడించి తరుముటను దెలుపుటయే.



## అశోకునిశిలాస్తూపము.

దర్శనీయమగు ఢిల్లీలోని చిత్రములలో నశోకునిశిలాస్తూపము మఱియొక్కటి. ఇది మొట్టమొదట పాంచాలదేశమునందలి అంబాలా మండలములోని జగంధ్రియను గ్రామమున కేపుమైళ్లదూరమున నుండెడిది. దానిని ఫిరోజుషాహా పెకలించి తెచ్చి ఢిల్లీయందుఁ దననగరున నాటించుకొనియెను. ఇతని కాలపుచరిత్రను వ్రాసియుంచిన జయా-ఉద్దీన్-బార్నిక్రిందిరీతిని దీనికథను జెప్పుచున్నాఁడు.

“స్తూపమును బదుండబెట్టుటకు నుత్తమమార్గమును బాగుగ యోజించినపిదప నా ప్రాంతములందలి కాల్బలమును నాశ్వికసైన్యమును దక్కుంగల జనసామాన్యమును నచ్చటికి రావలసినదని ముదలయాయెను. అప్పనికి నవశ్యమగు సర్వవిధోపకరణములను బ్రతిమానవుఁడును దేవలసినదనియు నుత్తరువు



అశోకుని శిలాస్తూపము.



పుట్టెను. బూరుగుప్రత్తి బస్తాలుబస్తాలుగ వచ్చిచేసుటకుఁ దగు నేర్పాటు లొనర్పఁబడెను. స్తూపమునకుఁ జుట్టును గొల్లలుగ నీప్రత్తిపఱచి వైచిరి. స్తూపము క్రిందిభాగములోని మట్టిని దీయుటతో నది యల్లనల్లనదనకొఱకేర్పడిన మెత్తపయిఁ బడెను. ప్రత్తికొంచెము కొంచెముగఁ దీసి వేయఁబడెను. స్తూపము భూమిపై సురక్షితముగఁ బడియుండెను. త్రవ్విన భాగమును బరీక్షింపఁగా నొక పెద్ద చదరపురాయి దీని కాధారముగ నిడియుంటదెలిసెను. దీనినిగూడ పెకలించి దీసిరి. స్తూపమునకు దెబ్బదాకకుండుటకయి దాని కావరణముగ మెత్తని తుంగగడ్డియు తోళ్లును వైచి కట్టిరి. నలుబదిరెండు చక్రములతో నొకబండి సిద్ధమాయెను. ప్రతిచక్రమునకును నొక్కొక్క త్రాడు కట్టియుంచిరి. ఒక్కొక్క త్రాటికడను వేలకొలఁది జనులు పనిచేసి మిక్కిలికష్టముతో నాస్తూపమును శకటముమీఁది కెక్కించిరి. తరువాత గానుకు గానుకు నొక్కొకమోకును బంధించి, మో కొక్కింటిని నూరుగురుజనులు పట్టి లాగి, యీ బండిని యమునానదీతీరమునకుఁ దెచ్చివిడిచిరి. సుల్తానుగా రీస్తూపముసాగుటను వీక్షింపనట కేతెంచిరి. అదివఱకే 2000 మణుగుల బరువునకుఁ దక్కువగాక 5000 ను 7000 ను మోయఁగలుగు గొప్ప పడవలనేకములు యమునానదియందు బారుగాఁగట్టియుండెను.మహాచాతుర్యముతో స్తూపమీపడవల



కాశ్మీరద్వారము.

కాశ్మీరద్వారము—ఇది పట్టణమున నుత్తరభాగమున నున్నది. క్రైస్తవచర్చికిని ప్రభుత్వమువారి కార్యాలయములకును నిది దగ్గర.



పైకెక్కింపఁబడి ఫిరోజాబాదునకుఁ గొనిపోఁబడెను. అచ్చట నెంతో ప్రయాసతో నిద్దానిని నగరుఁ జేర్చిరి" *

ఇది నగరుచేరిన పిదపఁ దీనిని నిలుపుట కొనర్చిన పరిశ్రమ గూడవర్ణనీయమే. ఢిల్లీయందలి చతురులగు పని వారెల్లరును జేరి మిక్కిలి జాగరూకతతో విచారించి యొక యుపాయమును బన్నిరి. సున్నముతోను గారతోడను నొకకట్టడమును గట్టి యొక్కొకయంతస్థు ముగియుటతోడనే ఆయంతస్థుపైకి స్తూపపుఁ జివర నెక్కించుచువచ్చిరి. ఇట్లెక్కింప నెక్కింప నెకయెత్తేర్పడెను. తరువాత స్తూపమును సమరేఖాకృతిగ నిలువఁ బెట్టుటకుఁ గొన్ని యంత్రములు పన్ని మిక్కిలి శ్రమచేసి కార్యము సాధించిరి.

ఈస్తూపము 37 అడుగల ఎత్తుగలది. పీఠభాగమునఁ జుట్టుకొలత 9 అడుగుల 4 అంగుళములు. దీనిపై చెక్కఁబడిన యశోకుని నాలుగు శాసనములును జెక్కు చెదరకున్నవి. ఇవియె భరతఖండ చరిత్రమున నిలిచియున్న శాసనములలోఁ బ్రాచీనతమములు(క్రీ॥ పూ. మూఁడవశతాబ్దము). క్రీ॥ శ॥ 1164 సంవత్సరమున చౌహాణ్ రాజగు వీసలదేవునిచే రచియింపఁబడిన శాసనం బొండుగూడ దీని నలంకరించుచున్నది.

ఇంకను ఢిల్లీయందనేక ప్రేక్షణీయ విషయములు గలవు గాని యవి యెల్లయు వర్ణించుట కిచ్చట తావుచాలదు.

* ఫెర్గుసనుగారి కొన్ని వాక్యములకు భాషాంతరీకరణము.



లాహోరుద్వారము.

లాహోరుద్వారము— ఇది పశ్చిమ భాగమున నున్నది. ఇటనుండి చాందినీ చౌకున బాటకలదు.





ఢిల్లీద్వారము.

ఢిల్లీద్వారము—ఇది పురమునకు దక్షిణ ముఖమున నున్నది.

## ద్వారములు.

కాశ్మీరద్వారము, లాహోరుద్వారము, ఢిల్లీద్వారము, అనునవి వీనియందు ముఖ్యములు. ఈద్వారముల పటములను మాచమువరు లింను చూడఁగలరు

## తోటలు.

రాణీతోటయనునది షహజహాను బాదుషాహుగారి పుత్రికయగు జహానారా బేగముచే వేయఁబడిన ఉద్యానవనమని ప్రతీతి గలదు. దీని మధ్యప్రదేశమున యమునాకాలువలోని యొక శాఖ ప్రవహించుచున్నది. దీనివలన నీయుద్యానవన మిప్పుడును బహుసుందరముగు యలరారుచున్నది. కాని పూర్వకాలమున నింతకంటె సుందరతరముగ నుండియుండెననుటకు సందియము లేదు. ఇప్పుడీ యుద్యానవనము నలంకరించు వస్తువులలో శ్రీ విక్టోరియా మహారాజ్ఞిగారి శిలారూప మొక్కటియు రాతిలోఁ దీర్పఁబడిన యేనుఁగుస్వరూప మొక్కటియు నున్నవి. ఈరాతి యేనుఁగు పూర్వము ఢిల్లీద్వారమున నుండెడిది.

ఢిల్లీయందీ యుద్యానవన మొక్కటి గాక దర్శింప నర్హములగు సొంపైన తోటలు మఱికొన్ని గలవు. అందు 'సంతోషసదన' మని యర్థమిచ్చుచు ఔరంగజేబు పట్టాభిషేకమునకు స్థానమయి చెలువొందిన షాలిమారుతోటయును, రాణీతోట వేయించిన జహానారా బేగము సోదరియును ఔరంగజేబు పక్షవర్తియు నయిన రోషనారావలన వేయఁబడిన రోషనారా తోటయును యమునానది తీరమునంగల కుద్సియా తోటయును ముఖ్యములు.



## వీధులు.

ఢిల్లీయందు పెద్దవీధులు పది గలవు. వీనిని నైర్మల్యమునఁ దేని, ప్రకాశమునఁ దేని, సౌకర్యమునఁ దేని, వైశాల్యమునఁ దేని మించువీధులు గల పురము భరతవర్షమున మఱొక్కటి లేదు. ఇందు ముఖ్యము చాందినీ చౌకు. చాందినిచౌకు అనగా రజతవీధియని యర్థము. ఇది కోటలోనుండి లాహోరుద్వారమునకు ¾మైలు వ్యాపించుచున్నది. దీని వెడలుపు 74 అడుగులు. దీని మధ్యప్రదేశమున నుండు కొంచె మెత్తగు బాటకు రెండు వైపులను వృక్షపంక్తులు పాంథులకు జల్లనినీడ నీనఁ గంకణము గట్టి నిలువొని యున్నవి.

దర్బారువీధి యనునది ఢిల్లీరాజమార్గమునుండి పోవు చీలికలలో నొక్కటి. దీని కుత్తరభాగమున నెబవారిమైదానము గలదు. ఈబవారిమైదానమె దర్బారు రంగము. ఇది కాశ్మీరద్వారమునుండి 3½మైళ్లున్నది. ఇచ్చటనె 1877వ సంవత్సరమందు విక్టోరియా మహారాజ్ఞి కాలమున లిట్టను ప్రభువును, 1903వ సంవత్సరమున సప్తమైడ్వర్డు చక్రవర్తిగారి ప్రతినిధిగ లార్డు కర్జనును దర్బారుల నడిపిరి. ఇచ్చటనే కడచిన డిశంబరు మాసము పండ్రెండవ తేది మంగళవారమున సర్వసామంత ప్రభువులును ప్రజలును నేత్రపర్వముగాఁ జూచుచుండ

శ్రీపంచమ జార్జి సార్వభౌముఁడును నతని యర్ధాంగలక్ష్మియగు



దర్బారుహాలు

శ్రీమేరీ చక్రవర్తినియును స్వయముగనేతెంచి మున్నెన్నఁడు నెఱుఁగని మహావైభవమున మూర్ధాభిషిక్తు లయిరి.

---



# ఢిల్లీ దర్బారు.

## 2. శ్రీరాజ దంపతులు.

మూఁడవ ప్రకరణము.

# శ్రీ రాజదంపతులు.

## జార్జి బాల్య క్రీడలు.

జార్జిచక్రవర్తి క్రీ॥ శ॥ 1865 సంవత్సరమున జూన్ నెల 3వ తేది మార్లబరో సదనమున జన్మమందెను. అదేనెల 7వ తేది మహారాజ్ఞి విక్టోరియాగారి సన్నిధియం దీబిడ్డఁడు క్రైస్తవ మతాచారము ననుసరించి జ్ఞానస్నానమను సంస్కారము నొందెను. ఇతని శైశవమునందు విశేషము లెవ్వియులేవు. ఏడేండ్ల బాలుఁడగు నప్పటి కితఁడు నావికా సైన్యమునకు నర్హుఁడని నియమింపఁబడి నాఁటినుండి యాతని విద్యాదిపరిశ్రమలు తదనుసరణముగఁ బన్నఁబడెను. సెలవు దినములలో నొక కొన్నిటి నితఁడు దన తలితండ్రులతో డెన్మార్కు రాజుగారి యాతిథ్యముక్రింద కోపెన్‌హేగను పురమునఁ గడపుట తటస్థించెను. కోపెన్‌హేగను రేవుపట్టణము. అచ్చట సముద్రము మిక్కిలి యిఱుకు. ఆవల నీవల గొప్ప సముద్రభాగములుండి యా సముద్ర భాగములను గలిపి వేయుట కయి భగ

వంతునిచే నియమింపఁబడిన యిట్టి యిఱుకు జలభాగమునకు జలసంధి యనిపేరు. పై నుడివిన జలసంధి యుదకముల రాకొమరులు జలకమాడుటకలదు. అట్టి తరుణముల మన జార్జి రాబిడ్డఁడె నిర్భయముగ నందఱికంటె మున్న నీటఁ జొరఁబడుచుండును. అప్పుడె యితనికిని దరువాత రుష్యాజారుపదము నధిష్ఠించిన నికలసన్ అను నితని బాంధువునకును మైత్రి సమకూరెను. మొదటినుండి సాహసక్రియలయం దితని కభిరుచి మెండని నుడువఁబడియున్నది. ఏపనికిఁ బూనినను మిక్కిలి యుత్సాహముతోడఁ బూనువాఁడు. గుఱ్ఱపుస్వారి చేయునెడల నెల్లను బ్రారంభమునందే యితఁడు గనుపఱచుచు వచ్చిన సౌలభ్యమును జూచిన ముందీతఁడు చక్కని రౌతు గాఁగలఁడని విశదముగఁ దెలియుచుండెడిది. గొప్ప వేటకాండ్ల సమూహములను జేరుటకు నాసక్తితో నితఁడు వెడలి, వేటకుక్కలతో సమముగఁ దనయశ్వమును బఱువెత్తించుచుండును. ఇంగ్లాండు నందు శీతకాలమున మైదానములు హిమపుఁ బఱపుగలవయి యుండును. మనపిల్లకాయలు జారుడుబండపై నాటలాడుకొను నట్లాంగ్లేయ బాలురు బాలికలును నీ హిమముమీఁదఁ గుతూహలముతో నాటలాడుచుందురు. అయిన నీయాటలు మనము వీనితోఁ బోల్చిన జారుడుబండలయాటలకంటె నెక్కుడపాయకరములనుట హిమము స్వభావమునుబట్టియే మాచదువరు లెఱుఁగఁగలరు. ఇట్టి వ్యాయామములలో జార్జి రాబిడ్డఁడు జంకు



కళంకులేక యెట్టి హిమమునైనను సరకు సేయక ప్రవేశించుచుండుననిన నితని సాహసస్వభావము తేటపడఁగలదు.

ఒకచిన్నకథ. బాల్మొరాలు నగరమున రాచనగరునందీ రాకొమరుఁ డుండుతఱి నితని సహాధ్యాయుఁ డొకబాలుఁ డుండెను.—అతఁడిప్పు డాంగ్లేయప్రభు సభయందౌన్నత్యముగనిన సభ్యుఁడు.— అతఁడు జార్జి రాబిడ్డనితో డాగురు మూతలాడుచుండెను. ఆయాటయందు జార్జి పలుమాఱు దొంగ యయ్యెను. దానికిఁ గారణము పైబాలుఁడె యైనందున నతని నితఁడు సహింపలేక ముష్టియుద్ధమునకుఁ బిలిచెను. ఆపిడికిటి పోట్లాటలో నతనిదె పయిచేయి యయ్యెను. కాని దానివలన వీరిద్దఱకును స్నేహభావమేమాత్రమును దఱుఁగక మిక్కిలి యన్యోన్యమైత్రి యేర్పడెను.

బాల్మొరాలు భవనమున జార్జి రాబిడ్డఁడు యుద్ధమునకు వలయు కరత్రముల (Gloves) జతలను బెట్టుకొని యావనులగు నావికులకుఁ బ్రియమగు నీవ్యాయామమునకుఁ బలుమాఱు కడఁగుచు స్వసంరక్షణమునందు సమర్థుఁ డయ్యెను. ఇట్లు రాకొమరులకు బహిర్వ్యాయామములకు నాటంకము సెప్పకున్నను వారి తలిదండ్రులు విద్యా విషయమున మాత్రము వారి నుదాసీనులుగ నుండనిచ్చినవారుగారు. జార్జి రాకొమరుఁడు దీవ్రగ్రాహి కాఁడు గాని యెప్పుడును బట్టుదలగల వాఁడు గావునఁ దత్ఫలము నందఁగలిగెను.

## జార్జినావికోద్యోగము.

పన్నెండవ సంవత్సరములు నిండినతోడనె యితఁడన్న గారితోఁ గూడ నావికాసైన్యమునఁ బ్రవేశపెట్టఁబడెను. (క్రీ॥ శ॥ 1877 వ సంవత్సరము జూన్ నెల 5వ తేది). వీరితో నింకను నూటయేబదిగురు బాలురు నావికావిద్య నభ్యసించుచుండిరి. వీరునువారును శయ్యావిషయంబులందక్క సర్వవిధముల సమానముగఁజూడఁబడుచుండిరి. జార్జిచక్రవర్తి నేఁటికిని దానచ్చటఁ గడపిన కాలమును సంతోషముతో స్మరియించుచున్నాఁడు. తన పుత్రులఁగూడ నచ్చటికే విద్యాభ్యాసమునకుఁ బంపియుండెను. 'బాక్కాంటె' యను నోడమీఁద జార్జి రాబిడ్డఁడును నితని యన్నయు నిద్దఱును మధ్యధరా సముద్ర మార్గమున పశ్చిమ యిండియా దీవులకుఁ బోయిరి. ఆ ప్రయాణము వలన జార్జికి సముద్ర యానముపై నెక్కుడభిమానము గలిగెను. క్రీ॥ శ॥ 1880 వ సంవత్సరమున 'బాక్కాంటె' ప్రపంచము చుట్టి రాఁబయన మయ్యెను. దానియందును దరువాత 'కనడా' యను నోడయందును ప్రయాణముచేసి 1883 లో నుత్తర అమెరికాకుఁ బోయిచేరెను. అట మాంట్రియల్, ఒటావా, టొరాంటోమున్నగు గొప్పపట్టణములను దర్శించి ఆయా ప్రదేశములను జూచుచు 'నయాగరా' మహాజలప్రపాతమున కలరి నాఁబోవు సంబంధమువలనఁగలుగు ననురాగమునకుఁ జిహ్నమోయనునట్లు 'కనడా' రాష్ట్రముపైఁ బ్రేమగలవాఁడయ్యెను.



1884 వ సంవత్సరమున జార్జిరాబిడ్డఁడు నావికా విద్యయందు మొదటితరగతిలోఁ దేరి 'సబ్ లెఫ్టినెంటు' పదమునకర్హుఁడయ్యెను. అప్పుడునావికాధ్యక్షుఁడుగ నుండిన అడ్మిరల్ సర్ జాన్ డాల్రింపిల్ హే యను నతఁడితనిని గూర్చి "ఇతఁడారితేరిన నావికుఁడు. పేరునకుఁదేరినవాఁడుగాక మాయందఱవలెఁ బరిశ్రమ జేసినవాఁడ"ని నుడివియున్నాఁడు. జార్జి యిల్లుఁజేరి గ్రీన్విచ్చు పట్టణమునందలి 'రాజకీయ నావికాకళాశాల'యం దభ్యసింప మొదలిడెను. మంచిగదులజతయొక్కటి దక్క నచ్చట నితనికమర్చిన విశేష సౌకర్యము లేమియు లేవు. బంధువుల ఛాయాపటములను బుష్పలముగ వ్రేలాడవైచి యాగది కితఁడలంకారము నిచ్చుచుండెను. 1885 లో నితఁడు లెఫ్టినెంటుగా నేర్పఱుపఁబడెను. 'థండరరు' 'డ్రెడునాటు' 'అలెగ్జాండ్రా' అను మూఁడోడలలో నుద్యోగమునలిపెను.

1889 లో నితఁడొక నాశక ప్లవమును (Torpedo) నడపుచుండెను. అప్పుడితని యధికారితనిని రావించి "మీ తండ్రిగారగు ప్రిన్సు ఆఫ్ వేల్సుగారు మిమ్మును గుడ్వుడ్ అను నెడకుఁ బంపవలసినదనియుఁ దామట మిమ్మును జూడ వేచియుందురనియు వర్తమానమంపి యున్నార"ని చెప్పెను. దానికితఁడు "సరే. అయ్యా! అయిన నా నాశక ప్లవము గతి యేమికావలెను?" అని ప్రత్యుత్తరమిచ్చెను. దానికా యధికారి ఇతనికానాఁటికి సెలవియ్యఁ గలుగునని మెను గాని, యాతఁ

దద్దాని కంగీకరింపక "ఈనావను సముద్రయాత్రకుఁ గొంపో వలసినదని నాకు ముదలగలదు. కావున నేను బోయి రావలెను" అని నుడివి కొన్ని నిమిషములలో 'స్పితెడ్' అను శేవునై పునఁ దన నావతోఁ గూడఁ బ్రయాణము సాగించెను. 1885 వ సంవత్సరము అక్టోబరు (October) మాసములో నితఁడు 'థ్రష్' అను ఆయుధప్లవమును సంపూర్ణ స్వాతంత్ర్యముతో నడుప నర్హుఁడయ్యెను.

ఈతని నావికాశక్తి కచ్చటి వారెల్లరును మిక్కిలి సంతోషించిరి. ఇతని తండ్రియు జర్మనీచక్రవర్తియు నితని నచ్చటఁ జూడవచ్చిరి. తనతల్లికిని సోదరులకును దన మొదటి స్వతంత్రోద్యోగమును మిక్కిలి సంతోషముతోఁ దెలియఁ జెప్పెను. 1887 వ సంవత్సరమున విక్టోరియా మహారాజ్ఞి గారి రాజ్యపంచాశద్వార్షికోత్సవ (Jubilee at the Fiftieth Year of her reign) సమయమున జరగిన నావిక ప్రదర్శనము నం దీతఁడు మిక్కిలి పరిశ్రమచేసెను. 1889లో మహారాజ్ఞీ గారితనిని తనునావికాపార్శ్వవర్తిగా (Naval aid-de-camp.) నియమించుకొనిరి. 1891లో నితఁడు నాయకుఁడయ్యెను. ఆసంవత్సరమే యితఁడు 'డబ్లిను' పురమునకుఁ బోయియుండి యచ్చట గొంచె మపాయకరమగు జ్వరముచేఁ బీడింపఁ బడెను. కాని కొద్ది కాలములోనే యితనికి దేహము కుదిరి యితఁడు దన కర్తవ్యములకుఁ బూనఁ గలిగెను. 1892వ సంవ



త్సరము జనవరినెల 14వ తేది యితని యన్న క్లారెంసుప్రభు వకాలపు మృత్యువువాతఁ బడుట తోడనె, యీతని జీవయాత్రయంతయును నొక్క త్రుటికాలమున మార్పుఁ జెందెను. ఇతఁడు దండ్రికిఁ దరువాత రాజ్యమున కర్హుఁ డయినందున నావికోద్యోగమువదలి రాజకీయ వ్యవహారములయందుఁ బరిశ్రమసేయవలసిన వాఁడాయెను. ఇటఁ గొంచెము జార్జి రాకొమరుని కథనాపి మేరీరాణిగారి వంకకుఁ దిరుగుదము.

మేరీ బాల్యక్రీడలు.

ఈమె 1867వ సంత్సరము మేనెల 26 వ తేది కెన్సింగుటను భవనమునఁ బుట్టెను. ఈమె తండ్రి టెక్కుప్రభువు. ఈమె తల్లి విక్టోరియా మహారాజ్ఞీ గారికి నాలవ తరపు బంధువు; అలెగ్జాండ్రా మహారాణి తాతగారి చెల్లెలి కుమార్తె. మేరీమహారాణికి ముగ్గురు తమ్ములు. ఈమె పుట్టిన నెలగోజుల కీమెకు జ్ఞానస్నాన సంస్కారము నడచెను. చిన్నతనమున నీమెకు 'రాచకుమారి మే' యనునది ముద్దుపేరు. ఈమె తన శైశవమును గుఱించి యది మిక్కిలి తుంటరితనముతోడను, నెక్కుడు సుఖముగను, విశేషరాహిత్యముగను గడుపఁబడెనని తానే వర్ణించియున్నది. ఈమెకు బొమ్మలును గుక్కలును ప్రియతమములు. ఎంత వికారముగ నుండినను, నెంత ప్రాతపడియుండినను, నెంత యుత్కృష్టమగు ప్రత్యామ్నాయవస్తువు నిచ్చినను నీమె తనమొదటి బొమ్మలను విడుచునదిగాదు.

విద్య నేర్చుకొనుట కెంతో యీమెను బుజ్జగింప వలసి యుండెను. ఈమెగారి తల్లియు దాదియు మిక్కిలి పరిశ్రమచేసి యీమెకు విద్యయందభిరుచి కలుగ జేసిరి. చరిత్రయనిన నీమెకు మహాభిలాష. ఈమెకు క్రికెటు మున్నగు వ్యాయామములకుఁ దగినంత కాల మీయఁబడుచుండెను. ఆయాటలో నీమె దనసోదరుల ననాయాసముగ మించుచుండెడిది. అట్లగుట వలననే యీమె దృఢకాయయు నారోగ్యవతియు నయి యున్నది. సద్గుణముల నాటుటయం దీమె తల్లికిఁగల యాసక్తి పెక్కు తల్లుల కుండ దనిన నతిశయోక్తి గానేరదు. ఆమె మతము దన బిడ్డలు విశేష సౌఖ్యములకును భ్రమాస్పదములగు నభ్యాసములకును లోనయి యనదలు గాఁగూడదనుట. ఆయమ "విధేయత నేర్చుకొనుటయు, విద్యగఱచుటయు, పెరుగుటయు ననుపనులు బిడ్డలకుఁ జాలును. విందులకుఁ బలుమారు పోవుటయు, రాత్రులెక్కుడు నిద్రగాచుటయు శైశవపుఁ బచ్చదనముం బోనడచి కన్యాత్వపు సౌందర్యమును, గాంతిని నపహరించును. లోకమున ముసలి శిశువులు లెక్కకుమీఱి యిప్పటికే యున్నవారు" అని యొక తరి నుడివెను. మఱియొక సమయమున నొక యాహ్వానప్రార్థనకు "దయాపూర్ణమగు తమ కోరికను నెరవేర్ప నా కెంత యిష్టమున్నను రేపటిదినము నాపిల్లలను బంపుటకు వీలులేకుండుట కెంతయుఁ జింతిల్లుచున్నాను. ఈ వారమున రెండు రోజులు నా బిడ్డలు విందులకుఁ బోయి



యుండిరి. ఎక్కుడు కాలము దుర్వ్యయము సేయుట వలన వారివిద్యాభ్యాసమునకు బలమగు నాటంకము గాఁగలదు. కావున నాయభిప్రాయ మెఱింగిన మీరు నన్ను క్షమింతురు గాక' యని వ్రాసి పంపెను. ఇంతియెకాదు. మేరీగారి తల్లి దన బిడ్డ లితరుల కష్టములను జక్కఁగ నెఱింగికొని వారి యెడల సానుభూతి గలవారయి వారికి సాహాయ్య మొనర్ప సమర్థులుగావలెనని కోరునది. ఆమెదేశాభిమానమునకు మేర లేదు. బీదలయెడ నామెకుఁ గల యనురాగము మెండు. ఇతరులను దనవలె నెంచుకొని వారి కెప్పుడును నామె మేలు సేయుచుండును. రాకొమారి మేయును నామె సోదరులును నితరుల కొఱంతలను దెలిసికొనుటకై వారిని మతాచార్యులతో దరిద్రుల గృహముల కనుపుచుండును. ఇట్టి మాతచేఁ బెంపఁబడిన దగుటచే మేరీరాణియు నా సుగుణముల కాలవాలమయ్యెను.

1883 వ సంవత్సరమున మే తల్లిదండ్రులు ఫ్లారెంసున నివసింప నేగిరి. అచ్చట నీమెకు చిత్రకళాభవనములందుఁ గల పటములఁ జూచుటకును బట్టణవైచిత్ర్యముల దర్శించుటకును సమయము గలిగెను. ఫ్లారెంసున దివ్యమగు గానము గొల్లలుగ నీరి వీనుల దనుపుచుండెను. మే రాకుమార్తెకు వర్ణలేపన విమర్శనాశక్తి యచ్చటనె కలిగెను. వీరు తిరిగి యింగ్లాండునకు వచ్చిన తరువాత విక్టోరియా మహారాజ్ఞీ 'రిచ్చిమండు' పట్టణము

లోని శ్వేత భవనమును వీరికి బసకుగా నిచ్చిరి. అచ్చట నుండు నెడజరగిన యొకటి రెండు వృత్తాంతములు వ్రాసినచో మేరీ రాణికి నామె తల్లి పట్టించిన సుగుణము లిట్టివని తెల్లముగాఁ గలదు.

రాకొమారితె మేయును నామె తల్లియు రిచ్చిమండు ఉద్యాన భూములకును బ్రక్కనంగల 'క్యూ' తోటలకును నప్పుడప్పుడు విహారార్థము వెడలు చుండుదురు. అట్లొక్క ప్రాతఃకాల సమయమున పోయియుండి యొక ముసలిస్త్రీ గట్టెలేరుచుండుటను గాంచిరి. ఆనాఁడు మిక్కిలి చలిగా నుండెను. ఆముదుసలి బడలిపోయి యుండుట విశదముగఁ గనుపించుచుండెను. వెంటనే 'టెక్కు' ప్రభ్వి దన గొడుగు వంకరతో నెండుశాఖలను ద్రుంచ మొదలిడెను. 'మే' రాకుమార్తె వాని నన్నిటిని బోగుచేసెను. ఈపగిది మంచికట్ట యేర్పడెను. ముసలిది మహాసంతోషమున దాని నెత్తుకొని యింటికిఁ బోయెను.

ఒకనాఁడు క్యూతోటయందును నిట్టి విశేషమొక్కటి దటస్థించెను. ఒకదాది ఒకబిడ్డను త్రోపుడు బండియందిడుకొని త్రోసికొని వచ్చుచుండెను. అప్పుడామెకు దారి యందుఁ దీగెలకంచె యడ్డమయ్యెను. బహుదూరము వెనుకకు దిరిగి పోయినఁ గాని సరియగు మార్గము గానరాదు. కావున నామె యాకంచెలో నుండి త్రోపుడుబండిని



దూర్చి ప్రయాణము సాగించవలెనని పలుమారు ప్రయత్నించెను. కాని యామె ప్రయత్నము ఫలింపకుండెను. దానినంతయు గమనించి చూచుచుండిన టెక్కుప్రభ్వి 'నిలు. నిలు. నేను నీకు సాయము చేయఁగలుగుదును. నీవు బిడ్డనెత్తుకొమ్ము. నేనును నాపుత్రికయు త్రోపుడు బండిని కంచెను దాఁటించెద" మని నుడివి తృటికాలములో నా దాదిని సంతోషపఱచి పంపి వేసెను. కాని యా దాదికి మాత్రముదనకిట్టి సాయము చేసిన వారెవరైనదియును దెలియదు.

మే రాకొమారితకు తలిదండ్రులిచ్చు చిల్లర పైకమున నామె యొక భాగముప్రత్యేకించి వైచి దరిద్రుల బిడ్డలకుఁ బంచిపెట్టుట చిన్నతనమునందే నేర్చుకొనియెను. ఆప్రాంతముల నుండిన క్షయరోగియగు నొక బాలునియెడ నీమె చూపిన దయయు సానుభూతియు నింకను నచ్చట విన నగుచున్నది. ఈమె పలుమారు వానిని జూడఁ బోయి యా కుటీరమున వానిప్రక్కనఁగూర్చుండి ముద్దులుగులుకుమాటలతో వానిని సంతోషపెట్టుచు సద్గ్రంథములఁ జదివి వాని వీనులకు విందొనర్చుచు వాని యాయాస ముడుపుచుండెడిది. ఆమె ఒక యాదిత్యవారము ప్రొద్దుటివేళ చర్చికి పోవుచు కడపటి పర్యాయము వానిని జూచెను. ఆమెకప్పటికే యాపసివానికి మరణము మూఁడియుంట నిశ్చయముగఁ దెలిసియుండెను. కావున నామె కంటనీరునించి వానినిముద్దుగొని వానినుండి

సెలవు పుచ్చుకొనియెనఁట. ఇట్టి విశేషచరిత్రకలదయి పెరుగుచు నీమె తల్లితోఁగూడ ననేక వైద్యశాలలును శరణాలయములును వీక్షించి బీదలమేలునకై పెక్కు విధములఁ బాటుపడుచుండెను. మేరాకొమరితె కిరువది సంవత్సరములకుఁ బైబడి చూచుటకీమె విగ్రహము పొడవయి బహుసుందరమయి యుండెను. ఆ సమయమున నీమెపాణిని గ్రహించుట కెవరో యొక విదేశపు రాకొమరుఁడు ప్రయత్నించెనను వార్త కొద్దిగఁ గలదు. కాని యాతని కీమె లభింపదయ్యెను. తండ్రి కనంతరము సింహాసనమున కర్హుఁడయిన జార్జి కొమరుఁడు మాచమువరులకై వేచియున్నవాఁడు.

## జార్జి యార్కు ప్రభువగుట.

క్లారెంసు ప్రభువు మరణముచేత తన స్థితియందుఁ గలిగిన ప్రాప్తియగు మార్పు, దుఃఖము వలన జార్జి కొక కొంతకాలము చక్కఁగ బోధపడలేదు. కాని త్వరలోనె క్రమక్రమముగఁ దన భవిష్యత్కర్తవ్యముల నితఁ డెఱింగికొన మొదలిడెను. 1892 వ సంవత్సరమున నితఁడు 'ఇహ్నే' పండితునితోఁగూడ జర్మనీయా యందలి హీడల్బర్గు పట్టణమునకుఁ బోయెను. విద్యాభ్యసనకాలము గానిసమయముల నితఁడు సుందరమగు నాపురవీధులలోఁ బచారుచేయుచు నెదురు పడ్డ ప్రజతో సంభాషించుచుండును. అచ్చటి సర్వకలాభవన విద్యార్థులు బంతులాడుచుంటను జూచి యొక్కొకవేళ సంతసించుచుండును. ఇట్లు కొంత కాలముట గడపి జార్జి 'మెలాంపసు' అను రెండవతరగతి నావ కధ్యక్షుఁడయి నావికా ప్రదర్శనములఁ బనిచేసెను. ఇంచుమించుగ నీసమయముననె జార్జికి 'యార్కు ప్రభువు' అను బిరుదుగలిగెను. సింహాసనమున కర్హుఁడైనందున నితనికి నావికాజీవనము విడువదగినదేయైనను గొంతకాలము వఱకును నప్పుడప్పుడు సముద్రయానమునకుఁ బోవుటకు వలయు సమవాయము లేర్పఱుపఁబడెను. ప్రభుమండల మధ్యమునకంటె నావికాసమూహమధ్యముననే యితనికి దృష్టి యెక్కుడగుటచే యువరాజపట్టభద్రున కొసంగఁబడు పెక్కు బిరుదావళులును దదర్థము నియమితములయిన యాచారములును నితని కంతగా రుచింపలేదు. కాని యవ్వానిని స్వీకరించియే తీరవలసిన వాఁడగుట, వాని నెల్లను నర్థాంగీకారముతోడ నందుకొనియెను. క్రీ॥ శ॥ 1892 వ సంవత్సరము జూన్ నెల 17 వ తేది యితఁడు ప్రభువుల సభలో నొక సభ్యుఁడుగ నేర్పడి యాపదమునకు నిర్ణీతముగఁ బ్రతినల నంగీకరించెను. ఉపన్యాసము లిచ్చుట యనిన నావికులకు తలకంటగింపు. నావికుఁ డగుటచే నితనికిని ఉపన్యాసముల యందంత యభిరుచి లేదు. లేకున్నను ఉపన్యాసము లియ్యక తప్పినది కాదు. కావున నితఁడు దన బంధువగు కేంబ్రిడ్జు ప్రభువును ఉపన్యాసములిచ్చు విధమునుగూర్చి కొన్ని సలహా లిమ్మని యడిగెను. అతఁడు 'కుఱ్ఱా! ఇంతకంటె సులభమేమియు లేదు. చిన్న కాగితపు ముక్కలమీఁద నీవు మాట్లాడు

విషయమును రచియించి యుంచుకొనుము. పిదప నేమియుఁ దొట్రుపాటు పనిలేదు. సమయము వచ్చిన వెంటనె ముక్కలు దీసి చదువ వలసినదె" యని ప్రత్యుత్తర మిచ్చెను. యార్కుప్రభు వతనికిఁ బ్రణమిల్లెను. కాని యతని బోధనుపయోగింపలేదు. ఒక సభయందు కేంబ్రిడ్జు ప్రభువు ప్రక్కనఁ గూర్చొని యుండెను. తానగ్రాసనాసీనుఁడై యుండె. అట్టితరుణమున జార్జి ప్రభువు లేచి కేంబ్రిడ్జు ప్రభువు విస్మయమందుచుండఁ దన మనోపేటిక నుండి వెలువడు వాక్కులతో సల్లనల్లన నుపన్యసింప మొదలిడెను. కేంబ్రిడ్జు "పోగరుపోతు కుఱ్ఱఁడు. నేఁజెప్పిన ట్లేలజెయ్యఁడయ్యె? తప్పదు. ఇతఁడుపన్యాసమధ్యమున నాఁగిపోవును. అవమానపడును" అని గొణఁగుకొనుచుండెను. యార్కు భీతినందలేదు. నిలువలేదు. రెండుమూఁడుపన్యాసముల జయప్రదముగఁ జేసి తండ్రికి సంతోషము నించెను.

## వివాహమహోత్సవము.

1893 వ సంవత్సరము మే నెల 3 వ దినమున యార్కు ప్రభువునకును మే రాకొమరితెకును ప్రధానము జరగెననువార్త వ్యాపించెను. దేశమంతయును మిక్కిలి యానందించె. పత్రికలా యానందమును వేనోళ్లఁ జాటెను. శీఘ్రకాలములోననె యిరువాగులవారును నపరిమితమగు పెండ్లి సన్నాహములఁ జేయఁ దొడంగిరి. సామ్రాజ్యపుఁ బదిచెరగుల నుండియు బహుమానములు పెండ్లి కొమారుఁడు పెండ్లికొమార్తెలకు వేనవేలుగ



రాఁ బ్రారంభించెను. విక్టోరియా మహారాజ్ఞీగా రీప్రయత్నములు గొంతకాలము సాగిన తరువాత వానివలననగు నాయాసమును దీర్చుకొన బాల్మోరాలు భవనమున వసింపఁబోయిరి. అయిన నటనున్నను వివాహమున కమర్పఁబడు ప్రతి విషయమును నామెకుఁ దెలిపి యామె యంగీకార మందుచుండిరి. యార్కుప్రభు వింకను విందు సమయముల నెక్కుడు సిగ్గును గనుపఱచుచుండెను. ఒకతరి "ఇక్కడ నొక్కరినైనను నేనెఱుఁగను. ఇంతకాలము సముద్రముమీఁదనుండిపోయితి" నని యొక స్నేహితునితో నుడివెను. అయినఁ బ్రధానమునకుఁ దరువాత నితఁడును ఈతని భవిష్యద్భార్యయు ననేకములగు విందులకాహూయమానులై వీరేయచ్చట ముఖ్యాతిథులయినందున నీతని కీసిగ్గు వదలి పోవుటకు సందర్భములు గావలయు నన్ని దొరకెను.

జూలయినెల యారవతేది సర్వజనులకును నుత్కృష్ట సంతోషాస్పదమగుఁ బండుగ. నాఁడు, దినముగూడ నిర్మలమై హర్షదాయిగనుండెను. అరుణోదయము మొదలు మధ్యాహ్నము వఱకును బ్రజ గుంపులుగ లండను నగరమునకు వచ్చి చేరిరి. వివాహితులగు డ్యూకు రాకొమరితల యూరేగింపుఁ జూడనెల్లరును గుతూహలులయి యేతెంచిరి. రాచబాట కావల నీవల వేనవేలు యుద్ధభటులు వరుసలుదీరిరి. పదిన్నర గంటలగుటయు నతిథులొక్కరొక్కరుగ సెంటుజేమ్సునగరు నందలి అంబాసడరు కోర్టుఁ జొరఁ బ్రారంభించిరి. వధువు

తండ్రిగారికిఁ బిల్లనాఁటనుండియు స్నేహితుఁడును, నాంగ్లేయ దేశభక్తులలో నగ్రగాగ్రేసరుఁడును నగు గ్లాడుస్టన్ రాజనీతిజ్ఞ శిఖామణి మొట్టమొదటి వారలలో నొకఁడుగఁ బ్రవేశించెను. లెక్కకుమీఱి పిక్కటిలిన యువతీమణుల యాభరణముల నుండియు వస్త్రములనుండియు బయలుదేరు ప్రభలు నలుదిక్కులను వ్యాపించి వింతకాంతుల వెదఁజల్లుచుండెను. ప్రసిద్ధి నొందిన ప్రతిపురుషుఁడును బ్రతి స్త్రీయును వివాహాలయంబునకు వేళకు దప్పక వచ్చియుండెననుట విశదమయ్యె. బహిరంగణము నందలి వాద్యవిశేషముల గంభీరస్వనములు మొదటి యూరేగింపు గదలివచ్చుటం దెల్పెను. అచిరకాలములోనే వరుఁడు దనతండ్రితోడను బినతండ్రితోడను వివాహాలయము లోనికిఁ బదము లిడుచుండుట గానవచ్చెను. అతఁడు ధరించిన యుడుపులు నావికా నాయకత్వమును జ్ఞప్తించుచుండెను. అతని నడకయుఁ జేష్టయు నాతని సభాకంపతను బయల్పఱచుచుండెను. మేరా కూఁతురును శుభ్రమగుఁ దెలుపుఁగట్టి వెండిజరిగె బుటేదారు పని చకచక లీనుచుండఁ దా ధరించిన గులాబి మున్నగు సుపుష్పములకుఁ దనదేహకాంతిచే నెక్కుడు సౌందర్యము నిచ్చుచుఁ గొలఁది కాలములోనె సఖులతోఁగూడ నావివాహమందిరముఁ జొచ్చెను. ఈయుత్సవ సమయమున కేతెంచిన రాజకీయాతిథు లనేకులు. అందు రుష్యాజారు కుమారుఁడును, డెన్మార్కు రాజ్యపురాజును రాణియు నుండిరి. వీరెల్లరును రాజనగరునం



దలి చిన్న గుడిలో నెఱ్ఱరంగు వస్త్రములతో నలంకరింపఁబడిన యాసనముల మీఁదఁ గూర్చుండిరి. పవిత్రవేదికకు వరుఁడు వచ్చుటకుఁ గించిత్పూర్వము, రజతతూర్యముల మంగళస్వనములును, సామాజికు లెల్లరును నిశ్శబ్దముగ లేచి నిలచుటయును విక్టోరియా మహారాణిగారి రాకను దెలియపఱచెను. ఆయమ నల్లనివస్త్రముల ధరియించియుండెను గాని సందర్భశుద్ధికయి నలంకరింపఁజేసిన బుటేదారుపని వానిని సంపూర్ణముగ నావరించుకొని వాని యసితవర్ణమును పై కెగయనీకుండెను. వజ్రముల చిన్నకిరీటమును, 'ఆర్డరు ఆఫ్ దిగార్టరు'ను బిరుదును సంకేతించు నీలవర్ణపు బట్టెడయు, 'నైటు' పదమును సూచు పెక్కులగుఁ జుక్కలును బ్రపంచమునందలియుత్తమ చక్రవర్తిని కలంకారములయి శోభిల్లుచుండెను. ఇప్పగిది ధగద్ధగాయమానమగు విచిత్ర వర్ణముల ప్రవాహము పరిపూర్ణముగఁ బ్రవహించుచుఁ జూపరుల కన్నుల మిఱుమిట్లు గొలుపుచుండెను. వారిదిగ్భ్రమతను బాపుట కోయన నాచార్య సంఘము దమకు సాధారణమగు నుడుపులతో సభామధ్యమున కేతెంచిరి. టెక్కుప్రభువు దనకన్యను జార్జి ప్రభువుకు దానముసేసెను. ఆమెయు మెల్లని స్వనమున సందర్భోచితములగు పలుకుల నుడివెను. మహామతాచార్యుఁ డొకచిన్న యుపన్యాసమున వధూవరులకు బోధనా వాక్యములఁ బల్కి యీవివాహము ఆంగ్లేయ జాతికి శ్రేయోదాయమగు గాత

మని యాశీర్వదించెను. ప్రార్థనగీతము పాడినతరువాత యార్కు ప్రభువు దనభార్యను, విక్టోరియా మహారాజీగారిని, వేల్సురాకొమారితెను, ఎక్కు ప్రభ్విని, డెన్మార్కురాజదంపతులను ముద్దుగొనెను. మహారాజీయు, తక్కుంగల రాజసమూహమును మిక్కిలి యనురాగముతోఁ బెండ్లికూఁతును దీవించిరి. తరువాత స్వల్పకాలములోనె యూరేగింపులతో నందఱును వివాహ భోజనమునకయి 'బక్కింగ్హాము' నగరునకు బయలుదేరిరి. ప్రక్కన నుద్యానవనమందుంగల తుపాకులు గౌరవార్థముగ గుండ్లు ప్రేల్చెను. లండను నగరమందలి చర్చుల గంటలన్నియు సంతోషధ్వానముల నిగుడ్చెను. బక్కింగ్హాము నగరు ముంగల పథూవరులకై యెదురు జూచుచుండిన జనులు మూకగట్టి నిలిచియుండిరి. వీరి కానందము గలుగఁ జేయుటకు నగరుసేరిన కొన్ని నిమేషముల లోపలనె విక్టోరియా మహారాణియు నామెకుటుంబమును యా సౌధపుఁబైయంతస్థు నందలిసజ్జున నగుపించిరి. కుర్చీలు దేఁబడి వారికమర్పఁబడెను. పదినిముసముల కాలము నవీనదంపతులు సరససల్లాపము లాడుకొనుచుఁ దమ యవ్వగారి సమీపమునఁ గూర్చుండిరి. జనులందఱును దాము వేచియున్నందులకు ఫలముగఁ గన్నులార జార్జి మేరీల జూచి తనివినందిరి. దీనికిఁ బిదప సాధారణముగ నిట్టి వివాహములకు సామాన్యములగు నితర కార్యములును వేడుకలును నడచెను. వివాహము యథా



శ్రీ చక్రవర్తిగారి కుటుంబము

విధిగను జయప్రదముగను ముగింపునందెను. ప్రజలందఱును దమ తమ కుచితమగు విధమున నీ మహోత్సవ కాలమున సంతోషమును గనుపఱచిరి. తనకు నైజమగు సుస్వభావమును వెల్లడించుచు, తన మనుమఁడగు యార్కు ప్రభువుకును, టెక్కు రాకొమరితె యగు విక్టోరియా మేరీకిని జరగిన వివాహసమయమునఁ బ్రజలు దన యెడలను దన సంతతి యెడలను గనుపఱచిన విశేష ప్రేమాభక్తులు మనస్సునకు హత్తి మహాసంతోషప్రీతుల నిచ్చెనని విక్టోరియా రాణిగారు దెలియఁ జేసియున్నారు. ఇది రాణిగారి కొక క్రొత్తసంగతి గాదు. సుఖమునఁగాని దుఃఖమునఁ గాని యామెయెడ గాఢమగు సానుభూతి యెల్లరును గనుపింపఁ జేయుచుండుట యామె మనమున సంపూర్ణముగా నంటినదే. తమ సుఖదుఃఖములయందా యమ హృదయమెంత గాఢముగ నిమగ్నమగునదియు వా రెఱుంగుదు రని యామెకుఁ దెలియును. సామ్రాజ్యమందలి సర్వప్రజలకును నామెకును నీపరస్పర సంబంధ ముండుటయె సామ్రాజ్యమునకు నిజమగు బలము. పౌరులతోఁగూడ రాణిగారును దన మనుమఁడును మనుమరాలును జిరాయురైశ్వర్యముల నందుదురు గాతమని పరమాత్మునిఁ బ్రార్థించుచున్నది.'' యని ప్రజల యనురాగమునకు ప్రత్యుత్తరముఁ బ్రకటింపించెను.

## జార్జిరాజకార్యపరిశ్రమ.

వివాహానంతర మేడుసంవత్సరముల కాలము మేరీ ప్రభ్వీ జార్జి ప్రభువుల జీవనమం దొక్కవిభాగముగఁ గొనవలసి యున్నది. 1894వ సంవత్సరము జూను నెల 23వ తేది వీరి ప్రథమ పుత్రుఁడు పుట్టి విక్టోరియా మహారాజ్ఞికిఁ దనకుఁ దరువాత మూఁడవతరపురాజును జూడఁగల్గు సంతోషమును గలిగించెను. ఈశిశువునకు 'ఎడ్వర్డ్ ఆల్బర్ట్ క్రిశ్చియన్ జార్జ్ ఆన్డ్రూ పాట్రిక్ డేవిడ్' అను నామకరణ మొనర్చిరి. మాచదువరు లీపొడవగు పేరేల యిడఁబడెనని యాశ్చర్యపడుచున్నారు గాఁబోలు. బ్రిటిషుదీవులలోని ప్రతిభాగమునకును సంరక్షణకర్తయగు ఋషి యొక్కఁడొక్కరుఁడు గలఁడని వాడుక. అట్టి ఋషులందఱను స్మరియించుఁ దలంపుతో నింతపెద్దపేరు. కాని సర్వసాధారణముగ నీ బిడ్డని డేవిడ్ అనియే పిలుతురు. 1895 వ సంవత్సరమునఁ దూర్పు ఆశియాయందు చీనాచరిత్రమందు బాక్సరువిగ్రహమని పేరుఁగనిన యుద్ధముప్రారంభమయ్యెను. దానియందు జార్జికెక్కుడు దృష్టిదగిలి యచ్చటి సమాచారములను జాగరూకుఁడయి చదువుచుండెను. ఆసంవత్సరము ఫిబ్రవరి మాసముననే యితఁ డున్నత తపాలాస్థానమును జూచి యాంగ్లేయ తపాలాపద్ధతుల నన్నిటిని యుత్తమతపాలాధ్యక్షుని సాహాయ్యముచేఁ బరీక్షించెను. ఇంచుమించుగ నీకాలముననె యితని తండ్రియగు వేల్సుప్రభువు గొంచెము గొంచెముగఁ



దనకుఁ జేయవలయుఁ గార్యములఁ దన కుమారునిపై నిడఁ బ్రారంభించెను. రాజ్యమునందలి వేరువేరు మండలములను జూచి వచ్చుపని యార్కుప్రభువు సేయవలసిన వాఁడయ్యెను. ఇట్లు దినములు గడువ నీతఁడు రాజ్యకార్యము లెక్కుడు నేర్చుచుండెను. డిశంబరు నెల 14వ తేది యితని రెండవ కుమారుఁడు పుట్టెను. అతనికి ఆల్బర్ట్ ఫ్రెడరిక్ ఆర్థర్ జార్జ్ అను పేరిడిరి. 1896వ సంవత్సరమంతయు యార్కుప్రభ్వీ ప్రభువులు బ్రిటిషుదీవులలోని నాలుగు చెరగుల యందలి ప్రదేశములను దర్శించివచ్చుటయందుఁ గడపిరి. కొన్నియెడల వీరనేక శుభకార్యములకుఁ బునాది వైచుచుందురు. మఱికొన్నిచోట్ల వేనవేలు ధనము వెచ్చించికట్టించిన పరిశ్రామిక విద్యాలయములఁ దెఱచుచుందురు. ఇంక గొన్నిపట్లఁ దమ జ్ఞాపకార్థమై యేర్పడిన వైద్యశాలలయందు స్వాగతమంది తమ కృతజ్ఞత దెలుపుచుంద్రు. ఎల్లెడను మనోవాక్కాయ కర్మంబుల నుత్తమోద్యోగములయెడఁ దమసానుభూతిని వెలిఁబుచ్చుచుందురు. 1897 వ సంవత్సరమున మూఁగి వారలకును జెవిటి వారలకును విద్యఁగఱపు సంఘము వారొక విందునడపిరి. ఆసమయమున యార్కుప్రభు వగ్రాసనాసీనత్వమున కంగీకరించి తన సానుభూతిఁ గనుపఱచెను. విందుకుఁ బూర్వమె యితఁడా సంఘము వారి విద్యాశాలకుఁ బోయి సర్వమును నెఱింగికొని తన కార్యమునకు సిద్ధపడియెను. ఒకవిద్యార్థి స్వైర

చిత్రలేఖనము నభ్యసించుచుండెను. అతనింజేఁ దగురీతి సంభాషించి సంపూర్ణ బధిరుఁడైనను జక్కఁగ మాట్లాడ నేరువఁగలిగె ననుటను దెలిసికొనియెనఁట! 1897 వ సంవత్సరము ఏప్రిలు నెల 25వ తేది తల్లిదండ్రుల నలరఁ జేయుచు యార్కుప్రభ్వీ ప్రభువులకుఁ బుత్రికారత్న మొక్కటి జనించెను. ఆ బిడ్డకు విక్టోరియా అలెగ్జాండ్రా ఆలిస్ మేరీయను నామము నిడిరి. జూన్ మాసమునఁ బ్రపంచపు దశదిశలనుండి గౌరవానురాగ వాక్యపుష్పముల విక్టోరియా మహారాజీగారి పీఠమునకుఁ గొనితెచ్చిన యాయమ 'రాజ్యారోహణ షష్ఠిపూర్తి మహోత్సవము జరగెను. అప్పుడీ ప్రభ్వీప్రభ్వు లిరువురును నెల్ల నుద్యోగములకుఁ దోడ్పడి సెయింటుపాల్ దేవాలయమునకు మహారాణితోఁ గూడఁ గృతజ్ఞతాప్రార్థన ల్సేయనేగిరి.

### ఐర్లాండునకు ప్రయాణము.

దీనికి తరువాత ప్రభ్వీప్రభువులు ఐర్లాండునకు విజయము సేయుదురను వార్తపర్వెను. ఆ సీమయందలి జనులెల్లరును దమ సంపూర్ణాంగీకారమును గనుపఱచి వీరెప్పుడు వత్తురాయని వేచియుండిరి. వీరు ఆగస్టుమాసము 17వ తేది లండను నగరము నుండి బయలుదేరిరి. వీరు ఇంగ్లాండు, ఐర్లాండులకు నడుమ నున్న జలభాగము దాఁటు నప్పుడు దినమంత సుముఖముగ నుండలేదు. కాని వారుగట్టుచేరిన తరువాత వారికి జనులిచ్చిన స్వాగత మత్యద్భుతము. కొందఱి వార్తననుసరించి యట్టి



స్వాగతము విక్టోరియా మహారాజిగారి కైనను లండనుపురమున నేని రాజ్యారోహణ షష్ఠిపూర్తి సమయము నందునఁ గూడ నియ్యఁబడలేదఁట! ఇట్లు సుఖముగఁ బ్రారంభించి వారైర్లాండులోని దర్శనీయ స్థలముల కన్నిటికిని బోయిరి. వారి రాకపోకలన్నియు వివరించు టనవసరము. వారయిర్లాండు సందర్శనమును ముగించు నప్పటికి జనులయందు సాంద్రతమమగు రాజభక్తిభావములఁ బురికొల్పి తమ యెడల నెప్పటికిని నశింపనేరని యనురాగమును బుట్టించిరనిన వారి సౌమనస్యత దెలియఁగలదు.

### టెక్కుప్రభ్వీ ప్రభ్వులమరణము.

ఐర్లాండున నుండఁగనే ప్రభ్వీతల్లియగు టెక్కు ప్రభ్వి జబ్బుపడెనను కించిద్దుఃఖకరమగు వార్త వచ్చెను. ఔషధసేవఁ జేయింప నామె యప్పటికిఁ గొంత గుదురుపడెను. కాని యక్టోబరు 25వ తేది మరల నామెకు బలమగు వ్యాధి తటస్థించెను. ఒకపర్యాయ మదివఱకె రణచికిత్స చేయఁబడిన యెడన రెండవమారును నదే చికిత్స చేయవలసి వచ్చెను. ఆమె కా చికిత్స వలన గుణము కాలేదు. 27వ తేది యకస్మాత్తుగఁ గాలగతినొందెను. అప్పటికి మేరీప్రభ్వి యింగ్లాండు సేరియుండెను. కావునఁ దల్లి మరణము నామె చూడ వలసిన దయ్యెను. సంవత్సరమున కైదువేల పౌండ్లాదాయము మాత్రము గలదైనను టెక్కుప్రభ్వి దీర్చుచుండిన యపారమగు లోకోపకార కార్య

ముల వలనను నామె యౌదార్య గుణమువలనను నామె దేశవాసులందఱకును బ్రియమై యుండెను. కాబట్టియే యాయమ మరణమునకు బహు జనులు వగపు గనుపఱచిరి. ఆమెను సమాధి సేయు నప్పుడు చేరిన మహాజనుల గుంపును జూచినను నామె జనుల కెంత యల్లారుముద్దో తెలియుచుండెడిది. ఆమె మరణము వలన టెక్కు ప్రభువు దీనుఁడై యటు తరువాతఁ గృశించుచునే వచ్చెను. 1900 సంవత్సరము జనవరి నెలలో నరువది రెండేండ్ల వయస్సున నితఁడు పరలోకప్రాప్తి నొందెను. కొలఁదికాలములోనే యీవిధముగఁ దలిదండ్రుల నిద్దఱను గోల్పోయిన మేరీప్రభ్వి యెంతి వ్యసనము గలిగియుండెనో ప్రత్యేకించి వ్రాయ వలసిన పని లేదు.

ఈ ఖేదమును గొంతె ముపశమింపఁజేయు విషయ మొకటి మూఁడుమాసముల లోపలనె జరిగెను. మార్చి నెల 31 వ తేది మనప్రభ్విప్రభువులకు మఱియొక కుమారుఁడు పుట్టెను. అతనికి హెన్రివిల్లియమ్ ఫ్రెడరిక్ ఆల్బర్టు అనునామ మునిడిరి. ఇంచు మించుగ నీదినములలోనె జార్జిగారితండ్రి వేల్సు రాకొమరుఁడు 'బ్రుస్సెల్సు' నుండి ప్రయాణమయి వచ్చుచుండ నాతనిని 'సిపిడో' యనువాఁడు గాల్పఁ బ్రయత్నించెనుగాని దైవానుగ్రహమువలన నది దప్పి పోయెను. దీని వలన జార్జి ప్రభువుకు రాజున కగోచరముగఁ జుట్టుందిరుగు నపాయము లనేకములుగలవని విశదమయ్యెను. ఈవిషయమును



గుఱించి యితఁడు దరువాత నొక సభయందు "మహాజనులారా! ఇట్టి సంగతులనెల్ల మనమాపరమాత్ముని చేతిలోనివారమే" యని హాస్యరీతిని పలికిఁ దనభావమును వెల్లడించెను. 1889 వ సంవత్సరముననే గ్లాడుస్టను మహానుభావునికి దేహము స్వస్థతదప్పి లోకమునకుఁ గొంతవిచారము గలిగెను. అప్పుడు జార్జి ప్రభువును మేరీ ప్రభ్వియు నతనియెడ సానుభూతి గనుపఱచిరి. కొలఁదికాలములో గ్లాడుస్టను పరలోకప్రాప్తిఁ జెందెను. అతని భార్యయు 1900 జూను మాసములో మగనిఁ గలుసుకొననేగెను. గ్లాడ్స్టను సమాధిసమయమున మనప్రభువును నతని తండ్రియు శవము పయిఁబఱచు వస్త్రమునుమోసి కొని యాలోకోత్తరునియెడఁ దమకుఁ గల గౌరవ ప్రేమలఁ గనుపఱచిరి. అతని భార్య గతించినప్పుడును మన ప్రభువును ప్రభ్వియు దమ సానుభూతిం దెలిపిరి. ప్రపంచప్రఖ్యాతి గాంచి తన సౌమనస్యమువలన నానాదేశీయ ప్రజల నలరఁజేసి, బూటకపు బిరుదులు మానవుల పరస్పర సామ్యమును బ్రకటించుఁ దనవంటి మహామహునకు రుచింపవని దనంతవచ్చిచేరిన ప్రభుపదమును దిరస్కరించి చాటి, మానవనామమున కర్హత నిచ్చు నుపకరణము సత్కార్యదీక్షయే యని తన జీవనమువలనఁ బ్రదర్శించి, యింగ్లాండు రాష్ట్రమునకును విక్టోరియా మహారాజ్ఞికిని అఖండ యశస్సును సంపాదించిపెట్టి, లోక మెల్లను హాహారావములు సెలంగ నస్తమించిన రాజనీతి పారంగతుఁ

డును సామాన్యజనస్వాతంత్ర్యసంస్థాపకుఁడును అగు మంత్రిసత్తముఁడు దివికేగిన తరువాత నెంతోకాల మాయుత్తమ మిత్రుని సాంగత్యము ఏడలేక వెడలెనో యన విక్టోరియా మహారాణి యచిరకాలములోనే 1901 సంవత్సరమున దన సుప్రసిద్ధ శాంతపరిపాలనమును వదలి దిగంతంబులకు వ్యాపించియుండిన కీర్తిపుంజంబులవలనఁ బామరులగు సర్వజనుల హృదయసీమలనుండి వెల్వడు దుఃఖ పరంపరల నురుమాడుచు వారి శుద్ధప్రేమానిలంబుల సర్వవ్యాపనముతో నాలింగింప స్థూలకాయంబు వదలి ప్రకృతితో సమ్మేళన మందెను.

## జార్జి యువరాజపదవి.

ఈమె మరణమువలన వేల్సు ప్రభువు సప్తమైడ్వర్డు చక్రవర్తి యయ్యెను. యార్కుప్రభువు కారన్‌వాల్ ప్రభువై తండ్రియనుమతిమీఁద మార్చి 16 వ తేది భార్యతోఁ గూడ ఆస్ట్రేలేసియాఁ జూచి రాఁబయలుదేరెను. అచ్చటతఁడు తద్దేశపుఁ బ్రథమ పార్లమెంటు సభ ననఁగా రాజకీయ సభను దెఱచెను. ప్రభ్వీ ప్రభువుల యీ భ్రమణ కాలమువలన ఆస్ట్రేలేసియా న్యూజీలాండు, దక్షిణ ఆఫ్రికా, కనడా, దేశములయందలి బ్రిటిషు ప్రజలకు సంతోష ప్రేమలు గలిగెను. నవంబరు మాసము మొదటిదినమున జార్జిప్రభువును మేరీప్రభ్వియు నింగ్లాండు వచ్చి చేరిరి. ఎనిమిది దినములకుఁ దరువాత నెడ్వర్డు మహారాజు పుట్టిన దినమున, కారన్‌వాల్ ప్రభువును ప్రభ్వియు వేల్సు రా



కొమరుఁడును రాకొమర్తెయు నను బిరుదులందిరి. ఈ బిరుదులంటయె సింహాసనమునకుఁ దామ యప్పటి రాజ్యారూఢులకుఁ బిమ్మట హక్కుదారులని స్థాపించుకొనుట. కావుననె యీ బిరుదులనందు రాబిడ్డలకు దేశీయులందరు హర్షముతో నభివాదన మొనరింతురు. లండనునగర పౌరులు జార్జిమేరీల కిట్టి యభివాదనోత్సవము జరపినపుడు “ ఆంగ్లేయులారా, మేలుకొనుఁడి ” అను శీర్షికతో జార్జి ప్రభువిచ్చిన యుపన్యాస మిప్పటికిని సుప్రసిద్ధమై యున్నది. నాఁటినుండి వేల్సు రాకొమరుఁడు దండ్రికిఁ గ్రమ క్రమముగ నెక్కుడు సహకారికాఁ జొచ్చెను. 1902 వ సంవత్సరము వసంత కాలమంతయు రానున్న పట్టాభిషేకమహోత్సవమును గుఱించి జనులుత్సుకులయి యుండిరి. లగ్నమునకుఁ గొన్ని గంటల పూర్వ మెడ్వర్డు చక్రవర్తి యస్వస్థతనందెననియు రణచికిత్స యవసర మయ్యెననియు దుర్వార్త ప్రపంచము నావరించెను. ఉత్సవమునకు సర్వసిద్ధముగనుండిన లండనుప్రజ దీనివలన నెట్లు మ్రాన్పడినదియు నాఁడటనుండిన వారేరును మఱవఁజాలరు. దిగ్భ్రమవాసిన తోడనె యానగరమునఁ జేయఁబడియున్న ఏర్పాటు లెల్లయు నొక్క త్రుటికాలమున నాపివేయఁబడెను. బ్రిటిషుప్రజలును, నెడ్వర్డుచక్రవర్తి శాంతగుణము నెఱిఁగియున్న యితర దేశీయులును దుఃఖమున మునిఁగి పోయిరి. ఇట్లయ్యును నాతని విశేషానుజ్ఞల ననుసరించి కొన్ని కొన్ని

విందులు మాత్రము నిలుపఁబడలేదు. దైవానుగ్రహముచే స్వల్పకాలముననె ఎడ్వర్డు వ్యాధివిముక్తుఁడై బలమునంది యథావిధిగ మూర్ధాభిషిక్తుఁ డయ్యెను. ఈ కాలమెల్ల దల్లి మొదలుగాఁ గల వారి దుఃఖము నాపుటయందును, బట్టాభిషేక మహోత్సవమునకు వచ్చిన రాజాధిరాజులకు సపర్యలు సలుపుటయందును వేల్సు రాకొమరుఁ డుద్యుక్తుఁ డయి యుండెను. 1902 వ సంవత్సరము డిశంబరు నెల 20 వ తేది యితనికి మఱియొక కుమారుఁడు జన్మించెను. అతనికి 'జార్జ్ ఎడ్వర్డ్ అలెగ్జాండర్ ఎడ్మండు' అని పేరిడిరి.

జపానీయులయెడ ప్రీతి.

1904 వ సంవత్సరమున రుష్యా జపానువిగ్రహము జార్జి దృష్టినంతయు నాకర్షించెను. తాను నావికుఁడుగాన నీ విగ్రహమునఁ బ్రయోగింపఁబడు నూతన నావికా వ్యూహములఁ బరిశీలించి యానందమొంద వచ్చునని తలంచెను. ఆ యుద్ధమున నిరువాగుల వారి కార్యముల యౌచిత్యానౌచిత్యములు విమర్శించుటకుఁగూడ నెడము లేకుండెను. ఆ బాల్యస్నేహితుఁడు రుష్యాజారగుటవలనను, జపానుపక్షమునందలి ప్రముఖులొక కొందఱు దన మిత్రులగుట వలనను నితనికి రెండు పక్షముల వారియందును సమాన గౌరవమే యుండెడిది. 'ఊర్ట్సరు' అను నావకుఁ జేరిన నావికావిద్యార్థుల కితఁడు బహుమానములఁ బంచిపెట్టుచుండెను. అప్పుడితఁడు "ఉత్తమ



నావికానాయకుఁడని లోకమున విరివిగ ప్రసిద్ధిఁగాంచిన యడ్మిరల్ టోగో యీ 'ఊర్ట్సరు' పయిఁ బదునెనిమిది మాసములు పరిశ్రమ చేసినాఁడనుట ప్రతి 'ఊర్ట్సరు' బాలుఁడును గౌరవముతో స్మరింపవలెను." అని నుడివెను. జపానునకు నావికానాయకత్వమున నగ్రస్థానమును సంపాదించి పెట్టిన యడ్మిరల్ టోగో యింగ్లండునందలి యీ ఊర్ట్సరునావలోఁ బని నేర్చుకొని యచ్చట నెల్లరకును గావలసిన వాఁడై నెగడినవాఁడు. ఇంగ్లాండుతో నిట్టి సంబంధము గలవాఁడు గావుననే జార్జిచక్రవర్తిగారికట జరగిన పట్టాభిషేక మహోత్సవమును దిలకింప నాతఁడాహూయమానుఁ డయ్యెను. అడ్మిరల్ టోగో యెడలను, 'పోర్టు ఆర్థరును' రుష్యావారినుండి పట్టుకొనిన 'నోగీ' సేనాధిపతి యెడలను జార్జిచక్రవర్తి కత్యాదరముగలదు. వారి మూలమునను, నితరప్రముఖులతో సంభాషించుట వలనను, గ్రంథావలోకనమునను జార్జిచక్రవర్తియు మేరీచక్రవర్తినియు జపాను చీనాలను గూర్చి చక్కఁగ నెఱింగికొని యున్నారు.

హిందూదేశమునకు ప్రయాణము.

1905వ సంవత్సరమున మార్చి నెలలో జరగిన ఆంగ్లేయ రాజకీయ సభయందు వేల్సుప్రభువును బ్రభ్వియు భరతవర్షమును దర్శించి వచ్చుటకై రు 3,00,000లు కర్చులకుగాను నుపయోగించుకొనవచ్చునని తీర్మానింపఁబడెను. జార్జిప్రభువు బొంబాయి గ్రామరక్షక సంఘమువారి సమ్మానపత్రికకు బదులు

చెప్పుటలో వక్కాణించిన విధమున నతఁడీదేశమునకు వచ్చుటకుఁ బూర్వమె యిద్దానిం గుఱించి శ్రద్ధఁజేసి చదువుకొని యుండెను. కాని గ్రంథస్థవర్ణనల వలన గ్రహించు జ్ఞానమునకును స్వీయముగఁ బరిశీలించి విమర్శించి సంపాదించు జ్ఞానమునకును గడు దూరముగదా! జార్జిప్రభువు దమసామ్రాజ్యమునకు శిరోమణి యనఁదగు నీభరతఖండమును గన్నులారఁ జూచు వేడుకతో నా సంవత్సరము అక్టోబరు నెల 19వ తేది యిలు వెడలి బయలు దేరెను. కన్నబిడ్డలను వెనుక విడనాడి ప్రయాణమునకుఁ దరలుట యేరికైనను గష్టమే. మేరీరాణిగారికిఁ గూడనట్టి భావము వొడమెను. కానియాయమ దన బిడ్డలు అలెగ్జాండ్రా మహారాణిగారి సంరక్షణలో నుందురను గొప్పనమ్మకము వలన వారినుండి కొంతకాలము వేరుపడవలసి యుండుటకు మనస్సును గుదుర్చుకొని భర్తతోఁ గూడ 'రినౌన్' అను ఓడనెక్కి ప్రయాణమాయెను. భార్యాభర్తలిరువురును బొంబాయికి వచ్చిచేరిరి. భారతపుత్రులచ్చట దమ ఈ భవిష్యత్పరిపాలకుల కొసఁగిన స్వాగతమును వర్ణింప నలవిగాదు. స్వాగత పత్రికకుఁ బ్రత్యుత్తర మిచ్చుటలో జార్జి ప్రభు విట్లు పలికెను:—

" ..ముప్పది సంవత్సరముల క్రింద నొకనాఁడు నా ప్రియజనకుఁడగు చక్రవర్తి యీ ప్రాంతముననె నిలువఁబడి తన జీవితమునందు భరతఖండమును జూడవలెననుట



కలలయందుంగూడ దలపెట్టుచుండెనని వక్కాణించుచుండెను. నేనును నాభార్యయు నట్టియూహాలతోడనె యుంటిమి. మీరును మీసహకారులును ఈమా తలపోతల నింత జయప్రదముగఁ దీర్చినందులకు మేము మీకెంతయుఁ గృతజ్ఞులము. తండ్రిగారివలెనే మేమును నడచుకొనుటలో వారిచేఁ బ్రారంభింపఁ బడిన యాచారమును నెఱవేర్చిన వారమగు చున్నారము. ఆయాచారము దరతరముగఁ బూర్తి సేయఁ బడుచునేయుండుఁ గాక యని మాయాశయము. నేనును రాకొమరితెయుఁ బూనుకొనిన యీభ్రమణముల నొక్క లోపముండక మానదు. ప్రతివస్తువును జూచుటకును, గౌరవమొసర్చు ప్రతివ్యక్తికిని మాకృతజ్ఞత సూచించుటకును మాకు కాలముచాలదు. ఏరి స్మరణము మన కెల్లరకును ప్రేమావహమో అట్టి మీ మొదటి మహారాజ్ఞియగు నాయవ్వనుండియు నా తండ్రినుండియు భరతవర్షము నెడను భారతీయుల యెడను ప్రేమ వంశపరంపరగ వచ్చియున్నది. నాచిన్నతనమునుండి భరతవర్షమునిన దయ, భక్తి మర్యాద, స్థైర్యము అను నీ సద్గుణములకుఁ బర్యాయపదమని యెన్నుకొనుచున్నాఁడను. ముందు కొద్దిమాసముల లోపలన నాయనుభవములవలన నీప్రథమభావములు బలపడఁ గలవని నమ్ముచున్నాను. భారతీయుల యెడ సానుభూతియుఁ బ్రేమయు గల వారమగుటయే గాక వారి కొఱంతల యందును కామ్యములయందును నెక్కుడు పరిచయముతో సంబంధముగలుగఁ

జేసికొని దైవనియోగముచే భరతవర్షపు క్షేమమును నందలి ప్రజలసౌఖ్యమును ననెడి ఏకపరిణామమునకై పాటుపడు ప్రజలతో బ్రిటిషువారనక భారతీయులనక రాజకీయోద్యోగులనక పరులనక సర్వజాతుల సర్వశాఖల వారితో స్నేహ మలవడఁ జేసికొనవలెనను నదే మా యిరువురి యాశయమయి యున్నది....”

ఇట్టి యుత్కృష్ట వాక్యములకు భారతీయు లలరి రని వేరుగఁ జెప్పవలెనా? ఇట్టి సౌమనస్యముగల ప్రభువు నెడ వారికిఁ గృతజ్ఞత యపారమనిన యొకవింతయా! వేల్సు రాకొమరుఁడును రాకొమరితయు బొంబాయి వదలి భరతఖండమునఁ బ్రయాణమై పోయిన మార్గమునంతయు నిట విస్తరించి వ్రాయఁ బనిలేదు. వీరి విహారమును గుఱించి సాధ్యమగు నంత సంగ్రహముగ జార్జి రాకొమరుఁడు గిల్డుహాలు భవనమున ఉపన్యసించిన వాక్యములతోడనె వర్ణించెదము.

### హిందూదేశ విహారము.

“నవంబరు నెల 9వ తేది బొంబాయి నగరమున స్వాగతమందినది మొదలు మార్చినెల 19వ తేది కరాచిరేవునందు నింగ్లాండు ముఖమయి యోడ నెక్కుటకు విహరించినస్థలములలో నెల్లమాకు ప్రజలు గనుపఱచిన గౌరవమును ప్రేమయును నపారములు. అవిమాకు హృదయంగమము లయియున్నవి. మేమెప్పుడును మఱవఁజాలము.... మేము వెళ్ళినచోట్ల నెల్లయు



వీధులు చక్కఁగ నలంకరింపఁ బడి జనులు గుంపులు గుంపులుగ మనోహరమగు నుడుపులు ధరించి మమ్ము నెదుర్కొను చుండినను, కొన్నిభాగములందు క్షామమువలనఁ బీడింపఁబడి దరిద్రులై కష్టము లందుచుండిన దురదృష్టులను మేము మఱవ లేదు. నేను గ్వాలియరునందు దుర్భిక్షమువాతఁ బడకుండ సంరక్షింపఁబడుచుండిన 6000 జనమును పురుషులు స్త్రీలుబిడ్డలను నొక్కయెడఁ జూచుటతటస్థించెను. ఆగంగమును గాంచుట దుఃఖకరముగనే యుండెనుగాని, యాబీదలను గాపాడుటకుఁ జేయఁబడియుండిన సంపూర్ణప్రయత్నములఁ జూచిన నాకు సంతోషముగలిగెను. సామంతరాజుల రాష్ట్రములను జూచుట మా యనుభవములలో ముఖ్యతమముగను, నెక్కుడానందదాయిగను గణింపఁ బడవలెను. ఆసామంతప్రభువులును వారివారి ప్రజలును మిక్కిలి యుత్సాహముతోడను గౌరవముతోడను మమ్మును సత్కరించిరి.... కొద్దిపాటి యనుభవముతో నామనస్సున భరత వర్షమును గుఱించి నిలచిన భావములను నుడువుచున్నాను. భరతవర్షము నొక్కదేశముగఁ బరిగణింపఁ గూడదు. అది రుష్యాదక్కఁ దక్కిన యౌరోపాఖండమునకు సమానమగు విస్తీర్ణముగల ఖండము. జాతిమతభాషలచే భిన్నులగు పెక్కుతెగల జనులు మొత్తమునకు 300, 000, 000 ఆఖండమున నివసించుచున్నారు. దాని యపరిమితవిస్తీర్ణమును, అద్భుత తేజంబును, మారుచుండెడి శీతోష్ణ స్థితియు, అందలి విస్తారమగు నెడారు

లును, హిమాచ్ఛాదిత శిఖరములును, సుందరమగు నడవులును, మహానదులును, ప్రాచీన శిల్పికా వైచిత్ర్యములును, పురాతన గాథలును నాకాశ్చర్యమును బుట్టించెను. భారతీయులు మిక్కిలి యోర్పు గలవారనియు, జీవనమున నాడంబరము లేనివారనియు, రాజభక్తిపరులనియు, దైవభక్తిపూర్ణులనియు నాకు దృఢమగు నమ్మకము కలిగినది. మన పరిపాలన న్యాయపరిపాలనయనియు ధర్మపరిపాలన యనియు వారు విశ్వసించి రనినే నెఱుంగఁ గలిగితిని.

"నేనుజూచిన విషయములను బట్టియు, వినినసంగతులను బట్టియుమనము రాజ్యకార్య నిర్వాహణమున జనులయెడ నెక్కుడు సానుభూతి గనుపఱుపఁ గడంగినచో భారత వర్షము నేలుట మనకింకను మిక్కిలి సులభముగా గలదని తీర్మానించి తిరవలసినవాఁడనై యున్నాను.

"అట్టి సానుభూతికి నెల్లప్పుడును జనులు గొల్లలుగ నిజముగుఁ గృతజ్ఞతఁ జూపుదురని నేను నిశ్చయముగఁ జెప్పఁగలను... పూర్వ దేశములకు సహజమగు నిర్మలాకాశము ఛత్రముగఁ దరలివచ్చి నానావర్ణ వస్త్రములు ధరించిన సర్వజాతిజనులును బొంబాయిలో కరాస్ఫాలనాది శుభచిహ్నములతో నాకొసంగిన స్వాగతమును చిత్రించుటకు నాకు శక్తియుండిన బాగుండునేయని మనసు ఉవ్విళ్లూరు చున్నది. కాని





కైబరు కనుమ.

ఉష్ణభూమియగు బొంబయినుండి నాభావములు కటిక చలిసీమయగు ఖైబరు కనుమ ప్రాంతములకుఁ బరు వెత్తుచున్నవి... అచ్చటఁ జగత్త్రయమందుఁ బ్రసిద్ధమగు 'ఆలీమసిజిదు' గలదు. అచ్చటికిఁ జుట్టుముట్టు నధికారమువహించు ఖానులు దమ మందలలో నుండి యేరిన పొటేళ్ళను, మంచి తేనెను గానుకగఁ గొని వచ్చిరి. ఇట్టి యాటవికములును, స్వల్ప నాగరికతా సూచకములును నగు ప్రదేశములకును గళాకౌశలమునకు ముకురములు పోలి ప్రాచీన వైభవమును వెల్లడించు శిథిలభవనముల కిరవు పై శోభిల్లు ఢిల్లీయాగ్రాలకును దారతమ్యముఁ బరిశీలించిన నెంత మనోరంజకముగనుండునో గనుఁడు. అటనుండి మేము గ్వాలియరుకును, కాశికిని దరలితిమి. లోకమున మరెచ్చటను సాధ్యముగాని సందర్భము లచ్చట మాకు సమకూరెను. చిత్రవిచిత్రములగు రంగువస్త్రములు తొడుగుకొని ఐరోపాఖండమునందలి మధ్యకాలపు (క్రీ॥ శ॥ 14, 15, 16 శతాబ్దములు) సైనికులను స్మరణకుఁ దెచ్చు పార్శ్వవర్తులు బారులు బారులుగఁ జుట్టినడువ విలువఁగల యంబారులచే నలంకరింపఁబడిన ఏనుంగులపై నెక్కించి మమ్ములను బట్టణములలోనికిఁ బిలుచుకొని పోయిరి.... క్రొత్త సంవత్సరము పుట్టునప్పటికి మేము మనసామ్రాజ్యమున రెండవ నగరమయిన కలకత్తాయం దుంటిమి. తగినంత కాలము లేదుగాని లేనిచో జాతి విషయమునను, సాంఘికాచార విషయములను,



భరతవర్షమునుండి మిక్కిలి భిన్నమయిన బర్మాను గురించియు, రంగూనునందలి సువర్ణాలయమును గురించియు, మండలే పట్టణమందలి దర్శనీయవస్తువులను గురించియు, ఐరావతిపయి మేము



బోలన్ కనుమ.

మూఁడు దినములు గాంచిన యనుభవములను గురించియు నుపన్యసింపవలెనను కోరిక కలదు. అయిన నిది యదను కాదు. మనము మద్రాసు వైపునకుఁ బోవలసియున్నది. ఆనగరము

మనసామ్రాజ్య స్థాపనచరిత్రమున నెక్కుడు సంబంధము గలది.* అచ్చటినుండి దక్షిణ ఇండియా యందలి యుష్ణభూములను దాఁటి యుత్తరాభిముఖులమయి పవిత్రక్షేత్రమయి హిందూ మతమునకు రాజధాని యనఁదగి పుణ్యనదికిని ప్రసిద్ధదేవాలయ ములకును నావాసమయిన వారణాసిఁగడచి మరల కటికచలికిని మంచునకును బుట్టినిల్లయిన క్వెట్టా ప్రదేశమును జొచ్చితిమి. దానిని వదలి బోలనుకనుమద్వారా నత్యద్భుతమగు రైలుమార్గ మున సముద్రతీరమునకు 5500 అడుగుల పైనుండి దిగి సింధు మండలములోని తీక్ష్ణాతపమున కాకరమగు మైదానములను దరించి కరాచీరేవు చేరితిమి" అని జార్జి రాకొమరుఁడు ఇంగ్లాండు చేరిన తరువాత గిల్డుహాలుభవనమున నుడివెను.

ఇతని వాక్యములన్నియు మనము సంతోషముతో జ్ఞాపకముంచుకొనఁదగినవే. అందులోఁ గ్రిందగీతలు వేయఁబడిన భాగము మనచక్రవర్తిగారి హృదయస్థ ప్రేమను వెల్లడించుచున్నది. గావున నది మనకు సర్వకాలములయందును స్మరణీయము. "నేను జూచిన విషయములను బట్టియు వినిన సంగతులను బట్టియు మనము రాజ్యకార్యనిర్వహణమున జనులయెడ నెక్కుడు సానుభూతిగనుపఱుపఁ గడంగినచో" యను పదములు జార్జి ప్రభువుగారు భారతవర్షమును

* తూర్పుతీరమున నాంగ్లేయుల మొదటి స్థానములలో నిది యొకటి. యని చక్రవర్తిగారిభావము.



గుఱించి యెన్నియో విషయముల నెఱింగికొని యుండిరనుట విశదపఱచుచున్నవి.

### పత్రికా ప్రతినిధికి దర్శన మొసంగుట.

మనదేశము నందలి పత్రికలలోనెల్ల పత్రికయని పేరుఁగాంచిన అమృత బజారు పత్రికను మన ప్రభువు విడువక చదువుచుండెడి వాఁడఁట. నిర్భయముగ నధికారుల లోపములను ఖండించుటకుఁ బ్రసిద్ధినొందిన యీపత్రికను జదువుచుండుటయేకాక, తాను కలకత్తాకుఁబోయి యుండిన సమయమున నీపత్రికాప్రతినిధికి దర్శనమిచ్చి యతనితో సంభాషించెను. ఎప్పుడును నధికారులవలన సందేహముచేఁ జూడఁబడుచు వచ్చిన యీప్రతినిధిగారికి యువరాజుగారు దయతో స్వాగతమిచ్చినపు డతని మనస్సు కరగి కన్నులనుండి జారఁదొడంగెనో నాఁగ సంతోషాశ్రు లుబుక పొరలెను. కృతజ్ఞతావాక్యము లొక్కొంటి నొక్కటి యొరసికొని రాఁబ్రయత్నించి కంఠమునఁ బెనఁగుచుండెనో యన నాతని స్వనము కంపమందెను. ఇట్టి సందర్భముల నతఁడు జార్జి రాకొమరునితో "ప్రభుపుంగవా! చిత్తగింపుము. క్షుద్రుఁడనైన నాకుఁ దమ యీదర్శనమువలన మహాగౌరవ మలవడినది. ఇద్దానిని నేనెల్లప్పుడును గృతజ్ఞతతో జ్ఞాపకముంచుకొనియెదను. భవిష్యత్తున మాకు చక్రవర్తి కాఁగల తమ యెదుటనున్నాఁడనుగాన భరతవర్షము దుస్థితి యందున్నదనిచెప్ప సెలవు వేడుచున్నాఁడను. తమరు మున్ను

మాకుపరిచితులగుదురుగాన నీదేశము దమసంరక్షణకుఁ బాత్ర మనివక్కాణింపనిండు. దయయుంచుఁడు. భారతీయుల మఱవఁ బోకుఁడు. ఇగ్లాండునందలి నాలుగుకోట్ల బలె వీరును తమప్రజలేయనునది జ్ఞాపకముంచుకొనుఁడు. వీరికి వలయు విషయములలో ముఖ్యతమము పరిపాలకుల నిర్మలసానుభూతి" యని మోకరించి నిలచి ముకుళితకరకమలుండయి విన్నవించెను. ఈ పదములు జార్జిప్రభువు మనస్సునాకర్షించెననుటకు సందియము లేదు. వెంటనే యతఁడు పత్రికా ప్రతినిధిని దయారసపూరిత వాక్యములతో లేవఁజేసి "నిన్నుగాంచుటచే నాకు మిక్కిలి యానందము గలిగినది. భారతీయుల మఱవకుండుమని యభయమియ్య మనుచున్నాఁడవు. సరి. నే నెప్పుడును వారిని మఱవను. మఱవఁజాలను. ఎల్లప్పుడును జ్ఞాపకముంచుకొనుటయే కాక దేశీయులు నాకొసంగిన యత్యుత్తమ స్వాగతముచే నేనెంతయలరినదియుఁ దప్పక నాతండ్రిగారి కెఱుక పఱచెదను. మీయెడనింకను నెక్కుడు సానుభూతిఁ గనుపఱచుట గర్తవ్యమని నా తండ్రిగారితోఁ జెప్పుట నాకు సంతస మీను ధర్మము. భరతవర్షమును గుఱించి నామనస్సున నిశ్చల భావములు నెలకొని యున్నవి" యని ప్రత్యుత్తర మిచ్చెను.

## ఇంగ్లండునందలి కథలు.

జార్జిప్రభువీ విధమున భారతీయుల నిరాశనుడిపి వారిమనముల నుల్లాసమునించి యింగ్లాండునకుఁ బయనమయి పోయి



1906వ సంవత్సరము మే నెల 1 వ తేది యిలుసేరెను. ఇంగ్లాండున రాజ్యాంగము నడుపునట్టి మంత్రిమండలము (Cabinet) 1905 మొదలు 1908లోపల రెండు మారులు మారుట తటస్థించెను. ఆ దేశమున మంత్రులు జనప్రతినిధిసభ (House of commons.) లో నుండి యెన్నుకొనఁబడు చుండుటచేతను, ప్రతినిధి సభను సభ్యులను ప్రజలే నిర్వాచించుటవలనను మంత్రులు మారుట యనిన సర్వరాజ్యాంగాధికారులును మారుటయే యయి, ప్రజలు దమహక్కుల ననుసరించి నూతనముగ ప్రతినిధి సభను నిర్వచించుటే యగు చున్నది. ఇట్టిమార్పులుగలుగు కాలమునఁ దటస్థించు విశేషాంశములన్నియు జార్జిప్రభువు ఇంగ్లాండున నున్నను లేకున్నను గూడ మిక్కిలి శ్రద్ధతో గమనించుచుండెను. 1908 వ సంవత్సరమున నితఁడు కనడాకు మరల దర్శనమిచ్చి రా వెడలెను. అచ్చట నీతని యొక్కయు రాకొమారితె మేరీయొక్కయు విగ్రహములతో తపాలాబిళ్లలు అచ్చువేయఁ బడియెను. వీరి జ్ఞాపకార్థమయి పతకముల చ్చొత్తింపఁబడిపంచిపెట్టఁబడెను.

1910 వ సంవత్సరమున నింగ్లాండు ప్రభువుల సభవారు (House of Lords.) జనప్రతినిధి సభవారిచే సిద్ధపఱుపఁబడిన బడ్జెట్టు బిల్లును అనఁగా ముందు సంవత్సరపు ఆదాయవ్యయ పట్టికను త్రోసివేసిరి. దానివలన రెండు సభలవారికిని భేదములు గలిగి యప్పటిమంత్రిమండలమువారు రాజునమతి పయి పార్లమెంటు కూడుటను నిలిపి ప్రజలను వేరొక ప్రతినిధి సభ నేర్పఱచుకొనుఁడనిరి.

ఇంగ్లాండున బహుకాలముగ రాజకీయ కక్షలు రెండుగలవు. లిబరలుల కక్షయొకటి. వీరెప్పుడును సంస్కార పక్షమువారు. కాంసర్వేటివుల కక్ష రెండవది. వీరు సర్వ సాధారణముగఁ బూర్వ పద్ధతుల విడచువారుగారు. పార్లమెంటు సభయందు, అందుముఖ్యముగఁ బ్రతినిధి సభయందు, రెండు తెగలవారును నుందురు. కాని ఏ తెగవారి సంఖ్యయెక్కుడుగ నుండునో ఆ తెగ సభ్యులనుండియె మంత్రులను రాజెన్నుకొన వలయును. వీరె రాజ్యకార్య నిర్వాహకులు. కావున వీరి కక్షయె తత్కాలమునకు నధికార కక్ష. 1910 వసంవత్సరమునకుఁ బూర్వము లిబరలులే నధికార కక్షగ నుండిరి. ఆ సంవత్సరమున నడచిన నిర్వాచనమునఁ గూడ వీరె యధికార కక్షయయిరి. అయినను వీరి సంఖ్యమాత్రము మొదటి కంటెఁ దక్కువయయి యుండెను. ప్రజాప్రతినిధుల సభకును ప్రభువుల సభకును గల పరస్పర సంబంధమును గుఱించి వివాదములు ప్రారంభమగుట వలన రాజునకును నతని సాహాయ్యులకును మనోవ్యధ గలుగఁ జొచ్చెను. ఎడ్వర్డు చక్రవర్తి యప్పుడు కొంత జబ్బు పడియుండెను. అట్లుండియు 1910 వసంవత్సరము ఫిబ్రవరి నెలలో నతఁడు పార్లమెంటు సభఁ దెఱచెను. అదియె యాతని కడపటి రాజకీయ కార్యమయి పరిణమించెను. మే నెల 5 వ తేది యతఁడు మిక్కిలి యెక్కుడగు ఋజచే బాధింపఁ బడుచున్నాఁడనువార్త బయట వెడలెను.



రెండవనాఁడర్ధ రాత్రముననామహామహుఁడు పరలోక ప్రాప్తిఁ జెందెను. రాజ్యాంగ కార్యములు చక్రవర్తి కొఱకైనను నిలువఁ జాలవుగదా! తండ్రి మరణమందిన కొన్నిగంటలలోపుగనె జార్జి రాకొమరుఁడు రాజును చక్రవర్తియునయి యాలోచన సభాభవనమునకు స్వారివెడలవలసిన వాఁడాయెను. యథావిధిగ నెడ్వర్డు చక్రవర్తి కుత్తరక్రియలు జరిగెను. సంవత్సర కాలము శోకచిహ్నములతో సర్వ కార్యములును నడుపఁ బడెను. 1911వ సంవత్సరము జూన్ నెల 22వ తేది ఇంగ్లాండున పంచమజార్జి చక్రవర్తికిని మేరీ చక్రవర్తినికిని పట్టాభిషేక మహోత్సవము జరిగెను. అదే సంవత్సరము వీరిరువురును డిశెంబరు మాసమున భరతవర్షమునకుఁ దరలి వచ్చి భారతీయుల నెల్లర సంతోషాంబుధి నోలలాడఁజేయుచు ప్రాచీన చక్రవర్తులంబలె పురాణ ప్రసిద్ధంబగు ఢిల్లీనగరమున సామ్రాజ్య పట్టభద్రులయిరి. ఆమహోత్సవమును ముందు దర్బారుల విషయమయి వ్రాయు ప్రకరణములో వర్ణింతుము. ఆ సమయమున విచ్చేసిన కొందఱు సామంతరాజులను గుఱించియు వారి రాజ్యములను గుఱించియు రాఁబోవు ప్రకరణములలోఁ జెప్పెదము.

---






నాలుగవ ప్రకరణము.

# హైదరాబాదుసంస్థానము.

## నైసర్గికస్వరూపము.

భరతవర్షమున నాంగ్లేయ ప్రభుత్వమునకుఁ లోఁబడి యుండు సామంతసంస్థానములలో నైజాముగారి హైదరాబాదు సంస్థానము విస్తీర్ణమునందేమి, జనసంఖ్యయందేమి, ఆదాయంబునందేమి, చారిత్రిక ప్రాముఖ్యమునందేమి మొదటిదిగ గణింపఁబడుచున్నది. దర్బారు లన్నిటియందును భారతీయ సామంతులలో మొదటిస్థానము నైజాముగారిదిగనే యంగీకరింపఁబడుచున్నది. కావున నీసంస్థానచరిత్రమును మున్మున్న లిఖింపఁగడఁగితిమి. దక్కన్ ఉచ్చ భూప్రదేశమున నెక్కుడుభాగ మీ హైదరాబాదు సంస్థానము. దీని కుత్తరమున విహారము, మధ్యపరగణాలును, వాయవ్యమున బొంబాయి రాజధానిలోని ఖాందేష్ జిల్లాయును, దక్షిణమున కృష్ణా తుంగభద్రానదులును, పశ్చిమమున బొంబాయి రాజధానిలోని అహమ్మదునగరము షోలా

పురము, బీజపురము, ధార్వారు, జిల్లాలును తూర్పున కృష్ణా జిల్లాయును, వరదా గోదావరీ నదులును ఎల్లలు. దీని వైశాల్యము 82,698 చదరపు మైళ్లు. ఈసంస్థానమును భూసారమున నేమి జన విశేషముననేమి రెండు సమభాగములుగ భాగింపవచ్చును. గోదావరీ మంజీరా నదు లీరెండు భాగములకును సరిహద్దులు. ఈ సరిహద్దుల కుత్తరభాగము నల్లరేగడిభూమి. గోధుమలును ప్రత్తియు నట పండును. మహారాష్ట్రము కన్నడము భాషలు. ఈసరిహద్దులకు దక్షిణభాగము తెలుఁగుదేశము. భూమి గులుకరాతితో మిశ్రమము. నేలలో నీళ్లు ఇంకుటకు వీలులేదు. కావుననే యీభాగమున చెరువులు మున్నగు జలాశయములు మెండు. వరిపంట సామాన్యము. బాలఘాటు కొండలు, సహ్యాద్రులు, జాల్నాగుట్టలు ఈ సంస్థానమున ముఖ్య పర్వత పంక్తులు. గోదావరి కృష్ణ, తుంగభద్ర, పూర్ణ, మంజీర, భీమ, వైన గంగ, మానేరు ముఖ్యనదులు. మూసి, వింది, మునేరు మొదలగు కొన్ని ఉపనదులును గలవు. ఈసంస్థాన భూగర్భమున వజ్రములు, బంగారు, రాక్షసబొగ్గు బయలువెడలినవి. మంచి ఇనుముకూడఁ గాన్పించు చున్నది. ఈసీమలో దట్టమగు నడవులును ననేకములు గలవు. పులులు ఏనుఁగులు మున్నగు మృగములును చిత్రవిచిత్ర వర్ణములతో నొప్పు పక్షులును లెక్కకుమీరి యీయడవుల నలంకరించు చుండును.



ఈరీతి నీ సంస్థానమున నుత్తమ సంపదకు వలయు విషయము లెల్లయు గలవు. కావుననే నీసంస్థానముచే నాక్రమింపఁబడియుండు భూభాగము బహుకాలముగఁ జరిత్ర యందు ప్రఖ్యాతి గాంచుచు వచ్చుచున్నది. దీని తూర్పుదక్షిణ భాగములు నిశ్చయమగు చరిత్రప్రారంభ మగుటకు మున్ను ద్రావిడజాతులవారి స్వాధీనమున నుండెను. ద్రావిడభాషలు మాటలాడు జాతులలో నాంధ్రజాతి యిప్పటికిని తక్కినజాతులకంటె నెక్కుడు జనసంఖ్య గలదయి యున్నది. ఈసంస్థానమునందు మధ్యభాగమగు దక్షిణాపథమును (దక్కను) రామాయణ మహాభారత కర్తలు పేర్కొని యున్నారు. శ్రీరాముని కిష్కింధానగరము ఆనెగొంది విజయనగరములనుట ఇప్పుడందఱకును దెలిసిన సంగతి యేగదా! ఆర్యులు దక్షిణాపథము నెప్పుడు లోఁబఱచుకొని నదియు నిష్కర్షగఁ జెప్పుటకు వీలులేదు గాని, క్రీ. పూ. 272-231 వఱకును నేలిన యశోకుని కాలమున నాతని రాజ్యము మాత్రము విహారమును, ఈ సంస్థానములోని పూర్వోత్తరభాగములను గూడ నావరించియుండెను. ఔరంగాబాదు జిల్లాలో గోదావరీ తీరముననుండు పైఠను సీమయందలి పిఠెనికులు అశోకునిచే జయింపఁబడిన జాతులలో నొకరని యాతని శాసనముల వలనఁ గానవచ్చుచున్నది. [1]బౌద్ధరాజులకుఁ దరువాత నీసంస్థాన భూభాగముపై నధికారము వహించినవా

1. అశోకుని శిలాశాసనము 5

రాంధ్రులు. అశోకుని శాసనములలో వీరిపేరు గానవచ్చుచున్నది.[1] గాని వీరుబలవంతులయినది క్రీ॥ పూ॥ 220 వ సంవత్సర ప్రాంతములనె. కృష్ణాడెల్టాలో నుండి తమ యధికారమును గ్రమక్రమముగ వర్తింపఁజేయుచు వీరుదమసామ్రాజ్యమును నాసికము వఱకును వ్యాపింపఁ జేసిరి. క్రీస్తుశకము మొదటి శతాబ్దమునకు వీరు శాక్యులకును, పల్లవులకును, మాళవఘూర్జరములలో నివసించుచుండిన యవనులకును, బ్రతిస్పర్థులుగఁ గనుపించుచున్నారు. క్రీ॥ శ॥ 138 లో రెండవపులమాయి రాజ్యమునకు వచ్చెను. అతఁడు పశ్చిమ క్షేత్రపుఁడగు రుద్రదమనుని బిడ్డను పెండ్లాడెను. మామగారితో పోరుటలో రెండవపులుమాయి తనరాజ్యములోఁ బశ్చిమభాగమును గోలుపోయెను. మఱియొక శతాబ్దములోపల నాంధ్రసంతతియే యంతరించెను. అందులకుఁగారణము బహుశః పల్లవరాజుల ప్రవృద్ధియే యై యుండును. వీరు మొదట కృష్ణానదికి దక్షిణభాగమున రాజ్యమేలుచుండి, మెల్లమెలఁగ హైదరాబాదు ప్రాంతముల వఱకును వ్యాపించిరి. ఆంధ్రులకు తరువాత హైదరాబాదు సంస్థానము ముందు భూప్రదేశము నేలినవారిలో సుప్రసిద్ధులు చాళుక్యులు. వీరు క్రీ. శ. 550 ప్రాంతమున విజాపురము జిల్లాలోఁ గానుపించి, పూర్వ పశ్చిమదిగ్భాగములకుఁ దమ యధికారమును వ్యాపింపఁ జేసి, కల్యాణి రాజధాని చేసికొని రాజ్యమును

1. అశోకునిశిలాశాసనము. 13



స్థాపించిరి. క్రీ॥ శ॥ 608 మొదలు 642 వఱకును రెండవపులికేశి యనువాఁడు ఇంచుమించుగ నర్మదానదికి దక్షిణమున నుండు ద్వీపకల్పమునంతయు నేలెను. ఈపగిది మహాబలవంతులయి చాళుక్యులు రాజ్యమేలి నంతకాలమును వారికిని పల్లవులకును, విడువరాని యుద్ధము జరుగుచునేయుండెను. కావున చాళుక్యులు దక్షిణహిందూస్థానములో విశేషభాగ మేలుచుండినను వారి రాజ్య పరిమితి మాత్రము క్షణక్షణమును మారుచుండెను. చాళుక్యులను గొంతకాలమునకుఁ దరువాత రాష్ట్రకూటులు లోఁబఱచుకొనిరి గాని, మఱల చాళుక్యులు క్రీ॥ శ॥ 973 లో నధికారమునకు వచ్చి రెండు శతాబ్దములు చోళరాజులతోడను, ద్వారసముద్ర రాజులతోడను హోరాహోరిగఁ బోరుచుఁ దమపదవిని నిలుపుకొనిరి. 1189 వ సంవత్సరప్రాంతమున చాళుక్యబల మస్తమించెను. యాదవులును హొయిసలలును ప్రభుత్వమున కెక్కిరి. యాదవుల రాజధాని దేవగిరి యయ్యెను. దక్కనున నధికారము వహించిన హిందూవంశములలో యాదవవంశము కడపటిది. విజయనగర సామ్రాజ్యము దరువాత ప్రతిష్ఠాపింపఁబడెనుగాని దాని యధికారమంతయు కృష్ణకు దక్షిణభాగముననె వ్యాపించి యుండుటంబట్టి దక్కనున గడపటి హిందూసంతతిరాజులు యాదవులే యనుటలో నేమియు దప్పుండదు.

దక్షిణాపథము మీఁదికి దృష్టిసారించిన మహమ్మదీయ ప్రభువులలో మొదటివాఁడు అల్లాయుద్దీను. అతఁడు 1295 వ సంవత్సరమున, ఫెరిస్తా వ్రాతల ననుసరించి, యాప్రదేశమున కంతయు రాజయి పరిపాలించుచుండిన యాదవవంశజుఁడగు



దేవగిరి దుర్గము.

రామదేవుని పైకి దాడివెడలెను. ఇతని రాజధాని దేవగిరి. అల్లాయుద్దీను దేవగిరిని గొల్లకొట్టెను. ఇట్లు ప్రారంభమయిన మహమ్మదీయ దిగ్విజయము దేవగిరితో నిలువలేదు. క్రమక్రమముగ దక్షిణాత్యరాజు లెల్లరును మహమ్మదీయులకు లోఁబడవలసిన వారైరి. 1325 లో మహమ్మదు తుఘ్లకు నధికారము క్రిందికి దక్షిణాపథమంతయు వచ్చిచేరి యుండెను. కాని యతని క్రౌర్యము వలన యాతని సామ్రాజ్యమునకు ముప్పువాటిల్లెను. అతఁడు



ఘూర్జరమును (Gujerat.) జయించి లోఁబఱచుకొనఁగా నప్పుడచ్చటి ప్రజ లనేకులు దక్షిణాపథమునకు వచ్చి నిలచియుండిన మొగలాయీల యండఁ జేరిరి. అది చూచి యోర్వలేక తుఘ్లకు, శరణాసినవారికి శరణమిచ్చిన తన సామంతులనే చెఱవెట్టెను. ఇంతియెకాక, ఢిల్లీనుండి తనరాజధానిని తాను దౌలతాబాదని పేరిడిన దేవగిరికి మార్చెను. జనులందఱును మొఱపెట్ట సాగిరి. అప్పుడితఁడు మిక్కిలి క్రూరకార్యములకుఁ గడంగెను. ఒక పర్యాయము రాజధాని మార్చుటతోఁ దృప్తినొందక పౌరులెల్లయు దేవగిరిచేరిన తరువాత మరల వారిని ఢిల్లీకి నడువుఁడనియెను. ఈకారణములఁబట్టి తిరుగుబాటులు పుట్టెను. చక్రవర్తి సేనలొకరిద్దఱి నాపఁగల్గెనుగాని యల్లరు లెక్కుడయి హుసేను ఖానుఁడను ప్రబలవిరోధి యెదుర్కొనునప్పటికివి విరిసిపోయెను. సైన్యాధిపతి యోడిపోయి నిహతుఁడయ్యెను. అంత హుసేనుఖాను "సుల్తాన్ అల్లాఉద్దీన్ హసేనుఖాన్ గంగోబహామని" యను బిరుదులతో బహామనీరాజ్యమును 1347 లో స్థాపించెను.

### బహామనీరాజ్యములు.

గుల్బర్గ మీరాజ్యమునకు మొదట రాజధాని. 1434 లో అహమ్మదాబాదు రాజధానియాయెను. రానురాను బహామనీ రాజసంతతివారు బలహీనులుగాఁ జొచ్చిరి. వారి పటుత్వము తప్పినందున వారికి లోఁబడి ప్రవర్తించి శక్తిగాంచిన బలవంతు

లగు ప్రభువు లచ్చటచ్చట స్వాతంత్ర్యము ప్రకటించిరి. అట్లగుట 1512 వ సంవత్సరము లోపల నైదుస్వతంత్ర సంస్థానము లేర్పడెను. అందు గోలకొండ కడపటిది.

దీనికి మొదటిరాజు కుతుబ్ షాహా. ఇతని సంతతివారిలో నొక్కఁడగు మహమ్మదుకులి గోలకొండయందు నీటివసతి లేకపోవుటచే హైదరాబాదు గట్టించెను. దీనికి మొదటఁ దనప్రియురాలిపేరు పెట్టఁదలఁచి భాగ్యనగరమని నామకరణము చేసెను. ఆమె మరణానంతరము దన కుమారుని పేరు ననుకరించి హైదరాబాదని మార్చెను. ఈ సంస్థానముతో సమానముగఁ దులఁదూగినవి విజాపురము, అహమ్మదు నగరము. కావున నీమూఁడు సంస్థానములకును నంతఃకలహములు విడువక నడుచుచుండెడివి. ఈ యంతఃకలహములే వీని నాశనమునకుఁ గడపటఁ గారణమయ్యెను. మహారాష్ట్రుల విజృంభణంబునకును నిదియే హేతువు. 1586 లో అక్బరు, తరువాత షాజహాను, పిమ్మట నౌరంగజేబు ఈ సంస్థానములను లోఁబఱచుకొనిరి. అహమ్మదు నగరమునను విజాపురమునను మహారాష్ట్రులు ప్రవృద్ధిగాంచిరి. గోలకొండయం దక్కన్న మాదన్నలను ఆంధ్రులు సచివత్వమున ప్రసిద్ధిగాంచిరి. శ్రీశివాజి శక్తియుక్తులవలన మహారాష్ట్రులు మొగలాయి చక్రవర్తులింకను బలవంతులయి యుండఁగనె సామ్రాజ్యము సంపాదింపఁ గలిగిరి. అక్కన్నమాదన్నల యౌన్నత్యమును సహింపలేని యొక తురుష్కనాయకుని విశ్వాసఘాతు



కము వలనను, స్వామిద్రోహమువలనను, వీరు మొగలాయీల చేతులలోఁ జిక్కి మరణమందిరి.

ఇవ్విధమున చెదరిపోయిన బహమనీరాజ్య ముండిన యెడములో మహారాష్ట్ర సామ్రాజ్యమును మొగలాయీల రాజ్యఖండమును నుండుట దటస్థించెను. 1683 వ సంవత్సరమున నౌరంగజేబు రెండవమారు దక్షిణాపథముపై దండయాత్ర వెడలునప్పటికి, శివాజి పరలోకమున కేగి యుండెను. అతని కుమారుఁడు సాంబాజి ధైర్యముదప్ప దక్కిన తండ్రి సుగుణము లెవ్వియును గలవాఁడు గాఁడు. మహారాష్ట్ర సైన్యము గూడ జెదరబెదరలయి యుండెను. కావున వీరు విజాపురమును గోలకొండయును మొగలాయీలనుండి కాపాడలేక పోయిరి. సాంబాజి పట్టువడి ఖయిదీయయి చంపఁబడియెను. కాని దీనివలన మహారాష్ట్రులు పోరాటమును విడువరైరి. వారి పితూరీలకు నిలువలేక ఔరంగజేబు 1706 వ సంవత్సరమున అహమ్మదు నగరమునకుఁ బారిపోవలసివచ్చెను. అతఁడు శత్రువులచేఁ జిక్కి చచ్చునంతటి తరుణ మొక్కటి గూడ తటస్థించెను గాని యాతని యదృష్టవశమునఁ దప్పించుకొనెను. మరుసటి సంవత్సరముననే యితఁడు 89 ఏండ్ల ప్రాయమున మృతినొందెను. ఇతని మరణానంతర మీతని పుత్త్రులు సింహాసనమునకయి పెనఁగులాడఁ జొచ్చిరి. ఇతని కాలమున నీతని కాప్తవర్గములో నొక్కఁడనఁదగు గాజిరుద్దీనను సుబేదారు

డుండెను. అతఁడు బీరారు ఎలిచ్పురముల కధిపతి. తన యజమాని కుమారులు గద్దెకయి పడు వివాదములలో నితఁడేపక్షమును నవలంబింపఁ డయ్యెను. ఇతని కుమారుఁడు చిన్ కిలీచ్ ఖాన్ మాత్రము అజీమునకు సాయపడనియ్యకొని, యాతనితో గొంతకాలము గడపెను. కాని యతని నడవడి సరిపడనందున ననేకులగు నితర నాయకులతోఁ గూడ చిన్ కిలీచ్ ఖాన్ అతనిని వదలి సంగతుల గమనించుచు మిన్నకుండెను. ఔరంగజేబు పెద్దకొమారుఁడగు బహదూరుషా తన తమ్ముఁడగు అజీము నోడించి గద్దియ నెక్కెను. అప్పుడతఁడు చిన్ కిలీచ్ ఖానుని అయోధ్యకు సుబేదారుగను, లక్నోకు ఫౌజుదారుగను, నియమించెను. ఆపదమందును నితఁడు బహుకాలముండఁడయ్యెను. బహదూరుషాహ వృథాడంబరుఁడును నసమర్థుఁడును నగుట యతని చుట్టుంగలవారు పోరాని పోకలఁ బోవుటయుఁ జూచి సహింపక యితఁడు దనయుద్యోగములను మానుకొని జరుగనున్న కార్యములను జాగరూకుఁడయి కనిపట్టి యుండెను. 1712 వ సంవత్సరమున బహదూరుషాహ మృతినొందెను. సింహాసనమున కయి మరల పోట్లాటలు ప్రారంభమాయెను. బహదూరుషాహకు జహందరుషా అనువాఁడును, అజీముషాహకు ఫరూకుసయ్యరు అనువాఁడును, కొడుకులు. జహందరుషాహ, తండ్రి పరలోకమున కేగిన తోడనే, పీఠమునాక్రమించుకొని రాజసంతతివారి నంతయుఁ జంపి



చెను. కాని ఫరూకుసయ్యరు బంగాళమున నుండుటచే నతఁడీతనికి దొరకలేదు. కావున వీరిరువురకును యుద్ధము దప్పినది గాదు. జహందరుషాహ యుద్ధమునని హతుఁడయ్యెను. అతని మిత్రుఁడును, బహదూరుషాహ కాలమున హైదరాబాదునందు రాజప్రతినిధిగ రాజ్యమేలినవాఁడును నైన జుల్ ఫికర్ ఖానుఁడు గూడ మడసెను. ఫరూకుసయ్యరు సింహాసనము నధిష్ఠించుట తోడనే సమయము వేచియుండి విజయమునందిన పక్షమును చేరిన వాఁడగుటచే చిన్ కిలీచ్ ఖానుఁడు ఆసఫ్ జా నైజాము-అల్-ముల్క్ అనుబిరుదుతో దక్షిణాపథమునకు రాజప్రతినిధి యయ్యెను.

## నైజాము - అల్ - ముల్క్.

ఇతఁడే ప్రస్తుతపు హైదరాబాదు సంస్థానమునకు స్థాపకుఁడు. ఇతఁడెట్లు స్వతంత్రుఁడయినదియు మనము దెలిసికొన వలసియున్నది. ఫరూకు సయ్యరు వలనఁ బ్రతినిధిగ నేమింపఁబడి యితఁడు హైదరాబాదుకు వచ్చి చేరెను. అచ్చట యితఁడు గాంచిన రాజ్యవ్యవస్థ యెట్టిది? బహదూరుషాహ కాలమున దక్షిణాపథమునఁ బ్రతినిధిగ నుండిన దావూదుఖానుఁడు సాంభాజికుమారుఁ డయిన సాహూతో సంధిచేసికొని మహారాష్ట్రులపోరునుండి మహమ్మదీయ రాజ్యమును దప్పించి యుండెను. కాని దావూదుఖాను ప్రతినిధి పదమునుండి వదలిపోయిన తరువాత నాప్రదేశమంతయు నరాజక

మయి యుండెను. మహారాష్ట్రులు మరల మొగలాయి
రాష్ట్రమును గొల్లగొట్టుచుండిరి. ఆసఫ్జాకు వారి
చుటకు శక్తిచాలకపోయినను ఎక్కుడు బుద్ధికౌశల్యము
వాఁడు గావున మహారాష్ట్రులలో నంతఃకలహములు పుట్టి
గొందఱను ఢిల్లీపాదుషాహ పక్షము పూనునట్లొనర్చి
ఈపగిది భేదోపాయముచే నొక్క సంవత్సరములోపలఁ
రాజ్యమును మహారాష్ట్రుల బారినుండి తప్పించినదే
యితఁడు కర్నాటకముపై దండెత్తుటకుఁ గూడ సన్న
డయ్యెను. కాని యీలోపల నితనిని బాదుషాహ
ఢిల్లీకి రావలసినదని యాజ్ఞాపించిరి. కారణము ఢిల్లీ
ముఖ్యమంత్రిగ నుండిన హుసేనాలీఖానునకును బాదుషా
కును సరిపడకపోయినందున హుసేనాలీని దక్షిణాపథమున
బంపి వేయవలయునను తలఁపు బాదుషాహకు బుట్టుట
సాహూ దెబ్బకుఁ దాళలేక యతనితో మైత్రిచేసుకొని హు
నాలి 1718 వ సంవత్సరమునఁ దన యజమానిమీఁదికి దం
త్తి వెడలి ఢిల్లీ చేరెను. అచ్చట జరిగిన ఘోరయుద్ధమ
ఫరూకుసయ్యరుని చంపి మహమ్మదుషాహాను సింహాసన
క్కించిరి. ఆసఫ్జాకు దక్షిణాపథ రాజప్రతినిధిత్వము మ
దొరకుట కష్టమయ్యెను. 1720 లో నితఁడు దగిన ఏర్పా
లెల్లయు ముందె చేసియుంచుకొని ఢిల్లీ వదలి హైదరాబా
పోయి చేరెను. స్వాతంత్ర్యము ప్రకటించుటకు ఆసఫ్



శ్రీ హైదరాబాదు నైజాముగారు.

యింతకంటె విశేషమేమియుఁ జేయవలసిన పనిలేదు గదా! హుసేనాలితోఁ గూడ చేరుకొని మహమ్మదు బాదుషాహ స్వయముగ దక్షిణమునకు దండు వెడలి వచ్చెను. కాని మార్గమున శత్రువులవలన హుసేనాలి చంపఁబడుటయు, ఢిల్లీ నగరమున వైరులు మఱియొక చక్రవర్తిని నేమించుకొనుటయు సంభవించుటచే మహమ్మదుషాహ వచ్చినఁ దారిఁబట్టి తిరిగిఢిల్లీఁ జేరవలసిన వాఁడాయెను. గద్దెను శత్రుబలములనుండి దక్కించుకొనుటలో నితఁడు జయమందెను. అప్పుడు మరల నాసఫ్ జాను ముఖ్యమంత్రి పదమున కితఁడు నియమించెను. కాని ఆసఫ్ జామాత్రము హైదరాబాదునందుఁ దనశక్తి స్థిరముగ నుండుటకు వలయు నుపాయము లన్నిటిని వెదకి పన్ని ఢిల్లీకి బయలుదేరి పోయెను. అచ్చట రాజ్యభారము నిర్వహించుటకు ఆసఫ్ జాను సమ్మతము కాలేదు. సారము చెడి బెండువడి కుచ్చితాత్ముల కాకరమయి యవగుణుండగు మహమ్మదుషాహచే సృష్టింపఁబడిన కొలువుకూట మెక్కడ? కార్యదక్షతకుఁ బేరుఁ గాంచిన ఔరంగజేబు కాలమునఁ బరిశ్రమచేసి బుద్ధిబలముల గడించిన ఆసఫ్ జా యెక్కడ? కావుననె యీతఁడు గొంతకాలము ఢిల్లీలోనుండి యచటవర్ణింపనలవికాని పెక్కుపాట్లుపడి కట్టకడపట 1724 వ సంవత్సరమున మరల హైదరాబాదునకుఁ బయనమై పోయెను. అప్పుడు బాదుషాహ ఇతని కెదురుపడి కీడుచేయ మనసురాక ఇతనిని జంపివేయవలసినదని

స్థానికపరిపాలకున కుత్తరువిచ్చెను. వాఁడును నట్లేచేయఁ బ్రయత్నించియు ఆసఫ్ జా చేతిలోఁ జిక్కి మృతుఁడయ్యెను. ఆసఫ్ జా బాదుషాహాగారి కీవిషయమేమియుఁ దెలియదని నమ్మినట్లె నటించుచు నాపరిపాలకుని శిరస్సును వారికిఁ బంపి బాదుషాహాగారిపై తిరుగుబాటు చేయనెంచిన ద్రోహిని తాను దునుమాడినట్లుఁ దెలియచేసెను. ఇప్పుగిది నామమాత్రమునకుఁ దాను బాదుషాహాగారి ప్రతినిధియనియే యొప్పుకొనుచు నిజమునకు ఆసఫ్ జా సర్వస్వాతంత్ర్యములును గలవాఁడయి నైజాము సంస్థానమును స్థాపించెను.[1]

### సింహాసనమునకై కలహములు.

1784 వ సంవత్సరమున ఆసఫ్ జా గతించి పోయెను. అప్పటికి హైదరాబాదు సంస్థానము నేఁడెంతగలదో యంతకంటె నెక్కుడుండెనని చెప్పవచ్చును. నైజముల్-ముల్కు-ఆసఫ్ జా చచ్చినతోడనె యధికారమునకై యతనికుమారులలో సంతఃకలహములు పుట్టెను. మొదటికుమారుఁడు ఢిల్లీనగరమున నుండిపోయెను. హైదరాబాదులోఁ దండ్రి మరణకాలమున సిద్ధముగ నుండిన నాజర్ జంగ్ సైన్యముయొక్క సాహాయ్యమువలన బొక్కసమును స్వాధీనపఱచుకొని రాజ్యమునకు వచ్చెను. ఆసఫ్ జాకు మిక్కిలి ప్రియమైనకూఁతు రొక్కర్తె యుండెను.

1. ఢిల్లీలో బాదుషాహాపేరు నశించువఱకును హైదరాబాదు నవాబులు తాముదక్కను సుబేదారులనే వ్యవహరించుచుండిరి.



కమె పుత్రుఁడు ముజఫర్ జంగు. ఇతఁడు దనతాత తనకు హైదరాబాదు సుబేదారీ నిచ్చిపోయెనని నుడివి తనహక్కు స్థాపించుకొనఁ జూచెను. అప్పటికి దక్షిణ హిందూస్థానమున ఫ్రెంచివారును నాంగ్లేయులును వ్యాపారవిషయములఁ బ్రతిస్పర్థులయి నెగడియుండిరి. ఇంతియెగాక ఎవరికి వారీదేశమునఁ బలుకుబడి సంపాదించవలెననియు ప్రయత్నించుచుండిరి. కావున నాజర్ జంగు ముజఫర్ జంగులకు వరుసగ నాంగ్లేయులును ఫ్రెంచివారును దోడ్పడనియ్యకొనిరి. మొదట నాజరుజంగే విజయుఁడయ్యెను గాని యతనిప్రజలే యతనిని జంపినందున ముజఫర్ జంగు 1750 లో సుబేదారుఁడయ్యెను. ఇతఁడును దమకు సరియయిన బహుమానము దొరకలేదని కోపము వహించిన పఠాను సైనికులచే నిహతుఁడయ్యెను (1751). ఇట్లు నాజర్ జంగు ముజఫర్ జంగులిద్దఱును గతించిన తరువాత ఫ్రెంచివారు ఆసఫ్ జా మూఁడవపుత్రుఁడగు సలబత్ జంగును గద్దెపై నునిచిరి.

### సలబత్ జంగు.

సలబత్ జంగు గద్దె నాక్రమించిన తరుణమున ఆసఫ్ జా మొదటికుమారుఁడు గాజి-ఉద్దీన్ ఢిల్లీనుండి వచ్చి తన హక్కును స్థాపించుకొనఁ జొచ్చెను. కాని యతఁడకస్మాత్తుగ మృతినొందెను. సలబత్ జంగు తల్లి విషము పెట్టి చంపివేసెనని యొక చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. గాజి-ఉద్దీనుకు సాహాయ్యులుగ నేతెంచిన మహా

రాష్ట్రీలకు లంచమిచ్చి సలబత్ జంగు వారినుండి తప్పించుకొనెను. ఈరీతి నితఁడు దక్కఁగొని ఫ్రెంచివారి మాటే యధికారముగఁ బరిపాలించుచుండెను. కాని ఫ్రెంచివారికిని ఆంగ్లేయులకును దక్షిణహిందూస్థానములో జరిగిన పోరాటములో ఫ్రెంచివారపజయమునందుచు వచ్చినందున వారు హైదరాబాదునుండి తమబలముల మరలించుకొను వారయిరి. సలబత్ జంగున కీసాయము పోవుటొక్కటి యెగాక మఱియొక కష్టము చూపట్టెను. ఫ్రెంచివారు వలదనుచుండినను గూడ తాను రాజధానియందు లేనితఱి తన తమ్ముఁడయిన నైజామలీకి నధికార మిచ్చుచుండెడువాఁడు. దానివలన నతఁడు బలవంతుఁడై తన్ను పదభ్రష్టుం జేయ సమయము వేచియుండుట సలబత్ జంగుకు విశదమయ్యెను. కావున నతఁడు 1759వ సంవత్సరము మేనెలలో నాంగ్లేయులతో సంధి చేసికొనెను. దానివలన నైజాము చుట్టుంగల ఎనిమిది జిల్లాలతోఁగూడ మచిలీపట్టణ సీమయు, నిజాముపట్టణ సీమయు కొండవీడు వకలమన్నూరు జిల్లాలును, నాంగ్లేయవర్తకసంఘమువారికి ఇనాముగా నిచ్చివేసెను. ఫ్రెంచివారిని దనదేశమునుండి వెడలఁగొట్టెద నని వాగ్దానము చేయుటయే గాక ఆంగ్లేయుల శత్రువులకు శరణమిచ్చుటగాని సాయము చేయుటగాని లేదని యొప్పుకొనెను. ఆంగ్లేయవర్తక సంఘమువారును నైజాముగారి శత్రువులకు శరణమిచ్చుటగాని వారికి సాయ



మొనర్చుటగాని లేదని వాగ్దానముచేసిరి. ఇట్టి సంధిచేసికొనినను గూడ సలబత్ జంగునకు పదవి దక్కినదిగాదు. 1761వ సంవత్సరమున నైజామలీ యితనిని రాజ్యభ్రష్టునిజేసి సుబేదారీ నాక్రమించుకొనియెను.



పూర్వకాలపు మచిలీపట్టణము.

## నైజామలీ. (1761—1799.)

హైదరాబాదు సుబేదారుకు లోఁబడి దక్షిణమున నిద్దఱు నవాబులుండెడివారు. ఉత్తరసర్కారుల నవాబును, కర్నాటకపు నవాబును దమతమ మండలములలోఁదాము సర్వాధికారులే యైనను సామ్రాజ్యసమిష్టిలో మాత్రము హైదరాబాదు సుబాకు నుత్తరవాదులు. కాని యివి రాను రాను హైదరాబాదు నధికారము నుండి తప్పించుకొనఁ జూచెను. కావున నైజామలీ సుబేదారుఁడయిన తోడ

నే తనయన్నను జంపించి రాజధానియందుఁ దన యధికారమును స్థిరపఱచుకొని కర్నాటకపు నవాబు దన్ను యజమానిగ నొప్పుకొనునట్లు చేయునుద్దేశముతోఁ దీక్షణగతిఁ గర్ణాటకముపయికి దాడివెడలెను. అయినఁ గర్నాటక మప్పుడు ఆంగ్లేయుల సంరక్షణయందుండుట వలన వారితని నెదుర్ప సమకట్టిరి. దాని నెఱింగి యితఁడు అప్పటికిఁ దనబలము చాలనందున మరలి పోయి హైదరాబాదు చేరెను. రెండవమారు దండువెడలుటకు నాఁటినుండి ఉపకరణములు సమకూర్ప మొదలిడెను. ఈసంగతివిని యాంగ్లేయు లప్పటికే యిక్కట్టులో నుండినవారుగాన బలవంతుఁడగు నైజాముతోఁ ద్వేషము గట్టుకొనొల్లక తమప్రతినిధి నొకని నైజామలీ వద్దకు సంధి చేసికొని రాఁ బనిచిరి.

## 1766 సంవత్సరపు సంధి.

1766 వ సంవత్సరము నవంబరునెల 12 వ తేది నాఁడు స్నేహసంధి తీర్మానమాయెను. దీనివలన నాంగ్లేయ వర్తకసంఘమువారు నైజామువద్దనుండి ఏలూరు, శ్రీకాకుళము, రాజమహేంద్రవరము, ముస్తఫానగరము, మూర్తిజానగరము (గుంటూరు) అనుమండలములను ధృవకౌలుకుఁ బుచ్చుకొని నైజామునకు వలయునప్పుడు దండును సిద్ధపఱచి యిచ్చుటకును అట్టి దండు అవసరముగాని సంవత్సరములలో గుత్త పైకముగ తొమ్మిదిలక్షల రూపాయీలు అత



నికి చెల్లించునట్లును ఏర్పఱచుకొనిరి. ఇందులో మూర్తిజానగరము (గుంటూరు) మాత్రము నైజామువలన నతని తమ్ముఁడగు బజలతుజంగుకు జహాగీరుగా నియ్యఁబడి యున్నందున నది యాతని జీవ మున్నంతకాలము ఆంగ్లేయ వర్తకసంఘము వారికిఁ జేరుట లేదనియు మూర్తిజా నగరము కర్నాటకపు సరిహద్దులలో నుండుటంబట్టియు, గర్నాటక మాంగ్లేయుల సంరక్షణలో నుండుటంబట్టియు, బజలతుజంగుచే గర్నాటకములో నేమైన అల్లరులు జరుపఁ బడినచో మూర్తిజా నగరమును స్వాధీనము చేసికొనుట కాంగ్లేయుల కధికార మున్నదనియుఁ దీర్మానింపఁబడెను. వీరు గట్టఁదగిన తొమ్మిదిలక్షలకు లెక్కలెట్లు తేలవలెనన్న వీరు నైజాముకొఱకా యత్తపఱచి పంపు దండులకుగాను సెలవగు మొత్తము ఈమొత్తమునకు లోఁబడినదైనచో మిగత బాకీ వీరు నైజాముగారి బొక్కసములోనికిఁ జెల్లించవలసినదే. తొమ్మిదిలక్షలకు మించెనేని వీరే పెట్టుకొనవలెను. ఇదేసంధినిబట్టి కొండపల్లి దుర్గములో నాంగ్లేయుల సైన్యములు మాత్ర ముండవలసినదనియు నైజాముగారిపక్షమున వారి కిల్లాదారుఁడు (అనఁగా కోటకధిపతి) నేమింపఁ బడవలసినదనియు నొడంబడిక జరిగెను. ఆంగ్లేయులకు ధృవకౌలున కీయఁబడిన మండలములోని వజ్రపు గనులును, ఆ గనులుగల గ్రామములును నైజాము గారికే చెందవలసినది. ఆంగ్లేయులును నైజా

ముగారును నొండొరుల మిత్రులను శత్రువులను దమమిత్రులుగను శత్రువులుగను భావింప నియ్యకొనిరి.

### హైదరాలీ ప్రత్యక్షము.

పైసంధి జరుగునప్పటికి నైజామునకుఁ గ్రొత్తవైరి యొకఁడు చూపట్ట మొదలిడెను. మైసూరునందు హైదరాలి క్రమ



కొండపల్లి దుర్గము.

క్రమముగ బలవంతుఁడగుచుండెను. అతని నెదుర్కొనుటకు నైజామునకు నాంగ్లేయుల సాయము కావలసి వచ్చెను. ఇంతియె



గాక నైజాముపైఁ గర్నాటకమునందలి పాళేగారులు కొందఱు తిరుగఁబడిరి. వారినణఁచుట యందును నతఁడాంగ్లేయుల నుపయోగించుకొనవలసినవాఁడె యాయెను. ఇట్లు వారిని దోడుఁ జేసికొని యతఁడు దనపాళేగారులను సాధించినదేగాక హైదారాలీకి లోఁబడిపోయియుండిన బెంగుళూరుకోటనుగూడ స్వాధీనపఱచుకొన గలిగెను. కాని యీలోపుగ హైదరు నైజామలీని దనవలలోఁ జిక్కించుకొని అతనిని ఆంగ్లేయులనుండి విడదీసి వారిని ఈదేశమునుండి సంపూర్ణముగఁ బారదోలుటకుఁ బ్రయత్నములు సల్పెను. ఇప్పగిది మొదటికే మోసము వచ్చినందున నాంగ్లేయులు దమ యింటిని దాము కాచుకొన వలసి వచ్చెను. హైదరు మహారాష్ట్రులతోడను నైజాముతోడను జేరి వీరిని సమయింపఁ జూచెను. హైదరు నైజాముల సైన్యములు కర్నాటకముపయి దండెత్తివచ్చి ఆంగ్లేయులు నైజామలీకే సాహాయ్యముగఁ బంపుచుండిన బలమునుదాఁకెను. మొదట నాంగ్లేయులు వెనుదీయవలసినవారైనను దరువాత వీరి యుద్ధభటుల శక్తిప్రదర్శనమువలనను వీరికి గవర్నరు జనరలుగ నుండిన హేస్టింగ్సుయొక్క చాతుర్యమువలనను, నైజాము పోరాటము తగదనితెలిసికొని మరల వీరిపక్షమును జేరెను.

### ఆంగ్లేయులతో సంధి. (1768).

అప్పుడు 1768 వ సంవత్సరమున నాంగ్లేయులకును నైజామలీకిని రెండవసంధి జరిగెను. దీనివలన నైజాముచే

హైదరున కియ్యఁబడిన సన్నదులన్నియు రద్దుచేయఁబడెను. అది వఱకు హైదరుచేతులలో దొరకియుండిన కర్ణాటక భాగమంతయు నాంగ్లేయులకు స్వాధీనమాయెను. అచ్చట నైజాముగారి గౌరవమును నిలుపుటకై ఆ భాగమునకుఁగాను అతనికి నాంగ్లేయులు ఏడులక్షల పన్నును గట్టనొప్పుకొనిరి. కొండపల్లి దుర్గమచ్చటి జహాగీరుతోఁ గూడ సంపూర్ణముగ వీరిదే యయ్యెను. మొదటిసంధి వలన వీరికి ధృవకౌలు కియ్యఁబడిన యైదుమండలముల గుత్త కొంతకాలము మూఁడులక్షలును తరువాత నేడులక్షలును ఇచ్చులాగున నేర్పడెను. ఆంగ్లేయులు నైజాము హైదరుతోఁ జేరిన కాలమున నాక్రమించిన కమ్మంమెట్టు వరంగల్ సీమ లతనికి మరల్పఁబడెను. మొదటి సంధిననుసరించి ఆంగ్లేయులు నైజామునకు వలసినప్పుడు దండుల నాయత్తపఱచి యియ్యవలసిన వారయి యుండిరి. కాని యీసంధియం దది మారిపోయెను. వారు దమకు నైజామునెడఁగల ప్రేమను జూపుటకై సిపాయీల పటాలములు రెంటిని ఆరుఫిరంగులను ఐరోపియనుల యధికారము క్రిందఁ గావలసి వచ్చినప్పుడు పంపనియ్యకొనిరి. కాని వానికగు వ్యయము నైజామే భరింపవలసెను. కర్ణాటకపునవాబుపై ఇతనికి నధికారము ఈసంధి వలనఁ దప్పిపోయెను. సమయూచిత్యము గణింపక హైదరాలీతోఁ జేరినందులకు నైజామిన్నివిధముల నాంగ్లేయ వర్తకసంఘమువారి పయిఁ దన కదివఱకుండిన పట్టును బోఁగొట్టుకొనెను.



1779వ సంవత్సరమున మరల నైజామలికొక చిక్కు తటస్థించెను. ఉత్తర సర్కారులకుఁ జేరిన గుంటూరు అతని తమ్ముఁడగు బజలత్ జంగునకు జహాగీరుగా నియ్యఁబడెననియు నది సంధుల ప్రకారము కొన్ని షర్తులతో అతని మరణానంతర మాంగ్లేయులకుఁ జేరవలసినదిగా నుండెననియు మాచదువరు లిదివఱకే యెఱింగియున్నారు. 1774 వ సంవత్సరమున బజలత్ జంగు కొందఱు ఫ్రెంచి సైనికులను తనకొలువులోనికి తీసికొనెను. అతనికి యజమానిగ నుండిన నైజామలీ ఆంగ్లేయులతోఁ జేసికొనిన యొడంబడికల ననుసరించి ఫ్రెంచివారిని దీసివేయుమని తనతమ్మునకు వ్రాయవలసిన వాఁడయ్యెను. బజలత్ జంగీ యుత్తరువును లక్ష్యపెట్టిన వాఁడుగాఁడు. కాని యైదు సంవత్సరములకుఁ దరువాత ననఁగా 1779 వ సంవత్సరమున హైదరాలీదెబ్బకుఁ దాళజాలక బజలత్ జంగు ఫ్రెంచివారిని దన సేననుండి తొలఁగించి నైచి యాంగ్లేయులతో సంధి చేసికొని వీరి పటాలములను దనజహాగీరులో నుంచుకొనెను. ఇంతటితో నిలువక యతఁ డాంగ్లేయులకు గుంటూరు జిల్లాను కౌలున కిచ్చుటఁగూడఁ దటస్థించెను. 1768 వ సంవత్సరపు సంధి ననుసరించి బజలత్ జంగు మరణానంతరమో లేక నైజాముగారి యుత్తరపు మీఁదనో గుంటూ రాంగ్లేయులకుఁ జెందవలసి యుండ వారీరీతి నైజామునకుఁ

గొంచెమైనను దెలుపకయే బజలత్ జంగు యొద్దనుండి యీ జిల్లాను గైకొనుట నైజామునకు నాగ్రహము పుట్టించుటకుఁ గారణమయ్యెను. ఇట్టి సందర్భముల నతని కోపముగూడ న్యాయమయినదే. అతని కప్పుడు జరిగినది గొప్ప యన్యాయ మనుట నాంగ్లేయ ప్రభుత్వమువారే తరువాత సిద్ధాంతీకరించి యక్కాలమున మద్రాసు గవర్నరుగా నుండిన సర్ థామస్ రంబోల్టు అను నతనిని పదవినుండి తొలఁగించుటయే గాక యతనితోఁ జేరియుండిన కొందఱు సభ్యులనుగూడ నదేవిధమున శిక్షించిరి. ఇదంతయు నప్పటికప్పుడు జరిగినది కాదు. అల్లకల్లోలము లయిన తరువాత నింగ్లాండునందలి యధికారులు రహస్యసభ నొకదాని నేర్పఱచి ఆసభవా రీదేశమునకు వచ్చి జాగరూకతతో నన్ని విషయములను జర్చించి యనేకులగు సాక్షులను విచారించి తమ యభిప్రాయములను దెలిపినమీఁదట నైజామునెడ మద్రాసు ప్రభుత్వమువా రపరాధము చేసిరనుట తేలెను. కాని యీలోపుగ నైజామున కేలాటి సమాధానమును నీయఁబడలేదు. కావున నతఁడు గోపోద్దీపితుఁడయి మరల హైదరాలీతోఁ జేరుకొని ఆంగ్లేయులతోడి స్నేహము మాని వారిని బారదోల వలసినదని బజలత్ జంగుకు దెలియఁ జేయుచు, నతఁడట్లు చేయనియెడల దానతనిని మర్దించెద నని కూడ జంకించెను. ఇంతలో గుంటూరుజిల్లాను గుఱించి మద్రాసు ప్రభుత్వమువారు చేసికొనిన యేర్పాటులు బంగాళాలోని



గవర్నరు జనరల్‌గా రొప్పుకొనక పోవుటచే నాజిల్లా మరల నైజాము స్వాధీనము చేయఁబడియెను. ఇంతియెగాక యితనిని సమాధానపఱచుట కాంగ్లేయులు మిక్కిలి పరిశ్రమఁ జేసిరి. వారి స్థితి యప్పు డంతబాగుగ నుండలేదు. కావున నైజామునకు దగినంత హితోపదేశమునకు వీరు పూనుకొనవలసి వచ్చెను. వీరి ప్రయత్నములు వృథకాలేదు. హైదరు ఆంగ్లేయులతోఁ గడపటి యుద్ధము చేసినపుడు నైజా మతనితోఁ గలియలేదు. 1782 వ సంవత్సరమున బజలత్ జంగు మరణమందెను. వెంటనే గుంటూరు జిల్లా యాంగ్లేయుల స్వాధీనము చేయఁబడియుండవలెను. కాని నైజాము దానిని తానే యుంచుకొనెను. 1784 వ సంవత్సరమున నాంగ్లేయవర్తక సంఘమువారు 'జాన్సన్' అను నతనిని నైజాము వద్దనుండి గుంటూరు జిల్లాను రాఁబట్టుట కనిపిరి. అప్పుడు నైజాము 1768 వ సంవత్సరపు సంధి ననుసరించి యాంగ్లేయులకుఁ జెందిపోయిన ఉత్తర సర్కారులను వారు మరలఁ దన కియ్యవలసినదనియు దానికై యప్పటివఱకు వారు దన కప్పుపడిన గుత్తమొత్తమును వదలి వేయుటయెగాక యొక కోటి రూపాయిలు బహుమతిగా నిత్తుననియు నొక క్రొత్తబేరమునకు మొదలిడెను. పాపమాజాన్సన్ దానినంతయును నామోదించుచు డైరెక్టరుల సమ్మతికయి యనిపెను. వారది గనినతోడనె మండిపడి జాన్సన్‌ను దీవ్రగతిఁ దూలనాడి పనినుండి తీసివైచిరి. అప్పటి

నుండి కొంతకాలము త్తరసర్కారుల మాటయె యెత్తుకొనలేదు. నైజామునకును నాంగ్లేయులకును నిశ్చయసంబంధ ముండినది గాదు. 1788 వ సంవత్సరమున గుంటూరు జిల్లా ప్రశ్న మఱల బయలు దేరెను. గవర్నరు జనరలుగారు యుద్ధముచేసి నైనను సాధింప నాయత్తపడిరి. అంతట నైజాము పోరు నోర్వలేనివాఁ డయినందున నాంగ్లేయవర్తక సంఘము వారికి కా జిల్లానిచ్చి లెక్కలు చూచుకొని తీర్మానము చేసికొనెను.

## మూఁడవ మైసూరు యుద్ధము.

ఈ తరుణముననె 1768 వ సంవత్సరపు సంధిని గుఱించి దాని విషయములు బోధపఱచుచు గవర్నరు జనరలుగా నుండిన లార్డుకారన్ వాలీసు నైజామున కొక యుత్తరము వ్రాసెను. అదియు నైజామునకును నాంగ్లేయులకును జరిగిన సంధిపత్రములలో నొక్కటిగ నెన్నఁబడుచున్నది. దానివలన కారన్ వాలీసు నైజామును జాలవఱకుఁ దృప్తిపఱచె ననుటకు సందియము లేదు.

ఇంతియెగాదు. ఈ తరుణముననె ఆంగ్లేయులు దనురెసిడెంటు హైదరాబాదున నుండునట్లును నేర్పరుచుకొనిరి. 1789-వ సంవత్సరమున హైదరు కుమారుఁడగు టిప్పూసుల్తానుతో నాంగ్లేయులకు విగ్రహము గలిగెను. నైజా మేదోయొక పక్షముఁ జేరి తీరవలసి వచ్చెను. టిప్పూపక్షమున నుండుట కతనికి టిప్పూపై నమ్మకము చాలకపోయెను. వాఁడు జయించినచోఁ దప్పక తన్నుఁగూడ మ్రింగివేయ నుంకించునను సంశయమితనికిఁ బుట్టెను. వాఁడు విజయుఁ డగుటయు సందేహాస్పదముగ నుండెను. ఇంతియెగాక లార్డుకారన్ వాలీసితనిని బహువిధముల రమ్మని చీరి టిప్పూనోడించుటవలనఁ గలుగులాభములలో మంచిభాగ మిత్తునని వాగ్దానము సేయుచుండెను. కావున నేవిధమునఁ జూచినను నాంగ్లేయులతో నేకమయి టిప్పూనెదురించుటయె యితనికి లాభకారిగఁ గాన్పించెను. పేష్వాయును వీరితోఁ జేర నియ్యకొనెను. కావున నీమూఁడు కక్షులవారికిని 1790 వ సంవత్సరమున సంధిజరిగెను. దీనివలన నీమూఁడు కక్షులవారును టిప్పూసుల్తానుతో విగ్రహము పట్టుదలతో నడుప నియ్యకొనిరి. అతనితోడి సంబంధములు దామెల్లరును గలిసియే చేసికొన నొప్పుకొనిరి. జయము గలిగినచో దానివలన నగు లాభములను సమభాగములుగ బంచుకొన నియమించుకొనిరి. ఈసంధికిఁ దరువాత దీనిని నడుపుటకొఱకే నైజామునకును నాంగ్లేయులకును మఱియొక యొడంబడిక నడిచెను. నైజాముగారి సాహాయ్యార్థము బంగాళమునుండి గవర్నరుజనరలుగారు నాలుగు మొదలు ఆరుపటాలముల వఱకును బంప నొప్పుకొనిరి. ఈదండునకగు వ్యయమంతయు నైజాము అచ్చుకోవలసినదే గాని నగదుగా నియ్యవలసిన పనిలేదు. విగ్రహము ముగిసిన మీఁదట టిప్పూనుండి తీసికొనఁబడు సొమ్ములో నైజాము భాగమునుండి అప్పటివఱకగు మొత్తమాంగ్లేయులు దీసికొన

వచ్చును. లేదా ఆ ఫసలీకి నైజామునకు వీరియ్యవలసిన పేష్కష్ నుండి తగ్గించుకొనవచ్చును. ఇట్టి నిబంధనలతో టిప్పూసుల్తానుతో విగ్రహము ప్రారంభమాయెను. కాని యది బహుకాలము నడచినది కాదు. 1792లో టిప్పూసుల్తాన్ సంధి చేసుకొనవలసిన వాఁడయ్యెను. అప్పుడతఁడు దనరాజ్యములో సగమువంతు శత్రువులకొప్పగించి వేసెను. దానిలో నైజామునకు చెందినభాగము సంవత్సరమునకురు 52, 64, 000 ఆదాయము నిచ్చునదయి యుండెను.

## మహారాష్ట్రులు డీకొనుట.

టిప్పూసుల్తానుతో విగ్రహము ప్రారంభమగునప్పుడే నైజామలీకిని మహారాష్ట్రులకును సంబంధము మైత్రిగలదిగ నుండలేదు. కావున మహారాష్ట్రులు దన తోడను ఆంగ్లేయులతోడను జేరినట్లుచేరి తాను టిప్పూసుల్తానుతోఁ బోరాడుచుండఁ దనదేశమును గొల్లకొట్టుదు రేమో యని నైజాము భయపడి అట్టి దేమియు జరుగకుండ అభయమిమ్మని లార్డుకారన్‌వాలీసును వేడెను. కాని యతఁడద్దాని కంగీకరింపఁడయ్యెను. టిప్పూతోఁ బోరాటము ముగిసి ముగియకమున్నె నైజాము మనస్సున భయరూపముగనుండిన మహారాష్ట్రుల దాడి నిజమయ్యెను. వీరికిని అతనికిని గొంతలావాదేవీలు నడచుచుండెడివి. అందులో నితఁడు వారికి బాకీపడుట తటస్థించెను. కావున వారు దమహక్కును సాధించుకొన నీతని



పైనెత్తివచ్చిరి. అప్పుడితఁడు గవర్నరు జనరలుగారిని సాయమడిగెను. మహారాష్ట్రులును ఆంగ్లేయులకు మిత్రులేయయి యుండినందున నతఁడు సైన్యముల యుద్ధభూమికిఁ బంపఁడయ్యెను. దానివలన నైజామునకుఁ గోపమువచ్చి ఆంగ్లేయులు దనకితర వేళల సాహాయ్యార్థమయి తనవద్ద నుంచిన రెండుపటాలములను తిరుగఁగొట్టి తనతమ్ముఁడు బజలత్ జంగునుండి సంపాదించిన ఫ్రెంచి పటాలములకు నింకను గొందఱను జేర్చికొని ‘‘రేయిమండు’ అను ఫ్రెంచినాయకు నొక్కరుని నియమించి మహారాష్ట్రుల నెదిర్చెను. ఇట్లుచేయుటలో తానుఆంగ్లేయుల సాయ మిఁకెప్పుడును గోరక స్వతంత్రుఁడుగా నుండవలె ననుటయే యాతని యభిప్రాయము.

నైజాముయొక్క యీయభిలాష నెరవేరియుండినచో హైదరాబాదు చరిత్రమే మారిపోయి యుండును. కాని తిరుగఁగొట్టఁబడిన ఆంగ్లేయపటాలములు దారిఁబట్టిపట్టకమునుపె నైజామలీ కుమారుఁడు ఆలీజా తండ్రిపై తిరుగుబాటొనర్చెను. పాపమతఁడు దండ్రి చచ్చువఱకు వేచియుండ లేకపోయెనుగాఁబోలు. తండ్రి బుద్ధి కడపటి కెట్లుపరిణమించునోయని సందియపడియెఁ గాఁబోలు. లేదేని తనతండ్రి యన్నను జంపి రాజ్యమునకు వచ్చెఁగావునఁ దానును దన తండ్రి మార్గము నవలంబింపకున్నఁ దనకును రాజ్యము రాదని తలంచెనేమొ? ఏయూహతోనైననేమి? అతఁడు దండ్రిని సమయించి సింహాసనము నాక్రమింప

సమకట్టెను. కాని యతనికి బుద్ధిబలము దక్కువ కావున దండ్రిచే నతనినిబట్టి నియోగింపఁబడిన ఫ్రెంచివారలకు లోఁబడిపోయె. ఇట్టి సందర్భములఁ దనకు సాహాయ్యకారులుగనుండి తాను దనసీమనువదలి దండులతోఁగూడ బయట యుద్ధములయందు నిమగ్నుఁడయి యుండఁ దనరాజ్యములో నల్లకల్లోలములు జరుగకుండఁ గాచుటకు సిద్ధమయియున్న ఆంగ్లేయుల పటాలములను దిరుగఁగొట్టుట తగదని తలంచి కాఁబోలు నైజాము వారిని మరలరప్పించెను. వారును ఆలీజా లోఁబడునంతలో వచ్చిచేరిరి. ఆలీజాను ముఖ్యమంత్రి యవమానపెట్టి నందున నతఁడు విషముదీసికొని మృతినొందెను.

నైజాము తానుచేర్చిన ఫ్రెంచిసైన్యములతో మహారాష్ట్రుల నెదిర్చెను. రేయిమండు సిద్ధపఱచిన పటాలములప్పటికాలమునకు మిక్కిలి బలవంతములు. భరత వర్షమునందు మఱియేస్వదేశాధీశుని యెడను నట్టిబలము లుండలేదనిన వానియుత్కృష్టత బయల్పడఁగలదు. నైజామునకును మహారాష్ట్రులకును జరిగిన యుద్ధమునందు నైజామును అతని పనికిమాలిన పటాలములును వెనుకంజవైచి పాఱిపోవకున్నచో రేయిమండు సంపూర్ణ జయమందియుండును. కాని నైజామే అప్పటివిజయమును జెడిపికొనెను. మహారాష్ట్రులతనిని కర్డ్లా దుర్గమునఁ జుట్టుకొనిరి. అతఁడు సంవత్సరమునకు ముప్పదియైదు లక్షల ఆదాయమునీను భూభాగమును నాలుగునర కోటి



రూపాయిల ద్రవ్యమును మహారాష్ట్రులకిచ్చుకొని తన ముఖ్యమంత్రిని ( hostage.) ప్రతిభువుగా నిచ్చి వారినుండి తప్పించుకొనవలసినవాఁడాయెను.

ఇట్లపజయమంది రాజధాని వచ్చిచేరెను. ఫ్రెంచిపటాలము లొకవైపునను ఆంగ్లేయపటాలములు మఱియొకవైపునను ఇతనిని గొలుచుచుండెను. భరతవర్షమున ఫ్రెంచివారి యౌన్నత్యము 1757వ సంవత్సరముతోడనె నశించిపోయి యుండెను. కావున ఫ్రెంచిదొరతనమువారికి సేవకులుగ నదివఱకుండినవారచ్చటచ్చట స్వదేశీయప్రభువుల దగ్గఱచేరి పొట్టఁబోసికొనుచుండిరి. అట్టివారలలో నిప్పుడు నైజాము కడనుండిన రేయిమండొక్కరుఁడు.

## రేయిమండు.*

ఇతఁడసామాన్య శక్తియుతుఁ డనుటకు సందియములేదు. ఇతఁడు ఫ్రాంసుదేశమున 'గాస్కనీ' పరగణాలో 'సెరిన్యాక్' అను గ్రామములో 1755 వ సంవత్సరమున జననమందెను. ఇరువది సంవత్సరముల ప్రాయ మప్పుడు హైదరాలీకిఁ దోడయివచ్చిన 'షెవలియర్ డిలాషి' యొక్క పటాలములో నొక చిన్న యధికారిగఁ జేరెను. అనేక పర్యాయము లితఁడు ధైర్యసాహసములు చూపుటవలన నధి

* ఇతనిని ఇప్పటికిని హైదరాబాదునందు గొప్పకుటుంబములవారు స్మరించుచున్నారు.

కారు లితనిపైఁ బ్రేమగొనఁ జొచ్చిరి. కావున నితఁడు త్వర లోనే నాయకత్వమున కర్హతనందెను. 1783వ సంవత్సరమున నాంగ్లేయుల నెదుర్చుటలోఁ బోడ్పడ 'బుస్సీ' యేతెంచినపు డాతఁడితనిని దనపార్శ్వవర్తిగ నేమించుకొనెను. బుస్సీమరణా నంతరము 1786వ సంవత్సరమున నప్పటి పుదుచ్చేరి గవర్నరు గా రితనిని నైజామునకు మిక్కిలి నమ్మకమగు సేవకుఁడు గాఁగ లఁడని సిఫార్సుచేసిరి. నైజామును నితనికి మాసమునకు నైదువే లరూపాయిలు జీతమిచ్చి కాల్బలపుఁ బటాలమొక్కటిని సిద్ధ పఱుప నియోగించెను.

ఇతఁడు చేర్చిన పటాలము నైజామదివఱకును జూడ నైనఁ జూడనంతటి బలవంతమయినదయి కనుపట్టినందునఁ గ్రమ క్రమముగఁ బదునాల్గుపటాలములఁ జేర్చవలసినదని యితనికి నుత్తరువాయెను. ఇతఁడు బలములఁ జేర్చినదియు, మహా రాష్ట్రులతోఁ బోరినదియు, నైజాముయొక్క బలహీనతవలన విజయమును సంపాదింపలేకపోయినదియు నింతకుమున్నె వ్రా సితిమి.

ఇట్టిప్రచండుఁడగు ఫ్రెంచినాయకుని యాధిపత్యముక్రింద దినదినప్రవర్ధమానమగు సైన్యముండుటయు, నది నైజాము నకు దోడుగనుండుటయు, నతనివద్దచేరుకొని యాతనితో సంబం ధములు గల్పించుకొనుచుండిన యాంగ్లేయులకు గిట్టినదిగాదు.



మార్క్వెసుఅఫ్‌వెల్లెస్లీ ఆంగ్లేయులకు గవర్నరు జనరలుగా వచ్చునప్పటికి రేయిమండు పటాలములు నింకుస్థితియందుండెను.

## సంధికిఁగారణములు.

టిప్పుసుల్తానుతో మరల విగ్రహము తటస్థించునట్లుండె ను. మహాబలశాలియగు టిప్పుసుల్తానుతోఁ జంచలచిత్తులయిన నైజాము మహారాష్ట్రులను దోడుచేసికొని పోరఁగడఁగు నాం గ్లేయులకు, నైజాముయొక్క బలవంతమగు ఫ్రెంచిసైన్యమును దమదండులో నొక్కయంగముగ స్వీకరించుట కుక్కతోఁక పట్టుకొని గోదావరియీఁద సాహసించుటయె యయియుండును గదా. కావున మార్క్వెసుఅఫ్‌వెల్లస్లీ నైజామును ఫ్రెంచిసైన్య ములఁ బగులఁగొట్టుమని వేధింపఁజొచ్చెను. కాని నైజామునకు మాత్రము దనబలమును దగ్గించుకొనుట కేమాత్రమును ఇష్ట ములేకుండెను. అట్టిసందర్భముల నొకటిరెండువిషయములు తటస్థింపకున్నచో నైజామునకును నాంగ్లేయులకును సంతత్వరగ స్నేహము గుదిరియుండదు. కాలపరిపక్వమహిమవలన నప్పుడే రేయిమం డకస్మాత్తుగఁ జచ్చుట దటస్థించెను. అతఁడు విషము చేతఁ జచ్చెనను వదంతిగలదని యొకచరిత్రకారుఁడు వ్రాయు చున్నాఁడు.[1] నైజామునకు ముఖ్యమంత్రిగనుండి యతనిక్షేమ మునకయి (hostage) ప్రతిభూఁడుగ మహారాష్ట్రులవద్ద బహుకా లము ఖైదీవలెనుండిన ఆజమ్ - ఉల్ - ఉమ్రా మిక్కిలిచాతు

1 Malleson—Native States of India-

ర్యముతోఁ బనిచేసి కర్డ్లాసంధివలన నైజాముపోఁగొట్టుకొనిన సర్వసంపత్తును మహారాష్ట్రులనుండి నైజామునకు మరల్చుటకుఁ దగిన యేర్పాటులన్నియుఁ బన్ని, తన్ను వారువదలి పెట్టునట్లు వారితో స్నేహభావముగల్పించుకొని హైదరాబాదువచ్చిచేరెను. ఇతఁడాంగ్లేయుల పయిభక్తియు వారియెడ ప్రేమయుఁ గలవాఁడు. కావున నైజామున కితఁడు నచ్చఁజెప్పి రెండవమారు తిరుగఁ గొట్టఁబడనుండిన యాంగ్లేయ సైన్యములను హైదరాబాదునందు నిలిపెను. రెసిడెంటుగానుండిన కిర్కుపాట్రికు నైజామునకునప్పటికాలమున ఫ్రాంసులో జరుగుచుండిన విప్లవమును గుఱించియు నటప్రభువులుపడుచుండిన గొప్పదురవస్థలను గుఱించియు ఫ్రెంచివారికి ప్రజాస్వాతంత్ర్యమునెడఁ గల యాపేక్షలను గుఱించియు సమయము దొరకినపుడెల్ల పెంచిచెప్పుచు వారియెడ నతని కసూయఁగలిగింపఁ బ్రయత్నించుచుండెను. నైజామునకుఁగూడ ఫ్రెంచివారు రాజును విధ్వంసముచేసినదిచూడ విస్మయకరముగనె యుండెను. ఇంతియగాక 1796వ సంవత్సరమున నైజాము మిక్కిలి జబ్బుపడిలేచి నాఁటినుండియు బలహీనుఁడగుచునేయుండెను.

## ఆంగ్లేయులతో సంధి (1798.)

ఇప్పుగి దన్నివిషయములును నాంగ్లేయులకు సహకారులుగనే కాన్పించెను. కావున గవర్నరుజనరలుగారు ఫ్రెంచిపటాలములను బగులఁగొట్టవలసినదని నొక్కిచెప్ప నారంభించిరి. నైజామునకును నాంగ్లేయులకును 1798వ సంవత్సరము మఱియొకసంధి జరిగెను. దానివలన నైజామునకు నాంగ్లేయులు రెండుపటాలములకు బదులు ఆరుపటాలములు సాహాయ్యమియ్య నంగీకరించిరి. నైజాము దనక్రింద జీతగాండ్రుగ నుండిన ఫ్రెంచివారల నందఱను పనులనుండి తొలఁగించి ఆంగ్లేయుల స్వాధీనముచేయ నొప్పుకొనెను. ఆరుపటాలములకు నగు వ్యయము సంవత్సరమునకు రు 24, 17, 100లు. నైజాముగారి బొక్కసమునుండి నాలుగు కిస్తీలుగ నిచ్చున ట్లేరుపరుపఁబడెను. మహారాష్ట్రులకును నైజాముగారికిని మరల నేవేని భేదములు గలిగినచో నాంగ్లేయులు మధ్యవర్తులుగ నుండ నియమింపఁబడిరి. ఆంగ్లేయులనుదక్క దక్కిన యైరోపియనులను నైజాముగారి రాజ్యమునుండి వెడలగొట్టు విషయమున 1798వ సంవత్సరము శెప్టెంబరు నెల 1 వ తేది ప్రత్యేక మొకయొడంబడిక జరిగెను. దానిననుసరించి నైజాము రెసిడెంటుగారి యేర్పాటులకు నియ్యకొన నంగీకరించెను.



## ఫ్రెంచివారి పలుకుబడికి భంగము.

అక్టోబరు నెల తొమ్మిదవ తేది నైజామున కెక్కుడుఁగ నాంగ్లేయులియ్యఁదలఁచికొనిన నాలుగుపటాలములును హైదరాబాదు వచ్చిచేరెను. రెసిడెంటుగారు సంధిప్రకారము ఫ్రెంచిబలములను జెదరఁగొట్టవలసినదని వేడిరి. కొన్నిదినములకాల మేమియు నడచినదిగాదు. ఫ్రెంచిపటాలముల

విషయమున నడచినయొడంబడికను పూర్తిసేయకుండుటకు వలయు ప్రయత్నములు దోఁచెను. అంతట రెసిడెంటు తన సైన్యములను ఫ్రెంచివారిపై విడియింప వలసివచ్చునని తెలిపి తనదండును ఆపనికై యాయత్తపఱచుచుండినట్లు తోఁపింపఁజేసెను. అంతట నైజాము గారు ఫ్రెంచియధికారులను దమసేవనుండి దప్పించిరనియు ఫ్రెంచిపటాలములు విడిపోవలసినదనియు నుత్తరువుపంపిరి. ఈయుత్తరు వయినతోడనె ఫ్రెంచిసైన్యములలోఁ దిరుగుబాటులు చూపట్టెను. ఆతిరుగుబాటే కారణముగ వానిని జెదరఁగొట్టుట సులభమాయెను. ఫ్రెంచిపటాలము లుండిన నగరభాగము నాంగ్లేయ సైన్యములు చుట్టుకొనెను. ఇదిచూచి ఫ్రెంచిసైనికులు జడిసిపోయిరి. లోఁబడినచో నభయమిత్తుమని యాంగ్లేయులు చాటుటతోడనె ఫ్రెంచిభటులు 15, 000 జనులు గిక్కుమిక్కుమనక ఒకరివెంబడిగ నొకరు ఆంగ్లేయుల శరణుఁజొచ్చిరి. హైదరాబాదునం దీరీతిని ఫ్రెంచివారి పలుకుబడిని నశింపఁజేసి తమబలములను సంస్థాపించుకొనుటలో నాంగ్లేయులు వడసిన విజయము భరతఖండచరిత్రమున కంతకును ముఖ్యాంశమని చెప్పనొప్పును.

## టిప్పూప్రయత్నములు - పతనము.

టిప్పుసుల్తాను నాంగ్లేయుల నెదుర్చుటకొఱకు మిక్కిలి బలమగు కక్షను సంస్థాపించుటకుఁ బడరాని పాట్లెల్లయును బడుచుండెను. అతఁడు నైజాముతోడను ఫ్రెంచివారితోడను సంబంధ



ములు గల్పించుకొని వారినిగూడ నాంగ్లేయులకు విరోధులుగఁ జేర్చుకొనఁ జూచుచుండుటయే గాక అరేబియా పరిపాలకుండు మున్నగు మహ్మదీయప్రభువుల నందఱను సాయము చేసికొని స్వమతావలంబకులకు మతాభిమానమును బురికొల్పి యపరిమిత సైన్యములఁ బ్రోగుచేసి యాంగ్లేయులను మొదలంటఁ బారఁదోలఁ బ్రయత్నించుచుండెను. హైదరాబాదునందు పైనివర్ణించిన విజయమునకు మూలకారకుఁడగు లార్డువెల్లస్లీ గవర్నరు జనరలయి ఈదేశమునఁగాలిడి యుండకమున్నె యీవిషయమును జక్కఁగ గ్రహించి తనపై యధికారులకుఁ దెలిపి టిప్పూకార్యములకు భంగముగూర్చుటకు వలయు సాధనములు వెదకుట యందు మిక్కిలిశ్రద్ధ వహించెను. హైదరాబాదునందలి ఫ్రెంచి బలమును విచ్ఛిన్నముచేసి ఆసంస్థానాధీశ్వరుని యొద్ద తమ శక్తిని దృఢపఱచుకొని, వెంటనే అకస్మాత్తుగ దండునాయత్త పఱచి టిప్పూసుల్తానుపై కనిపెను. ఇచ్చటనాల్గవమైసూరు విగ్రహము వర్ణించు టవసరముగాదు. దానియందు టిప్పూ యోడిపోయి ప్రాణము లర్పించెనని నుడివిన చాలును. అతని మరణానంతర మారాజ్య మంతయును నాంగ్లేయులయు నైజాముయొక్కయుఁ జేతులలోఁబడెను. దానిని వీరలు బంచుకొనుటకై 1799వ సంవత్సరమున మైసూరుసంధి జరిగెను.

## మైసూరుసంధి (1799)

మైసూరునందు బహుభాగమును విభజించి యుండినచో నైజామునకు మిక్కిలి బలమగు దుర్గములు చేఁజిక్కి యుండును. అప్పటికట్టి యవకాశము నైజామున కిచ్చుట తగదని లార్డు వెల్లస్లీ కి దోఁచెను.* దానివలన మైసూరు విభజింపఁబడక మొత్తముగఁ బూర్వపురాజుల సంతతివాఁడగు కృష్ణరాజ ఒడయరు బహదూరుగారి కియ్యఁబడెను. అతనిసాహాయ్యార్థ మా రాజ్యములో నాంగ్లేయ పటాలములు నిలుపఁబడెను. వానికగు వ్యయమునకై యితఁడు సంవత్సరమునకు ఏడులక్షల వరహాలియ్యనియ్యకొనెను. ఇట్లు పూర్వపురాజ సంతతివారికి మైసూరునిచ్చి టిప్పుసుల్తాను గడించియుండిన తక్కిన దేశమును ఆంగ్లేయవర్తకసంఘమువారును, నైజామును, మహారాష్ట్రులును బంచుకొనునట్లేర్పఱుపఁబడెను. మహారాష్ట్రులు టిప్పుతోఁ బోరాడుటలో కలిసి పనిసేయకున్నను వారిని గూడ నీసంధిలోఁ జేర్చుకొని వారికొక కొన్ని జిల్లాలనిచ్చుటకుఁ గారణము "పేష్వారావు పండిత ప్రధాన్ గారికిని, ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియాకంపెని బహదూరుగారికిని, ఘనతవహించిన నవాబు నైజాము - ఉద్ - దౌలా ఆసఫ్ జా బహదూరుగారికిని, మహారాజ మైసూరు కృష్ణరాజ బహదూరుగారికిని గల స్నేహమును రాజకీయసహవాసమును నిలుపుటకై" యని నుడువఁబడి

* ఈ యంశము వెల్లస్లీగారి లేఖవలన దెలియుచున్నదని ఫ్రేజరను చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు.



నది.[1] పేష్వా యీసంధికి నొప్పుకొనినవాఁడుగాఁడు. కావున నతనికయి వేరుచేసిపెట్టిన భాగమునందు మూఁడింట రెండవవంతు నైజామున కియ్యఁబడెను. మొత్తముమీఁద నతనికి మైసూరు సంధివలనను 1792 లో టిప్పుతో జరిగిన సంధివలనను సంవత్సరమునకు కోటిరూపాయలాదాయము రాఁగలదేశము చెందెను. కాని బహుకాల మిది యితని స్వాధీనమున నుండినదికాదు.

## ఆంగ్లేయులతో సంధి. (1800.)

టిప్పూసుల్తానును నుదముట్టించుటను జూచి మహారాష్ట్రులు అసూయాపరవశులై యుండిరి. వారు రానురాను ఆంగ్లేయులయెడ విరోధభావము నభివృద్ధిఁ జేయుచుండుట విశదమయ్యెను. కావున నాంగ్లేయులు నైజాముతోడి సంబంధము నింకను బలము చేసికొనఁ బ్రయత్నింప వలసి వచ్చెను. ఇదివఱకతనికిని దమకునుగల పరస్పర సమానమిత్రభావము గష్టసమయములఁ బనికిరాక పోవచ్చునని యెంచి తామతనికి సంరక్షకులయి తమ సలహాల కతఁడు ఎదురు చెప్పలేకుండునట్లు నియమించుకొనవలెనని వీరికిఁ దోఁచెను. ఇంతియగాక ఆతని దేశము మహారాష్ట్రుల దేశపు సరిహద్దులలో నుండుటవలన నాతనిదేశమునందుఁ దమబలములు వలసినంత యుండుటగూడ లాభకారియేయని

1 C. N. Atchinson's collection of treaties, Engage-ments & sannads. Vol. 5 Page. 9.

వారుదలంచి యుండిరి. కావున 1800 వ సంవత్సరమున నైజామునకును ఆంగ్లేయులకును మఱియొక సంధిజరిగెను.

ఈ సంధిప్రకారము నైజాముగారి రాజ్యములో నాంగ్లేయులచే నుంచఁబడిన సాహాయ్యసైన్యము(Subsidiary force) స్థిరపఱుపఁబడి సంఖ్యయందును హెచ్చుచేయఁబడెను. రెండు పటాలములు సీపాయిలును, ఒక్కపటాలము ఆశ్వికసైన్యమును, వీనికిఁదగిన ఫిరంగులు మందుగుండులతోడను, సిబ్బందితోడను, మున్నున్న ఆరుపటాలముల సీపాయిలకును ఒక్కపటాలము ఆశ్వికసైన్యమునకును జేర్పఁబడెను. మొత్తముమీఁద ఆంగ్లేయ వర్తకసంఘమువారు నైజాముగారికి సాహాయ్యసైన్యముగ స్థిరపఱచినది ఎనిమిదిపటాలముల సీపాయిలును(అనఁగా 8000లు తుపాకి నుపయోగించు భటులు) రెండుపటాలములు ఆశ్వికసైన్యమును(అనఁగా 1000 మంది రౌతులు)వీనికవసరమగు ఫిరంగులు, ఐరోపియనుల సిబ్బంది, లాస్కారులు, మందుగుండులు మున్నగునవి. వీనికన్నిటికగు వ్యయమునకై నైజాము టిప్పుసుల్తాను రాజ్యమునుండి శ్రీరంగపట్నము (1792), మైసూరు సంధులవలన గడించిన సంవత్సరమునకు కోటిరూపాయ లీనుదేశభాగమును ఆంగ్లేయుల కియ్య నొప్పుకొనెను. యుద్ధసమయముల నాంగ్లేయుల సాహాయ్యార్థమయి ఈ పటాలములలో రెండు దక్క దక్కినవానిని దన స్వంతసైన్యములోని ఆఱువేల కాల్బలముతోడను, తొమ్మిదివేల ఆశ్వికభటులతోడను, బంపుటకు నైజా



ము సమ్మతించెను. ఈసంధివలన నైజామును ఆంగ్లేయులును రాజకీయ కార్యముల కైక్యతనొందుట నిర్వచింపఁబడినందున నైజాము పరరాష్ట్రములతో నాంగ్లేయులకుఁ దెలియకుండ నుత్తరప్రత్యుత్తరములు సలుపుటలేదనియుఁ, బరరాష్ట్రము వారితోఁ బోరునకు దాను పోవుటలేదనియు, నొకవేళఁ బరరాష్ట్రపు వారితోఁ దనకు వివాదములు గలిగినప్పు డాంగ్లేయ వర్తక సంఘము వారు న్యాయమువిచారించి తీర్మానముచేసిన విధమున నడచుకొనును ననియును కూడ నొడంబడిక చేసికొనెను. ఆంగ్లేయవర్తకసంఘమువారు నైజాముపై నకారణముగ దండెత్తినచ్చు శత్రువుల నణఁచుభారము నంగీకరించుటయే గాక నైజామునకు సర్వవిధముల సాయపడఁదలంచికొని యుండుటను సూచించిరి. "నిజమునకు (నైజామును ఆంగ్లేయసంఘము వారును) ఒక్కటేయను యైక్యమయినందున" ననుపదములు ఈసంధిపత్రమున భూమిక (Preamble) యందును షరతుల యందును గూడఁ గానవచ్చుట వలన నైజాము గొంచెము లోతుగఁ బరిశీలించిన పూర్ణాశ్రయతను బయల్పఱచునట్టి ఆత్మగౌణసామ్యమును(Self subordinating equality)దప్పక వచ్చినందువలన నాంగ్లేయులయెడ నంగీకరించెనని చెప్పవచ్చును" అని యొకచరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు [1] ఇప్పగిది రాజకీయ విషయములలో నైజాముతో దిట్టమగు నేర్పాటులు గా

1 Mac-auliffe—The Nizam.

వించుకొని యాంగ్లేయులు 1802 వ సంవత్సరమున నతనితో వర్తకసంధి నొక్కటిని గుదుర్చుకొనిరి. దానివలన వర్తకులకు మున్నుండిన గష్టము లనేకములు దీరిపోయెను. ఒకరి రాష్ట్రమునుండి మఱియొకరి రాష్ట్రమునకు దిగుమతి కాఁగల సరకుల పై నూటికైదువంతున సుంకముగట్టుట నిర్ణయింపఁబడెను. కొన్ని మార్పులతో ఆపద్ధతియే నేఁటికిని సాగుచున్నది.

## నైజామలీ చివరదినములు.

తనతదనంతరము దన రాజ్యమును నైజామలీ కుమారులు ముగ్వురకునుఁ బంచిపెట్టవలెనను ఉద్దేశము దనకుఁగలదని కనుపఱచి దానికై మహారాష్ట్రులయు నాంగ్లేయులయు సమ్మతిఁ బడయనుండెను. ఇట ఢిల్లీచక్రవర్తిగారి యనుమతిమాటయే దలపట్టకుంట మనము గమనింపవలెను. ఈలోపుగ 1797 వ సంవత్సరమున నైజామలీ మిక్కిలి జబ్బుపడెను. అప్పుడాతని పెద్దకుమారుఁడు గొంతకష్టముమీఁదఁ దండ్రికిఁ బ్రతినిధిగ రాజకీయ కార్యములు నెరవేర్ప నేమింపఁబడెను. 1799 లో నైజామునకు వ్యాధిప్రబలి మృత్యువును దెచ్చిపెట్టునేమో యను స్థితినిగలిగించెను. ఆతరుణమున గవర్నరుజనరలుగారు రెసిడెంటునకొక యుత్తరము వ్రాసిరి. అందులో నాంగ్లేయులు సికందరుజాకు నైజామలీ మరణానంతరము సాయముచేయవలసినచో నతఁడీయకొనవలసిన షరతులు లిఖింపఁబడెను. వానికన్నిటికిని అతఁడొప్పుకొనెను. నైజామలీ కుత్తుకనుండి



యూపిరి వెడలుటె యాలస్యముగ సికందరుజాను సింహాసనముపై కెక్కించుటకు సర్వసన్నాహములును జేయఁబడియుండెను. కాని నైజామలీ మరల బ్రతుకుటవలన నవెల్లయుఁ బనికి రాకపోయెను. అయిన నప్పుడు సికందరుజా కొసఁగిన షరత్తులే 1800 సంవత్సరపు సంధిలో నైజామలీకినినొసంగఁబడి యతనిచే నంగీకరింపఁ బడెను. ఇట్లదివఱకె యాంగ్లేయుల సంరక్షణకు లోఁబడియుండ నెంచికొనిన సికందరుజా 1803 వ సంవత్సరమున నైజామలీఖానుఁడు మరణించఁగనే అల్లరులును గడబిడలును నేమియు లేక నైజాముపదమున కెక్కెను.

## సికందరుజా (1803—1829).

సింహాసనము నెక్కినపుడితని వయస్సుముప్పదినాలుగు సంవత్సరములు. ఇతఁడు సౌలభ్యమును సుఖమును అపేక్షించి ప్రజల కష్టసుఖములను గమనింపఁ డయ్యెను. ఇతఁడు సింహాసనమునకు వచ్చునప్పటికి సిందియాహోల్కారుల పరస్పరసంఘట్టనమువలన రేగిన ప్రథమ మహారాష్ట్రయుద్ధము జరుగుచుండెను. 1803 వ సంవత్సరము అక్టోబరు నెల 25 వ తేది పునహాయొద్ద యుద్ధములో సింధియాయును నతనికి సహకారిగఁ బోరుచుండిన పేష్వాయును హోల్కారుచే నోడింపఁబడిరి. పేష్వా సంపూర్ణమగు నాశమును దప్పించుకొనుటకయి యాంగ్లేయులతో సహవాసము గోరెను. కావున నాతనికిని వీరికిని నైజామునకును వీరికినిం బలె అదేషరత్తులతో సంధి

జరిగెను. 1805వ సంవత్సరమున సింధియాఁగనిన యపజయము వలన ప్రథమ మహారాష్ట్ర విగ్రహము ముగిసెను. ఈవిగ్రహమున సికందరుజా ఆంగ్లేయులకేమాత్రమును సాహాయ్యము చేసియుండలేదు. అట్లుండియు శత్రువుల నుండి పట్టుబడిన దేశములోఁ గొంతభాగము నైజామునకీయఁబడెను. దీనివలన నితని రాజ్యము ఉత్తరమున వింధ్యాద్రులవఱకును వరదానదివఱకును వ్యాపించెను. ఈతరుణముననె బీరారు (Berar) పూర్తిగ నైజామునకుఁ జేరెను. 1804 వ సంవత్సరమున నైజామలికి ముఖ్యమంత్రిగనుండి ప్రఖ్యాతి వడసిన ఆజిమ్-ఉల్-ఉమ్రా పరలోకప్రాప్తిఁ జెందెను. అతనిస్థానమున మీర్ ఆలంను నేమింపవలసినదని రెసిడెంటుగారు సలహానిచ్చిరి. ఇతఁడు ఆజీమ్-ఉల్-ఉమ్రా ముఖ్యమంత్రిపదము నందుండినపుడాతని కాప్తుఁడుగ కార్యభారమును వహించిన వారలలో ముఖ్యుఁడు. అంతియగాక ఆంగ్లేయులయెడ నెక్కుడు భక్తిగలవాఁడు. సంస్థానము పయి యనురాగము గలవాఁడు. కాని ఇతఁ డాంగ్లేయ ప్రతినిధి వలన నిర్వచింపఁ బడుటం జేసి ముఖ్యముగ వారివాఁడుగనె ఉండు ననితలంచికాఁబోలు సికందరుజా ఇతనిని నియమించుటకు మొట్టమొదట ఇష్టపడలేదు. అయినఁ దప్పదని రెసిడెంటు బలవంతపెట్టిన మీఁదట నైజామీతనికిఁ బూర్వపు ముఖ్యమంత్రికిఁ గల శక్తులలో నొకకొన్నిటిని తగ్గించి ఇతనిని ఆపదమున నుండనిచ్చెను. మీర్-ఆలమ్ యుక్తిమంతుఁడు గావున నైజాముగారి మనసున కెక్కునట్లు ప్రవర్తించి యతని మన్ననవడసి ప్రతిరాజ్యాంగమందును (Department) వలయు సంస్కారములనేకముల నుపక్రమించెను.



### మహీపుత్రరాముఁడు.

బీరారునకుఁ బరిపాలకుఁడుగ నుండిన రాజా మహీపుత్రరాముఁడు 1805 సంవత్సరమున హైదరాబాదునకువచ్చి నైజాము స్నేహితులగు ఇస్మేల్-యార్-జంగు మున్నగువారి ద్వారా అతనివద్ద పలుకుబడి సంపాదించుచుండెను. మహీపుత్రుఁ డెప్పగిది నైన మీర్-ఆలమ్‌ను పదచ్యుతుని జేసి తానా స్థానము నాక్రమించుకొనఁ బ్రయత్నింప మొదలిడెను. మీర్-ఆలమ్‌కును ఆంగ్లేయాధికారియగు రెసిడెంటుకును గల యన్యోన్యమును బెంచి చెప్పి నైజామునకు మీర్-ఆలమ్‌పై నుదాసీన భావముఁ బుట్టింప మహీపుత్రుని పక్షమువారు పూనుకొనిరి. ముఖ్యమంత్రిపై వీరు బన్న మొదలిడిన కుట్రలను నైజామెఱింగియు నెఱుఁగని వానివలె నుండనియ్యకొనెను. ఇట్టి సందర్భములలో రెసిడెంటు చర్చఁబుచ్చుకొని తీరవలసిన వాఁడాయెను. అతని నిర్బంధమువలన మహీపుత్రుఁడు బీరారున దన స్థానమునకు వెడలిపోవలసినదని యుత్తరువాయెను. కాని యిదినామకార్థము పుట్టిన యుత్తరువె. మహీపుత్రుఁడింకను నైజాముతో నాలోచనలు సేయుచు సింధియా హోల్కారులను దోడుచేసికొని మీర్ ఆలమ్‌ను

మార్గమునుండి తొలఁగించి ఆంగ్లేయసంబంధమును మాన్పింపఁ బ్రయత్నించుచుండుటయుఁ దెల్లమయ్యెను. దీనిపై గవర్నరు జనరలుగారి యుత్తరువు ననుసరించి రెసిడెంటు మహీపుత్రుని అతని సాహాయ్యులను వెంటనే తొలఁగించ వలసినదని నైజామునకు దృఢముగఁ దెలియఁజేసెను. అతఁడును నాప్రకారమె చేయవలసిన వాఁడయ్యెను. ఇంతవఱకును దనకేమైనఁ గీడుకలుగు నేమోయని జంకి రెసిడెంటుగారి తోటయందొక భవనమున దాఁగియుండిన మీర్-ఆలమ్ నగరుఁజొచ్చి మరల దనధర్మము నెరవేర్పఁ బ్రారంభించెను. నైజామును అతనిని గౌరవించి సమ్మానించెను. మహీపుత్రుని అతని పరిజనమును దొలఁగించుటవలన నిలువయున్న యుద్యోగములకు మీర్-ఆలమ్ పక్షమువారు నేమింపఁబడిరి. అందుబీరారునకు రాజా చందూలాల్ సోదరుఁడగు గరుడబక్షీ పరిపాలకుఁడుగ నేమింపఁబడెను. అతని సాయమునకైఁ గొంత యాంగ్లేయ సైన్యముగూడఁ బంపఁబడెను. దానిని జూచినతోడనె మహీపుత్రుఁడు షోలాపురమునకుఁ బారిపోయి యటనుండి కొంతకాలము నైజాముగారి యెడ శత్రుత్వము పూని పోరి కట్టకడపట హోల్కారు శరణుఁజొచ్చి యతనివలనఁ జంపఁబడెను.

### నైజాము స్థితి.

1808 వ సంవత్సరమువఱకును నైజామునకును ఆంగ్లేయులకును గల సంబంధమున విశేషాంశములేవియు నుండలేదు.



ఆసంవత్సరమున మీర్-ఆలమ్ మరణమందుట తోడనె మరల నైజామునకును రెసిడెంటునకును ముఖ్యమంత్రిపదమున కెవ్వరిని నియమించవలె ననుటతో వాదము ప్రారంభమాయెను. 1800 సంవత్సరమున జరిగిన సంధిప్రకారము నైజాము దన స్వంతసైన్యమును అవసరమగుడు ఆంగ్లేయుల సాహాయ్యార్థము పంపవలసిన వాఁడయియుండెను. మహారాష్ట్ర యుద్ధమున నిట్టి సైన్యమును దగినంతను దగినస్థితిలో బంపకపోవుటయేగాక తరువాతఁ బలుమారు హెచ్చరింపఁ బడినను సరియగు సైన్యమును జేర్చుటకూడ మానివేసెనఁట. సికందరుజా మహారాష్ట్రులయెడ పక్షపాతము గనుపఱచు చుండినందున నతఁడు ఆంగ్లేయులకు విరోధియని ప్రకటించిన బాగుగనుండునాయని మార్క్విసు వెల్లస్లీ మొదటి మహారాష్ట్ర విగ్రహమునకుఁ బ్రారంభమున యోజించినట్లు గూడఁ దెలియవచ్చుచున్నది[1] మీర్ ఆలమ్‌ను ముఖ్యమంత్రిగ నేర్పఱచు కొనుట కితఁడెన్నివిధములఁ బెనగులాడినదియును రెసిడెంటుగారికిఁ దెలిసియే యుండెను. ఇట్టి సందర్భముల నీతని ముఖ్యమంత్రి స్థానమున దనచే నియమింపఁబడి తనపై యాధారపడియుండు వాఁ డుండుట యావశ్యకమని రెసిడెంటుకుఁ దోఁచెనని వేరుగ వ్రాయఁబనిలేదు. కావున నతఁడు దన యిష్టప్రకారమె ముఖ్యమంత్రిని నియమింప వలసిన దని నైజామును నిర్బంధపెట్టెను. దానిపై సిరువురకును గొంతతీక్ష్ణ

1 Wellington's despatches.

మగు వివాదము జరిగెను. "సర్వాధికారియగు సంరక్షకుఁడును మూర్ఖుఁడగు సంరక్షితుఁడును బెనఁగులాడిన సర్వసామాన్యముగ నెట్టిఫలము గలుగునదియు మనమెఱింగిన విషయమేగదా. నైజాము దనసంరక్షకులకు ముత్తెముల నిచ్చి చిప్పను దానుంచుకొనెను. మూనిర్-ఉల్-ముల్క్ అను నైజాముగారి మనుష్యుఁడు నామకార్థము ముఖ్యమంత్రిగ నేమింపఁ బడియెను. ఆంగ్లేయులకు మిత్రుఁడగు రాజాచందూలాల్ అను హిందువు పేరునకు పేష్కారేయయినను నిజమునకు పేష్కారుదివానుల[1] శక్తులరెంటిని గలవాఁడుగ నొనర్పఁబడెను."[2] ఇతఁడు 1832 వ సంవత్సరమున మూనిర్-ఉల్-ముల్క్ చనిపోవుట తోడనె దివానుపట్టమును గూడ ధరించెను.

## చందూలాల్ ముఖ్య మంత్రిత్వము.

మొదట నితఁడు సుంకమువసూలుచేయు శాఖలో సర్కారునౌకరుగఁ జేరినవాఁడు. 1804 వ సంవత్సరమున మీర్-ఆలమ్ ముఖ్యమంత్రి యగుటతోడనె అతఁ డీతనిని తన వద్ద కార్యనిర్వాహకుఁడుగ నుంచుకొనెను. అతఁ డాంగ్లేయులకు మిత్రుఁడై వారిపక్షము నవలంబించుచు వచ్చినందున నితనికిని ఆంగ్లేయులయెడ స్నేహభావము పెరుగుచునే వచ్చెను. దాని వలన నితనికిఁ గలిగిన లాభము మాచదువరులిదివఱకే వినియు

1 దివాను, ముఖ్యమంత్రియనునవి పర్యాయపదములనిగ్రహించునది.

2 జి. బి. మాలిసన్.



న్నారు. కావున నిఁక రాజా చందూలాల్ రెసిడెంటు గారెట్లునడపిన నట్లు నడచెననినచో నతిశయోక్తిగ నుండఁజాలదు. రెసిడెంటును దరుణము చూచుకొని నైజాము స్వంతసైన్యములను సంస్కరించి విడిచెను. వానిపై నాంగ్లేయాధికారులు నియమింపఁబడిరి. ఆంగ్లేయుల ప్రతినిధియగు మంత్రిచేతులలో సర్వశక్తుల నిడుకొనుటవలన హైదరాబాదునకును ఆంగ్లేయ రాజ్య మండలములకును విశేషభేదములేక పోయెనని తెలియఁ జేయు నంశములలో నిదియొకటని మాక్ఔలిఫ్ అను చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు.

1871 వ సంవత్సరమున పిండారీలతోఁ జేరుకొనిన మహారాష్ట్రులకును ఆంగ్లేయులకును మరల విగ్రహము ప్రారంభమాయెను. దానిలో సంస్కారమందిన నైజాము దండులు దీర్చినపనివలన వానిబల మిట్టిదిగదా యని బయల్పడెను. ఆవిగ్రహము ముగిసి నాగపురాధిపతియు హోల్కారును పేష్వాబాజీరావును ఓడింపఁబడిన తరువాత 1822 వ సంవత్సరమున హైదరాబాదు నైజామునకును నాంగ్లేయులకును మఱియొక సంధిజరిగెను. ఆంగ్లేయప్రభుత్వమువారు పేష్వాను జయించి యతని స్థానము నాక్రమించుటవలన నతనికి నైజాము గట్టుచుండిన చౌతుకప్పమును వీరికిని గట్టవలసిన వాఁడైనను ఈసంధివలన నది త్రోసివేయఁ బడెను. ఇంకను మహారాష్ట్రులు నైజాముపై మోపుచుండిన మామూలు

భారము లెవ్వియును దాము మోపుటలేదని కూడ వాగ్దానము చేసిరి. నైజామునకు సంవత్సరమునకు 6,26,375 రూపాయలు ఆదాయము నిచ్చు భూభాగము ఈసంధివలనఁ జేరెను.

రాజా చందూలాల్ గట్టివాఁడేగాని యతని రాజ్యాంగ పద్ధతులుమాత్రము పురాతనములు. జనులపై వేయఁబడిన పన్ను తప్పక బొక్కసము చేరుటయె పరమావధిగఁ గల వాఁడు గావున నతఁడు ఏలములు వైచి ఈయాభాగమున కింతింతయని నిర్ణయించుకొని ఆయాభాగములలోఁ బన్ను వసూలు చేసికొనుటకు కౌలుదారులను వదలుచువచ్చెను. యజమానికియ్యవలసినది పోఁగా ఎంతదొరికిన నంత రాఁబట్టుకొనుట కౌలుదారుని పని కావున నీపద్ధతి బహుస్వల్పకాలములోనె యసంతుష్టిని గలిగించి దుర్గతులను దెచ్చిపెట్టెను. పన్ను లిచ్చు ప్రజలు కౌలుదారుల యధికారుల యొక్క దురాగతములకు నిలువలేక త్రోవదోపుడులకును దిరుగుబాటులకును మొదలిడిరి. అన్యాయవర్తులగు కౌలుదారుల పక్షమువహించి దురదృష్టులును సుస్వభావులును నగుఁ బౌరులపైకి దాడివెడలి సైన్యాధికారులయిన ఆంగ్లేయులు వారల నన్యాయముగ నురుమాడవలసిన వారైరి.

## రాజ్యాంగ సంస్కారము.

ఇట్లు చందూలాల్ రాజనీతివలన దేశమునందు దుస్థితి ప్రబలుట సహింపలేక 1820వ సంవత్సరమున సర్ చార్లస్ మెట్



కాఫ్ను ఆంగ్లేయప్రభుత్వమువారు రెసిడెంటుగాఁ బంపిరి. అతఁడాంగ్లేయాధికారులను జిల్లాల కధిపతులను జేసి, ఆయామండలముల యందు మండలాధికారులును గ్రామాధికారులును రైతులనుండి వసూలు చేసికొనవలసిన మొత్తములను నియమించి న్యాయమగు కౌలులనియ్యనేర్పఱచెను. ఆంగ్లేయ మండలాధికారులు గడచినఫలములను బట్టియు సాగగుచుండిన ప్రదేశమును బట్టియు సాగుకాఁగల భూభాగమును బట్టియుఁ బన్నులను దీర్మానముచేసిరి. వీరుపక్రమించిన సంస్కారము లైదుసంవత్సరముల కాలము పరీక్షింపఁబడెను. వానివలన కౌలుదారులకును రైతులకును నిరంతర మగుచుండిన కలహము లణఁగిపోయెను. పన్ను వసూలుచేయుటకై దండుల విడియించు నాచారము దప్పిపోయెను. దేశము శాంతిమై వృద్ధిపొంద మొదలిడెను. రాజ్యాంగముపై ప్రతిసంవత్సరము రగులుకొనుచుండిన యసంతుష్టి పోయి యనురాగ ముత్పన్నముకాఁజొచ్చెను.

## ఋణవిమోచనము.

ఈసంస్కారములతో గూడ రెసిడెంటు హైదరాబాదు నైజాముగారి యప్పుల విషయమునందు శ్రద్ధఁజేసి రాజ్యాంగమునకు భరింపరాని ఋణముల బాధనుండి విమోచన మొసంగవలసివచ్చెను. బహుకాలముగ హైదరాబాదునందు స్థాపితమయి యుండిన పాల్మరు కంపెనీ వారు నైజామునకు సంవత్స

రమునకు 45 లక్షలవంతున నూటికి 25 వడ్డీచొప్పున నప్పిచ్చుచువచ్చి యుండిరి. ఈయప్పేల చేయఁబడెనో కారణము విశదముగఁ గానరాదు. నైజామును మోసపుచ్చు నుద్దేశముతో చందూలాలు చేసినపనియని మాత్రము గనుపట్టుచున్నది. ఎట్లైననేమి? దీనివలన నాకంపెనీవారు దక్షిణాపథమున నైజామునకంటెను ఆంగ్లేయులకంటెను బలవంతులయి యుండిరి. ఇదేవిధమున పురాన్‌మల్ అనువాఁడు బీరారును గుత్తకు తీసికొని యచ్చట ప్రాముఖ్యత గాంచియుండెను. రెసిడెంటు మెట్‌కాఫ్ గారాకంపెనీని, ఈపురాన్‌మల్‌ను నైజాముగారి సంబంధము నుండి తొలఁగించెను. నైజాము ఆంగ్లేయవర్తక సంఘమువారికిఁగూడ నప్పుపడియుండెను. ఈఋణములన్నియును దీర్చుటకు నాంగ్లేయప్రభుత్వమువారు నైజామునకు ఉత్తరసర్కారులకై గట్టుచుండిన పేష్కష్‌ను విడిపించుకొని రొక్కము కోటి అరువదియారులక్షల అరువదియారువేల ఆరువందల అరువదియారు రూపాయల నిచ్చిరి.

## నాజిర్-ఉద్దౌలా (1829-1857).

సికందరుజా రాజ్యాంగవిషయములలో బహుకాలము విశేషము జోక్యముపుచ్చుకొనుట మానివేసి మౌనమున కాలముగడపుచునుండి 1829 వ సంవత్సరము మేనెల 24 వ తేది పరలోకప్రాప్తిఁజెందెను. అతనికిఁదరువాత నాతనిపుత్రుఁడు నాజర్



ఉద్దౌలా సింహాసనమునకు వచ్చెను. ఆంగ్లేయప్రభుత్వమువారతనిని నైజామని ప్రకటించిరి. ఆప్రకటనాసమయమున జరిగిన రెండువిశేషములుమాత్రము గమనింపవలెను. అదివఱకును గవర్నరుజనరలు నైజాముగారికి వ్రాయుటలోఁ దన్ను 'నాయజ్‌మద్' అనఁగా 'కడుపేద' అను తక్కువను నిరూపించు పదములతో వర్ణించుకొనుచుండెడివాఁడు. నైజాముగారు గవర్నరుజనరలునకు వ్రాయునెడ 'మాబుదౌలత్' అనఁగా 'ప్రభువులమగుమేము' అను గౌరవపదముల నుపయోగించుచుండును. ఆయలవాటును మాన్పించుటకును గవర్నరుజనరలును నైజామును బరస్పరసామ్యము నెఱుకపఱచు మాటల నుపయోగించుటకును దగిన ఏర్పాటుచేయఁబడెను.

రెండవవిశేషము. ఆంగ్లేయప్రభుత్వమువారు నాజిర్-ఉద్దౌలాను 'పట్టభద్రుఁడవగునెడ' నీకు స్వాగతమనుటలో నితరసామంతప్రభువుల కేరికిని యుపయోగింపని 'పట్టభద్రత్వ'ము నుపయోగించుట.

## తిరిగిచందూలాల్ దుష్పరిపాలన.

నాజిర్-ఉద్దౌలా గద్దెనెక్కుట తోడనె తనరాజ్యము లోపలి రాజ్యాంగనిర్వహణమునంతయును దానె చేసికొనెదననియు మెట్‌కాఫ్‌వలన నియమింపఁబడిన ఆంగ్లేయమండలాధిపతులను దీసివేయవలసినదనియు గవర్నరుజనరలుగారికిఁ దెలియఁజేసెను. ఆంగ్లేయ ప్రభుత్వము వారును దానికి వల్లెయని

యంగీకరించిరి. మెట్‌కాఫ్‌చే నియోగింపఁబడిన ఆంగ్లేయాధికారులు తొలఁగింపఁబడిరి. నైజామునకు అంతఃపరిపాలనయందు సంపూర్ణ స్వాతంత్ర్య మీయఁబడెను. ఇట్టిస్వాతంత్ర్యమును గోరుటకు నైజామును బురికొల్పినవాఁడు అతని ముఖ్యమంత్రియగు రాజాచందూలాలని తోఁచుచున్నది. అతఁడు మొదట సర్వస్వతంత్రుఁడై రాజ్యభారము నిర్వహించుచుండి మధ్యకాలమున మెట్‌కాఫ్ ఏర్పాటువలనఁ గొంచెము శక్తిహీనత నందియుండెను. కావున మొదటిస్వాతంత్ర్యమును సంపాదించుకొనుటకు చందూలాలే నైజాము చేత నాంగ్లేయప్రభుత్వమువారిని ఆంగ్లేయాధికారులఁ దీసివైచునదని యడిగించెనని కొందఱభిప్రాయపడియున్నారు. ఎట్లైననేమి ఆంగ్లేయాధికారులుదమయాధీనముననుండిన జిల్లాలను ముఖ్యమంత్రి కొప్పగించి వెడలిపోయిరి. చందూలాల్ మరలఁ దన మొదటి యాచారములను విడువక రాజ్యమును నడుపమొదలిడెను. మరల మునుపటి విధముననే కష్టములు చూపట్టఁ దొడంగెను. గొప్పగొప్ప జమీందారులుగ నున్నవారి చర్యలుగూడ నాక్షేపణీయమయ్యెను. పన్ను వసూలుతగాదాలు మిక్కుటముగాఁ జొచ్చెను. 1835 వ సంవత్సరమున ఆంగ్లేయవర్తకసంఘపు డైరక్టర్లు గవర్నరుజనరలుగారికి ‘‘(నైజాము)రాజ్యములో బహుకాలముగ నెలకొనివచ్చుచున్న అల్లరులను, అరాజకమును దాము ఉదాసీనభావమునఁ



జూచుచుండలేమనియు అప్పటిముఖ్యమంత్రి న్యాయమైదిట్టమగు పరిపాలనకుఁ దగినఏర్పాటుల నొనర్పఁడేని ఆమంత్రినిమార్చి యవసరమగు నితరకార్యముల నెరవేర్చవలసియుండునని నైజామును ఆంగ్లేయప్రభుత్వమువారు నిర్బంధపెట్టవలసిన వారగుదు”రనియు నైజామునకుఁ దెలియఁజేయ వలసినదనియుత్తరువుఁ బంపిరి.

దీనిపై చందూలాల్ ఏఘ్రాయొక కొన్నిమార్పు లాంగ్లేయప్రభుత్వమువారు జోక్యముకలుగఁజేసికొని చేసిన బాగుండునని నుడివెను. కాని దానికి నైజా మియ్యకొనఁడయ్యెను.* అప్పుడు తాలూకుదారులు మున్నగు క్రిందియుద్యోగస్తులు దురాగతములకుఁ బోకుండఁ గనిపెట్టుటకు అమీను లనువారు నేమింపఁబడిరి. కాని వీరును విద్యలేని హీనజన్ములేగావున నీయేర్పాటువలన నదివఱకుండిన దుర్మార్గుల సంఖ్యకు నింకను గొందఱు చేర్చఁబడిరి. ఇట్లగుట కొలఁదికాలములోనే నైజామురాజ్యాంగము దురవస్థలయందు సంపూర్ణముగ మునిఁగిపోయెను. అప్పులు రానురాను మెండయ్యెను. ఆదాయము లేదాయెను. చందూలాల్ కొంతకాలము తనచాకచక్యమువలన రాజ్యభారము నిర్వహించెను. కాని హైదరాబాదునందలి సాహుకారుల కతనిపై నమ్మకముదప్పి తనుబాకీలు దమకిచ్చివేయ వలసినదని తొం

*ఒక చరిత్రకారుఁడు నైజాము ఒప్పుకొనకుండునట్లు చేసినదికూడ చందులాలే యనుచున్నాఁడు.

దర పెట్టఁ బ్రారంభించుట తోడనె యతనికూఁరి త్రిప్పుకొన వీలులేకపోయెను. కావున నతఁడు నైజామునకు రాజీనామా నిచ్చి 1843 వ సంవత్సరము సెప్టెంబరు నెల 6 వ తేది పదవిని వదిలి పెట్టెను.

### ఆంగ్లేయులపైకుట్ర.

ఈలోపుగ జరిగిన సంగతి నొక్కటి నిట వ్రాయవలసి యున్నది. 1839వ సంవత్సరమున నొకపెద్ద కుట్రయొకటి బయల్పడెను. ఉదయగిరి నవాబుముఖ్యుఁడుగ భరతవర్షమునందలి ప్రభువులనేకులు చేరి ఆంగ్లేయులను బారదోలుట కొక విస్తారమగు కుట్రఁ బన్నుచుండుటను అప్పుడు నెల్లూరునందు దండవిధాయకుఁడుగ (magistrate) నుండినస్టోనుహాసు అను నతఁడు గనిపెట్టెను. ఆకుట్రయందు నైజాముగారి సోదరుఁడగు ముబారిజ్—ఉద్—దౌలా గూడ కలఁడను హేతువుచే హైదరాబాదునందు రెసిడెంటుగారి యాధిపత్యము క్రింద ఐరోపియనులును ఉత్తమస్వదేశీయులును పంచాయతిగఁ జేరి యాకుట్రను గుఱించి గొప్ప విచారణ జరిపిరి. పదిమాసములు వ్యాయోగము నడచిన తరువాత ముబారిజ్-ఉద్-దౌలాయును నతని మిత్రులనేకులును ఉదయగిరి నవాబుతో నుత్తరప్రత్యుత్తరములు సలిపి, మతావేశపరవశులగు వహాబీల కుద్రేకమును బుట్టించి, యాంగ్లేయులను బారఁదోలు నుద్దేశముతోఁ గుట్రపన్ని ఆంగ్లేయప్రభుత్వమునకును



హైదరాబాదు ప్రభుత్వమునకును విరోధమగు విధమునఁ బ్రవర్తించిరని పంచాయతీదారులు అభిప్రాయపడిరి. వీరి నేర్పఱచిన యధికారులీ యభిప్రాయముతో నేకీభవించిరి. కావున ముబారిజ్-ఉద్-దౌలాను అతని మిత్రులను ప్రభుత్వమువారవసరమని తలంచినంతకాలము చెఱయందిడుట నిర్ణయింపఁబడెను. అతఁడు గోలకొండయందుఁ గారాగృహమున నుండఁగనె మృతినొందెను.

### అల్లరులు—కారణములు.

1841-42 సంవత్సరములలో నైజాముగారి దేశమందంతటను అల్లరులు మిక్కుటముగ నుండెను. వీనినణఁచుటకు తాలూకుదారుల సిబ్బందిలేమియుఁ బనికిరాకుండెను. దీనివలన నీయల్లరులు బలవంతమైనవని తలఁపరాదు. పరిశ్రమఁజేసిన సైనికు లొకకొందఱు ఈయల్లరుల కన్నిటికిని చాలియుండి రనిన నైజాముగారి మాండలిక సిబ్బంది యేగతియందుండినదియును విశదముగాఁగలదు. చందూలాల్ మంత్రియగుటతోడనె రెసిడెంటు జోక్యముకలుగఁజేసికొని సంస్కరించిపెట్టిన సైన్యముదప్పఁ దక్కినరాజ్యాంగము లన్నిటి యందును శైథిల్యము ప్రతిదినమును హెచ్చుచుండెను. కావున నల్లరి గాండ్రకు సమయము మిక్కిలిచక్కనిదిగ నుండెను. ఈ యల్లరు లెట్లుపుట్టుచుండెనో వీనికిఁగారకులెవ్వరో నిర్ణయించుట గష్టము. దక్షిణాపథమందలి మహారాష్ట్ర ప్రభువు లివ్వానికి

జనకులనుటకు గొన్ని కారణములు గలవు. (1) హైదరాబాదు నందీయల్లరి కాండ్రడ ప్రతినిధులు మహారాష్ట్రి బ్రాహ్మణులుగ నుండుట (2) మూకలనాయకులు పదభ్రష్టుండయి యుండిన నాగపురపు రాజగు అప్పాసాహెబ్ పేరుంబెట్టుకొని మెలంగుచుండుట(3)దక్షిణమహారాష్ట్రదేశమున నైజామునకుం జేరిన భాదామికోట నొకమహారాష్ట్రుండే పట్టుకొనుట. కొన్ని యల్లరులకు ముఖ్యమంత్రిగారో లేకున్న తప్పక వారిపుత్రుండో ఉత్తరవాదులని యొక చరిత్రకారుండు వ్రాయుచున్నాండు. *

## ఆంగ్లేయుల అభిప్రాయములు.

1843 వ సంవత్సరమున రాజాచందూలాల్ రాజీనామానిచ్చి పనినుండి తొలంగిపోయిన తరువాత నైజాము రాజ్యకార్యములను స్వయముగ నవలంబానుకొనెను. అంతకుం గొంచెము మునుపు చందూలాల్ ఆంగ్లేయాధికారులను మరల నేమించుట కొప్పుకొనినను, నైజా మంగీకరింపఁడయ్యెను. ఆ సమయమునం దాంగ్లేయవర్తక సంఘమువారి డైరక్టరులు గవర్నరు జనరలు గారి క్రిందివిధమున వ్రాసిరి:—

"(నైజాముగారి) రాజ్యాంగమునందు మనము దగిన సంస్కారములుచేయ మనకు శక్తినిచ్చుటకుం గావలసినది నైజాముగారు రాజ్యాంగవిషయములలో నేమాత్రము జోక్యము కలుగచేసికొనుట లేదను దృఢవాగ్దానమె. ఇదివరకె

* Brigg—The Nizam Vol. I P. 112



అతండు విశేషము జోక్యము కలుగంజేసికొను చుండుటలేదు. (పైవాగ్దానముచేసినచో) ముఖ్యమంత్రి సాహాయ్యార్థ మెప్పుడును రెసిడెంటుగారి వంకకే తిరుగంగలండు. నైజాముగారు తమ ముఖ్యమంత్రిపై నేలాటి యధికారమును చెల్లించకుండునను వాగ్దానము చేయుటకుం దగిన కాలము రాజ్యాంగనిర్వహణ కార్యముల కష్టమునలన నిప్పటికే వచ్చినది. రాకున్న నదియెంతో దూరములేదు. అట్టి ఏర్పాటువలన మనకుంగల యుద్దేశము లుచితరీతి నీడేరగలవు. ఆఏర్పాటులలోను నైజాముగారు కర్చులుపోంగా నిలువయుండు నాదాయమును గొనుచు రెసిడెంటుగారి బోధల ననుసరించియు నతనియనుమతిమీందను ముఖ్యమంత్రి యుపక్రమించు సంస్కారముల కడ్డుపడక ఆర్థిక విషయమున దేశము బాగుపడుటను గనిపెట్టియుండురీతి నొక నిబంధన నిర్మింపంబడిన విశేష లాభకారిగ నుండును"

దీనింబట్టి నైజాముగారు స్వయముగం బరిపాలింపం జూచుట వారికెంత సమ్మతముగ నుండెనో మనమెఱుంగం గలము. చందూలాల్ రాజీనామాను నంగీకారమిచ్చు నెడ నైజాము మఱియొక మంత్రిని శీఘ్రకాలములోనే ఏర్పఱతునని నుడివి యుండెను. నైజాము స్వతంత్రముగ రాజ్యాంగము నడపుటలో నతనికిం సాయముచేయ నీడగువారు గూడ నెవ్వరును లేరైరి. కావున నతండొక్కరుం డెంతపాటువడినను చందూలాల్ కాల

మున చెల్లాచెదరై చెడిపోయిన రాజ్యాంగ విషయములు త్వరితగతి కుదురుపడవయ్యెను.

నైజాముగారి సైన్యమునకయి నైజాము ఆంగ్లేయులకుఁ బ్రతిసంవత్సర మియ్యవలసిన పైకము బాకీపడియెను. రెసిడెంటుగా నుండిన జనరల్ ఫ్రేజరు ఆంగ్లేయ వర్తకసంఘమువారి బొక్కసమునుండి యియ్యదొడంగి గవర్నరుజనరలుగారి కాసంగతిం దెలుపుచు దాను భూమిని జామీనడుగలేదని వ్రాసి ముందు మరల నీరీతి సందర్భములే సంఘటిల్లిన నేమిసేయవలెనని యడిగెను. దానిపై గవర్నరు జనరలు దమబొక్కసమునుండి యిచ్చుచుండవలసినదనియుఁ దగిన కాలములో నీ యప్పులుదీర్చక పోయినచో నైజాము గొంత భూభాగమును దమస్వాధీనముచేయు నట్లేర్పఱచ వలసినదనియుఁ బ్రత్యుత్తర మిచ్చెను. రెసిడెంటుగారికిఁ దెలియఁజేసిన యీసంగతులు నైజాముగారికిఁ గూడఁ దెలుపఁబడెను.

నైజామొంటరిగ బహుకాలము పరిశ్రమచేసి చేసి కట్టకడపట 1846 వ సంవత్సరము నవంబరునెల 7 వ తేది సురాజ్-ఉల్-ముల్క్‌ను ముఖ్యమంత్రిగా నేమించుకొనెను. ఇతనికిని నైజామునకును సరిపడినదిగాదు. రెసిడెంటున కితనిపై నెక్కుడభిమానము. ఇతనిని నైజాముతీసివేయ నుద్యుక్తుండయ్యెను. ఆవిషయమున నతనికిని ఆంగ్లేయ ప్రభుత్వమువారికిని బహుదూరము చర్చ జరిగెను. తుట్టతుదకు సురాజ్-



ఉల్-ముల్క్ పనినుండి తీసివేయఁబడియెను. ఇతనిస్థానమునం దత్కాలమునకు ఆమ్‌జద్ ఉల్ - ఉముల్‌కును దరువాత షంష్ - ఉల్ - ఉమ్రాయును నేమింపఁబడిరి.

షంష్-ఉల్-ఉమ్రా మంత్రిత్వమువహించిన దైదుమాసములే గాని ఆపదవి నున్నంతకాల మతని ధర్మముల నతఁడు చక్కఁగ నెరవేర్చెను. అతఁడు ఆంగ్లేయులకు నైజామియ్యవలసిన యప్పుపైనగు వడ్డి నెలనెలకును ఇచ్చివేయఁబడుననియు అసలు వాయిదాలమీఁద సంవత్సరమున కైదులక్షలు దీర్పఁబడుననియు రెసిడెంటుద్వారా గవర్నరుజనరలుకు వ్రాయించెను. గవర్నరు జనరలుగారు నైజామునకుఁ దాముద్రవ్యమిచ్చినది స్నేహభావమున నిచ్చిరనియుఁ గావున నంతయునొక్కమారిచ్చుట కేర్పాటులు చేయవలసినదనియు, బ్రత్యుత్తరమిచ్చిరి. షంష్-ఉల్-ఉమ్రా మంత్రిగనున్నంతకాలము నెలనెలకగు వడ్డీమొత్తము మాత్రముదప్పక దీర్పఁబడుచుండెను. అయిన నతఁడు నైజాము వ్యయపరుఁడైనందునఁ దనకేమియుఁ జేయవీలు లేకపోయెనని విసుగుకొని తనపదవికి 1849 వ సంవత్సరము మే నెలలో రాజీనామా నిచ్చెను. షంష్-ఉల్-ఉమ్రా ముఖ్యమంత్రిగానుండి యన్నికష్టములకు నోర్చుకొని తన ధర్మమును నిరాతంకముగ నెరవేర్చినందులకు గవర్నరుజనరలుగారు తమ సంతసమును దెలిపిరి.

## సైన్య సమస్య.

ఆంగ్లేయులకు నైజామప్పువడుటకు ముఖ్యకారణము నైజాము సైన్యమేయనుట మాచదువరు లిదివఱకే గ్రహించి యుందురు. సాహాయ్యసైన్యమను నదొక్క టేర్పడుటయు అది మొదటమొదట నైజామునకు వలసినప్పుడు పంపఁబడు చుండుటయు దానికగువ్యయమునకు గాను ప్రారంభమున ఉత్తరసర్కారుల గుత్తలోనుండి కొంతభాగము చెల్లువడు చుండుటయు తరువాత ఉత్తరసర్కారులును దత్త మండలములును [1] ఆంగ్లేయులకు సంపూర్ణముగ నియ్యఁబడుటయు మున్నగు విషయములెల్లయు నిదివఱకే వ్రాయఁబడియున్నవి. ఆ నైజాము సైన్యమునకును ఈసాహాయ్య సైన్యమునకును సంబంధములేదనుట ముఖ్యముగ జ్ఞాపక ముంచుకొనవలెను. సాహాయ్యసైన్యము మొదటినుండియు సర్వమాంగ్లేయులదే. ఈనైజాము సైన్యపుఁ జరిత్రవేరు.

ఇది ప్రారంభమున బహుకాలమునఱకును నైజాము గారిదే. దీని కిసాహాయ్యముగ నాంగ్లేయుల స్నేహముఃవలన 1766వ సంవత్సరమున సాహాయ్యసైన్య మేర్పడెను. సాహాయ్య సైన్య మే సంధివలన నేర్పరుపఁ బడెనో ఆసంధివలననే ఆంగ్లే యుల కవసరమగు నప్పుడు ఈనైజాము సైన్యమున నిర్ణీత

1 కడప, బళ్లారి, అనంతపురము, కర్నూలు, జిల్లాలకు ఈపేరువర్తిం చుచున్నది.



మయిన కొంతభాగము పంపఁబడవలసి నట్లేర్పఱుపఁబడెను. ఈయొడంబడిక కనుకూలముగ నైజాము ఎల్లప్పుడును నడుచు కొన లేనందునను నైజాముసైన్యము ఆతని యధికారుల ఆధీనమునం దున్నంతకాలము అంగసంపూర్ణత నందకుండు టను బట్టియు ఆంగ్లేయపక్షపాతి యగు చందూలాల్ ముఖ్య మంత్రి యయిన తరుణమున నాంగ్లేయరెసిడెంటు ఈనైజాము సైన్యమును సంస్కరించి దానిపై ఆంగ్లేయాధికారుల నియో గించెను.[1] నాఁటనుండి ఆసైన్యము నందుండు ప్రతి సైనికు నకును అధికారికిని జీతమునకై ఒకవిధముగ రెసిడెంటు ఉత్తర వాదియాయెను. దానివలన నైజాము ఈసైన్యములకు ఇయ్య వలయు జీతముబత్తెముల నియ్యఁజాలని తరుణములలో ఆంగ్లేయ వర్తక సంఘమువారు దమబొక్కసమునుండి యియ్యఁ దొర కొని ఆమొత్తమును నైజాము లెక్కల కెక్కించుచు వచ్చిరి. ఇట్లేర్పడిన ఈసాహాయ్య సైన్యము నైజాము సైన్యములేగాక నైజామున కితరదండులు గూడ చిల్లరచిల్లరగ నుండెడివి.

వెనుక రెయిమండను ఫ్రెంచినాయకుని గూర్చియు అత నిచే నైజాముగారి యుత్తరువుమీఁద గూర్పఁబడిన దండును

1. బాఖిర్ జంగు 1902వ సంవత్సరము మార్చి నెలలో కర్జన్ప్రభువునకు వ్రాసిన యుత్తరములో నీసైన్యము సంస్కరింపఁబడి స్థాపింపఁబడుట నైజా మున కెఱుకయే లేదనుచున్నాఁడు. పూర్ణముగ సిద్ధమైన తరువాత నతనిముఖ్యమంత్రియు రెసిడెంటును దానివ్యయమును నైజాముపైఁ బెట్టిరనియు నుడు వుచున్నాఁడు.

గుఱించియు ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని వచ్చిన సంఘర్షణములవలన నది బద్దలగుటను గూర్చియు వర్ణింపఁబడియెను. ఆదండులకు సమకాలికముగను తరువాతను నైజాము వద్ద పేరువడసిన యరబ్బీలు, పఠానులు, మన్సబుదారులు, రోహిలాలు, సిక్కులు, తుర్కవారు మొదలగుబంటులు ఏబదివేల కుండెడివారు. వీరందఱును నైజాము స్వంతసిబ్బందిలోఁ జేరినవారు. వీరికి తేఁడె జీతముబత్తెముల నిచ్చుచుండెడి వాఁడు. ప్రప్రథమమున వీరుపయోగ కారులుగనుండుచు యుద్ధములలోఁ దమ యజమానునికి మహోపకారులుగ నుండిరి. కాని సాహాయ్య సైన్యమును నైజాము సైన్యమును జక్కఁగ నేర్పడిన తరువాత వీరికంత అనుభవానుకూలములు లేకపోవుట వలన వీరురాను రాను పొగరుబోతులై నైజామునకే అపకారులగు నంతస్థితికి వచ్చియుండిరి. కాని వీరలకియ్య వలసిన వేతనములు మాత్రము నైజామున కియ్యక దీరకుండెడిది. ఇట్లు వర్ణితమగు నీసందర్భములను బట్టియు నటనట సూచింపఁ బడిన ఇతర కారణములను బట్టియు నైజాము నార్థికస్థితి (Financial condition) పలుమారు ఆతనికి వ్యసనములు దెచ్చిపెట్టుచుండెను.

### ఋణప్రదాతలయొత్తిడి.

నైజాము ఆంగ్లేయ వర్తక సంఘమువారికి అప్పుపడియుండిన మొత్తము 1850 వ సంవత్సరము డిసెంబరు నెల 31 వ తేదికి లోపుగ నియ్యవలసినదనియు అట్లు చేయని



యెడల గవర్నరుజనరలు ఆంగ్లేయవర్తకసంఘమువారికి న్యాయమునడపుటకు వలసిన కార్యములకుఁ బూనవలసినవారగుదురనియు రెసిడెంటు నైజామునకుఁ దెలియఁజేసెను. 1850 వ సంవత్సరము ఫిబ్రవరి మాసము వఱకును కాలము గడచిపోయెను. అప్పటికిని నైజాము రాజ్యాంగవ్యవహారములయందు తగినమార్పులు గనుపించలేదు. కావున బహుకాలముగ నైజామునడవడిని గనిపెట్టియుండిన రెసిడెంటుఫ్రేజరు బీరారుసందలి స్థితిగతులను గుఱించి వ్రాయుచు "ఏమంత్రి యేర్పఱుపఁబడినను అతఁడు రాజ్యాంగ కార్యములను నెరవేర్చుటకు సంపూర్ణస్వాతంత్ర్యము గలవాఁడుగ నొనర్పఁబడవలెనని నైజామునకుఁ దెలియఁజేయుట ముఖ్యతమమనియెను. ఈవిషయమున జనరల్ ఫ్రేజరు నైజాముతోఁ గలిసి మాటలాడుటకు నుత్తరువుగోరెను. తాను సింహాసనారూఢుఁడయి నప్పుడు మంత్రుల నేరుకొను స్వాతంత్ర్యము తనకు గలదని అప్పటి రెసిడెంటు నుడివి యుండుటను నైజామాసందర్భమున జ్ఞాపకపఱచెను. దీనికి జనరల్ ఫ్రేజర్ వల్లెయని అప్పుడు పేష్కారుగానుండి దివానుపనులను గూడ అసమర్థతతోఁ జూచుకొనుచుండిన రాజారాం బక్షీగారిని దీసివేసినను దీసివేయుననియు లేకున్న వేరొక్కరుని దివానుపనికిమాత్రము నేమించుననియుఁ దలంచి తన సంభాషణమును ముగించెనఁట.

1851 వ సంవత్సరము ప్రారంభమాయెను. నైజామున కాంగ్లేయుల ఋణమును దీర్ప నియమితమయి యుండిన గడువు మీరిపోయెను. కావున రెసిడెంటు నైజామును జూచి యతనికి గవర్నరు జనరలుగారి యసంతుష్టిని తెలియఁజేసెను. ముఖ్యమంత్రిపదవికిఁ దగువాఁడు ఏర్పడకుండుటవలన రాజ్యమరాజకముగ నున్నదనియు నట్టియరాజకపుస్థితికి తాముమిక్కిలి వగచుచుంటిమనియు కూడ జనరల్ ఫ్రేజర్ ముఖమున గవర్నరు జనరలుగారు తెలియఁజేసిరి. నైజాము రాజ్యములోఁ గొంతభాగమును స్వాధీనము చేసికొని పరిపాలించి దానిమూలమునఁ దమ కతఁడు బాకీపడిన ధనము రాఁబట్టు కొనవలసినదేగాని యితర విధములఁ దీరదని రెసిడెంటు తెలియచేసెను. దానిని గవర్నరు జనరలును ఒప్పుకొనెను. కాని ఆ ఏప్రిల్ మాసమునందే గణేశరావు దివానుగ నియమింపఁబడెను. ఇతఁడసమర్థుఁడనుట బహు స్వల్పకాలములోనె విశదమయ్యెను. ఆంగ్లేయప్రభుత్వము వారికి రావలసిన పైకము ఇతని శక్తివలన వచ్చుటకల్లయని తెల్లమయ్యెను. అందువలన గవర్నరుజనరలుగానుండిన లార్డుడాల్ హౌసీ నైజాము బాకీపడిన మొత్తము తీరుటకై అతని రాజ్యమునఁ జేరిన బీరారును, అచ్చటినుండి షోలాపురము వఱకుం గల భూభాగమును, కృష్ణా తుంగభద్రల మధ్యప్రదేశమగు రాయచూరు మండలమును, సర్వాధికారములతోఁ దమకు నిచ్చి వేయవలసినదని నైజామునకు వ్రాసెను. సాధ్యమయినంత



దనుక పరిశ్రమఁ జేసి యీయవస్థ మూడకుండునట్లు చేసికొన నిచ్ఛగలవాఁడయి నైజాము 1851వ సంవత్సరము జూన్ మాసములో సురాజ్-ఉల్ ముల్క్‌ను రెండవమారు ముఖ్యమంత్రిగ నేర్పఱచికొని రెసిడెంటుతో ఋణమున నర్థభాగము వెంటనె తీర్పఁబడుననియుఁ దరువాత నక్టోబరు మాసాంతమునకుఁ దక్కిన యర్థభాగము దీర్పఁబడుననియు నొక్కిచెప్పెను. తన సైన్యమునకు నగు వ్యయములను గ్రమముగ నిచ్చుటకొఱకు కొన్ని తాలూకాల వసూలును ప్రత్యేకించి పెట్టితినని కూడ నుడివెను. దీనినంతయునువిని రెసిడెంటు మనస్సమాధానమునంది కొంత కాలము వేచియుండ నియ్యకొనియెను. ఆగస్టు 15 వ తేది నైజాము దనవాగ్దానము ననుసరించి మొదటికిస్తీని గట్టివేసెను.[1] అప్పటికి రు 32, 97, 702,లు బాకీయుండెను. ఆమొత్తమును దీర్చుట కేర్పడిన వాయిదా గడచి పోవుటతోడనే రెసిడెంటు ఆసంగతిని గవర్నరు జనరలునకుఁ దెలియఁజేసెను. నైజాము అప్పంతయుఁ దీరువవలయునను దీక్షతోనున్నవాఁడను నమ్మకము దట్టినందున గవర్నరు జనరలు నైజాముచేసిన వాగ్దానములకు సమ్మతించుచు కిస్తీలమీఁద పైకమును దీసికొనుట కంగీకరించెను. కాని కొంతభాగ మీయఁబడినందునఁ దక్కినభాగ మీయకున్నను తొందరలేదని నైజాము దలంపకుండును గాత

1. ఈ కిస్తీకిగాను నైజాము దన యాభరణములను ఇంగ్లాండునఁ గుదువఁ బెట్టించెను.

మని దృఢముగ రెసిడెంటు నైజామున కెఱుకపఱచి యుండుట దనకు సమ్మతమేయని తెలిపెను. తరువాతఁ గొంతకాలము వఱకును వివరింపవలసిన విశేషము లేమియు లేవు.

1852వ సంవత్సరము నవంబరు నెలలో రెసిడెంటు ఫ్రేజరు రాజీనామా నిచ్చెను. కర్నల్ లో అతనిస్థానమున విచ్చేసెను. ఇతఁడు నైజాము సైన్యమునకుఁ బ్రతిమాసమును ఆంగ్లేయప్రభుత్వము వారిబొక్కసమునుండి యేజీతములిచ్చి తీరవలసివచ్చెను. మూఁడు నెలలలో 1853వ సంవత్సరము మార్చిలోపల నైజాముగారి యప్పుమరల నలువదియైదులక్షులయి యుండెను. గవర్నరు జనరలుగారు రెసిడెంటునకు నైజాముయొక్క యంగీకారమును స్వీకరించుటకయి క్రొత్తసంధినొకదానిని చిత్తువ్రాసి యంపిరి. కర్నల్ లో నైజామునకద్దానిని వినిపించి యతనితోఁ జర్చింపనేర్పఱచుకొనెను. ఈసందర్భమున నైజామునకును అతనికిని కొంచెము కఠినమగు సంభాషణలును ఉత్తరప్రత్యుత్తరములును నడువవలసివచ్చెను.

అప్పుడు రెసిడెంటు తెలియపఱచిన సంధిషరత్తులలో బీరారుమున్నగు ప్రదేశమును శాశ్వతముగ నాంగ్లేయప్రభుత్వమువారికి నైజాము ఇచ్చివేయవలయు ననునది యొకటి. రాజ్యములో నేమాత్రమైనను ఇతరుల కిచ్చుటగాని ఒకప్పుడు తనకయి ధైర్యముతోఁ బోరాడిన బంటులను దనసామీప్యము నుండి తొలఁగించుటగాని ఱేనికి మహావమానకరకార్యములని



నైజాముగారి గట్టినమ్మకము. కావున నీరెంటికిని తానియ్యకొనఁజాలనని నైజాము రెసిడెంటుతో నీసంధివిషయమయి చర్చించుటలోఁ బలుమారు తీవ్రముగ నుడివెను. ఈచర్చకయి రెసిడెంటు నైజాములును, రెండుపక్షముల ప్రతినిధులును అనేకపర్యాయములు గలసి సౌమ్యముగను ఆగ్రహముగను, తిన్నగను గట్టిగను, భూషించుకొనుచును ధిక్కరించికొనుచును సంభాషించిరి. నైజాము ఆసంభాషణయందు మహారాష్ట్రులును టిప్పూసుల్తానును లోఁబడి పోవుటతోడనె తనసైన్యమున కవసరము దీరిపోయెనని యొకపర్యాయమును, దనకా సైన్యము ప్రస్తుత ముండవలసినదే యని మఱియొకతరుణమునను, ఆంగ్లేయులు డబ్బు సంపాదించుటకుఁ బ్రయత్నించువారే యని యొకవేళను, దనకు సామంతుఁడుగనుండిన కర్నాటకపు నవాబునుండి ఆప్రదేశము లాగుకొనఁబడినపుడు తనభాగము దనకియ్యఁబడలేదని మఱియొకవేళను, నిలువయుండిన అప్పులకుఁ దన మంత్రులేగాని తానుత్తరవాది కాఁజాలనని యొకమారును, నాలుగుమాసముల వ్యవధినిచ్చిన తాను భారముపై మోపికొని అప్పటికి బాకీపడుమొత్తమును దప్పక ఇత్తునని మఱియొకతూరియు, నిప్పగిది బహుభంగుల డోలాయమానమానసుఁడై నుడివి కట్టకడపటికి ఆంగ్లేయప్రభుత్వము వారడిగిన ప్రదేశమును ఆంగ్లేయులకునుఁ దనకుమున్ను మంత్రిత్వము సలిపిన షంస్-ఉల్-ఉమ్రా

కును గొంచీగా అనుభవమున కిచ్చెదనని యుపక్రమించెను. అదియు కుదిరినదికాదు. తుట్టతుదకు 1853వ సంవత్సరమున కొద్దిమార్పులతో రెసిడెంటు'లో' మొదటఁదెచ్చి యిచ్చిన చిత్తు ననుసరించియే సంధిజరిగెను.

### తీర్మానపుసంధి (1853).

ఈసంధివలన నైజాముసైన్యము సంపూర్ణముగ నాంగ్లేయుల యధీనము క్రిందికే పోయెను. దానికి 'హైదరాబాదు కంటింజెంటు సైన్యము' అను పేరిడఁబడెను. దానికగు వ్యయమున కయ్యెను, అప్పుపై వడ్డీకొఱకును, కొన్ని ఇతర కర్చులకును నైజాము ఆంగ్లేయప్రభుత్వమువారికి బీరారు మున్నగు ప్రదేశములను సర్వస్వతంత్రములతోఁ బరిపాలింప నిచ్చెను. కాని వారుమాత్రము ప్రతి సంవత్సరమును అతనికి దానిని గుఱించి న్యాయమగు లెక్కలనుజూపి కర్చులు పోఁగా మిగతపైకమును అతని బొక్కసములోనికిఁ గట్టునట్లేర్పఱుపఁబడెను. 1800 సంవత్సరపు సంధిననుసరించి నైజాము ఆంగ్లేయుల సాహాయ్యార్థమయి యుద్ధసమయములఁ గొంతసైన్యమును బంపవలసి యుండెనుగదా! "హైదరాబాదు కంటింజెంటు సైన్యము" ఏర్పడి ఎల్లప్పుడును సిద్ధముగ నుండునట్లు స్థిరపడినందున ఈషరత్తు రద్దుచేయఁబడెను.



ఈసంధిజరిగిన తరువాత నాలుదినములకు దీనికై మిక్కిలి పాటుపడిన నైజాముగారి మంత్రియగు సురాజ్-ఉల్-ముల్క్ పరలోకప్రాప్తిఁ జెందెను. నైజామప్పుడు 'మహాసర్‌సాలార్ జంగు' అను బిరుదుపేరుగల మీర్-తురాబ్-ఆలీ అను సురాజ్-ఉల్-ముల్కు అన్నకుమారుని మంత్రిగా నియమించెను.

సర్‌సాలార్‌జంగు 1828 సంవత్సరము జనవరినెల 2-వ తేది జన్మమందెను. 1847 వ సంవత్సరమున అనఁగా పందొమ్మిదేండ్లప్రాయముననే యితఁడు కమ్మంమెట్టుకు తాలూకుదారుగ నేమింపఁబడెను. ఎనిమిదినెలలకాలము లోపల నాపనికివలసిన జ్ఞానమునుసంపూర్ణముగ సంపాదించెను. 1853వసంవత్సరమున పినతండ్రిమరణానంతరము ముఖ్యమంత్రిగ నాజర్-ఉద్-దౌలా వలన నేమింపఁబడినతరువాత నితఁడు గనుపఱచిన రాజ్యభార నిర్వాహణశక్తివలన నీతనిపేరాచంద్రతారార్కముగ హైదరాబాదు చరిత్రమునందు వెలయుచున్నది.

### రాజ్యస్థితి.

సాలార్జంగు సచివత్వమునకుఁ బూనునప్పటికి నైజాము రాజ్యము మహాదుర్దశలలో మునిఁగి యుండెనని చెప్పుటకు 1853 వ సంవత్సరపు సంధికంటెను వేరొండు నిదర్శన మవసరములేదు. ఆంగ్లేయప్రభుత్వమువారి కియ్యవలసియుండిన ఋణమాసంధివలన రద్దుపడియుండినను చిల్లరసైన్యములకు బహు

కాలముగ జీతము అప్పుపడుచునే వచ్చియుండెను. స్థానిక వణిక్కులకు నైజాముప్రభుత్వమువారు బాకీయైన మొత్తము మిక్కిలి గొప్పదిగనుండెను. మన్సబ్‌దారులకును జీతముబత్తెములనిచ్చుటకు పన్నులువచ్చుమార్గములు విశేషము గన్పించినవికావు. చిల్లరసైన్యముల ప్రతినిధులగు అరబ్బీ జమేదారులును సాహుకారులును అప్పటికాలమునకు హైదరాబాదునందు ప్రముఖులుగ నుండిరి. పన్నులును బలములును జమేదారులచేతులలోను నైజాము రాజ్యనిర్వహణమునకు ముఖ్యమగు నార్థికశక్తి సాహుకారులచేతులలోను జిక్కియుండెను.

## ఆర్థిక సంస్కారములు.

సాలార్‌జంగ్ తనసత్యసంధతచేతను కార్యదీక్షచేతను జమేదారులను, సాహుకారులను ముందు లోఁబఱచుకొనెను. అధికారమునకు వచ్చిన కొన్నినాళ్లలోపుగనె నైజాముగారి బంధువులకును చిల్లరసేనలకును సేవకులకును నెలజీతముల నిచ్చుటయు, తాలూకుదారులను నియోగించుటయుఁ దొలఁగించుటయు, లెక్కలను బరీక్షించుటయు, వేతనములను దగ్గించుటయు, అవసరమగునెడల క్రొత్తగ దండుల నేమించుటయు, మున్నగు కార్యములుచేయుటకు స్వాతంత్ర్యమును ఇతఁడు నైజామునుండి సంపాదించుకొనెను. అవిధేయత సూపినచో సర్కారువారికి— అనఁగా నైజామునకు— చేరిన దివానిశాఖ లోనివారినిగాని సైనికశాఖలోని



వారినిగాని శిక్షించుటకుఁ గూడ నితనికి అధికారమియ్యఁబడెను. అరబ్బీలబలమును స్వాధీనముచేసికొనుట సాలార్‌జంగ్ యుపక్రమించిన మొట్టమొదటి సంస్కారము. రాజ్యాంగపుశక్తిని నిర్మూలము సేయుచుండిన దండుగ దండులను బగులఁ



మహాసర్ సాలారుజంగు.

గొట్టుటకుఁ గూడఁ బ్రయత్నములు ప్రారంభింపఁబడెను. తాలూకుదారులందఱును దమతమ ఇలాఖాలోని అరబ్బీలను, రోహిలాలను, పఠానులను వారివారికి చెందవలసిన ద్రవ్యము

నిచ్చివైచి తఱుమవలసినదని యుత్తరువాయెను. అయిన నీయుత్తరువులు మొదట మొదట బహుస్వల్పముగ చెల్లించఁబడెననినచో నొకయాశ్చర్యముగాదు. సర్ సాలార్ జంగు మఱియొక ఏర్పాటునుగూడఁ జేసెను. అరబ్బీలకును రాజ్యములోని యితరప్రజలకునుగల లావాదేవీలెక్కలను జనులకు సన్యాయము జరుగకుండఁ దీర్చుటకుఁ దన నగరునందే యొక క్రొత్తన్యాయస్థానము నేర్పఱచెను. ఈన్యాయస్థానము ఆరంభమునుండియు మిక్కిలి యుపయోగకారి యయ్యెను. దీనివలన నియ్యఁబడిన తీర్పులన్నియు నక్కాలమున ప్రముఖులుగా నుండిన ఇద్దఱు జమేదారులున్యాయమని యొప్పుకొనుచు వచ్చిరి. దుర్మార్గులయి తిరుగఁబడిన అరబ్బీలను బందీకరించుటకు (arresting) ఈజమేదారులకు ముఖ్యమంత్రిగా రధికార మిచ్చిరి. అట్లు బాదీకరించుటలో నవసరమని తోఁచినయెడల నీజమేదారు లెంతటి పనినైనను జేయవచ్చునని యాజ్ఞ. కావున వారు సల్ సాలారుజంగునకుఁ జేసిన సాయము అంతింతయని చెప్పనవసరములేదు. ఇట్లు అరబ్బీలపై సర్వాధికారులగు జమేదారులను దోడుచేసికొని సర్ సాలారుజంగు అదివఱకు అరబ్బీలచేతులలోనికిఁ బోయియుండిన జమీనులను మెల్లమెల్లఁగ రాఁబట్ట మొదలిడెను. ఇందుఁ గొన్ని వేరువేరు వ్యక్తులవలన కుదువ పెట్టఁబడినవి. మఱికొన్ని సర్ సాలారునకుఁ బూర్వముండిన మంత్రులచే అరబ్బీలకు సర్కారువారియ్యవలసియుండిన అప్పులకై యిచ్చివేయఁబడినవి. వీనిని



మరల సంపాదించుటకై సర్ సాలారుజం గుపయోగించిన పద్ధతిలో నేమాత్రము న్యాయవిరోధము లేదు. ఆతఁడు సర్కారు బొక్కసమునుండి యియ్యఁగలిగి నంతపైకమును అరబ్బీల బాకీల కిచ్చివేయుచు నిలువయుండిన మొత్తములకు సాహుకారులనుజామీను ఇచ్చుచువచ్చెను. ఈసంస్కారముల నుపక్రమించుటలో సర్ సాలారుజంగుపడినకష్టములపరిమితి నిట వర్ణించుట అనవసరము. అయిన నితని యోరుపువల్లను కార్యసాధనాశక్తివలనను అవన్నియును సూర్యుని యెదుట నంధకారములువలె నదృశ్యములాయెను. 1856 వ సంవత్సరమున నతఁడు హైదరాబాదుసంస్థానమునందు జరుగుచుండిన బానిసవ్యాపారమును చట్టముచే నిలిపివేసెను.

## అఫ్ జుల్ - ఉద్ - దౌలా (1857-1869).

పైనిఁ జేర్కొనిన సంస్కారములు గాక సర్ సాలారు అంతఃపరిపాలనయం దింకను విశేషమగు గొప్పమార్పులు చేయవలసినవాఁడై ఆ ప్రయత్నములయం దుద్యుక్తుఁడయి యుండెను. ఇట్లుండ 1857 వ సంవత్సరపు మహావిప్లవము తటస్థించెను. ఉత్తర హిందూస్థాన మంతయును ఆవిప్లవ దవానలంబునఁ బడి మండుచుండెను. దాని యుష్ణము దక్షిణమునకుఁ బ్రాకి హైదరాబాదును నావరించుకొని నైజామునుగూడఁ దనపక్షమునఁ జేర్చుకొనినచో నంతయుఁ బోయిన దనుకొనవలసినదేయని హైదరాబాదునందు రెసిడెం

టుగానుండిన కర్నల్ డేవిడ్సన్ అనునతఁడు గవర్నరుజనరలు గారికి వ్రాసెను. ఈగడబిడలు జరుగుచుండఁగనే నైజాము నాజర్ - ఉద్ - దౌలా మృతినొందెను. అతనికుమారుఁడగు అఫ్జల్ - ఉద్ - దౌలా నైజాముపట్టమునకు వచ్చెను.

## మహావిప్లవవిచ్ఛేదనము.

అఫ్జల్-ఉద్దౌలాసింహాసన మెక్కినప్పటికి దేశమంతయును ఆంగ్లేయులపై తిరుగుబాటులతోడను తిరుగుబాటుల వార్తలతోడను నిండియుండుట ఇదివఱకు వ్రాయఁబడిన అంశములను బట్టియే విశదముగాఁ గలదు. క్రొత్తనైజాము గద్దెనెక్కిన కొన్నిగంటలలో ఢిల్లీనగరము తిరుగుబాటు సేనలచేఁ జిక్కెననువార్తవచ్చెను. హైదరాబాదునందును తిరుగుబాటుపరమున నుత్సాహము మెండుగ నుండెడిది. ఔరంగాబాదునుండి హైదరాబాదునకువచ్చి చేరియుండిన యిద్దఱు తిరుగుబాటు సైనికులను సర్ సాలారుజంగు బందీకరించి ఆంగ్లేయులకు ఒప్పగించినందున అచ్చట నల్లకల్లోలము ప్రారంభమాయెను. తుదకు రెసిడెంటుగారుండుప్రదేశము తిరుగుబాటు పరులచే ముట్టడింపఁబడెను. కాని ముఖ్యమంత్రిగారి దూరదృష్టివలన నిట్టి యుత్పాతముల నణఁచివేయుట కిదివఱకే ఏర్పాటులు జరిగియుండెను. కావున తిరుగుబాటు హైదరాబాదునందు కొంచెమైనను బలముతో నిలిచినది కాదు. దానికి ముఖ్యకారకులగు నిద్దఱును పట్టుపడిరి. పారిపోవఁ



బ్రయత్నించుటలో నొక్కఁడు కాల్చి వేయఁబడెను. రెండవ వాఁడు ద్వీపాంతరవాసశిక్షనందెను. ఇప్పగిది బహుజాగరూకతతో సర్ సాలార్ జంగ్ హైదరాబాదునందు తిరుగుబాటులు లేకుండునట్లు కాచి విప్లవదుఃఖము విశేషము దటస్థింపకుండునట్లొనర్చెను. నైజాముగారి ముఖ్యమంత్రి నైజామునకును ఆంగ్లేయులకును గల మైత్రినిదలంచి ఇంతపరిశ్రమ చేయుచుండినను నైజామును మాత్రము ఆంగ్లేయులు బహుజాగరూకులయి కనిపట్టియుండిరి.

విప్లవపక్షమున నుండినట్లెన్నఁబడిన ఒకఖైదీ మైసూరునందు కమీషనరు గారి యెదుట వాఙ్మూలములోఁ గొన్ని సంగతులు నుడివెనఁట. వాని మాటలలో గొన్నిటిని ఆంగ్లేయప్రభుత్వమువారు హైదరాబాదు రెసిడెంటునకు వ్రాసిపంపి నైజామునకు తిరుగుబాటునకగునూహలు లేవాయని పరిశీలింపమనిరి. దానిపై రెసిడెంటు తాను నైజామేమాత్రమును సందేహపడుటకు వీలులేనంతటి సూక్ష్మమగు విధమున నతనిచర్యలను జక్కఁగ పరిశోధింపించెననియు, అతనియొద్దకు విప్లవపక్షులగువారు వచ్చి తమ యుదంతము నంతయును జెప్పుకొనిరనియు; అద్దానినంతయును విని అతఁడు ఆంగ్లేయప్రభుత్వము వారికి విరోధమగు నేకార్యమునందును జొరనియ్యకొనలేదనియుఁ బ్రత్యుత్తరము వ్రాసెను.[1]

1. Frazer—the Nizam, Our Faithful Ally.

ఈసందర్భమున రెసిడెంటు నైజాము సైన్యమును గూడ మిక్కిలి చాతుర్యముతో నుపయోగించుకొనెను. హైదరాబాదునందా సైన్యమును నిలువనిచ్చినచో నుద్యోగరాహిత్యమున నది ఏవేనియల్లరులకు మూలము గావచ్చునని తలంచి యద్దానిని ఉత్తరహిందూస్థానమున విప్లవకారుల నణఁచుటకై ఆయత్తపఱచి పంపివేసెను. అచ్చట నీసైన్యము ఆంగ్లేయులకు మహోపకార మొనర్పఁగలిగెను. ఈ ప్రకారము ప్రాణము దీసెదమని ప్రతిపక్షులు పలుమారు జంకించుచుండినను వెనుదీయక నైజాముగారును నైజాముగారి ముఖ్యమంత్రియును, మహావిప్లవము జరుగుచుండు నెడకుఁ దరలి పోయి యుద్ధరంగమున వెనుకంజ వేయక నిలిచి నైజాముగారి సైనికులును, ఈవిపత్సమయమున నాంగ్లేయప్రభుత్వమువారికి ఉత్కృష్టసాహాయ్యం బొనర్చిరి.

### విప్లవవిచ్ఛేదనా ఫలితములు.

ఇట్లు సాలార్జంగు కలహకారుల నిర్మూలించుట వలన గొందఱికి కష్టముగా నుండెను గాఁబోలు. దీనివలననె తిరుగుబాటంతయు నణఁగిపోయిన తరువాత 1859వ సంవత్సరమున నొక విప్లవపక్షపాతి సర్ సాలారు జంగును రెసిడెంటును గలిసిపోవుచుండ వారిరువురిపై గుండు పాఱించెను. దైవవశమున నది వీరికి తాఁకినదికాదు. హత్యను ప్రయత్నించిన ఆదురాగతుఁ డచ్చటనె మంత్రి యనుచరులచే ఖండింపఁబడెను. 1861 వ సంవత్సరమున నైజాముయొక్కయు సర్ సా



లారుజంగుయొక్కయు స్నేహమును ప్రేమను భక్తిని అంగీకరించుచు వారికి గవర్నరుజనరలుగారు బహుమతులనంపిరి. అప్పుడు చేతికిచ్చిన బహుమతులవెల ఇంచుమించుగ లక్షరూపాయీలు. అదివఱకు నైజాము ఆంగ్లేయులకప్పుపడిన ఏబదిలక్షలు రూపాయలును రద్దుచేయఁబడియెను. ఇంతియెగాక నైజాముచే నాంగ్లేయుల కదివఱకియ్యఁబడియుండిన రాయచూరు నల్దుర్గము ధారసియో జిల్లాలు తిరిగి అతనికి మరల్చఁబడెను. తిరుగుబాటు చేసిన వారలలో నొక్కఁడగు షోలాపూరు రాజుగారి సంస్థానము గూడ నైజామున కప్పగింపఁబడెను. నైజామునకు నైట్ గ్రాండుకమాండర్ ఆఫ్ది స్టారు ఆఫ్ ఇండియా' యను బిరుదొసంగఁబడెను. సరసాలారుజంగునకును ఉచితరీతిని బహుమానము లర్పింపఁబడెను.[1]

### గ్రిబ్బిల్ అభిప్రాయములు.

ఈ బహుమానములను గుఱించి జె. డి. బి. గ్రిబ్బిల్ అను చరిత్రకారుఁ డీ క్రిందివిధమున వ్రాయుచున్నాఁడు:—

" 1853 వ సంవత్సరమున మనకు దత్తమయిన రాయచూరు మండలమును దిరిగియిచ్చితిమి. ఇదిమన యౌదార్యమువలన నైనదనుట సమంజసముగా నుండదు. నైజాము సైన్యమునకగు వ్యయమునకై ఆప్రదేశము ఇయ్యఁబడి

1. ఈబహుమాన విషయములన్నియు 1860 వ సంవత్సరపు సంధియందుఁ జేర్పఁబడినవి.

యుండెను. బీరారుమండలముయొక్క యాదాయముమాత్రమె అవ్యయమునకు వలసిన ద్రవ్యమును సమకూర్చుటేగాక ఇంకను ఎక్కుడుధనము నిచ్చుచుండెను. భారతవర్షమునందు (స్వదేశ ప్రభువులచే నాంగ్లేయులకు) ఒప్పగింతలు చేయఁబడిన ప్రతి మండల విషయమునను ఒప్పగించునెడ వేయంబడు వరుంబడి లెక్కలు మిక్కిలితక్కువగ వేయఁబడుటయు, ఒప్పగింత జరిగిన వెంటనె సర్వేసెటల్మెంటులు నడుపఁగాఁ దస్తూలమున ఛపావణిసాగు విశేషము బయల్పడుటయు సర్వసాధారణములు. కాఁబట్టి రాయచూరు మండలము 1853 వ సంవత్సరపు సంధి షరత్తుల పూరీకరణమునకు అనవసరమయియుండెను. అందుచే నాస్వల్ప భూభాగమును నైజామునకు మరల్చుట న్యాయానుకూలము మాత్రమే.

" 1853 వ సంవత్సరపు సంధి ననుసరించి మనకు నొప్పగింపఁబడిన సీమలవరుంబడిలో ప్రతిసంవత్సరమును నిలువకాఁ గలుగు ద్రవ్యమును ఏయప్పుదీర్ప వినియోగింపవలసినదని నిర్ణయింపఁ బడియుండెనో ఆ ఏబదిలక్షలఋణమును మన్నించి రద్దుపఱచితిమి. ఈకార్యముమనము నైజామునకౌదార్యము సూపితిమని దప్పక తోఁపింపఁజేయుచున్నది. కాని కొన్ని విషయములను మనము మఱువక జ్ఞాపకమునకు దెచ్చుకొనవలెను. మనకొప్పగింపఁబడిన సీమలు మనపరిపాలనక్రిందికి వచ్చియుండిన ఏడుసంవత్సరములుగ, సంధి ననుసరించి ప్రతిసంవత్సరమును



నైజామునకు మనము లెక్కలు చూపవలసినవారమే మైయుండియు, ఆసీముల ఆదాయవ్యయ పట్టికలమాటయె ఎత్తికొని యుండలేదు. 1860 వ సంవత్సరమున రాయచూరుమండలము నైజాము సైన్యవ్యయములకయి అవసరముగాదని మనమంగీకరించియేయుంటిమి. కావున నంతకుఁ బూర్వము గొన్ని సంవత్సరములు రాయచూరు మండలాదాయము(సుమా రిరువదిలక్షలరూపాయిలు)మనచేతులలో నుండిపోవుటవలన నేబదిలక్షలురూపాయిల ఋణమునం దెక్కుడు భాగము తీరిపోయి యుండెననియే చెప్పనొప్పును. ఇంతమాత్రమెకాదు. హైదరాబాదు సంస్థానమువారు మనకు గోదావరీతీరమునఁ గొన్నితాలూకాలిచ్చెదమని యంగీకరించిరి. వానినుండి సంవత్సరాదాయము రెండుమూఁడులక్షలు.[1] ఇది నూటికి నాల్గువంతున వడ్డీయని యెన్నుకొనినచో నట్లియ్యఁబడిన తాలూకాలే పూర్ణఋణమును దీర్పఁగల్గినవి.

"మనము ఇచ్చిన మఱియొకవరమేమన హైదరాబాదుకు షోలాపూర సంస్థానమును వశపఱచుట. షోలాపురము హైదరాబాదుకు లోఁబడియుండిన ఒకచిన్నసంస్థానము. దానిరాజు

1. ఈ భూభాగమునుండి వసూలగు పన్ను మొత్తము సంవత్సరమునకు రు 8,20, 833-13-5 అని 1860-61 సంవత్సరపు బీరారుమండలపు రిపోర్టులో వ్రాయఁబడినది. గ్రిబ్బిల్ కర్చులు దీసివేసినిక రాదాయమును లెక్కించిరని ఊహింపవలసియున్నది.

1857 వ సంవత్సరపుఁ దిరుగుబాటునందుఁ గలిసికొనెను. దాని వలన షోలాపురమును సాధించుటకు మనసైన్యములు వెడల వలసి వచ్చెను. అతఁడోడింపఁబడిన మీఁదట అతనిరాజ్యము మనస్వాధీనమయ్యెను. అతనికి నైజాము యజమానుఁడైనందున ఆతనితిరుగుబాటు మనయెడల నెంతయొ నైజామునెడలను నంతయె. ఏదెట్లున్నను తిరుగుబాటునకుఁ బూర్వము షోలాపురము వలన మనకు నేలాటి ఆదాయమును ఉండినదిగాదు. నైజాము మనకు సహాయుఁడుగ నుండినందున అతని సామంతుని దయిన షోలాపురమును మన మాక్రమించుకొనుట కేలాటి న్యాయాధారమును ఉండియుండదు.

"నైజాముగారు మన యెడల గనుపఱచిన విశేషభక్తిని మెచ్చుకొనుచు 1860 వ సంవత్సరమున మనమతనికి నిచ్చిన బహుమానముల [1]నిట్లు విమర్శించిపరిశీలించినచో మనమౌదార్యము చూపితిమని డంబము చెప్పికొన వీలులేదు. హైదరాబాదు సంస్థానమునకు మొదట స్వంతములయియుండిన వానిని మనము మరలనిచ్చితిమి."

1. లక్షరూపాయిల విలువగల వస్తువులు బహుమానము లియ్యఁబడెనని ముందువ్రాయఁబడెను. వానికిఁ బ్రతిబహుమానములుగ రెసిడెంటునకును ఇతరాధికారులకును నైజాము 90,000 రూప్యములు వెలగల ఆభరణముల నిచ్చెనని ఫ్రేజరు వ్రాయుచున్నాఁడు.



ఈ బహుమానములు సర్ సాలారుజంగు సంస్కారములను నిరభ్యంతరముగ నెరవేర్చుటకుఁ దోడ్పడెననుట నిర్వివాదాంశము. సర్ సాలారుజంగు ఉపక్రమించిన సంస్కారము లొక కొన్ని ఇదివఱకే వ్రాయఁబడియెను. అవి యన్నియు నార్థిక సంస్కారములనియును దెలుపఁబడియె. అంతఃపరిపాలనా విషయమున సాలారుజంగ్ చేసిన మార్పులె నేఁటికిని మన్నింపఁ బడుచున్నవి. హైదరాబాదు సంస్థానమంతయును పదునారు జిల్లాలుగ విభజింపఁబడెను. నాలుగు జిల్లాలుచేరి ఒకసుబాయని యేర్పరుపఁబడెను. ప్రతి సుబాకును నొక సుబేదారుఁడు నేమింపఁబడెను. అతనిక్రింద జిల్లాపై అధికారియగు తాలూక్ దారుఁడు నియమింపఁబడెను. అతని సాహాయ్యులే రెండవ మూఁడవ నాల్గవ తాలూక్ దారులని పిలువఁబడుచున్నారు. ప్రతితాలూకాయందును తహశీల్ దారు లేర్పఱుపఁబడిరి. తహశీల్ దారు పదము వివరించుటనవసరము. జిల్లాయధికారులే న్యాయాధిపతులుగ నుపకరింపవలసినదని తీర్మానింపఁబడెను. ఇది అనానుకూలమును అనర్థదాయకమును నగు తీర్మానమే యనియొప్పుకొనక తీరదు. ఇందు విషయమై హైదరాబాదు సంస్థానమున సంస్కారము జరుగవలసియే యున్నది. కాని సర్ సాలారుజంగ్ ఈఏర్పాటుచేయుటయందొక విషయము మనస్సున నుంచికొనినవాఁడు. న్యాయతీర్మానము బీదలసాదలకు విశేషము వ్యయములేకుండజరుగ

వలెనని అతని మతము. న్యాయవిచారణ ఆఙ్గ్లేయపరిపాలిత దేశముల జనులకు మిక్కిలి వ్యయమును గలుగఁ జేయుచున్నదనుటకు సందియము లేదు. ఈవిషయమును సర్ సాలారు కొన్ని తరుణముల స్పష్టముగఁ జెప్పియున్నాఁడు. ఇట్లు గుర్తెఱిఁగినవాఁడు గావుననే తన సంస్థానమందు స్టాంపు ఆక్టును బహుచులకన చేసి వదలిపెట్టెను. కాని దానివలనను అనర్థములు కలుగకపోలేదు. ద్రవ్యవంతులగు వారు న్యాయముగఁ గట్టఁదగు పన్నులను దప్పించుకొనుటయు దరిద్రులకు సరియగు న్యాయము గలుగకుండుటయు దటస్థించుచున్నది. కావున నొకకొంతసంస్కారము గర్తవ్యము. నేఁటికిని లంచములుదీయుట అచ్చటచ్చట లోలోపల జరుగుచున్నను మొత్తముమీఁద సర్ సాలారుజంగ్ సంస్కారముల వలన అదివఱకు బాహాటముగ నడచుచుండిన ఈదురాగతము అణఁగంటినదనియే చెప్పనొప్పును. హైదరాబాదు సంస్థానమున చేతిపనుల నభివృద్ధిపఱచు నభిప్రాయముతో నతఁడు వస్తుప్రదర్శనోత్సవములనుగూడ నడిపెను. ఇప్పగిది అన్ని విధములఁ బరిశ్రమ చేసి అతఁడు హైదరాబాదునకు నెమ్మదియు నైజామునకు ఇరువది సంవత్సరములలో మున్నున్నదాని మూఁడురెట్ల ఆదాయమును సమకూర్చెను.

"ఆదాయమునకు మించిన వ్యయము లేదాయెను. సర్కారునకుండిన యప్పులన్నియును దీర్పఁబడుటయేగాక కుదువ యుంచఁబడియుండిన నగలన్నియును విడిపింపఁబడెను. ఇట్టి పరిపాలనాఫలములు దృష్టిగోచరములగుచుండ భరతఖండము గొప్పపరిపాలకులను ఉత్తమరాజనీతివిదులను నీనఁజాలదని యెవ్వం డనసాహసింపగలఁడు? (భారతపుత్రులకు) వలసినది (తమశక్తులఁ బ్రదర్శింపుటకు) అవకాశముమాత్రమే" యని సర్ సాలారుజంగును గుఱించి వ్రాయుచు ఒకచరిత్రకారుఁడు లిఖించుచున్నాఁడు.[1]



## సాలారుజంగు పైకుట్రలు.

సమర్థతగలవానికి విరోధములు పుట్టుట సహజము. సర్ సాలారుజంగునకును నైజామునకును గలహముపెట్టి ఏవిధముననైనను సర్ సాలారును బదభ్రష్టుని జేయించవలెనని స్వలాభాపేక్షకులయిన కొందఱు అవినీతులు కుట్రలఁబన్నిరి. సర్ సాలారు నెడ రెసిడెంటున కప్రియము గావున నతనిని దీసివేయవలెనని నైజామునకును నైజామున కప్రియుఁడు గావున అతఁడు దీసివేయఁబడనున్నాఁడని రెసిడెంటునకును ఒకరివిషయము మఱొక్కరికి దెలియకుండుపగిది కుట్రకారులు కార్యములు నడిపిరి. కాని ఆకుట్రలు నిలిచినవు కావు. రెసిడెంటునకును నైజామునకును ఇరువురకును సర్ సాలారుజంగనిన మహాదరము. అందువలన నిరువురును ముఖాముఖిఁ దర్కించుకొనుటయు సత్యము బయల్పడెను. ఇట్టితరుణములు 1861లో నొకటియు

1. J. D. B. Gribble.

1862లో నొకటియుఁ దటస్థించెను. రెంటను సర్ సాలారువిజయుఁడయ్యెను. అయినను అతనిపై వ్యతిరేకభావమును బుట్టించు ప్రయత్నములంతటితో పోలేదు. నైజాము పూర్వాచారపరాయణుఁడు. సంస్కారముల ననుమానముతోఁ జూచువాఁడు. సర్ సాలారుజంగన్ననో సంపూర్ణసంస్కారపరుఁడు. నవీనపద్ధతుల నుపక్రమించువాఁడు. కావున వీరిరువురకును ఎంత యన్యోన్యముండినను వైషమ్యము గలిగించుట దుష్టబుద్ధులకుఁ గష్టము కాదు. అందువలననే మరలమరల నైజామునకుఁ దనముఖ్యమంత్రిపై సందేహముగలుగుచుండెడిది. 1861వ సంవత్సరముననె సర్ సాలారు ఆంగ్లేయపక్షపాతియనియు నైజామును ముంచివేయనున్నాఁడనియు నాంగ్లేయవర్తకసంఘమువారి దయను సంపాదింపసమకట్టినాఁడనియు సర్ సాలారును దూలనాడుచు పత్రికలు వ్రాసి నైజాముగారి నగరులోను మసీదులలోను వంతెనలమీఁదను నగరద్వారమునను అతికించియుంచిరనిన సాలారుజంగుసంస్కారములవలన దమదుర్మార్గములు నెఱవేరకపోవుటచే నతనికి శత్రువులయిన దుష్టులు మొదటినుండియు నతనిమీఁదఁ బ్రయోగింపఁదొరకొనిన సాధనములిట్టివని తెల్లముగాఁ గలదు.

1869వ సంవత్సరమున సర్ సాలారు నైజాముగారికొలువుకూటమునకేగు చుండగా దారిలో నాతనిని జంపివేయుటకుఁ గొందఱు ధూర్తులు ప్రయత్నించిరి. కాని లోకపరిణామప్రవాహమునకు సాలారు జంగింకనుగొంత దోడ్పడవలసిన వాఁడ



గుటవలనఁ బరమాత్ముఁ డతనికేమియు నపాయముగలుగకుండునట్లు పన్నివేసెను. హత్యకుపక్రమించిన దుర్మార్గుని ఉరిదీయవలసినదని నైజాముత్తరు విచ్చెను. ఆయుత్తరువును మరలించి వానిని ద్వీపాంతరవాస శిక్షతో వదలి పెట్టించవలెనని సర్ సాలారెంతయొ ప్రయత్నించెననిన అతని కరుణార్ద్రహృదయము వెల్లడి కాఁగలదు!

## నైజామున కపనమ్మకము.

సర్ సాలారు అనేకవిషయముల ఆంగ్లేయులసాయమును పొందినదినిజమే. అయిన నతఁడట్టిసాహాయ్యమును పొందినదెల్లయు నైజామునకు లాభమగుకార్యముల నొనర్చుటకే కాని మఱియేటికినిగాదు. మాతృభూమియగు హైదరాబాదుసంస్థానము పయి నతనికిఁగల అభిమానము ఇంకను విస్పష్టముగ ముందు దెలియఁగలదు. దాని మూలముననే అతని అద్వితీయధర్మబుద్ధి వెలువడఁగలదు. కాని మహాకార్యముల సాధించువారి కనేకవిధములగు నాటంకములురాకమానవు. ఈ విధికి సర్ సాలారుజంగును దలయొగ్గవలసిన వాఁడె గదా. అతనిపై నైజామునకు విరోధభావమెక్కుడగుచువచ్చి 1867వ సంవత్సరమున నతఁడు రాజీనామానియ్య సన్నద్ధుఁడుగావలసివచ్చెను.

## టెంపిలువాక్యములు.

ఆసంవత్సరము ఏప్రిల్ మాసమున హైదరాబాదునకు

రెసిడెంటుగాపోయిన సర్ రిచ్చర్డు టెంపిలు నైజాము సర్ సాలారుజంగునిడినయవస్థలనిట్లువర్ణించు చున్నాఁడు.

“నైజామువలన నాతఁడు (సర్ సాలారు) బానిసస్థితియం దుంచఁబడియుండెను. అతఁడు తన ఇల్లు విడువగూడని ఖయిదీయనవచ్చును. తనయజమానుని ఆజ్ఞలేని దతఁడు దనయావరణమును విడిచి చనలేకుండెను. నగరమునకు వెలుపల నుండు తన వసంతభవనమున విందు జరుపవలెననినను, ఆంగ్లేయసైనికుల బారుదీర్చి పరీక్షింపవలెననినను, రెసిడెంటుతో మాటలాడవలెననినను, అతఁడు ఉత్తరవు పొందవలసినదే. ఆఉత్తరవు పొందుట నామకార్థమని యనుకొనఁబోకుఁడి. ఉత్తరవు దొరకినను దొరకును, లేకున్న లేదు. ఒక వేళ ఉత్తరువియ్యఁబడినను నైజాముగారి మనస్సంతోషముతో నియ్యఁబడుచుండుట లేదు. నాకు అతనితో (సాలారుజంగుతో) విశేషము పని యుండెడివి. ఆపని దీర్చుకొనుట మిక్కిలి కష్టముగ నుండెడిది. అతనిని పలుమారు చూతమాయనిన దానివలన నైజామున కీర్ష్యయొడమును. లేక కాగితములుపంపి పనిచేసికొందమా యనిన నదియును నైజామునకుఁ దెలుపఁబడుచుండుటవలన ఆక్షేపణీయమే. ఇట్లుండియు సాలార్ జంగు దీనినంతయును గష్టముగ గణించినవాఁడుగాఁడు. దేశమునందలి అతనిసోదరులెల్లరుంబలె నతఁడును తనయజమానుని గౌరవించుచుండెను. నైజాముసన్నిధి కతఁడు పలుమారు విడువఁబడుచుండలేదు.



విడువఁబడినవేళలనో అతనికి మనోవ్యాకులమువలన ముఖమంతయును దెల్లబడిపోవుచుండెడిది. అతఁడు మరలఁ దనయజమానుని దనయెడ సుముఖుని జేసికొనలేనని కొంచెమించుమించుగ నిరాశఁజెందియుండినను ప్రభుభక్తియం దేమాత్రమును గొఱఁతవడనివాఁడై తన ప్రభువున కుపయోగమగు విషయమేమిచేయవలసివచ్చినను సిద్ధముగనుండెను.”

నైజామునకు సాలారునెడ ఇంతమనోగతమగు విముఖత్వముండియు నతఁడు మహాసమర్థుండగుటంజేసి యతనిని దొలఁగింపక సమ్మానింప దొడఁగెను.

### మీరుమహబూబు అలీఖాన్ (1869-1911).

1869 సంవత్సరము ఫిబ్రవరి మాసములో నైజాము అఫజల్ ఉద్ ధౌలామృతుఁ డయ్యెను. అతనికి రెండుసంవత్సరముల వయస్సుగల కుమారుఁడుండెను. ఆకుమారుఁడే మీర్ మహబూబ్ అలీఖాన్. తండ్రిమరణ మందిన నాఁటిరాత్రియె ఇతఁడు నైజాముగఁ బ్రకటింపఁబడెను. ఈతఁడు ఉచిత వయస్కుఁడయి రాజ్యభారము నిర్వహించుకొనుటకు శక్తిగలవాఁడగు వఱకును నవాబు సర్ సాలార్ జంగును నవాబుషంష్ ఉల్ ఉమ్రాయును సహపాలకులుగ (Co-regents) నేమింపఁబడిరి. ఇంతకాలము నైజాము కట్టుబడికిలోనై తనకు నుత్తమములని తోఁచిన సంస్కారముల నెల్లయును జేయలేకుండిన సర్ సాలారునకు నవీన స్వాతంత్ర్యము గొంత యలవడెను.

నైజాముగారి నిర్బంధమువలన ఇల్లువిడచి కదలలేకుండిన ఇతనికిఁ జక్కఁగ బ్రయాణములు సల్పి తనరాజ్యమున క్రిందిఅధికారులెట్లు పనులుదీర్చుచుండుటయుఁ బరిశీలించుటయేగాక పరరాష్ట్రములకుఁ బోయి నైజామునకు లాభకరములని తాను దలఁచిన కార్యములకై పాటుపడుటకును అచ్చటచ్చటి ఉత్తమ సాంఘిక రాజకీయాచారములను ఎఱింగికొనుటకును వీలుకలిగెను. ఇట్టి నూతనస్వేచ్ఛ దొరకినందున సర్ సాలారు హృదయమం దడఁగియుండిన దేశభక్తి బయలువడి పొంగిపొరల మొదలిడెను. తన యజమానియగు నైజాముపోనడచికొనిన బంగారు పంటల సీమబీరారు నెట్లైనను మరల సంపాదింపవలెనను ఆశ అతని డెందమున గాఢముగ నెలకొని యుండెను. 1860 వ సంవత్సరపు సంధిప్రకారము నైజాము బీరారుమండలమును గుఱించిన లెక్కలడుగు హక్కునుగూడ వదలుకొనియుండెను. ఆమండలమున కగువ్యయములు పోను నిలువ ఏమయిననున్నచో నాంగ్లేయు లియ్యనియ్యకొని యుండిరి. ఇదియంతయు సర్ సాలారునకు సమ్మతము గాదని వేరుగనుడువఁ బనిలేదు.

## సాలార్జంగు ప్రవర్తన.

ఇట నీసమయమున సర్ సాలారుజంగు ప్రవర్తనను గుఱించి మాక్ ఔలిఫ్ అనుచరిత్రకారుఁడు వ్రాయునంశముల నుదాహరింప వలసియున్నది.



“అతఁడు ప్రారంభమున (అనఁగా సహపాలకుఁడవుటతోడనె) నడచిననడక లాక్షేపణీయములు. నైజాము సంస్థానపు స్వాతంత్ర్యమును బ్రకటింపవలె ననుట ఆతని కాదర్శమయ్యెను. సమాన రాష్ట్రములకు బరస్పరము మాననీయమగు చట్టముల నుపయోగింప నైజాముసంస్థానమున కర్హతగలదను మిషఁగల్పించుకొని ఆంగ్లేయరాజ్యముయొక్క సార్వభౌమత్వమును చల్లఁగ నిరాకరింప నుద్యుక్తుఁడయ్యెను. అతనిపినతండ్రి ముఖ్యమంత్రిగనుండు నెడ తిరిగియియ్యఁబడవలయునను షరత్తుతో ఆంగ్లేయుల కియ్యఁబడిన బీరారుమండలమును మరల సంపాదింపవలెనని యతఁడు మిక్కిలి యుత్సాహము గలవాఁడయ్యెను. ......‘నేను బీరారును మరల్చుకొననైనను మరల్చుకొనవలెను, లేక దానిని (ఆంగ్లేయులు) నిలుపుకొనుటకుఁ దగినకారణములున్నవని నామనస్సునకు నిశ్చయముగఁదోఁచనైనను దోఁచవలెను, లేక నేను చావనైనను చావవలెను’ అని లార్డునార్త్‌బ్రూకునకు వ్రాసిన వాక్యములవలన నాతని యభిప్రాయము వెల్లడియగుచున్నది.

“ఈ యాశచేనతఁడు ఆక్షేపణీయములగుఁ బనులఁ జేయ మొదలిడెను. ‘నైజాము సైన్యము’ నకవసరములేదని చూపి ఆంగ్లేయులు బీరారు నుంచుకొనుటకుఁ గారణములేదని సిద్ధాంతీకరించు నభిప్రాయముతో ‘నైజాము సైన్యము’ మాదిరి ననుసరించి ‘సంస్కరింపఁబడిన సైన్యములు’ అను పేరుతో

దండులసమకూర్చెను... 1875వ సంవత్సరము వేల్సుప్రభువుగారి దర్శనమునకుఁ బోవనిష్టములేమినిసూచించుటయు, యుద్ధోపకరణములు రహస్యముగ చేయించుచుంట బయల్పడుటయు, తన సహపాలకుఁడు మృతినొందగ మఱియొక సహపాలకుఁడు నేమింపఁబడుటకూడదని పట్టుపట్టుటయు నతని మనోగతిని దెలియఁ బఱచు చున్నవి. పత్రికలమూలమున నేమి గొప్ప అధికారులమూలముననేమి, మఱియితరుల మూలముననేమి భారతవర్ష ప్రభుత్వమువారిని వంచింపఁ జేయఁబడిన ప్రయత్నము లతని యనుజ్ఞ మీఁదనడచెను. ఈకారణములను బట్టియు మఱియితరకారణములను బట్టియు రాజప్రతినిధిగ, అనఁగా గవర్నరుజనరలుగా, నుండినలార్డులిట్టను తన ప్రతినిధిత్వమున యుద్ధమునకంటెను శాంతమునకంటెను నెక్కు డపాయకరమగునది ఈమంత్రియొక్క కుట్రలేయని సంకోచింపక నుడివియున్నాఁడు. ఈతన యభిప్రాయముల నెరవేర్చుకొను నుద్దేశముతో బీరారును మరల్పుఁడనియు నైజాము సైన్యమును బగులఁగొట్టుఁడనియు ఆంగ్లేయులతో నొక్కి చెప్పుటకొఱకు స్వంత సంతోషమునకై యని నిమిత్తముగల్పించుకొని సర్ సాలారుజంగు 1876 వ సంవత్సరమున నింగ్లాండునకు బయనమయిపోయెను. హైదరాబాదునెడల నాంగ్లేయప్రభుత్వమువారి చర్యలన్నిటినిఖండించుచు నతఁడు వ్రాసిన దానిని నార్తుబ్రూకుప్రభువును ఇంగ్లాండు ప్రభుత్వమువారును చక్కఁగ విమర్శించిరి. ఇండియా



కార్యదర్శిగనుండిన సాలిస్‌బరి ప్రభువు మిక్కిలి చాతుర్యముగను దృఢముగను నైజాముగారు బాలుఁడుగనున్నంత కాలము ఆసంస్థానపురాజకీయ సంబంధములు మార్చుటకు వీలులేదనియు 1853, 1860లలో జరిగిన సంధులఔచిత్యానౌచిత్యముల చర్చించుట తగదనియుఁ బ్రత్యుత్తరమిచ్చిరి.

"ఆయిన ఇంగ్లాండునకుఁ బోవుటకుఁ బూర్వమే ఆమంత్రి, అనఁగాసర్ సాలారు, ఆంగ్లేయ పత్రికల మూలమున దన మొఱ్ఱలు ప్రారంభింపించెను!*

"అదివఱకే బీరారును గుఱించి యితఁడు రెండవ మారు అర్జీ యిచ్చుకొనియున్నందున 1877 వ సంవత్సరమున జరుగనున్న చక్రవర్తిని దర్బారునకు ఆంగ్లేయ ప్రభుత్వమువారిసార్వభౌమత్వమును ఒప్పుకొనిననే తప్ప ఇతఁడు రాకూడదని తెలుపఁబడెను. ఆదర్బారున కభిముఖుఁడయి ఇతఁడట్టి సార్వభౌమత్వాంగీకార మెంత యవసరమయినదియు ఎంత యనివార్యమయినదియుఁ బ్రకటించెను. అచిరకాలములోనె సాలిస్‌బరి ప్రభువుగారు దన అర్జీపైనిచేసిన తీర్మానములను సంపూర్ణముగ నంగీకరించెను....

---

* ఇచ్చట నీ చరిత్రకారుఁడు ఆంగ్లేయపత్రికలు బహుతీవ్రముగ వ్రాసినవని నుడువుచు ఆతీవ్రతకు సర్ సాలారు ఉత్తరవాది గాఁడనుచున్నాఁడు.

"పిదప నతఁడొనర్చిన సర్వకార్యములను గవర్నరు జనరలుగారు 'విద్యావంతుడును అనుభవవంతుఁడుననగు ఆంగ్లేయప్రభుత్వపు మిత్రుని' వనివర్ణించియున్నారు."

ఈ అను వాదమునందలి యొకటి రెండు విషయములను మాత్రము పూర్వ పక్షముచేయవలసియున్నది. సంస్కరింపఁబడిన సైన్యములను గుఱించి సర్ సాలారవ్వానిని దనసంస్థానమునకు స్వాతంత్ర్యము సంపాదింప సమకట్టిచేర్చెననుట మిక్కిలి పొరపాటు. 1857 వ సంవత్సరపు తిరుగుబాటు సమయమున నైజాము సైన్యము ఆంగ్లేయుల సాహాయ్యార్థమై ఉత్తరహిందూస్థానమున కనుపఁబడియెను. అప్పుడు హైదరాబాదునందుండిన యల్లకల్లోలమిదివఱకే వర్ణింపఁబడియున్నది. అట్టి సందర్భములలో సర్ సాలారు తగిన సైనిక సాహాయ్యములేక కార్యములు గడుపశక్తుఁడయి యుండునా యనుట మనము యోజింపవలసియున్నది. ఈయోజన కొక్క ప్రత్యుత్తరమె సాధ్యము. సర్ సాలారు దన శక్తిలోఁగలవఱకు భటులను సిద్ధముచేసికొని తీరవలసినవాఁడయ్యెను. కావున నతఁడాసమయమున హైదరాబాదు నంచు చెల్లాచెదరయియుండిన బలములన్నిటిని సంస్కరించి పటాలముగ నేర్పఱచుకొనెను. పటాలమునకు అధిపతులుగ ఐరోపియనులు నేమింపఁబడిరి. అదియే 'సంస్కరింపఁబడిన సైన్యము'[1] అనఁబరగునది. కావున నీసైన్యమును సర్ సాలారు దురభిప్రాయముతోఁ జేర్చెననుట అతనిపై అకారణముగ నిందమోపుటయె. ఇఁక నతఁడాంగ్లేయ ప్రభుత్వపుసార్వభౌమత్వమును నిరాకరింప నుద్యుక్తుఁడయ్యెననుటయు నతనియెడలేనిభావము నతని కారోపించుటగనె కన్పట్టుచున్నది. పైనిరూపింపఁబడిన నూతన సైన్యములు దనచేతులోఁ బెట్టుకొని దేశమందంతటను ఆంగ్లేయ ప్రభుత్వముపై తిరుగుబాటులు ప్రబలియుండిన కాలమునఁ గొంచెమేనియుఁ జలింపక ఆంగ్లేయప్రభుత్వపక్షమునఁ బరిశ్రమచేసి అందలి ప్రముఖులగు నధికారులచే వారి రక్షకుఁడుంబలె మన్ననలందుట అతనిమనమున నాంగ్లేయసార్వభౌమత్వనిరాకరణముండియుండినచోఁ దటస్థింపనేరదని ఎట్టివారికిని దోఁచకమానదు. సర్ సాలారు మహాదేశభక్తుఁడును ప్రభుభక్తుఁడును గావున మాతృభూమియగు హైదరాబాదునకును, యజమానియగు నైజామునకును బీరారుమండలనష్టమువలనను ఇతరవిధములను గలిగిన హైన్యమును మాపనెంచి ప్రయత్నములుచేయుటలో గొంచెముతీక్ష్ణముగఁ బనిచేసి అట్టిహైన్యమునకుఁ గారకులయిన కొందఱకు విరోధియయ్యెననుటకు సందియములేదు. వారు బలవంతులుగ నుండినందునను ఇతర కారణములకతనిపైవైరమూనిన దురాత్ములువారికి సాయులగుటవలనను సర్ సాలారు గార్యములలో కొన్నిటికి అపార్థములు గల్పితమయి అతఁడెప్పుడునుదలంప నైనఁదలంపని భావము లతనికారోపింపఁ బడెను.

1. J. D. B. Gribble 'Two native states'.

పైయును వాదమునందె సర్ సాలారు ఇంగ్లాండునకు వెడలినట్లు వ్రాయఁబడియెనుగదా! అప్పు డతఁడచ్చట గనిన స్వాగతవైభవమే యతనికిని ఆంగ్లేయులకునుగల యన్యోన్య ప్రేమానురాగమును వెల్లడింపఁజాలియుండెను. ఇంగ్లండున ప్రతి నగరమువారును అతనిని రమ్మనిచీరుచు ఏదోయొక మహాచక్రవర్తి కింబలె అతనికి సంపూర్ణగౌరవమును జూపిరి. అతనికారోగ్యము దప్పినందుననొకటి రెండునగరముల కతఁడు దర్శనమిచ్చుటకుఁ గూడవీలులేకపోయెను. అతనిని సమానముగ సమ్మానించిన వారలలో ఇటలీదేశోద్ధారకుఁడును రాజునునగు విక్టరు ఇమాన్యుయెల్ ను, రోమునందలి మహామతాచార్యులును, ఆంగ్లేయ చక్రవర్తిత్వమునకర్హుఁడగు వేల్సుప్రభువును నుండిరనిన సర్ సాలారునకు జరిగినగౌరవాదరణలు విశదముగాఁ గలవు. అతఁడు నాలుగుమాసముల కాలమిట్టివిధమున యాత్రనడపి 1876 వ సంవత్సరము ఆగస్టునెల 25 వ తేది హైదరాబాదు వచ్చిచేరెను. ఆడిశెంబరునందె 1877 వజనవరిలో జరుగనున్న చక్రవర్తిని దర్బారునకభిముఖుఁడై నైజాముగారితోఁ గూడఢిల్లీకేగెను. 1883వ సంవత్సరమున నైజాముగా రైరోపాకుయాత్ర వెడలుట నిశ్చయింపఁ బడెను. దానికై సర్ సాలారు ఉచితమగు రీతిని ఏర్పాటులుచేయుచుండెను. ఫిబ్రవరి 5 వ తేది రాత్రి పండ్రెండు గంటలవఱకు అభ్యాసరీతిని పనిచేసి పఱుండెను. రెండు గంటలగునప్పటికి అకస్మాత్తుగనతనికి కలరాదగిలెను. రాను



రానుఆవ్యాధి తీవ్రమయి 8 వ తేది సాయంత్రము 5 గంటలకు ప్రజలను ప్రభువులను దుఃఖాబ్ధిలోముంచి మహాసర్ సాలారును భరతవర్షపునుత్తమ పుత్రులలో నగ్రగణ్యుని మ్రింగివేసెను.

## రెండవసాలార్జంగు.

అతనికి ఇద్దఱు పుత్రులును నిద్దఱుపుత్రికలును నుండిరి. అందు రెండవసాలారుజంగు మొదటివాఁడు. తండ్రిమరణానంతరమితఁడు రాజానరేంద్రప్రసాదుతోఁగూడ సహపాలకుఁడుగనేమింపఁ బడెను. 1884వ సంవత్సరమున నైజాము మీరు మహబూబ్ ఆలీఖానుఁడు రిపన్ ప్రభువుచే సంపూర్ణశక్తులతోఁ బరిపాలకుఁడుగఁ బ్రకటింపఁ బడుట తోడనె రెండవసాలారు ముఖ్యమంత్రిగ నియమింపఁబడెను.

మీర్ మహబూబ్ మంచి విద్యావంతుఁడు. అతని బాల్యమునందు మహాసర్ సాలారుజంగు అతనికి రాజ్యాంగ విషయముల యందొక్కొక్కటినిజక్కఁగ నేర్పి విద్యాలయములయందును పరిశ్రమాగారములయందును అభిమానమును బుట్టించి యుండినందున నతఁడు రాజ్యభారమును నిర్వహించుటకుఁ దగిన శిక్షనంతయు గనియుండెను. కావున నతఁడు గద్దె నధిష్ఠించిన తరువాత హైదరాబాదు రాష్ట్రమున సర్ సాలారుజంగు ప్రారంభించిన సంస్కారములు బాగుగ నభివృద్ధిచెందఁ జొచ్చెను. విద్యాలయములు గట్టింపఁబడెను. యంత్రశాలలు నిర్మింపఁ బడెను. గొప్ప సంతతులకుఁ జేరిన

బాలురు విదేశములకుఁ బోయి ఉన్నత విద్యనభ్యసించుటకు సదుపాయము లేర్పఱుపఁబడెను. వైద్యశాస్త్రమును స్త్రీలకుఁ గఱపుటకును శాస్త్రీయమగు పద్ధతుల నవలంబించు దాదులను సిద్ధపఱచుటకును ఉచితమగు నేర్పాటులొనర్పఁ బడెను. దేశ మంతటను వైద్యశాలలు నెలకొల్పఁబడెను.

మీరుమహబూబ్ ఆలీ సింహాసనమునకు వచ్చిన తోడనె రెండవ సాలారుజంగు మంత్రియయ్యెనని నుడివితిమి. వీరిరువురకును యజమానియు సేవకుఁడుగ మైత్రికుదిరినదిగాదు. కావున సాలారుజంగు 1887 వ సంవత్సరమున రాజీనామానిచ్చెను. నాఁటినుండి కొంతకాలము నైజాము దనకుఁదానె మంత్రిగఁ గార్యముల నెరవేర్పఁదొడంగెను.

## ఔదార్యకార్యము.

భరతవర్షమున కెప్పుడును పశ్చిమోత్తరపు సరిహద్దు వలన బాధదప్పినదిగాదు. అందున నాంగ్లేయప్రభుత్వము స్థిరపడిన తరువాత నావైపునుండి రుష్యావారు దండెత్తివత్తురేమో యను భీతి [1] కడుంగడు హెచ్చఁ జొచ్చెను. 1885 వ సంవత్సరమున రుష్యా సైన్యములు ఆఫ్గనిస్థానము మీఁదికి దాడివెడలనుండెనను వార్త ప్రబలెను. అట్టివార్తలె దినదినమునువ్యాపించుచుండినవి. కావున నవ్వానినన్నిటిని యోజించి నైజాము పశ్చిమోత్తరదిగ్భాగపు సరిహద్దునందు వలసినంత రక్షకసైన్యముండ

1 అది వట్టిభీతియనుట లోకమునకు విదితమయి యున్నది.



వలెనని అభిప్రాయపడియెను. అందుచే నాసంవత్సరమున అట్టి రక్షకసైన్యమునకై అరువదిలక్షల రూపాయలు దానిత్తుననియు యుద్ధముదప్పక పోయినచోఁ దానె స్వయముగఁ గత్తికట్టుకొని బయలుదేరుదుననియు గవర్నరు జనరలుగారికి 1887 లో వ్రాసి ఆంగ్లేయలోకమును భ్రమింపఁ జేసెను.

నైజాము కొంతకాలము రాజ్యభారమునంతయును తానే నిర్వహించి నవాబు బషీరుద్దౌలా సర్ ఆస్మన్‌జాబహదూరును మంత్రిగా నియోగించుకొనెను. ఆరు సంవత్సరములు పని చేసి అతఁడును రాజీనామానిచ్చెను. సర్ విక్ర-ఉల్ - ఉమ్రా మంత్రి పదమునకు నియోగింపఁబడెను. అతనికిఁ దరువాతివాఁడె ప్రస్తుతపు ముఖ్యమంత్రియగు మహారాజా సర్ కిషన్‌ప్రసాదు.

## మహారాజా సర్ కిషన్‌ప్రసాదు.

ఈ మంత్రి కాలమున నాంగ్లేయులకును నైజామునకును గలసంబంధములలో నొక ముఖ్యమగు మార్పు కలిగెను. బీరారు విషయమున సర్ సాలారుజంగు పడినపాట్లును వానివలన నతనికి వచ్చిన యపకీర్తియు ఇదివఱకే వర్ణింపఁబడెను. ఆబీరారువిషయమె ఈమంత్రికాలమునఁ దీర్మానింపఁబడిన ముఖ్యవిషయము. 1853వ సంవత్సరమున నైజాము బీరారును ఆంగ్లేయుల పరిపాలన క్రిందికి చేర్చినది మొదలు ప్రతి సంవత్సరమును కర్చులు పోఁగ మిగతయున్న ద్రవ్యము నైజామున కియ్యఁబడవలసి యుండెను గదా! బీరారున నాంగ్లేయు లుపక్రమించిన పరిపాలనాపద్ధతి

మిక్కిలి వ్యయపరమని యెల్లరును అంగీకరించియే యున్నారు. కావున ప్రతి సంవత్సరమును నిలువయుండుచు వచ్చిన ద్రవ్యము బహుస్వల్పము. 1887-88 లో మాత్రము బీరారుమండలాదాయమునుండి రు 19, 73,000లు నైజామున కియ్యఁబడెను. మొత్తముమీఁద చూచినచో 1860-మొదలు 1900 వఱకుగల నలుబది సంవత్సరములకు నైజామునకు సంవత్సరమునకు 9 లక్షలవంతున నియ్యఁబడెను. ఇదియైనను నైజామునకు మిగిలిన దాయనిన మిగిలినది కాదు. 1900-01 వత్సరములలో నైజామున కొక్కదమ్మిడియైనను రాకపోవుటయేగాక బీరారునఁ గలిగిన దుర్భిక్షమును దీర్చుటకుఁ జేయఁబడిన వ్యయముచే బీరారుమండలము ఆంగ్లేయప్రభుత్వము వారికి 1,40,95,608లు అప్పుపడెను. సుభిక్షముగల సంవత్సరములలోని నిలువ దుర్భిక్షముల నపనయింప నుపయోగింపవలయునను ఆచారమును బట్టి ముందు సంవత్సరములలోని నామకార్థపు నిలువను అనుభవింపుచుండిన నైజామీ నూటనలుబది చిల్లరలక్షలనిచ్చుకొనవలసిన వాఁడాయెను. ఇంతియెగాక సర్ సాలార్ జంగంతటివాఁడు మఱియొకరుఁడు మంత్రి హైదరాబాదునకు దటస్థించనందున పైఁగనిన క్షామములకయియే హైదరాబాదు సంస్థానముకొఱకు నాంగ్లేయులవద్దనుండి నైజాము రెండుకోట్ల రూపాయిలప్పు పుచ్చుకొనవలసినవాఁడయ్యెను. కావున నైజాము



స్థితి మఱల నొకటిరెండు క్షామములు దటస్థించినచో దుర్భరమగునట్లు గాన్పించెను.

## లార్డు కర్జను.

ఈ సందర్భములలో 1902 వ సంవత్సరమున లార్డు కర్జను హైదరాబాదునకు దర్శన మీయఁబోయెను. అంతకుమున్నె యతఁడు నైజామునితో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచుండెను. పై యప్పులలోఁ గొంతభాగము 1901 వ సంవత్సరమున దీర్పఁబడియుండెను. అయినను 1902వ సంవత్సరము లార్డుకర్జను నైజాముతోఁ గలిసినప్పుడు ముఖాముఖసంభాషణము జరిగెను. సర్ సాలారుజంగునకు అతనికాలమున ఇండియా సెక్రటరీగానుండిన లార్డుసాలిస్బరీ యిచ్చిన ప్రత్యుత్తరములోనప్పటికి 'బాలుఁడుగానుండిన మీర్ మహబూబ్ యౌవనత్వమందినతరువాత నతఁడిచ్ఛయించెనేని ఆంగ్లేయులకును నైజామునకును గలపరస్పరసంబంధములు సంపూర్ణముగ నాంగ్లేయ ప్రభుత్వమువారు మఱల విమర్శింపగలరు' అని వ్రాసిన వ్రాతనాధారము చేసికొని లార్డుకర్జనీవిషయమున జోక్యముకలుగఁజేసికొనెను. అదేలార్డుసాలిస్బరీ ఆప్రత్యుత్తరముననే 1853వ సంవత్సరపు సంధిలో బీరారిన్ని సంవత్సరము లాంగ్లేయు లనుభవింపవలసినదని లేదు గావున నాంగ్లేయుల కామండలము శాశ్వతముగఁ బరిపాలన కియ్యఁబడినది అని నుడివియుండుట వలనను, సర్వజనులకును సమ్మాన్యుఁడై మహానిపుణుఁడగు సర్

సాలారుజంగంతటి వాఁడే విశ్వప్రయత్నములుచేసి కట్టకడపట విఫల మనోరథుఁడయి యుండుటం బట్టియు, అమలులోనున్న షరత్తులను బట్టి బీరారునుండి దనకగులాభమేమియు గన్పింపకుండుటం బట్టియు, మీర్ మహబూబ్ ఆలీఖానుఁడు నిష్ఫలమగు ప్రాతపోరాటములకు నిష్టములేనివాఁడై ఉన్నదున్నంత వఱకు దిట్టముఁచేసికొన ప్రయత్నించి లార్డుకర్జనుతో 1902 వ సంవత్సరమున సంధిచేసికొని బీరారువిషయమును ఒకవిధముగఁ దీర్మానముచేసికొనెను.

బీరారునుగూర్చినసంధి (1902).*

ఈ సంధివలన బీరారుమండలము నైజాము ప్రభుత్వములోనిదే యనుట స్థిరాంగీకారమునందెను. కాని ఆమండలము శాశ్వతముగా నాంగ్లేయులకు కౌలునకీయఁబడెను. గుత్త 25 లక్షలరూపాయలని నిర్ణయింపఁబడెను. లెక్కలువేయఁగా తేలిన బీరారుమండలక్షామనివారణార్థ మయిన ఋణము 76 లక్షలును హైదరాబాదు సంస్థానమండలక్షామనివారణార్థమయిన ఋణము 185 లక్షలును 30 సంవత్సరములలోఁ ఈగుత్తపైకముతో దీర్పఁబడు నట్లేర్పఱుపఁబడెను. ఇందునకు ప్రతిసం

* బీరారును మరలించుకొనవలెనను వాంఛయు, బీరారుమరల్చకుండుట నైజామున కన్యాయము సేయుట యనుతలంపును హైదరాబాదుసంస్థానమున ఈసంధినాఁటికినిగలవనుటకు లార్డుకర్జను హైదారాబాదునకు దర్శనమియ్య. వెళ్లినప్పుడతనికి బాకరారు జంగు వ్రాసిన ప్రకటిత పత్రమేసాక్షి



వత్సరము నియ్యవలయు పదునైదులక్షలు పోఁగామిగత 10 లక్షలు నైజామున కిచ్చునట్లును ఈయప్పులు దీరిపోయిన తరువాత సంవత్సరమునకు సంధిప్రకారము 25లక్ష లిచ్చునట్లును నొడంబడికచేసికొనఁబడెను. బీరారుమండలమును పరిపాలనావసరముల కొఱకు ఆంగ్లేయమండలములతోఁ జేర్చుకొనుటకాంగ్లేయప్రభుత్వమువారికి స్వాతంత్ర్యమీయఁబడెను. నైజాము సైన్యమును దగ్గించుకొనుటకుగాని మార్చుకొనుటకుగాని భరతవర్షపు సైన్యములలోఁ జేర్చుకొనుటకుగాని వారికి హక్కుగలిగెను. నైజాము స్వసంరక్షణకుగాని ఆతని సంస్థానములోని యల్లరుల నణఁచుటకుగాని సైన్యముల ననుపుటకుమాత్రము వారుత్తరవాదులుగ నేర్పడిరి. నైజాము దన యొద్దనుండు చిల్లర సైన్యములను 12, 000ల వఱకును దగ్గింపనియ్యకొనెను. ఆంగ్లేయ ప్రభుత్వమువారు నైజాముగారి సంస్థానమున నుంపనెంచిన తమ సైన్యమును తదనుగుణముగఁ దగ్గింతుమనిరి. బీరారుపై నైజామునకు గలప్రభుత్వమును సూచించుటకు ప్రతి సంవత్సరమునుఅతని జన్మదినోత్సవమున బీరారుమండలపు రాజధానిలో ఆంగ్లేయుల పతాకముతో నతని పతాకమును గూడ ఎక్కించుట నిర్ణయింపఁబడెను.

దయామయత్వము.

1908వ సంవత్సరము సెప్టంబరు 28వ తేది ఆదివారము నాఁడు మూసీనదివరదలు ప్రచండమై అకస్మాత్తుగఁగన్పట్టి హైద

రాబాదు పట్టణమునందు విశేషభాగమునకుఁ బ్రళయముగఁ బరిణమించినదిప్పటికినిఁ దలఁచుకొనిన హృదయమునందు సంతాపముపుట్టకమానదు. ఆతరుణమున మీర్ మహబూబ్ ఖాను నాలుగుదివసములు నిద్రాహారములుమానికన్నీళులువిడుచుచుఁ దనప్రజకుఁ దటస్థించిన మహద్విపత్తును మాన్పుటకయి సర్వవిధములను జేసినప్రయత్నములు జ్ఞప్తికివచ్చిన నాతని దాతృత్వమును కరుణాళుత్వమును స్ఫుటముగ మనోగోచరము లగుచున్నవి. దురదృష్టుల కష్టములఁ బాపుటకతఁడు రాష్ట్రపుబొక్కసమునుండి యిచ్చినద్రవ్యముతో సంతుష్టిఁజెందక తన స్వాంతధనమునుండి 4½ లక్షుల రూప్యములను ధారాళముగనొసంగి కమిటీలనేర్పఱచి భోజనపదార్థములును, స్త్రీలకు బాలురకు బాలికలకు ఎల్లరకును దగినవస్త్రములును, దుప్పటులు గొంగళ్లు చొక్కాలు మున్నగు చలినాపు వస్త్రవిశేషములును, ప్రతిగృహమునకుఁ జేర్పించెననిన మన మీరుమహబూబ్ యొక్క ఉదారహృదయమును వర్ణించినవారమగుదుము.

మీర్ మహబూబ్ ఆలీఖానుఁడు దనప్రజలయెడఁజూపిన దొక్కయనురాగము మాత్రమె కాదు. వారియందతనికి సంపూర్ణమగు నమ్మకముండెడిది. ఈవిషయమును సిద్ధాంతీకరించుటకు నతఁడు మింటోప్రభువునకు వ్రాసినయుత్తరమె చాలియున్నది. గవర్నరుజనరలుగారు రాజద్రోహము విషయమై జాగ్రత్తగ నుండవలసినదని వ్రాయ దానికీతఁడు దనరాజ్యమున



నట్టినేరములుండుటకు వీలులేదనియుఁ బ్రజలు మతభేదములు లేక పరిపాలింపఁబడుటచే సంపూర్ణముగ సంతుష్టులయియున్నారనియు వ్రాసి యతని కాశ్చర్యమును బుట్టించెను.

### మీరుమహబూబ్ నిర్యాణము.

ఇట్లు ఇరువదియేడు సంవత్సరములు ప్రజారంజకముగ రాజ్యముచేసి 1911 వ సంవత్సరము ఆగస్టు నెల 30 వ తేదిన 45 సంవత్సరముల వయసున హిజ్ హైనెస్ ఆసఫ్‌జా ముజఫరుల్ మమాలికు నైజాముల్ ముల్కు నైజాముద్దౌలానవాబు మీరుసర్ మహబూబు అలీఖాన్ బహదూరు ఫత్తెజంగు జి. సి. ఎస్. ఐ. జి సి. బి. గారు అకస్మాత్తుగ మరణమందెను. దయామయుఁడై దీర్ఘకోపమూనువాఁడుగాక ప్రజలయం దనురాగముగల్గి ఆడంబర మొక్కింతయేనిదగ్గరరానీక జనులయందు సంపూర్ణమగు నమ్మికకలవాఁడై రాజ్యభారమును వహించి రాజ్యకార్యముల నిర్వహించిన ఈమహానీయు నెవ్వరు గౌరవింపరు? ఈలోకమాన్యుని మరణమున కెవ్వరు వగవకుందురు?

### ఉస్మాన్ ఆలీఖాన్.

అతఁడు పరలోకప్రాప్తిఁ జెందినతోడనె అతని కుమారుఁడగు ఉస్మాన్ ఆలీ ఖానుఁడు నైజాము పదమునకుఁ బ్రకటింపఁబడెను. ఇతఁడు గద్దియనెక్కుతరి "నాతండ్రిగారి వలెనే నేనును ప్రజకును దేశమునకును నావలన నైనంత మేలును

చేయుదుననియు ఆంగ్లేయ ప్రభుత్వమునకు భక్తిచూపె
ననియు వాగ్దానము సేయుచున్నాఁడ" నని నుడివెను. ఇతఁడు
గడచిన పట్టాభిషేకమహోత్సవ సమయమున ఢిల్లీకరిగి
యచ్చటి సామంతప్రభుసభ నలంకరించి చక్రవర్తిగారిచే మొట్ట
మొదట సమ్మానమందెను.

తండ్రిగారి పరిశ్రమవలన రాజ్యాంగ శాఖలన్నియుఁ
జక్కఁగఁ దీర్పఁబడిన స్థితిలోనితఁడు రాజ్యమునకు వచ్చియు
న్నాఁడు. ఇప్పుడు హైదరాబాదు నందు ఆంగ్లేయ మండల
ములందు వలెనే ముఖ్యమంత్రి అధికారము క్రింద మఱియొక్క
రుమంత్రులతోఁ గూడిన రాజ్యకార్య నిర్వాహక సంఘమును
(Executive Council) ఔద్యోగికా నౌద్యోగిక (Official &
non-official.) సభ్యులతోఁ గూడిన శాసననిర్మాణ సభయును
గలవు. తదనుగుణముగనే ఇతర రాజ్యాంగశాఖలును సంస్క
రింపఁ బడియున్నవి. ఉత్తమన్యాయ స్థానమొందు నెలకొల్పఁ
బడియున్నది. విద్యాలయములును స్థాపింపఁ బడియున్నవి. వీని
నన్నింటి నభివృద్ధిపఱచి, జాగరూకుఁడై మెలఁగి ప్రజాక్షేమ
మునకై పాటుపడి తండ్రిగారికంటె నెక్కుడనిపించుకొనుటకీ
నైజామునకు దైవము బుద్ధిబలంబుల నొసంగుగాత!

—————



# ఢిల్లీదర్బారు.

# 4. బరోడారాష్ట్రము.



బరోడాయందలి గొప్పకమాను.

శమునందు(1)కాడీప్రాంతము (2) బరోడాప్రాంతము(3)నవ్సారీ ప్రాంతమునని పటముపైఁ జూపఁబడిన ప్రాంతములు (అనఁగా మనజిల్లాలఁబోలు ఖండములు) గలవు. కాథియవాడయందలి రెండుభాగములలోని భూప్రదేశమునకును అమ్రేలిప్రాంతము అనిపేరు.

ఈప్రాంతములకు నెల్లలు వేరువేరుగఁ దెలిపినచో నొకకొంత సహకారిగ నుండును. అన్నిటికంటె నుత్తరమున నుండు కాడీప్రాంతమునకు ఉత్తరమునను పశ్చిమోత్తరమునను పాలంపూరు రాధంపూరు సంస్థానములున్నవి. దక్షిణభాగమునను గొంతపడమటను బొంబాయి రాజధానికిఁ జేరిన అహమ్మదాబాదు కేయిరా జిల్లాలుగలవు. తూర్పున మహీకాంత సంస్థానముగలదు. బరోడా ప్రాంతమునకు ఉత్తరమున కేయిరా జిల్లాయును; పశ్చిమమున కేయిరా కాంబే బ్రోచి జిల్లాలును; దక్షిణమున నర్మదానదియును, బ్రోచి జిల్లాయును, రివాకాంత సంస్థానములును; తూర్పున రివాకాంత సంస్థానమును పంచమహాలు జిల్లాయును గలవు. నవ్సారిప్రాంతమును సూరతు జిల్లా ఉత్తరమునుండి దక్షిణమునకు రెండుభాగములుగ విభజించుచున్నది. దీనిని మనస్సున నుంచుకొని మొత్తముమీఁద నీప్రాంతమునకు నుత్తరమున బ్రోచి జిల్లాయును రివాకాంత సంస్థానమును పశ్చిమమున సూరతుజిల్లాయును పశ్చిమసముద్రమును, దక్షిణమున సూరతుజిల్లాయును బానస్డా సంస్థా



నమును డాంగులును, తూర్పున ఖాండేషుజిల్లాయును ఎల్లలని చెప్పవచ్చును. ఇఁక కాథియవాడలోని అమ్రేలి ప్రాంతము భిన్నభిన్నముగ నున్నది. జునగడు మున్నగు కాథియవాడ సంస్థానములు అందలి ముఖ్యభాగమును జుట్టుకొని యున్నవి. మఱియొక భాగమగు ఓఖామండలము పశ్చిమసముద్ర తీరమునను కచ్ఛిఖాడీ తీరమునను వ్యాపించి భూపార్శ్వమున నవానగరసంస్థానముచేఁ జుట్టఁబడియున్నది. ఇందే ద్వారకా నగరముగలదు.

## నైసర్గికస్వరూపము.

ఈ సంస్థానపు విస్తీర్ణము 8099 చదరపుమైళ్లు. జనసంఖ్య 19,52,692. ఈ సంస్థానమున ఎత్తగుపర్వతపంక్తులుగాని విస్తారమగు నడవులు గాని లేవు. అమ్రేలి ప్రాంతమునందలి 'గిర్' అడవిమాత్రము గుజరాతుదేశపు సింహమున కింకను ఆటపట్టగుటంజేసి కొంచెము ప్రసిద్ధిఁజెందియున్నది.

ఈ సంస్థానమునఁ బ్రవహించు నదులలో ముఖ్యమయినవి సబర్మతి, మాహి, నర్మదా, తపతులు. ఇవియైనను బరోడా ప్రాంతమున నొకకొంత భాగమునకే ఉపయోగకారులు. ఇవి కాక చిన్నచిన్న ఏళ్లనేకములుగలవు. చెఱువులు బావులును మెండుగనున్నవి. ఖండములు ఖండములుగ నుండుటంబట్టి బరోడాసంస్థానపు భూసారమును మొత్తముగ వర్ణింప నలవిగాదు. కొంతభాగము నల్లరేగడి భూమిగను మఱికొంత ఎఱ్ఱమట్టి ప్రదేశముగను వేరొకకొంత సముద్రతీరమయి ఇసుకనేలగను

ఇంకొకకొంత పచ్చిక బయళ్లుగను నున్నది. సంస్థానవర్ణన నింతటితో నాపి చరిత్రకుఁ దరలుదము.

### నామప్రశంస.

ఈ సంస్థానమునకు బరోడా యను పేరు వచ్చుట దీని రాజధాని నామమువలననే. రాజధానికి ఆపేరు మాత్రమె కాక వీరక్షేత్రము లేక వీరవాటి యనియును, చందనవతి యనియును నామములుండెడివి. ప్రేమానందుఁడను పదునేడవ శతాబ్దపు, గుజరాతికవి వీరవాటియను పేరుతోఁగూడ వడోదరాయను పదమును వాడియున్నాఁడు. అయినను ఏపేరు ఎప్పుడు వచ్చినదియును మనము నిర్ధారణగఁ జెప్పఁజాలము. ఆంగ్లేయ ప్రవాసికులును వర్తకులును మాత్రము మొదటి నుండియు దీనిని బ్రోడీరా అనియే పిలుచుచున్నారు. కావున బరోడా నామమునే మనము గ్రహింతము. ఇది 'వటోదర' యొక్క వికారమని చెప్పవలసియున్నది. దీనివలన నీనగరము వటవృక్షముల మధ్యనుండుటంజేసి ఇద్దానికాపేరు సిద్ధించినదని ఏర్పడుచున్నది. ఈయుత్పత్తియే సరియైన దనుటకు బరోడా నగరమును జుట్టుకొని యుండుమహావటవృక్షములేసాక్షి. ఇట్టి పవిత్రవృక్షములవలన నామముగాంచిన ఈపవిత్ర సంస్థాన చరిత్రము పదునెనిమిదవ శతాబ్దారంభమునఁ బ్రారంభమగుచున్నది.



గుజరాతుసీమకు మొదట మహారాష్ట్రులు 1705 వ సంవత్సరమున దండెత్తివచ్చిరి. 1712 వ సంవత్సరమున నట ఖండేరావను మహారాష్ట్రనాయకుఁడు ప్రబలుఁడయి కాన్పించెను. అతని యనుమతిలేనిది గుజరాతుఁజొచ్చు ప్రవాసికుల సొత్తునందు నాలవవంతు నతఁడు లాగుకొన మొదలిడియెను. మహారాష్ట్రులకును మహమ్మదీయ చక్రవర్తి ప్రతినిధులకును జరుగుచుండిన విగ్రహమున దీక్షతోఁ బనిచేసి మహారాష్ట్రులలోఁ బుట్టిన అంతఃకలహములలో 'సాహూజీ' పక్షమగుట వలన నతఁడు సాహూజిచే సేనాపతిగ నియమింపఁబడెను. (1716) నాలుగు సంవత్సరముల కుఁదరువాత ఢిల్లీపాదుషాహగారగు మహమ్మదుషాహ మహారాష్ట్రులకు గుజరాతునందు చౌతు పన్నును* వసూలుచేసికొనుట కుత్తరువిచ్చెను. సతారారాజు ప్రతినిధిగ సేనాపతియయిన ఈ ఖండేరావె గుజరాతునందు ఆ కార్యమునకు నేర్పఱుపఁ బడెను. ఇట్లుండ 1720వ సంవత్సర ప్రాంతమున స్వాతంత్ర్యము నెఱపఁ బ్రారంభించియుండిన నైజాముల్ ముల్కునక్కును దక్కనునకు ప్రతినిధిగ బాదుషాహ గారిచేఁ బంపఁబడియుండిన ఆలింఆలీకును బాలాపురము వద్ద యుద్ధము జరిగెను. అప్పుడాలింఆలీకి సాహాయ్యులుగ ననేక మహారాష్ట్రప్రభువులేగియుండిరి. అందును ఖండేరావు సైన్యములు మహాధైర్యసాహసములతోఁ బోరెను. ఆతరుణముననే

* అనఁగా చక్రవర్తికి రావలయు పన్నులో నాలవవంతుపన్ను.

అతనిక్రింది యధికారులలో నొక్కఁడగు దామాజిగాయిక వాడు తనప్రావీణ్యముచేఁ బ్రాముఖ్యమునంది షంషర్ బహాదూరు అనుబిరుదమునందెను. ఆపట్టము నేఁటికిని గైకవారుసంతతివారు వాడుకొనుచున్నారు. 1721వసంవత్సరమున ఖండేరావును దామాజియును నిద్దఱును బరలోకప్రాప్తిఁజెందిరి. ఖండేరావునకు త్రయంబకరావను నతఁడు కుమారుఁడు గలఁడు. దామాజిపేరు నిలుపుట కతని సోదరుని కుమారుఁడగు 'పీలాజీ' చాలియుండెను.

## పీలాజి (1721-1732).

ఇతఁడే బగోడా సంస్థానమునకు మూలస్థాపకుఁడు. గాయికవాడులకు పునహామండలములోని ధావడి మొదటి నివాసస్థానము. కాని వారు సేనాపతికడ నధికారస్థానమున కేర్పడిన పిదప నాగ్రామము వదలవలసినవారైరి. ప్రారంభమున గాయికవాడులు సేనాపతికి వేగులవారుగ నుపచరించుచుండిరను కథయొకటికలదు. అయినఁ దరువాతి వృత్తాంతముల ననుసరించిచూడఁగ వీరు సేనాపతిక్రింద గౌరవనీయమగునధికారములలోనె చాలకాలముండిన ట్లగుపించుచున్నది. పీలాజీగాయికవాడు మొదట ప్రస్తుతపు ఖాండేషు జిల్లాలోని నవాపురమందు ఏబదిస్వారులకు నాయకుఁడుగ నగుపడుచున్నాఁడు. కార్యసాధనాశక్తివలన నీతఁడు రెండుమూఁడువందలస్వారులకు నాయకత్వమున కెక్కి-సూరతు పట్టణమును గొనుటలో విజయుఁడయి



ఒక 'పాగా'కు, అనఁగా నొకసైన్యమునకు, నధికారిగ నియమింపఁబడెను. నాఁటినుండియు నతఁడు గుజరాతుపై కత్తి పోవుటయం దుద్యుక్తుఁడయి వాసిఁగాంచెను. రమారమి ఆసను యమునసె. అంతః కలహముల వలన నతఁడు తన నివాసస్థానమును నవాపురమునుండి 'సోనఘుడు' నకు మార్చి అచ్చటినుండి కార్యములు నడుప వలసినవాఁడయ్యెను. కావున 'సోనఘుడు' గాయిక వాడులను బోషించిన దాదియనుటలోఁ దప్పుండదు. ఇంతియకాక 1776వఱకు బహుకాలము వారికదియె రాజధానిగ నుపచరించుచుండెను.

కొన్ని సంవత్సరముల కాలము 'పీలాజి' ఇతరమహారాష్ట్ర నాయకులను తోడుచేసికొని 'సూరతు అట్టావీసి' అనఁగా సూరతునకుఁ జేరిన ఇరువది యెనిమిది చిన్న భాగములను దాఁకి కప్పమును సంపాదించుకొనుచుండి 1723 వ సంవత్సరమున సూరతు నగరమునే ముట్టడించి అచ్చటి పరిపాలకుని బరాజితు నొనర్చి గుజరాతునుండి క్రమముగ కప్పమునదిమి పుచ్చుకొనఁ జొచ్చెను. పాడ్రా, భాని, భాయాలీ గ్రామముల దేశాయీల సాయమున నతఁడు మాహీ నదివఱకును గుజరాతును గొల్లఁ గొట్టెను. 1725 వ సంవత్సరమున కంతయు నితఁడు బరోడా, నాందోడు, చాంపనీరు, బ్రోచి, సూరతు మండలములకు హక్కుస్థాపించుకొని 'సోనఘుడు, వచ్చి చేరెను. ఆ సంవత్సరమున నే సేనాపతియును 'పీలాజి' స్వాధీ

నములోనుండిన 'ధాబాయి' యను గ్రామమునకు దరలివచ్చి దానినె రాజధానిగ నేర్పఱచుకొనెను.

అటు తరువాతఁ గొంతకాలమువఱకును మహారాష్ట్రులకపజయముపయి నపజయము సంభవించెను. 'పీలాజి' మొదట 'కాంబె'కును పిదప సూరతు నకును భారిపో వలసిన వాఁడయ్యెను. కాని మహమ్మదీయ ప్రతినిధియగు సర్బులందుఖానునకు ఢిల్లీనుండి సాయమురానందున మఱల మహారాష్ట్రులు విజృంభించుట కనుకూల మయ్యెను. మాహీనదికి దక్షిణతీరముననుండు జిల్లాలలోని పన్నులలో నొక్క భాగమునకు 'పీలాజి'కి అర్హతగలదని అతఁడొప్పుకొనియెను. కాని మహారాష్ట్రులలోనే పీష్వాకును సేనాపతికిని విరోధము ప్రారంభమయియుండెను. కావున పీష్వాపరముగ 'పొన్వారు' 'పీలాజిని' ఎదురింప నియమింపఁబడియెను. ఇంతేకాక పీష్వాబాజీరావునకును సర్బులందుఖానునకును మైత్రిజరుగుట వలన పీష్వా సర్బులందుఖానునకు 'పీలాజి' నణఁచుటలోఁ దోడ్పడినచో నతనికి చౌతుపన్నును దానితో గూడ సర్-దేష్-ముఖిపన్నును (అనఁగా పన్నునందు మఱియొక పదియవ వంతును)అందునట్లు సంధిజరిగెను. కాని 'పీలాజి' కదృష్ట సమయముగ నుండుట వలన నతఁడు 'దాభాయి' 'బరోడా' పట్టణములను స్వాధీనముచేసి కొనెను. దీనికిఁ దోడుగ సర్బులందుఖాను పీష్వాతోఁజేసికొనిన సంధి ఢిల్లీబాదుషాహగారి వలన



నంగీకరింపఁ బడక పోవుటచే నతని స్థానమునఁ బ్రతినిధిగ 1730లో జోధపురమునకు రాజుగనుండిన అభయసింగు నేమింపబడెను.

ఈ అభయసింగుతోఁగూడ పీష్వా 'పీలాజి'కవ్యతిరేకముగ మైత్రి చేసికొని ఏలాగైనను ఇతనిని బరోడానుండి వెడలఁ గొట్ట వలయునను పట్టుపట్టెను. 1731వ సంవత్సరమున నీ ప్రయత్నమున బయలుదేరుటతోనే నైజాముల్ ముల్కు తన పైకి దాడివెడలనున్నాఁడను వార్త వచ్చుటవలన పీష్వా మరలిపోయెను. అట్లు పోవుచుండమార్గమున నతని సైన్యములకు గాయికవాడ్ సేనాపతుల దండులెదురుపడెను. యుద్ధముప్రారంభమాయెను. అందు సేనాపతి మడిసె. గాయకవాడునకు గాయము తగిలె. వారిసైన్యములు అపజయమందెను. ఇదియే ప్రసిద్ధి నొందిన భీలాపురయుద్ధము.

ఈయుద్ధమునకు దరువాత 'పీలాజి' మఱల 'సోనఘుడు' నకుఁ బరువెత్తిపోయెను. కాని పీష్వా తక్కిన మహారాష్ట్ర నాయకులను నశింపఁజేయు నుద్దేశము లేని వాఁడగుట మడసిన సేనాపతి కుమారుఁడగు జస్వంత రావునకు సేనాపతిత్వమును 'పీలాజి'కి 'ముతాలికత్వము'ను అనఁగా ప్రత్యధికారమును (Deputy)ఇచ్చి 'పీలాజి' కి సేనాఖాస్ ఖేల్' అనుబిరుదము నొసంగెను. 'ముతాలికుఁ' డైనందున 'పీలాజికి' సేనాపతికిఁ గల సర్వాధికారమును దొరకెను.

దానితో నతఁడు అభయసింగును రూపుమాపఁగడంగెను కాని మాయోపాయమున వీఁడె యతనిని జంపించెను. అయిన నాహంతకునకుఁ దగినశత్రువు గాయికవాడులలో లేక పోలేదు.

## దామాజి II (1732-1768).

పీలాజికుమారుఁడు అగుదామాజి II తండ్రి ప్రయత్నములను సార్థకపఱచి గొప్పరాజ్యమును సంపాదింపనుండెను. ‘పీలాజి’ మరణముతో మహారాష్ట్రులు సరియగు నాయకుఁడు లేమిచే చెల్లాచెదరయి యుందురను నమ్మకముతో నభయసింగు బరోడా నగరముపైదండెత్తి ఆపట్టణమును కోటను బట్టుకొనియెను. దామాజి దాభాయికిఁ దరలిపోయి అటనుండి అహమ్మదాబాదుమార్గమున నెత్తిపోయి ప్రతీకారమొనర్ప సిద్ధపడ మొదలిడెను. ‘పీలాజి’ కిఁ బూర్వస్నేహితుఁడగు పాడ్రాగ్రామపు దేశాయి భిల్లులనుకోలులను మహమ్మదీయుల మీఁదికిఁ బురికొల్పి యల్లరులు జరిగించెను. గాయికవాడు కుటుంబపు బలములు ‘సోనఘుడు’ నందు వచ్చి చేరెను. పీలాజితో వీరస్వర్గమందిన సేనాపతిభార్య ‘ఉమాబాయి’ గాయికవాడులకు సాహాయ్యము చేయ నేతెంచెను. ఇట్టి సన్నాహములతోఁ బనికిఁ బూనిన ‘దామాజి’ కి విజయమగుట కేమి సందియము? అహమ్మదాబాదునందుఁ గొంచెము గెలుపు గలిగినదే గాక బరోడా మఱల నతని వశమయి పోయెను. నాఁటినుండి నేటివఱకా నగరము గాయికవాడుల అధీనమందే యుండియున్నది. బరోడా వచ్చి



చేరిన పిదప ‘దామాజి’ స్వయముగ బయలు వెడలి అభయసింగు రాజ్యమును అనఁగా జోధపుర ప్రదేశమును ఆక్రమించి కొల్లఁగొట్ట నారంభించెను. దీనికి జడిసి అతఁడు గుజరాతువదలి తనరాజ్యమును గాపాడుకొనుటకై పోయి చేరెను. అంతట అభయసింగు స్థానమున ‘మోమిన్ఖాను’ అను నతఁడు బాదుషాహగారి ప్రతినిధిగఁ బంపఁబడెను.

అతఁడు అహమ్మదాబాదునందలి మార్వాడీల తొందరలకుఁ దాళలేక ‘దామాజీ’కి సేనానాయకుఁడగు రంగోజి యొక్క సాహాయ్యమును గోరి దాని కుపకృతిగ గాయికవాడునకు గుజరాతు పన్నులో నించుమించుగ సాబాలు నిచ్చి వేసెను. అట్లగుట ‘దామాజి’ కిని ఈ బాదుషాహ ప్రతినిధికిని 1742 లో ‘దామాజి’ మృతినొందువఱకును స్నేహము వర్ధిల్లెను. రమారమి ‘దామాజి’కిని ‘మోమిన్ఖాను’ నకును మైత్రిసమకూరు కాలముననె గుజరాతునందును కాఠియవాడునందును గాయికవాడు నధికారము ప్రబలముగాఁ జొచ్చెను. ఖాన్సా పట్టుపడుటయును నైజాము నౌకరుచే పాలితంబగుచుండిన బ్రోచిపట్టణమున వసూలగు సుంకముతో నర్థభాగ మీతనికిఁ జెందుటయును దీనికి నిదర్శనములని చెప్పనొప్పును. ఇంతియగాదు. సేనాపతిగ నేర్పఱుపఁబడిన జస్వంతరావు అసమర్థుఁడయినందున నితఁడే ఉమాబాయికి ముఖ్యమంత్రియయి కార్యములు నడుపుచుండెను. కావున

సేనాపతి శక్తియంతయును నీతని యంద నిలిచియుండె. ఇట్లు సర్వవిధముల బలమెక్కుచుండిన సమయమున 'దామాజి' మాళవముమీఁదికి నెత్తిపోయియుండెను. అంతలో మోమిను ఖాను పరలోకమున కరుగ నతని తావున ఫయా-ఉద్దీను నియమింపఁబడి యుండెను. అతఁడు మహారాష్ట్రుల యెడ విరోధభావము వహించి రంగోజి నెదిర్చి యోడించెను. కాని దామాజి, మాళవమునుండి వచ్చిన తోడనె మహారాష్ట్రులకు మంచియదృష్టము పట్టెను. ఫయా-ఉద్దీనుదేశభ్రష్టుఁడై పరుగెత్తవలసె. 'పెట్లాడు' రంగోజివశమయిపోయె. అహమ్మదాబాదు నగరమున గాయకవాడులకు నొక భాగము దామాజి సోదరుఁడగు ఖండేరావుచే సంపాదింపఁ బడియె. సూరతు పట్టణము విషయమున ననేకములగు నంతః కలహములు ప్రాప్తించుచుండి నందున 'దామాజికి' 1751 వ సంవత్సరమున నా నగరపు వరుంబడిలోఁ గొంతభాగము ఇయ్యఁబడున ట్లేర్పడెను.

రాజా 'సాహూరాజి' మరణముతో మహారాష్ట్రమున శక్తియంతయును పీష్వా 'బాలాజి' చేతులలోనికిఁ బోయెను. పునహా మహారాష్ట్రసామ్రాజ్యమునకు రాజధాని యయ్యెను. రాణీ సావిత్రీబాయికిని 'బాలాజి' కిని బద్ధవైరము. ఆమె కొల్హాపురపు రాజుగ నుండిన 'సాంభాజి' కి మహారాష్ట్ర సామ్రాజ్యాధిపత్యమును ఇప్పించ వలెనని ప్రయత్నించి అందుకు సాహాయ్యముగ 'దామాజి'ని రమ్మని వేడెను. 1751వ



సంవత్సరములో సేనాపతి యశ్వంతరావు యొక్క ప్రతినిధి దామాజి యగుటవలన పీష్వా ఇతనిని గుజరాతునం దర్ధభాగ మియ్యవలసినదని కోరెను. ఆయుత్తరువు నీతఁడు దిరస్కరించెను. ఆ సంవత్సరమే తారాబాయి శివాజి సంతతి వాఁడును దన మనుమఁడును నగు సతారారాజును మహారాష్ట్ర దేశముతోఁ గూడ పేష్వాల చెఱినుండి తప్పించ వలసినదని ఇతనికి నుత్తరు విచ్చెను. ఆముదల ననుసరించి ఇతఁడు 15,000 సైన్యముతో 'సోనఘడును' వదలిపయనమయి మార్గమున నెదురువడిన గొప్పదండు నొకదానిని ఓడించెను. కానిపీష్వా బలములతోఁ బోరుసమయమున నీతఁడు వానిచేఁ బూర్తిగఁ జుట్టఁబడుటవలన సంధిఁజేసికొన నిష్టము సూపెను. పీష్వాఆలోచన సల్పుచుండినట్లు నటించి మోసపుచ్చి ఇతనిని బట్టుకొని పునహా నగరమునఁ గారాగృహ మందుంచెను.

అటు తరువాత పీష్వా గుజరాతును మొగలాయీలనుండియు దామాజిపక్షము వారినుండియు లాగుకొనఁ జూచెనుగాని అతనికది సాధ్యముకాదయ్యె. కావున నతఁడు దామాజితో స్నేహపుమాటల నడపెను. చేయునదిలేక దామాజి పీష్వాకు గుజరాతునందు సగపాలు నిచ్చివేయునట్లును ముందుతాను జయించు భూభాగములలోఁగూడ నర్ధభాగము పీష్వాకు చెందునట్లును, నిబంధనలొనర్చు కొనెను. ఇంతియకాక వలసినప్పుడు పీష్వాకు సాహాయ్య మనుపఁదాను 10,000 సైన్యమును సిద్ధముగ నెల్లపు

డుంచుకొనుననియును కప్పముక్రింద 5 లక్షల 25 వేల రూప్యములు పీష్వాకుఁ గట్టుననియును గూడ నితఁ డొప్పుకొనియెను. 1753వ సంవత్సరమున దామాజియు నితర మహారాష్ట్ర నాయకులును జేరి అహమ్మదాబాదు పైకెత్తిపోయి మహా ధైర్య సాహసములతో డీకొని పోరాడిన జవాఁమర్ద్ ఖాఁ బాబిని పరాజితుఁ జేసి ఆనగరమును స్వాధీనపఱచుకొని నాఁటినుండి గుజరాతునందు మొగలాయీల యధికారము నడుగంటఁ జేసిరి. క్షీణింపఁ జొచ్చిన మొగలాయీల నుండి క్రమక్రమముగఁ దీసికొనఁబడుచుండిన భూభాగము పైనుద హరించిన సంధివలన గాయికవాడునకును పీష్వాకును సమభాగములుగఁ జేరుచుండెను.

ఇట్లు పీష్వాతో స్నేహము చేసికొనుట వలన నాతనితోఁ బోరాటముదక్క దామాజి దినదిన ప్రవర్ధమానమగు శక్తిని సంపాదించుకొనెను. 1761వ సంవత్సరమున మహారాష్ట్ర సామ్రాజ్యము నంతరింపఁజేయుట కేర్పడిన మృత్యుముఖమో నా సంఘటించిన మూఁడవపానిపట్టు (కురుక్షేత్ర) ఘోరయుద్ధమున నిలచి సంగర మొనర్చిన వీరులలో నీ దామాజియు నుండె. తనసాధ్యమగు వఱకు సదాశివరావుభావుకు సాహాయ్య మొనర్చి కార్యముతప్పుట దోఁచిన పిదప నితఁడు అదృష్టవశమున నెట్లో తప్పించుకొని గుజరాతువచ్చి చేరెను. అచ్చట మహమ్మదీయు లదియే సమయ మనుకొని మహా



రాష్ట్రబలంబుల నణంపఁ బ్రయత్నించుచుండుటం గాంచి ఈతఁడు తరుగని సాహసమున పెనఁగి ఏకమగుచుండిన మహమ్మదీయ శక్తుల నడచివైచెను. దీనికిఁ దరువాత బహు స్వల్పకాలములోనే ఇతఁడు దనరాజధానిని సోనఘడు నుండి 'పట్టను'నకు (అనఁగా ప్రాచీన అన్హిల్వాడకు) మార్చుకొనెను. 1763 మొదలు 1766 లోనితఁడు మహమ్మదీయులనుండి ప్రస్తుతపు 'కాడి' ప్రాంతమునంతయు సంపాదించి కాథియవాడ యందుంగూడ విస్తారమగు భూభాగమును గడించెను.

ఈవిజయములవలన నితని బొక్కసమునకును మిక్కుటమగు ద్రవ్యము చేరెను. ఈడా, రాజపిప్పలా సంస్థానములును గప్పములుగట్టువారైరి. ఇట్లుండ పానిపట్టుయుద్ధమునకు వెనుక అచిరకాలములోనే పీష్వా బాలాజి పరమ పదమునొందెను. పసివాఁడగు మాధవరావు పీష్వాపదమునకు వచ్చెను. అతనికాతని పినతండ్రి రఘోబావలననె చిక్కులు తటస్థించెను. బాలాజి మృతినొందువఱకు దామాజి పన్నులలో నాతనికిఁ జేరవలసిన భాగమును గ్రమముగ నిచ్చుచుండినను లేకున్నను ఆతని విషయమునఁ గుట్రలుపన్నుటకు మాత్రము సాహసించి యుండలేదు. కాని ఆతని తరువాత పీష్వాపదమునకై మాధవరావునకును, రఘోబాకును పెనఁగులాటలు దటస్థించి నప్పుడు పీష్వాయొక్క దుర్భర యాజమాన్యమును దప్పించుకొను నుద్దేశముతో దామాజి రఘోబాతోఁ జేరికొనెను. వీరిరువురకును గలి

గిన స్నేహమువలన గాయకవాడులకుఁ గట్టకడపట నష్టము వాటిల్లెను. మొట్టమొదట దామాజి రఘోబాకు సాహాయ్యుఁడయి పీష్వాగారి సైన్యముల నోడించుచు వచ్చెనుగాని 1768వ సంవత్సరమున మాధవరావు 'ధోడపు'వద్ద రఘునాధరావును దామాజికుమారుఁడగు గోవిందరావుతోఁ గూడఁ బట్టుకొనెను. దామాజి సంవత్సరమునకు 5, 25,000 లు కప్పము పీష్వాకు కట్టుటకును శాంతిసమయముల 3000 స్వారులను యుద్ధసమయముల 4000లను ఆతనికయి సిద్ధపఱచి యుంచుటకును పీష్వా మరలించుట కియ్యకొనిన కొన్ని జిల్లాలకుగాను రు2,54,000లు ఇచ్చునట్లును నొడంబడిక చేసికొనెను. ఈయుద్ధమునకుఁ బిదప బహు స్వల్పకాలములోనే దామాజి పరలోకమున కేగుటవలన గాయికవాడుల స్థితి మిక్కిలి హైన్యము చెందినదయ్యెను.

## గోవిందరావు (మొదటిసారి).

## (1768-1771)

దామాజికి నార్గురుపుత్రులు. అందు సయాజిరావు అను ప్రథమపుత్రుఁడు వెఱ్ఱివాఁడు. రెండవవాఁడగు గోవిందరావు పునహాయందు ఖయిదీ పాలెనుండె. వీరిరువురును ఇద్దరు భార్యల బిడ్డలు. దామాజిరావునకు మూఁడవ భార్యవలన మఱిముగ్వురు కొడుకులుండిరి. పీలాజి, మానాజి, మురారిరావులనివారికి పేళ్లు. వీరుగాక దామాజికి రెండవ భార్యవలననో మూఁడవ భార్యవలననో గలిగినవాఁడు ఫతేసింగను నాలవ కుమారుఁడును గలఁడు. ఈతఁడు మహాసమర్థుఁడు. తండ్రి చనిపోయిన తోడనే ఇతఁడు తమ యన్నలలోనెల్ల పెద్దయయి వెఱ్ఱియగు సాయాజి పరమునఁ బనిసేయఁజొచ్చెను.

ఇట్లు ద్వితీయ పుత్రుఁడగు గోవిందరావునకును ప్రథమ పుత్రుని మిష పెట్టుకొని ప్రయత్నములు సలుపు నాలవపుత్రుఁడగు ఫతేసింగునకును గాయికవాడు పదమునకయి వివాదములు ప్రారంభమయ్యెను. పీష్వాకింతియ చాలునుగదా! తనకుఁ బ్రతిస్పర్థిగఁ గార్యములకుఁ బూనుచుండిన గాయికవాడు కుటుంబమునందు కలహములు వచ్చుటయు నవ్వానిని దీర్చుటకుఁ దానేర్పడుటయుఁ దనకు శుభసూచకములుగ గ్రహించి గోవిందరావు ఫతేసింగుల వివాదములను బెంచుటకుఁ దోడ్పడెను. గోవిందరావు దన నగరముననే యుండుటవలన నతనినుండిగొప్ప నజరు గైకొని దామాజివలనఁ జేసికొనఁ బడిన యొడంబడిక కతని సమ్మతిందీసికొని యాతనిని గాయికవాడు పదమునకు నేమించి పంపెను. ఈలోపుగ ఫతేసింగు సయాజిరావు పరమున బరోడా నగరమును స్వాధీనము చేసికొని యుండెను.

## సయాజిరావు I. (1771-1778)

1771 వ సంవత్సరమున నితఁడు పునహాకుఁ దరలిపోయి అచ్చట పలుకుఁబడి సంపాదించికొని గోవిందరావుకంటె నెక్కుడుగ వాగ్దానములు చేసి పీష్వాగారదివఱకు నిర్ణయించియుండిన ఏర్పాటులను రద్దుపఱచునట్లొనర్చి సయాజిరావు సేనాఖాస్ ఖేలు

గనుదానతని ముతాలికుఁడుగను నుంఘులాగున ననుజ్ఞఁగొనెను. ఈవిషయము లింకను జరుగుచుండఁగనె పీలాజి మూఁడవ కుమారుఁడును కాఁడి జహాగీరుదారుఁడును నగు ఖండేరావు స్వప్రయోజనమునకయి దామాజిపుత్రుల వివాదములలో జోక్యముకలుగఁ జేసికొని యొకపర్యాయ మొక్కనికిని మఱియొకపర్యాయము మఱియొక్కనికి సాయముచేయుచు దేశక్షోభము కలుగఁ జేయఁజొచ్చెను. ఇట్టిదురవస్థలకాలమున గుజరాతును సంపూర్ణముగ పీష్వా మ్రింగివేయఁగలఁడను జ్ఞానము మందబుద్ధిగాని ఫతేసింగుకుఁ గలిగెను. కావునసతఁడు పునహానుండి మహాతృప్తుఁడు వోలె బరోడా వచ్చిచేరి అటనుండి బొంబాయియందలి ఆంగ్లేయవర్తకసంఘము వారితో మైత్రి సంపాదింపఁ బ్రయత్నించెను. అప్పటికది కుదిరినది గాదు. గాని 1773వ సంవత్సరమున బ్రోచి నవాబుతోఁ బోరాడి ఆంగ్లేయులద్దానిని దీసికొనినతోడనె వారు ఫతేసింగుతో నాపట్టణమును గుఱించి సంధిచేసికొనవలసిన వారయిరి. అదివఱకు నవాబు స్వాధీనమున నుండఁగా దానివరుంబడియందు గాయికవాడున కొక భాగము చెందుచుండెడిది. పట్టణము ఆంగ్లేయుల వశమయిన తరువాతంగూడ నట్లేజరగవలసినదని ఫతేసింగునకును ఆంగ్లేయవర్తకసంఘమువారికిని జరిగిన సంధివలనఁ దీర్మానింపఁబడెను. దీనికిఁపైఁబడి ఆంగ్లేయులు ఇతని విషయములలో



గలుగఁజేసికొనసందున నితఁడును గోవిందరావును గొంతకాలము ఒక్కరితోనొక్కరు ఒంటరిగ పెనఁగులాడుచుండిరి.

ఇట్లుండపునహాయందు నవీనములగు విశేషములు చూపట్టెను. పీష్వామాధవరావు 1772 వ సం॥ నవంబరు నెలలో మృతుఁడయియుండెను. ఆతనిసోదరుఁడు నారాయణరావు 1773 లోఁ జంపఁబడెను. ఈయల్లకల్లోలములలో రఘునాథరావు గద్దెనాక్రమించుకొనియె. అతఁడు 1773వ సంవత్సరాంతమున సయాజిరావును సేనాఖాస్ ఖేల్ పట్టమునుండితొలఁగించి తనకుఁ బూర్వస్నేహితుఁడగు గోవిందరావు కద్దానిని మఱలించెను. గోవిందరావిట్లు పీష్వాగారియనుగ్రహమువడసి వెడలివచ్చి 'సోనఘడును' ముట్టడించి స్వాధీనపఱచుకొనెను. ఈలోపుగ మృతినొందిన మాధవరావున కొక చిన్నికుమారుఁడు పుట్టుటయు పునహాయందు రెండు కక్షలేర్పడెను. రఘునాథరావాచిన్ని కుమారుని సింహాసనార్హుఁడుగ నంగీకరింపనందున నానాఫడ్నవీసు ముఖ్యుఁడుగ మంత్రులెల్లరును రఘునాథరావుపై వైరమూని అతనిని పునహానుండి వెడలఁగొట్టిరి. అతఁడు బొంబాయిలోని ఆంగ్లేయప్రభుత్వమువారిని సాయముచేసికొని నానాఫడ్నవీసుతోఁ బెనఁగ సమకట్టెను. గోవిందరావు ఫతేసింగు లిరువురును అతనికి సాహాయ్యమువత్తురను వార్తయుండెనుగాని తుట్టతుదకు గోవిందరావుమాత్ర మతనిం జేరెను. గోవిందరావు రఘునాథరావులు ఫతేసింగును బరోడాయందుముట్టడించిరిగాని పునహానుండి యత

నికి సాహాయ్యము వచ్చినందున విఫలమనోరథులయి వదలిచనిరి. నాఁటినుండి ఫతేసింగు పునహామంత్రుల పరమున సంగరరంగమున మహాశూరుఁడయి తన యావచ్ఛక్తినిజూపఁదొడఁగెను. పునహా బలము లాంగ్లేయులకు నిలువ లేక అనేకపర్యాయములు విజయమందకపోవుట సత్యమేకాని ఆంగ్లేయ సైన్యములు మాత్రము రఘునాథరావు యొక్కయు గోవిందరావు యొక్కయు పిచ్చిపటాలములు బరువై వ్రేగుటవలన గొప్పనష్టముల నందెను. గుజరాతునందు జరుగుచుండిన విగ్రహాము 1775 సంవత్సరము మే నెల కడపటి దినములలో సమాప్తినొందెనని చెప్పవచ్చును. అప్పటికి ఫతేసింగు బరోడాయందు సర్వస్వామిగనుండె. గోవిందరావు ఆంగ్లేయగుకర్నల్ - కీటింగుతోఁగూడ దురవస్థ లందుచుండెను. అట్టియ సేనాని సమయమున గోవిందరావు కర్నలుకీటింగును బరోడా ముట్టడించి తనవశము చేయవలసినదని యడిగెను. అయిన ఫతేసింగు చాతుర్యము లేనివాఁడు కానందున నాతఁడు శత్రుగణములోని వాఁడయినను అదివఱకె ఆంగ్లేయులతో మైత్రి గడింపఁ బ్రయత్నించుచుండెను.

ముట్టడించి బరోడాను గొనవలసిన గోవిందరావునకుఁ దోడ్పడుట కంటె బరోడాను సర్వస్వాధీనమున నుంచుకొనిన ఫతేసింగుతో స్నేహము కుదుర్చుకొనుట దుర్దశల పాలగుచుండిన రఘునాథరావునకును కర్నలు కీటింగునకును లాభకారిగఁ దోఁచెను. కావునవారు గోవిందరావు నట్టెవదలి ఫతేసింగుతో



సంధివాక్యములకుఁ బ్రారంభించి జూలై నెల 8 వ తేది యొడంబడిక చేసికొనిరి. దానివలన సయాజిరావు పరముగ ఫతేసింగు రఘునాథరావునకు సంవత్సరమునకు 8 లక్షలరూపాయి లిచ్చునట్లును, వలసినప్పుడు మూఁడువేల సైన్యములు సాహాయ్యమంపునట్లును, ఆంగ్లేయులకు, పీష్వాకును వారికిని జరిగిన సంధిననుసరించి, బ్రోచి పట్టణపువరుంబడియును మఱికొన్ని పరగణాలును ఇచ్చునట్లును గోవిందరావుకు ఫతేసింగుసయాజిరావులేమియు నియ్యనక్కరలేనట్లును ఏర్పడెను. ఇంతేకాక ఫతేసింగు రఘునాథరావునకు రు 26 లక్షలు నరువది దినములలో నిచ్చుట కంగీకరించెను. ఈమొత్తము కర్నలుకీటింగునకు సైన్యముల జీతము బత్తెములకు గావలసివచ్చినందున నతఁడు ఫతేసింగును అదలించి బెదరించి చాలభాగము వసూలుచేసికొనెను. ఈలోపుగ బొంబాయిప్రభుత్వమువాగు రఘునాథరావుతోఁ జేసికొనిన సంధిసికలకత్తాలోని యాజమాన్యప్రభుత్వమువారు రద్దుచేయుట సంభవించెను. ద్రవ్యములాగుటకయి ఈవిషయమునుగూడ కొంతకాలముగప్పి పుచ్చి కర్నలు కీటింగు ఫతేసింగునుండి 20 లక్షలవఱకునురాఁబట్టెను. కాని వానలు నిలచిపోయినతోడనె యాజమాన్య ప్రభుత్వమువారి యుత్తరువుననుసరించి కర్నలుకీటింగు బరోడాప్రాంతమువదలి చనెను. రఘునాథరావును అతని వెంబడినెయరిగె. కావున గోవిందరావు ఫతేసింగులు మఱల నొక్కరొక్కరుఁడుగనె పోరాడ

మొదలిడిరి. ఫతేసింగు గోవిందరావునకు అప్పటి బరోడా సంస్థానమున మూఁడవవంతు నిచ్చెదనని యొకపర్యాయమును నంతకంటె నెక్కుడిత్తునని మఱియొక పర్యాయమును, వార్తఁ బంపెను. కాని దుర్బోధనలవలన గోవిందరావు వీనికన్నిటికిని పెడచెవి నిడియెను. తరువాత జరిగిన విశేషము లెవ్వియో మనమెఱుంగముగాని 1778 వ సంవత్సరమున ఫతేసింగు బహుస్వల్పద్రవ్యమును వెచ్చించి పీష్వానుండి సేనాఖాస్ ఖేల్ పట్టము నందెను. గోవిందరావు నాఁటినుండి రెండు లక్షలరూపాయిల జహాగీరుతోఁ దృప్తిఁ జెందవలసిన వాఁడయ్యెను.

## ఫత్తేసింగు (1778-1789).

ఇట్లు ఫతేసింగు గాయికవాడు పదమున స్థిరపడియెను. ఇతఁడు సింహాసనమునకు వచ్చిన ప్రథమ దినములలో పురందరు సంధివలన మహారాష్ట్రులచే నాంగ్లేయులకు స్వాధీన పఱుపఁబడియుండిన బ్రోచి నగరమును మఱల సంపాదించుటకయి విశ్వప్రయత్నములు చేసెను. ఆపట్టణము గాయికవాడునకుఁ జేరినదగుటచే అతని యుత్తరువుగాని సమ్మతిగాని లేనిది ఇతర మహారాష్ట్రులద్దాని నిచ్చకువచ్చినట్లిచ్చివేయుట న్యాయముగాదని వాదించి దానిని చేఁబట్టుకొనఁ జూచెను. తనయొద్దనుండి కర్నలు కీటింగు తీసికొనిన ద్రవ్యము విషయమునను గూడ నాంగ్లేయులతోఁ గొంత పెనఁగులాడెను. కాని ఫలమేమియు లంభించినదిగాదు. 1779వ సంవత్సరమున పునహామహారాష్ట్రుల



కును ననఁగా పీష్వాకును ఆంగ్లేయులకును మఱల విగ్రహము ప్రారంభమయ్యెను. అందు గాయికవాడు మహారాష్ట్రులఁ జేరువాఁడేగాని కర్నలు గాడ్డార్డు గాయికవాడు రాజ్యమును ఆధారభూమి (base of operation) గఁ జేసికొనుట యావశ్యకమని తలంచి బొంబాయిలోని సైన్యములను జేర్చుకొని యకస్మాత్తుగ 'దాభాయిని'గొని బరోడాకుఁ బోయి చేరుటవలన గాయికవాడు నానాఫడ్నవీసు పలుతెఱంగుల వేడుచున్నను నాతనివిడిచి ఆంగ్లేయులకు సాహాయ్యుఁడు గావలసివచ్చెను. 1780 వ సంవత్సరము జనవరి నెల 26వ తేది ఫతేసింగునకును ఆంగ్లేయవర్తక సంఘము వారికిని కండిలాగ్రామమువద్ద సంధిజరిగెను.

ఈసంధివలన పీష్వాకు గుజరాతునందుండిన భాగము ఆంగ్లేయులకుఁ జేరిపోయెను. గాయికవాడు గుజరాతునందు దన భాగమున స్వతంత్రపరిపాలకుఁ డయ్యెను. ఇట్లు పంచుకొనుటలో సౌకర్యముకొఱకుఁ గొన్ని ప్రదేశములు మార్చుకొనఁబడెను. అందుచే ఫతేసింగునకు అహమ్మదాబాదు మున్నగునవి దొరికెను. ఆంగ్లేయులకు మాహీకి దక్షిణమందుండిన పీష్వాయొక్క భూభాగము చెందెను. గాయికవాడు పీష్వాకు చెల్లించుచుండిన కప్పమియ్యక తిరస్కరించుటలో నాంగ్లేయులు దోడ్పడ నొప్పుకొనినందున వారికాతఁడు జిన్నూరుజిల్లాయును బ్రోచికి సంబంధించిన మఱికొన్ని గ్రామములును శాశ్వతముగ దానముచేసెను. వారును అతఁడును

పరస్పరము సాహాయ్యము చేసికొన నియమించుకొనిరి. ఈసంధి కిఁదరువాత సింధియా ఫతేసింగును పీష్వా ప్రక్కకులాగుకొనుట కెన్నియో ప్రయత్నములొనర్చెనుగాని అవి యెవ్వియును గాయికవాడును గదలింపలేకపోయెను.

ఇట్లాంగ్లేయుల యెడ సంపూర్ణ విశ్వాసము గలిగి ఫతేసింగు వారికిఁ దోడ్పడుచుండెను. కాని ఈలోపుగ నైజాము హైదరాలియును మహారాష్ట్రులును నైక్యమగుదురను పెద్ద భయమొక్కటి చూపట్టినందున యాజమాన్య ప్రభుత్వము వారు పీష్వాసంధివాక్యములకుఁ జెవియిచ్చి లోఁబడిరి. అందువలన సాలబేసంధి 1782లో జరిగెను. దాని నిబంధనల ననుసరించి గాయికవాడు మఱల పూర్వపు స్థితికే వచ్చి చేరెను. అతని బొక్కసమునందలి ద్రవ్యము వ్యయమయి యుండుటయు నతని బలములు దగ్గియుండుటయుఁ దప్ప అతని కేలాటి లాభమును గలిగినదిగాదు. ఎప్పటివలె పీష్వాకుఁ గప్పము గట్టుట గూడ మఱల నాతనికి సంభవించెను. 1789 వ సంవత్సరము డిశెంబరు నెల 21-వ తేది నతఁడు నగరుమేడపైనుండి యకస్మాత్తుగఁబడి మృతి నొందెను.

మానాజి (1789-1793).

ఫతేసింగు చచ్చినతోడనే అతనితోఁగూడ యుద్ధములలోఁ బనిసేయుచుండిన మానాజి యనుసోదరుఁడు గోవిందరావ్వైకమూలనుండి యాక్షేపించుచుండఁగనె పీష్వాకుఁ దగినంత



నజరునిచ్చి ఫతేసింగప్పువడిన 36లక్షుల కప్పముగట్ట వాగ్దానము చేసి సయాజిరావు పేరుమీఁద గాయికవాఁడు పదమును బట్టుకొనెను. అయిన సింధియా గోవిందరావు పరముయినందున నతనికిని మానాజికిని పరస్పర కలహములు 1793 లో మానాజి పైలోకమున కేగువఱకును జరుగుచుండెను. వెట్రిసయాజి 1792 లోనే యుసురులు దొరగియుండె. కావున మానాజి పితృగణములఁ జేరుట తడవుగ గోవిందరావు గాయికవాడు పట్టమునకు సిద్ధమయ్యెను. అయిన నానాఫడ్నవీసునకు బరోడా సంస్థానము నెల్లైన రూపు మాపనలయునను పట్టుదల యంకురించి యుండె. కావున నాతఁడు గోవిందరావు నుండి నజరుగనేమి, ఫతేసింగు చేసిన బాకీదీర్చుటకనియేమి, సేనాఖాస్ ఖేల్ బిరుదమునకయియనియేమి, గాయికవాడులు చేర్చుటకు సాధ్యముగాని మొత్తమును రాఁబట్టఁజూచెను. సాలబే సంధివలన గాయికవాడు రాజ్యమునశింపరాదని నిర్ధారణ సేయఁబడి యున్నందున నాంగ్లేయు లీతరుణమున గోవిందరావు పక్షము వహించి నానాఫడ్నవీసునకు బుద్ధి చెప్పు వారయిరి.

గోవిందరావు (రెండవసారి 1793-1800).

1793 వ సంవత్సరము డిశెంబరు నెల 19-వ తేది గోవిందరావు సేనాఖాస్ ఖేల్ గ నియమింపఁబడెను. అయిన నింకొకపోరాటములేక అతఁడు ముఖ్యపట్టణమును ప్రవేశింపలేఁడయ్యెను.

అతని యధర్మ పుత్రుఁడగు కన్హోజి సింధియాయొక్క ప్రోత్సాహముచే బరోడాయందు నిలచి తండ్రి నెదిర్చెను. కాని అతని సైన్యములేయతనిని బట్టి యిచ్చినందున గోవిందరావు సులభముగ ముఖ్యపట్టణమును జొచ్చి కుమారుని చెఱనెట్టెను. వాఁడును మాయోపాయమునఁ దప్పించుకొని పోయి, కాడీ ప్రాంతమున జమీందారుగ నుండెనని ఇదివఱకు పేర్కొనఁబడిన ఖండేరావునకుఁ గుమారుఁడయి తండ్రికనంతరము జమీను ననుభవించుచుండిన మల్హారరావుతోఁ జేరుకొని గోవిందరావు నెదుర్ప సమకట్టెను. యుక్తిచే గోవిందరావు వారిరువురకును భేదములు పుట్టించి కన్హోజిని మరలఁ బట్టుకొని కారాగృహమునఁ బడవైచెను. మల్హారిరావు చేయునది లేక గోవిందరావుతో నొడంబడిక చేసికొనియెను. గోవిందరావు కాలమున జరిగిన విషయములలో నింకొకటియె ముఖ్యముగ వర్ణింపఁబడవలసి యున్నది. నానాఫడ్నవీసునకుఁ బ్రతినిధిగ ఆబాషెలూకరు అహమ్మదాబాదున సుబేదారుగ నుండెడివాఁడు. నానాఫడ్నవీసు సింధియా చేతులలోఁ జిక్కుపడినప్పుడు గోవిందరావు అహమ్మదాబాదును బట్టుకొనవలసినదని యుత్తరువాయెను. అయిన నితనికి ఆబాషెలూకరునెడ మంచి యభిప్రాయముండుటంబట్టి ఈతని మంత్రియగు రావ్జీ అప్పాజి పదిలక్షల ద్రవ్యము గొని అహమ్మదాబాదును ఆబాకు వదలిపెట్టఁ దీర్మానము చేసికొనెను. కాని ఆ పైకము నిచ్చు విషయములోఁ బోట్లాటలు ప్రారంభ





నానాఫడ్నవీసు.

మయినందునను, రావ్జీ అప్పాజీని ఆబా తిరస్కరించి మాటలాడినందునను, అంతటితో నిలువక ఆబా బరోడా గోసాయిల నొకకొందఱిని దోచుకొనినందునను, గోవిందరావు ఆబా షెలూకరుపై విగ్రహమునకుఁ బూనెను. ఇది జరుగుచుండఁగనె 1800లో నానాఫడ్నవీసు పరలోక ప్రాప్తిఁజెందెను. పీష్వా బాజీరావున కతని మరణమువలన బరువు దగ్గిపోవ నాతని పక్షమువాఁడగు ఆబాను విడువక తెఱిమి దీనునిఁ జేయవలసినదని అతఁడు గోవిందరావునకు వార్త పంపెను. నాలుగు నెలలు పోరాటము జరిగిన పిదప ఆబా షెలూకరును అతని సైనికులే మోసపుచ్చుటవలన నతఁడు గోవిందరావుచేతఁ జిక్కి ఖయిదీ యయి పోయెను. దీనివెనుక గోవిందరావున కధర్మపుత్రుఁడయ్యును నాతనికిఁ బ్రియుండగు భగవంతరావునకు సంవత్సరమునకైదు లక్షలరూపాయి లిచ్చు నిబంధనతో నామకార్థము అహమ్మదాబాదు గుత్త కీయఁబడెను. రావ్జీ అప్పాజి మిక్కిలి బలవంతుఁడయియుండినందున ఆతని కింకను శక్తి నీనొల్లక భగవంతరావు ప్రతినిధిగ సింధియా మంత్రి తమ్ముఁడగు యాదవరావును అహమ్మదాబాదునకుఁ బంపుటకు గోవిందరావు ప్రయత్నము సేయుచుండెను. ఇట్లుండఁగనె అతఁడు 1800 సం॥ సెప్టంబరు నెలలో మృతినందెను. అతని భార్య సహగమనమున కుంకించెను. కాని రావ్జీ అప్పాజి తమ్ముఁడు బాబాజీయును, మీర్‌-కమార్‌-ఉద్దీనును మంగల్ సాముల్ పారక్ అను సైన్యములకు వేతన



ములనిచ్చు సాహుకారులును, ఆమెను వారించి ఆమెకుమారుఁడగు ఆనందరావును గాయికవాడు పదము నధిష్ఠింపఁజేసిరి.

## ఆనందరావు (1800-1818).

రావ్జీ అహమ్మదాబాదునుండి తీవ్రగతినేతెంచి రాజ్యభారము నిర్వహింప మొదలిడెను. అయినఁ దండ్రియుండఁగనె రాజ్యమునకై ప్రయత్నించిన కన్హోజి మిన్నకుండువాఁడె? అతఁడుఁ రహస్యముగ బరోడా ప్రవేశించి సోదరునికడకేగి ఆతనికి బోధలొనర్చి యల్లసల్లన నున్నతోద్యోగములను సంపాదించుకొనెను. అటనుండి సైన్యముల లోఁబఱచుకొనియె. తన్మూలమున రాజ్యశక్తులన్నియు నాతని చేతనుండిపోయె. వానిని జాగరూకుఁడై యుపయోగించియుండిన బాగుండి యుండునుగాని స్వల్పబుద్ధులకు దూరాలోచన యుండదుగదా! కన్హోజీ కైశ్వర్యము గన్నులఁగప్పివేసెను. ఆనందరావునెడను, రాణిగారియెడను, ప్రభువులయెడను, సైన్యములయెడను, జనులయెడను నతఁడు కాఠిన్యము సూపనారంభించె. అంతటితో నాతని సామర్థ్యము నశించె. ఒక్కనాఁటిరేయి అరబ్బీసైన్యములతని నగరుం జుట్టికొని యతనినిఁబట్టి ఆనందరావున కప్పగించెను. వెంటనే యానందరా వతనిని కారాగృహముపాలుచేసెను.

ఇట్లు కన్హోజి రంగమునుండి యదృశ్యుఁడయిన పిదప రావ్జీ అప్పాజి మరల ప్రముఖుఁడయ్యెను. కాని అతనిచేతనె పెంచఁబడిన అరబ్బీ సైన్యములతనికె క్రమింగరానికడియై పఠణ

మించియుండె. కావున నాతఁడు ఆంగ్లేయుల సాయమువేడ నుద్యుక్తుఁడయ్యెను. దానినోర్వక యరబ్బీ లొక్కతఱియాతనిం జంప నెంచియాతని పల్లకిపై గుండ్లుపఱపిరి గాని దానివలన నాతనిబోయీలు మాత్రము మడసిరి. ఈలోపుగ కన్హోజి తల్లి వలన రేపెట్టఁబడి కాడీజహాగీరుదారగు మల్హారిరావును ఆనంద రావున కధర్మసోదరుఁడగు ముకుందరావును రావ్జీయానంద రావుల పయినెత్తిరా నిర్ణయించుకొని బొంబాయిలోని యాంగ్లేయప్రభుత్వమువారి సాయము గోరిరి. ఇట్లీరువాగులవారును దమ్ము నాశ్రయించుటవలన నేపక్షమవలంబించుటకును నిష్టము లేనివారయి యాంగ్లేయులు దమప్రతినిధి నొక్కరుని బరోడా కనిపి మధ్యవర్తిత్వము సలుపుమనిరి. మేజర్ వాకరు 1802 వ సంవత్సరము జనవరి 29వ తేది ఆనగరముచేరి సంగతుల విచారించెను. అతని తీర్మానములు మల్హారిరావునకు వ్యతిరేకము లయ్యెను. వానికి మల్హారిరావు అంగీకరింపఁడయ్యె. కావున నాంగ్లేయులు ఆనందరావు పక్షమయి కాడీజహాగీరుదారుతో విగ్రహమునడపిరి. మల్హారిరావు ఓడింపఁబడియె. ఆతనికి 1¼ లక్షల విలువగల ఆస్తినుండనిచ్చి తక్కినదంతయును ఆనందరావు నధికారము క్రిందికి తేఁబడెను. మల్హారిరావు కన్హోజియును పలుమారుతిరుగఁబడిరి. అందుచేత కన్హోజి 1812లో మద్రాసునకుఁ బ్రవాసమునకుఁ బంపివేయఁబడెను. మల్హారిరావు బొంబాయి చెఱసాలయందుంచఁబడఁగ నచ్చటనె మృతినొందెను.



మల్హారిరావుతో విగ్రహము ప్రారంభమగుటకుముందు రావ్జీఅప్పాజి ఆంగ్లేయులతోఁ జేసికొనిన యొడంబడిక 1802 వ సంవత్సరము జూలై నెల 20 వ తేది గాయికవాడువలన వ్రాతమూలకముగ స్థిరపఱుపఁబడెను. దానివలన విగ్రహమునకయిన కర్చెల్లయును ఆనందరావే భరింప నియ్యకొనెను. అరబ్బీల సైన్యమును దగ్గించుటకును మఱి యితరకార్యములకును గాయికవాడు సీమలో నొకసాహాయ్య సైన్యముంచఁబడున ట్లేర్పడెను. దానికగువ్యయము నెలకు రు 65,000లని లెక్కించి అంత ఆదాయముగల భూభాగము ఆంగ్లేయుల కప్పగింపవలసినదని తీర్మానింపఁబడెను. చౌరసిపరగణాయును సూరతునగరమున గాయికవాడునకు వసూలగు చౌతుపన్నును వారి కర్పింపఁబడెను. ఇంతియగాక ఆనందరావు దనకాంగ్లేయు లొనర్చిన మహోపకారమునకుఁ గృతజ్ఞత సూపుటకయి చిక్లీపరగణాను వారి కినాముగ నిచ్చివేసెను. గాయికవాడు బొక్కసమున ద్రవ్యము నుండకపోవుటవలనను భూములదివఱకే అడుమానములు పడియుండుట వలనను ఈసంధివలన నానందరావు ఆంగ్లేయ ప్రభుత్వమువారికి ఇయ్యవలసివచ్చిన భూములను గుఱించియు చెల్లించవలసిన పైకమునుగుఱించియు మఱికొన్ని యొడంబడికలు జరిగెను. దానివిస్తర మిటయనవసరము. ఇట్లు సైన్యవిషయములను ద్రవ్యాదుల విషయములను కట్టుదిట్టములొనర్చుకొనుటయేగాక యీసంధివలన నానందరావు.

తనరాజ్యమున దుర్మార్గము సేయువారినెల్లరను అందునఁ దా నొక్కఁడగుట తటస్థించినచోఁ దన్నుఁగూడ శిక్షింప ఆంగ్లేయుల కధికార మిచ్చివేసెను. మేజరువాకరు రెసిడెంటయ్యెను. అరబ్బీలు సర్వస్వతంత్రులుగ నుండినందున బరోడాయందప్పటికి రాజ్యాంగమే యుండలేదని చెప్పవచ్చునని యొకచరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. ఎట్లైననేమి. ఆంగ్లేయబలములు బరోడాఁ జొచ్చి అరబ్బీలను వశపఱచుకొని వారికి గాయికవాడు వలన నష్టముగలుగకుండునని యభయమిచ్చి వారి పటాలములను దగ్గించి ఆనందరావును గద్దెపై స్థిరముగ నిలుపవలసియుండె. అరబ్బీ సైన్యములకు సంవత్సరమునకు రు3,00,000లు అగుచుండెను. ఆంగ్లేయులు బరోడా ప్రవేశించునప్పటికి అరబ్బీలకు రు 20,00,000 అప్పు నిలచియుండె. ఆసంవత్సరపు పన్నులును ఆయకమయి పోయియుండెను. కావున అరబ్బీల యప్పులుదీర్చుట కాంగ్లేయ ప్రభుత్వమువారు జమీను జామీనుగఁ బెట్టుకొని ద్రవ్యము నిచ్చిరి. కొంతరక్తము ప్రవహించిన తరువాత నరబ్బీదండులు విఱిసిపోయె. సాహాయ్యసైన్యములు బరోడాయందు నెలకొల్పఁబడెను. 1805వ సంవత్సరమున నదివఱకు నాంగ్లేయులకును గాయికవాడునకును జరిగియుండిన సంధులలోను ఒడంబడికలలోను వివరించిన విషయములను ఒక్కెడఁ జేర్చుటకు మఱియొక నూతన సంధినడిచెను.



దీనియం దొక్కటి మాత్రము విశేషాంశము గన్పట్టుచున్నది. అంతకమున్ను ఆనందరావు సాహాయ్యసైన్యము రెండువేలుండున ట్లేర్పఱచికొని యుండెను. కాని ఈ సంధిననుసరించి అదిమూఁడువేలొనర్పఁబడెను. ఈసైన్యపుఁగర్చులకయి గాయికవాడు సంవత్సరమునకు రు 11, 70, 000ల సీను భూభాగమును ఆంగ్లేయులకు నిచ్చివేసెను. ఇంతియగాక విగ్రహమున కయిన వ్యయమున కయ్యును అరబ్బీలకియ్యవలసిన యప్పులఁదీర్చుట కయ్యును ఆంగ్లేయులును సాహుకారులును ఆనందరావునకు బదులిచ్చియుండిన రు 41, 38, 732-2-6లకుగాను కొన్ని పరగణాలవరుంబడి ఆ మొత్తము దీరువఱకును ఆంగ్లేయులకును సాహుకారులకును జేరవలసినట్లు నిర్ణయింపఁ బడెను. ఆనందరావు ఆంగ్లేయ ప్రభుత్వము వారి యనుమతిలేనిది ఇతర రాష్ట్రములతో విగ్రహముప్రారంభింప కుండుటకును ఐరోపియనుల నైనను అమెరికావారినైనను బ్రిటిషువారి ప్రజలోని స్వదేశీయుల నైనను వారి యుత్తరువులేనిది తనయొద్ద నౌకరులుగ నుంచుకొన కుండుటకును నిర్ణయించుకొనెను.

నాఁటినుండి రెసిడెంటు వాకరు మంత్రులసాహాయ్యమున బరోడా సంస్థాన రాజ్యాంగమును సంస్కరింప మొదలిడెను. 1803 నందె రావ్జీఅప్పాజి పరలోకమున కేగియుండెను. అతని పదమున కాతని పెంపుడు కుమారుఁడు శీతారాము నియమింపఁబడెను. కాని ఈశీతారాము వట్టిదుర్మా

గ్గుఁడైనందున సంస్కారములఁ దోడ్పడుటకు బదులు కుట్రలాలోచించి స్వామిద్రోహము సేయఁ బూనుకొనెను. అందువలన నతఁడు తుట్టతుదకు (1808) అవమానము చెందెను. అతఁడింకను దివానుగనుండునప్పుడు దన పినతండ్రియగు బాబాజీ అప్పాజిని దనకు సాహాయ్యము పిలుపించుకొని యుండెను. ఇంతేకాక శీతారాముయొక్క శక్తిని దగ్గించుటకయి ఆనందరావు తమ్ముఁడగు ఫతేసింగు బాబాజీతోఁ గూడఁ రాజప్రతినిధగ నేమింపఁబడి యుండెను. ఇట్లు బరోడాసంస్థానము రెసిడెంటుగారి బోధలననుసరించి దివాను, రాజప్రతినిధి మఱి ఇతరమంత్రులు మున్నగువారలతోఁ జేరిన సభవలన పరిపాలింపఁబడఁ జొచ్చెను. ఈ సభకే కమీషనని పేరు. దీని కలయుటలకే దర్బారులని నామము. మొదటి దర్బారు 1807 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 3 వ తేది నాఁడు జరిగెను. నాఁటినుండి బాబాజి ముఖ్య కార్యనిర్వాహకుఁడయి రాజ్యాంగమును నడపెను. ఇట నక్కాలమునందు ఆ సంస్థానమున రాజ్యవ్యవస్థ యెట్లుండినదియు వాకరువలన నయ్యదెట్లుపయోగించుకొనఁబడినదియును సంక్షేపముగ వర్ణించవలసియున్నది.

అప్పులు విశేషముగ రాజ్యాంగముపయి నిలచియుండెనని పైని వ్రాయఁబడియెను. ఆదాయమార్గములలో ముఖ్యతమమగునది యేరాష్ట్రమునందును భూమి పన్నేగదా! దానిని వసూలుచేయు పద్ధతులు బరోడాయందు పూర్వ రాజ్యము



లలో ననేకము లందుం బలెఁ బెక్కు కష్టములను గలిగించియుండెను. మండలములు మండలములు గుత్తల కియ్యఁబడుటవలనగుత్తలకుఁ గొనువారొక్కరి నొక్కరు మించు నభిప్రాయముతో సత్యధికముగ లంచములిచ్చుటయుఁ దమకయిన కర్చులను రాఁబట్టుకొనుటకై రైతులను బీడించుటయు సంభవించియుండెనని విశేషాంశముగఁ జెప్పఁ బనిలేదు. అయిననింతకంటె నెక్కుడు దురదృష్టమేమన గుత్తకుఁ బుచ్చుకొనినవారు బలవంతు లయినతోడనె స్వామిసొమ్మును చెల్లించుటయె యరుదయి పోఁజొచ్చెను. తప్పుడు లెక్కలఁ బెట్టి రాజ్యాంగద్రవ్యమును హరించు వారనేకు లేర్పడియుండిరి. రాజ్యాంగపుఁ బేరున దుర్వ్యయము లనేకములు చేయఁబడుచుండె. ఇట్లు సూచింపఁబడిన మహాలోపముల నాశ్రయించి స్వల్పలోపము లనేకములు చూపట్టి తండోపతండములయి పెరిగి రాజ్యాంగపు జీవరసమును బీల్చి వేయుచుండెను. వీనినన్నిటిని మాన్పుటకొక్కనికి సులభసాధ్యమగునా! అయిన రెసిడెంటు వాకరు సంస్కారములఁ జేయుటకు గంకణముగట్టిదనమనోరథమును గొంతవఱకుఁ దీర్చుకొనెను. మండలములను గుత్తలకిచ్చు పద్ధతిని మాన్పలేఁడయ్యెనుగాని గుత్తగాండ్లను దగినవారిని నేరుటయందు మాత్రము మిక్కిలి పరిశ్రమఁ జేసి మోసగాండ్రనుండి పైకము రాఁబట్టుటకును లేనిచో వారిని దండించుటకును న్యాయస్థానము నేర్పఱచెను.

బరోడా సంస్థానమునకు వరుంబడికి మఱియొక మార్గముండెడిది. కాథియవాడు నందును ఇతర ప్రదేశములందునుగల చిన్నచిన్న సంస్థానములనుండి ప్రతి సంవత్సరమును గప్పములు చెల్లుచుండెడివి. వీనిని కప్పములనియుఁ జెప్పుటకు వీలులేదు. మహారాష్ట్రులు గొంతరాజ్యము నేలుచు మఱికొంత రాజ్యము మీఁదికి దండులతోఁ గూడనెత్తి పోయి ఏటేట చేతికిఁ దొరకిన ద్రవ్యమును దెచ్చుకొనుచుండుట యాచారము. ఆ యా చిన్న సంస్థానమువద్దకు నీమహారాష్ట్ర నాయకులు పోవుటతోడనె అచ్చటి పాలకులు గాని పాలకులులేనిచోఁ బురవాసులుగాని ముందు సంవత్సరమునఁ దామిచ్చిన మొత్తమును మఱలఁజేర్చి దండెత్తివచ్చిన ప్రభువునకు ఊరిబయటికే తెచ్చియిత్తురు. ఆమొత్తము వచ్చిన నింక నెక్కుడు కావలయుననియుఁ బ్రభువులు కోరుట కలదు. వీరిదాడికి ఓర్వలేక ఆయా స్వల్పసంఘములవారు వీరికోరికననుసరించి ఇచ్చుటయు గలదు. ఇట్టికప్పములను వసూలుచేయు కార్యక్రమమునకు 'ములుక్ గిరి' అనిపేరు. గాయికవాడులు పీష్వాగారితో గూడ నిట్టి 'ములుక్ గిరి' స్వాతంత్ర్యమును సంపాదించుకొని యుండిరి. వాకరు రెసిడెంటు అయినతరువాత నతఁడు కాథియవాడులోనికిఁబోయి అదివఱకు నాంతరంగిక దుఃఖము వలన గాయికవాడులు వసూలుచేయని ములుక్ గిరి పన్నునంతయును లెక్కలువేసి సామంతులకు సంతకుఁ బూర్వము నందుంబోలె నన్యాయములు జరుగకుండ నేర్పాటులొనర్చి 'ములుక్ గిరి'ని నిశ్చయమయిన కప్పములలోనికి మార్చివేసెను.



ఇట్లు వరుంబడివిషయమున పరిశ్రమచేసి మహాకష్టముతో సిబ్బందిని దనకుసాధ్య మయినంత తగ్గించివేసెను. రాజ్యాంగముల నొక్కొక్కదానికిని సంవత్సరమున కింతకంటె నెక్కుడు వ్యయము కాకూడదని నిర్ధారణముచేసి ఆమొత్తమును మించకుండ నేర్పఱచెను. మహారాజుగారి స్వంతవ్యయము విషయమునఁగూడ హద్దులనునిచెను.

ఈ కార్యములనెల్ల బహు సమర్థతతో నెరవేర్చుచు రెసిడెంటునకు ముఖ్యసాహాయ్యుఁ డయియుండిన బాబాజీ అప్పాజీ 1810వ సంవత్సరము నవంబరు నెలతోఁ జనిపోయెను. అతనికుమారుఁడు విఠలరావు భావు ఆతని స్థానమున 'ఖాస్గివాలా' (కార్యనిర్వాహకుఁడు) ఆయెను. 1813లో నితఁడు కాథియవాడునకు సర్ సూబాగా[1] వెడలిన పిదప సుప్రసిద్ధుఁడగు గంగాధర శాస్త్రి దివాను పట్టమునకు వచ్చెను. 1810లోనే రెసిడెంటు వాకరు స్వదేశమునకు వెడలిపోయి యుండెను. అతని పదమున కాప్టెన్ (తరువాత మేజరు జనరల్) సర్ జేమ్సు కార్నకు నియమింపఁబడియుండెను. ఈయిరువురు రెసిడెంటుల యధికారముక్రింద బాబాజీ, విఠలరావు, గంగాధర శాస్త్రి వీరల సామర్థ్యము వలన బరోడా సంస్థా

1. ప్రతినిధి

నము ఆంగ్లేయులకు బాకీపడియుండిన మొత్తము నంతయును 1812 వ సంవత్సరము లోపలఁ దీర్చివేసియుండెను. కావున నాంగ్లేయులు బరోడా రాజ్యమునందు విశేషము జోక్యము పుచ్చుకొను ఆచారము మానివేయ వలయునను ఉద్దేశము గల వారయిరి.

ఇదివఱకే వ్రాయఁబడిన తెలుఁగున కన్హోజి మఱలఁ దిరుగఁబడి యల్లరులకుఁ బూనిపందునను ముందువర్ణితము గాఁబోవు ఇతరకష్టములు చూపట్టినందునను పై యుద్దేశము ఆంగ్లేయ ప్రభుత్వమువారికి నెఱవేఱినది గాదు. కన్హోజి మద్రాసునకుఁ బ్రవాసమునకుఁ బంపఁ బడకమున్నె పీష్వా గాయికవాడు దనకు బాకీదారుఁడని గొప్పలెక్కలను వేయ నారంభించెను. అహమ్మదాబాదు విషయమున నాతఁ డితని కిచ్చిన కౌలునకుఁ గూడ నాయువు నిండనుండె. వీరిరువురకును మైత్రియు సన్నగిలి పోవుచుండె. కావున నహమ్మదాబాదు మఱల గాయకవాడున కియ్యఁబడదనియు నతఁడు దీర్చ లేనంతటి యప్పుపద్దును పీష్వా ప్రదర్శింపుననియును ఆరంగమున నుండిన వారందఱకును గోచరముగాఁ జొచ్చెను. ఇంతియ గాక పీష్వాచేసిన సంధివలనఁ దాను గాయికవాడు పై నధికారమును వదలుకొనుటకుఁ బశ్చాత్తాపము నంది మఱల నేవిధముగనైన దనయధికారమునకుమార్గ మేర్పఱచుకొనఁ బ్రయత్నింపఁ గడఁగెను. ఇట బరోడాయందు దివాను పదమునుండి



యవమానముతోఁ దొలంగింపంబడి యుండిన శీతారాము దన విరోధులకుఁ బ్రతీకారము సేయ దారి యఱయుచుండెను. ఫతేసింగుగంగాధరశాస్త్రియందు నమ్మకమున్న ఆంగ్లేయ ప్రభుత్వము నెడ సంపూర్ణవిశ్వాసమును గలవాఁడయి సమర్థతతోఁ గార్యములు సాధింపనుండెనుగాని ఆనందరావు మిక్కిలి యసమర్థుఁ డగుటంబట్టియు నాంగ్లేయులు సంపూర్ణముగ సాయము సేయకపోవుటంబట్టియు నతఁడు బలవత్తరమగు విరోధశక్తుల నణంచుటలో మిక్కిలి కష్టపడవలసి వచ్చెను. అయినను శీతారాముపీష్వా యనుగ్రహమును బొంది మఱల స్వస్థానమును జేర వలయునను దలంపుతో రాష్ట్రద్రోహియయి మెలఁగుచుండుటఁ జక్కఁగ గుర్తించి యితఁడు వానినిబట్టి చెఱసాల యందుంచెను. కొంతవాదము జరిగిన తరువాత గంగాధరశాస్త్రి గాయికవాడు పరమున పీష్వాతో సంభాషించి వచ్చుటకు పునహాకు వెడలిపోయెను. అచ్చట పీష్వాబాజీరావు ఈతనితో మంచి మాటలాడి మాయోపాయములు పన్ని తన మరదలి సీతని కుమారునకు వివాహమున నిప్పించెదనని నుడివి పలుతెఱంగుల నమ్మించి తుట్టతుదకు ఒకనాఁటిరాత్రి నిరాయుధుఁడును సాహాయ్య శూన్యుఁడును నయియుండ ట్రింబక్జీ మూలమున హంతకుల నేమించి ఈతనిని జంపించెను. గంగాధర శాస్త్రిలు పునహాకు నాంగ్లేయుల పూచీపయి పోయియుండెను. కాని ఆంగ్లేయు లాతని మరణమునకుఁ దగిన పూర్ణప్రతీకారము

సేయ సమయము కాదయ్యెను. బరోడాయందు ఫతేసింగు గూడ స్వాతంత్ర్యత సంపాదింపఁ బ్రయత్నించుచున్న ట్లగుపడెను. కావున నాంగ్లేయ ప్రభుత్వమువారు పీష్వా బాజీరావును గొంత భయపెట్టి త్రింబక్జీని దమ స్వాధీనము చేసివేయునట్లొనర్చి గాయికవాడుకు సంబంధించిన విషయములను గుఱించి 1817వ సంవత్సరములో సంధికియ్య కొనునట్లు చేసిరి. ఆసంధివలన పీష్వా గాయికవాడుపైఁ దనకుఁ గల సర్వాధికారములను మానుకొనియెను. అదివఱకు గాయికవాడుపై దనకుండిన హక్కులకు గాను సంవత్సరమునకు నాలుగులక్షల రూపాయీలతో తృప్తిపొందనియ్యకొని అహమ్మదాబాదును గాయికవాడునకు సంవత్సరమునకు 4½లక్షలకు గుత్తకునిచ్చెను.

ఈ యొడంబడిక ననుసరించి గాయికవాడునకును ఆంగ్లేయులకును మఱియొక సంధిజరిగెను. దానివలన గాయికవాడు సాహాయ్యసైన్యముల సంఖ్య మునుపటికంటెను హెచ్చింపఁబడెను. ఆహెచ్చుసంఖ్యను పోషించుటకొఱకు పీష్వాభాగములను గుజరాతునందు గాయికవాడు గుత్తకు తీసికొనుట వలన నాతనికి వచ్చుచుండిన వరుంబడి యంతయును నాంగ్లేయులకు మరల్పఁబడెను. ఇంతియకాక గాయికవాడునకు ఆంగ్లేయులకును ఎక్కుడు సౌకర్యముగ నుండునట్లు వారి రాష్ట్రములలోని కొన్ని కొన్ని భూఖండములను బరస్పరము మార్చుకొనిరి.



గాయికవాడు ఆంగ్లేయులకు సాహాయ్యము వలసివచ్చినప్పుడు దనసైన్యములను 3000 స్వారులను బంప నంగీకరించెను.

ఈ సంధిజరిగిన కొద్దికాలమునకే మూఁడవ మహారాష్ట్ర విగ్రహము ప్రారంభమాయెను. ఆంగ్లేయులు పీష్వాతోడను నాగపురము రాజుతోడను సింధియా హోల్కారులతోడను వారిపిండారీలతోడను బోరవలసిన వారైరి. అనేకయుద్ధములు జరిగి దేశమంతయును నల్లకల్లోలముతో నిండియుండెను. అట్టిసమయమున ఫతేసింగు గాయికవాడు మహావిశ్వాసమున నాంగ్లేయులకు సాహాయ్యుఁడయి సాహసముతోఁ గార్యములు నెరవేర్చి ఆంగ్లేయుల విజయమునకు ముఖ్యముగఁ దోడ్పడెను. ఇట్లువారికయి యితఁడు పడినపాట్లవలన నతని బొక్కసము వట్టిదయి మఱల నప్పులు దలయెత్తెను. ఈవిగ్రహము ముగిసి పీష్వాశక్తి మొదలంట నశించిన పిదప గాయికవాడున కాంగ్లేయులు భూభాగము నేమియు నియ్యలేదు. అతఁడు పీష్వాకదివఱకుఁ గట్టుచుండిన నాలుగులక్షలు మాత్ర మాతనికి లాభమయ్యెను. ఫతేసింగు 1818వసంవత్సరము జూను మాసములోఁ బరలోకప్రాప్తిఁజెందెను.

ఆతనిస్థానమునఁ బరిపాలకుఁడుగ నతని తమ్ముఁడు సయాజిరావు గాయికవాడు నియమింపఁబడెను. ఆనందరావునకుఁ దరువాతనితఁడే గాయికవాడురాజ్యమునకుఁ బట్టము గట్టుకొనఁదగియుండెను. కావున నీతని కధికారము రాకుండఁజేయుట కొక

కొన్ని ప్రయత్నములు జరిగెను. కాని అవిసిద్ధించినవిగావు. ఇతఁడు మనోపటుత్వము గలవాఁడే కాని మూర్ఖుఁడు. పట్టినపట్టును సులభముగ వదలువాఁడు కాఁడు. మఱియొకరిని లక్ష్యపెట్టువాఁడునుగాఁడు. తనకు వ్యతిరేకముగఁ బ్రవర్తించువారి యెడ బద్ధవైరమూనెడివాఁడు. కావున నీతనికిని బొంబాయి ప్రభుత్వమువారికిని ఎడతెగనివివాదములు జరుగుచునేయుండెను. ఇతఁడు పరిపాలకుఁడయిన వెంటనే ధాక్జిదాదాజి యనువాఁడు రెసిడెంటుగా నుండిన కాప్టెన్ కార్నకుగారి సిఫార్సుమీఁదను సయాజియొక్క ఇష్టము మీఁదను దివానుగా నేమింపఁబడెను. కాని అతఁడు విశేష ద్రవ్యమపహరించి సంస్థానమునకు నష్టము గలుగఁ జేసినందున నాపదమునుండి తొలఁగింపఁబడెను. అతనికి లక్షరూపాయిలు వేతన మేర్పఱుపఁ బడియుండెను. దానిలో ముప్పదివేలు మూఁడు ఇనాము గ్రామముల రూపముగ నియ్యఁబడి యుండెను. తక్కిన పైకమిచ్చుటో లేకుండుటో నిర్ణయించుటకు బొంబాయి గవర్నరుగానుండిన మౌంటు స్టూఆర్టు ఎల్ఫిన్‌స్టన్‌గారు బరోడాకుఁ బోవ నిశ్చయించిరి. వారి రాక ఆ సంస్థానమున కితరవిధముల గూడ నుపయోగకారిగఁ దోఁచెను.

పీష్వానామ మంతరించి పోవుటవలన ఇదివఱకు వ్రాయఁబడినరీతి గాయికవాడు ఆతని కచ్చుకొనవలసియుండిన నాలుగు లక్షలును దక్కించుకొని యుండెను. విగ్రహము ముగిసినతోడనె ఆంగ్లేయుల పక్షమున మాళవమున యుద్ధము



చేయుచుండిన గాయికవాడు సైన్యము లిల్లు వచ్చిచేరెను. వాని వ్యయమునకుగాను ఆవిగ్రహకాలమున 39½ లక్షలు వెచ్చింపఁ బడియుండెను. గాయికవాడు 'సాహాయ్యసైన్యములు' గూడ సమర రంగమున నాంగ్లేయుల శత్రువుల నెదుర్వ ననుపఁబడియుండెను. వాని కొఱకు రమారమి 48 లక్షలు వ్యయమయియుండెను. ఈకర్చులన్నిటివలననైన కోటి నొక లక్ష యప్పులలో గాయికవాడు ఈఁదజాలకుండెను *అట్టి సమయమున సయాజిరావు 1816వ సంవత్సరపు సంధిని దలంచుకొని అందొక నిబంధనమేరకు ఆంగ్లేయ ప్రభుత్వమువారు దాము గాయికవాడు సైన్యముల సాహాయ్యమున గెలిచిన భూభాగమునం దాతనికిఁ గొంత భాగమిత్తుమని యొప్పుకొని యుండినందున నద్దానిననుసరించి పీష్వానుండి వారు గొనిన దేశములో నొక ముక్క నిత్తురుగాకని వేఁడెను. కాని వారు గాయికవాడునకు నేమియు నిచ్చుట కిష్టములేని వారయిరి. అందుచే సయాజికి ఆశాభంగమయి మిక్కిలి సంతాపము జనించె ననుటకు సందియము లేదు. *1819 వ సంవత్సరపు నక్టోబరు నెలలో

* ఈయప్పులకుఁ గారణము లివియని మౌంటుస్టూఆర్టు ఎల్ఫిన్‌స్టను కొన్నిటిని వ్రాయుచున్నాఁడు. కాని మొత్తముమీఁద నీకోటి నొక లక్ష రూపాయిలును సైనికులకు బాకీపడిన జీతముల రూపముననో మాళవమున గాయికవాడు (ఆంగ్లేయులకయి) నడపినయుద్ధముల సమయమున దదర్థము సాహుకారులిచ్చిన యప్పురూపముననొ ఉన్నదని ఎఫ్. ఏ. ఏచ్. ఎలియట్ బొంబాయి గెజటీరులో వ్రాయుచున్నాఁడు.

ఆనందరావు మృతుఁడయ్యెను. నాఁడే సయాజిరావు (ద్వితీయ) గాయికవాడు పట్టమునకు బ్రకటింపఁ బడియెను.

## సయాజిరావు II (1818-1847).

బొంబాయి గవర్నరుగారు దర్శన మిచ్చునప్పటికి శీతారాము మఱల బరోడా వచ్చిచేరి యుండెను. అతఁడు దివాను పదమున కాశించెనుగాని ఎల్ఫిన్‌స్టన్ అంగీకరింపనందున మఱియిద్దఱు దివానులేర్పఱుపఁబడిరి. వారియందును నమ్మకము లేమింజేసి సయాజి మీర్-సర్ ఫరజ్-ఆలీని వారింగని పెట్ట నియమించెను. అదివఱకు బరోడా సంస్థానపు రాజ్యకార్యములను దీర్చుచుండిన కమీషను రద్దుచేయఁబడెను. సయాజికి అంతఃపరిపాలనా విషయముల సంపూర్ణ స్వాతంత్ర్య మియ్యఁబడెను. అతఁడు ధనమునందుఁ బేరాసగలవాఁడయి స్వంత ధనము వేరుగను సంస్థానపు ద్రవ్యము వేరుగను జూచుకొన బ్రారంభించెను. రాజు ఇట్టి లోభియగుటవలన పన్నువసూలు చేయువారును ఉద్యోగముల నాశించువారును 'నజరానా' ల పేరిట గొప్ప గొప్ప లంచము లతనికమర్ప మొదలిడిరి. ఇట్టి పరిపాలనవలన నెట్టి నష్టములు గలుగుటయు విస్తరించి వ్రాయుటయే పని లేదు. రాజుగారి స్వంతధనాగారము నిండుచు వచ్చెను. అనవసరముగు హోదాలును నౌకరీలును రాష్ట్రమునఁ బ్రబలఁజొచ్చెను. దన్నూలమున నదివఱకె యప్పుల సంద్రమున మునిఁగి తేలుచుండిన సంస్థానము ఎక్కుడార్థిక దురవస్థలపాలయ్యెను.



రెసిడెంటు చేసిన బోధలన్నిటికిని సయాజిరావు పెడచెవిఁ బెట్టుటవలన రాను రాను రాజ్యవ్యవస్థ బొత్తుగఁ జెడిపోవుచుండెను. కాని కొంత చర్చ జరిగిన తరువాత నొక కొన్ని మండలములను ఘరానా మనుష్యులకు ఏడు సంవత్సరములకు మునిగుత్తకిచ్చి వైచి ఆంగ్లేయులు పూచీపడిన యప్పులు దీర్చునట్లేర్పడెను. దీనికంగీకారము సయాజిరావిచ్చెనుగాని ఏకారణముననో ఈ ఏర్పాటునకుఁ గారకుఁడయిన మంత్రి నాతఁడు పనినుండి తొలఁగించెను. తరువాత సయాజిరావు ఈ ఏడు సంవత్సరముల కౌలుల విషయములోఁ గొన్ని యక్రమముల నడిపెను. ఈ లోపుగ ఎల్ఫిన్‌స్టన్ బొంబాయి గవర్నరు పని చాలించుకొని స్వదేశమునకుఁ జనియుండెను. ఆతనిస్థానమును సర్ జాన్ మాకము అను నతఁ డధిష్ఠించె.

ఎల్ఫిన్‌స్టన్ గాయికవాడుతో బహు సామవాక్యములు పలికి మృదు మార్గముల నాతని నడవడినిసంస్కరింపఁ బ్రయత్నించువాఁడు. 'మాకము' అట్టివాఁడు గాక కఠినుఁడయి కన్పట్టె. 1827వ సంవత్సరము నవంబరు మాసములో సయాజిరావుతన స్వంత ద్రవ్యమునుండి యిచ్చిఆంగ్లేయులు పూచీపడినయప్పునంతయును వెంటనేతీర్చివేయ నుపక్రమించినను అదియేమిచిత్రమో మాకముఅద్దాని కియ్యకొనఁడయ్యెను. అందుమీఁద సయాజిరావునకును ఆంగ్లేయ ప్రభుత్వము వారికిని విభేదములు హెచ్చ మొదలిడెను. 1828 లో మాకము బరోడా రాజ్యములోని

కొన్ని జిల్లాలను తనయధీనము చేసికొని తన ప్రభుత్వమువారు పూచీపడిన యప్పులు దీరువఱకును ఆ సంస్థానము వారియధీనమున నె యుండునని తెలియపఱచెను. ఇతఁడు ఏడు సంవత్సరముల కౌలులను రద్దుచేసి దానివలన గుత్తగాండ్ర కయిన నష్టము గాయికవాడు అచ్చుకోవలసినదని యుత్తరవు చేసెను. సయాజిరావుచే దివాను పదమునుండి తొలఁగింపఁబడి దేశద్రోహియని యాతనిచే నెన్నఁబడుచుండిన మంత్రిపక్షము వహించి ఈగవర్నరు అతనికి హక్కులను స్థాపించి పెట్టెను. ఇంతటితో నిలువక 1830 వ సంవత్సరమున స్వయముగ బరోడాకుఁబోయి గాయికవాడు మహారాజుగారితో సంభాషించుట ముగించుకొని గాయికవాడు సైన్యములు 3000 తగిన స్థితియందు లేవని నిర్ణయించి రెసిడెంటున కవ్వానిని సంస్కరించుటకు నుత్తరువిచ్చి వానికగు కర్చునకుఁగాను 10 లక్షల ఆదాయము నిను మఱికొన్ని మండలములను గాయికవాడు సంస్థానమునుండి స్వాధీనము చేసికొనెను. కాని ఈకార్యమును ఇంగ్లాండునందలి డైరక్టరులు ఖండించినందున నిది నిలచినదిగాదు.

దీనికిఁదరువాత బరోడాయందు రెసిడెంటుండుటవలనను ఆతఁడు అంతఃపరిపాలనా విషయమున జోక్యము పుచ్చుకొనుట వలనను లేనిపోని భేదములు పుట్టుచున్నవని దలంచి మాకము బరోడాయందు రెసిడెంటు పదమును దుడిచివైచి ఆయధికారముననుండిన వానిని అహమ్మదాబాదునందు రాజకీయ ప్రతినిధిగ



నేమించెను. అతఁడు గుజరాతునందును బరోడాయందును ఆంగ్లేయుల లాభనష్టములఁ గనిపట్టవలసిన వాఁడయ్యెను. అతఁడు బరోడా వదలుటతోడనే ఆంగ్లేయుల పూచీపై గాయికవాడునకు అప్పులిచ్చిన సాహుకారులును దమకుఁ దగిన గౌరవముగాని సంరక్షణగాని సయాజిరావు వద్ద జరుగదని గాఁబోలు బరోడాను వదలిరి.

1831 వ సంవత్సరమున మాకము మారిపోయెను. బొంబాయి గవర్నరుగ లార్డుక్లేరు ఏతెంచెను. అతఁడు మిక్కిలి మెత్తని గుండెగలవాఁడు. కావున సయాజిరావు మహారాజునెడ సామవాక్యములు నెఱపఁ బ్రారంభించి మాకము కాఠిన్యమువలన నడచిన కార్యముల నన్నిటిని ఒక్కటొక్కటిగ రద్దుపఱచెను ఆంగ్లేయులాధీనము చేసికొని పరిపాలించుచుండిన మండలములు గాయికవాడునకు మరల్పఁబడెను. బరోడాయందు రద్దయిపోయి యుండిన రెసిడెంటు పదము పునరుజ్జీవితము చేయంబడెను. సయాజిరావునకును సాహుకారులకును బరస్పర విశ్వాసము జనించుటంజేసి వారు బరోడాకు వచ్చిచేరి యెప్పటివలెఁ దమ తమ వృత్తులనుండ నిర్ణయించుకొనిరి సయాజిరావు తన స్వాంత ద్రవ్యమునుండి ఇరువదియైదు లక్షలు కర్చుపెట్టి సాహుకారులఁ దనియించెను. గాయికవాడు, సైన్యములకు సక్రమముగ జీతమిచ్చుటకు జామీనుగఁ, బదిలక్షల రూపాయిలు బొంబాయి ప్రభుత్వమువారి బొక్కసమున ధరా

వతు పెట్టెను. ఘాతకము మహాకఠిన పద్ధతులవలన నెఱవేర్చ లేని పనులను గొంతవఱకు కీరితిని క్లేరుప్రభువు దీర్చఁగలిగెను. కాని ఇంకను దురవస్థలు సయాజిరావుకుఁ దప్పినవి కావు.

ఆతనియొద్ద మంత్రి పదమున కెక్కిన వనిరాముఁడు అతి దుర్మార్గుఁడయి ఆతనికి గొప్పదలవంపులును ఇక్కట్టులును దెచ్చి పెట్టెను. వాఁడు స్వలాభమే ప్రధానముగఁ జూచుకొనుట వలనను సయాజి మహారాజు వానినే సంపూర్ణముగ విశ్వసించుట వలనను రాజ్యమరాజకమయి పోయెను. దొంగతనములు, ఖూనీలు, త్రోవ దోపిడులు మున్నగునవి మెండయ్యెను. విచారణ యను మాటయే సున్నయయ్యె. ఘరానామనుష్యులకుఁ బ్రతుకు తెరువే లేదయ్యె. గాయికవాడు ప్రజలో నొక్క భాగమగు భిల్లులు కోలు లనువారు నిర్భయులయి గ్రామము తరువాత గ్రామమును దగులఁబెట్టుచుఁ గొల్లకొట్టుకొన సాగిరి. గాయికవాడు సైన్యము చేవచెడి దుర్మార్గముల నవలంబింపుచుండె. ఆంగ్లేయ ప్రభుత్వపువారి సంరక్షణయుఁ బూచీకత్తును గల సాహుకారులను వనిరాముఁడును అతని యజమానియు దోచుకొనఁ జొచ్చిరి. వీని నన్నిటిం గుఱించి బొంబాయి ప్రభుత్వమువారును బంగాళములోని యాజమాన్య ప్రభుత్వము వారును పలుమారు సయాజిరావును గట్టిగ హెచ్చరించినను గార్యము లేకపోయెను. దానివలన నాంగ్లేయ ప్రభుత్వము వారు నవ్సారిమండలమును పెట్లాదు మండలమును స్వాధీనము



చేసికొని 1839 లో ‘గుజరాతు క్రమవిరహితాశ్వకు (Gujarat Irregular Cavalry) లను పేరిట నూతనముగ నొకపటాలము నేర్పఱచిరి.

ఇంతపనిజరిగిన వెనుక 1839నవంబరులో సయాజిరావు ఆంగ్లేయులకు పూర్ణ విధేయుఁడుగ నుందునని వాగ్దానము సేయుచు వారి శరణ మడిగెను. 1840 వ సంవత్సరమున ఒక్కొక్క విషయమునను సయాజిరావుతో రెసిడెంటు ఏర్పాటు లొనర్చుకొనెను. వనిరాము దివానుపదమునుండి తొలఁగింపఁబడెను. సయాజిరావు మంత్రిలేకయె రెసిడెంటు గారి సలహాలతోఁ దానే స్వయముగ రాజ్యమునడపుకొన నిశ్చయించుకొనెను. కాఠియవాడునందు గాయికవాడునకుఁ జేరిన భాగమునందు న్యాయపరిపాలనమునకు సంస్కారము లొనర్పఁబడెను. బరోడా ప్రజలచే నష్టములందిన వారందఱకును దత్తదనుగుణముగ ధనమియ్యఁబడియెను. తక్కిన విషయముల యందునుఁ దగిన కట్టుదిట్టము లేర్పఱుపఁబడెను. ఆంగ్లేయులు స్వాధీనము చేసికొనియుండిన నవ్సారి పెట్లాదు మండలములు సయాజిరావునకు మరల్పఁబడెను. అతఁడు ప్రజలను న్యాయమార్గమున సంరక్షింతునని వాగ్దానము చేసెను. క్రొత్తఁగ నేర్పడినగుజరాతు క్రమవిరహిత ఆశ్వీక సైన్యమునకయి కాఠియవాడు వరుంబడినుండి మూఁడులక్షలు ప్రతి సంవత్సరమును దీసి యుంచునట్లు నియమింపఁ బడెను.

ఇట్లు సంస్కరింపఁ బడినను బరోడాయందు దురభ్యాసములు పొడసూపుచునే యుండెను. రెసిడెంటు కార్యస్థానమునఁ గూడ నిట్టి లోపములుండెడివి. కుట్రలును మెండుగ జరుగుచునేయుండె. వానినన్నిటి నిటవర్ణింపఁ జాలము.

1847వ సంవత్సరము డిసెంబరునెల 28వ తేది సయాజిరావు ప్రాణములఁ దొరఁగె. అతని పుత్రుఁడు గణపతిరావు, గద్దెకువచ్చెను.

గణపతిరావు (1847-1856)

ఈతఁడు విద్యావిహీనుఁడు. మనోదార్ఢ్యము గలవాఁడును గాఁడు. అయిన నీతని యొద్ద నొక్క సుగుణము మాత్రముండెడిది. దేశక్షేమమున కయి యితరు లుపక్రమించు కార్యములకు సాయపడుచుండెడువాఁడు. కావున నీతనికాలమున ప్రథమ భాగమందు రెసిడెంటుగా నుండిన ఫ్రెంచి బోధల వలన నీతఁడు బాటలవేయించెను. వంతెనలఁ గట్టించెను. మార్గముల ప్రక్కన చెట్లవరుసలు నాటించెను. శిశుహత్యయు బిడ్డలనమ్ము వ్యాపారమును దుడిచివైచెను. తనరాష్ట్రమునందు జరిగిన దోపిడీలను విచారించి హక్కుగల వారలకు సొమ్ము నిప్పించెను. ఇట్లు పలుతెఱంగుల నభివృద్ధికిఁ దోడ్పడియెను.

బొంబాయి గవర్నరుగారి కార్యస్థానమున దురాచారము లెక్కుడయి బరోడాసంస్థానము నం దన్యాయములు జరుపుటకుఁ గొందఱకెక్కుడు వీలగుచున్న దనువార్తప్రబలి ఆ సంస్థానమునఁ గొంతకాలము రెసిడెంటుగా నుండిన కర్నల్ లెట్టినంటు అవుట్రాము వలన ఋజువుపఱుచఁ బడినందున బరోడాపై బొంబాయి ప్రభుత్వమువారి కుండిన అధికారము రద్దయి ఆ సంస్థానము యాజమాన్య ప్రభుత్వమువారి విచారణలో నుంచఁబడెను. (1854). ఈ విషయమయి పోట్లాడుటలో అవుట్రాము దన పదమునుండి తొలఁగింపఁబడి నిజముబయలు వచ్చినందున మఱల రెసిడెంటు పదమున కనుపఁబడెను. కొందఱు గుర్బోధనలం జేసి గణపతిరావు అవుట్రాము రాకకుఁ గొంచె మెదిర్చెను గాని ఆయుద్యోగాంతరములు నిలువలేదు. అతఁడు రెసిడెంటయి తన కార్యస్థానములోని దుర్మార్గులను తొలఁగించివైచెను. 1856వ సంవత్సరమున మహారాజా గణపతిరావు బొంబాయి బరోడా రైలుదారివేయుటకు వలయు భూమిని మంజూరుచేసెను. అదే సంవత్సరమే అతఁడు స్నానము చేయుచుండ నాకస్మికముగ మృతినందెను. అతనికి మొగబిడ్డలు లేనందున నాతని తమ్ములలోఁ బెద్దవాఁడగు ఖండేరావు సింహాసనమునకు వచ్చెను.

ఖండేరావు (1856-1870)

ఇతఁడు దనకుముందుఁ జనిన గణపతిరావు నకును, వెనుక రానున్న మల్హారరావునకును, భిన్నుఁడుగఁ గాన్పించుచున్నాఁడు. ఇతఁడెంతో విద్యావంతుఁడు గాఁడుగాని కొంత సమర్థతగల వాఁడనుటకు సందియములేదు. దేహపటుత్వమున

నన్ననో ఈతనికి ఈడగువాఁడు దొరకుట దుర్లభము. కావున నితనికి వేటయందును, ఆటలయందును వ్యాయామముల యందును నభిరుచి మెండు.

సింహాసనమునకు వచ్చిన వెంటనే బరోడాను ఆంగ్లేయ పాలిత మండలముల కెనచేయఁదలఁచి ఈతఁడనేక సంస్కారములు ప్రారంభింప వలసినదని యుత్తరువు లొసంగెను. కొన్ని సంవత్సరములు మిక్కిలి పట్టుదలతోఁ బని గూడఁ జేసెను. కాని రానురాను మృగయా వినోదములయందును, ఆభరణాడంబరముల యందును, వృథా వ్యయముల యందును మనస్సు దగుల్చుటం జేసియుఁ దా నుపక్రమించిన సంస్కారముల యెడలఁ గ్రిందియధికారులెట్లు ప్రవర్తించుచుండినదియు గమనింపక పోవుటవలనను ఈతఁడు మొదలిడిన పనులెవ్వియును దీరినవిగావు. క్రొత్తనీళ్లతోఁ బ్రాతనీళ్లును గొట్టుకొని పోయెనన్నట్లు అదివఱకుండిన ఏర్పాటులు గూడ నశించిపోయెను. అట్లగుట నీతఁడు మహోత్సాహమునఁ దలపెట్టిన తలంపులు దేశమునకుఁ గొంతవఱ కనర్థదాయకములె యయ్యెను. కాని ఈతని కాలమునఁ గొన్ని సంవత్సరములు ప్రత్తిపంట మిక్కిలి చక్కఁగ ఫలించి జనులు సుఖపడినందునఁ గాకతాళన్యాయమున నిప్పటికిని ఈతనిపేరు ప్రజలత్యాదరమున నుడువుచున్నారు. ఇట్లనుటచే నితఁడు చేసినదేమియు



లేదనుట గాదు. ఈతని రాజ్యకాలమున నొక రైలుదారిశాఖ వేయఁబడెను. రెవిన్యూసర్వే ప్రారంభింపఁ బడెను.

1857వ సంవత్సరపు గొప్పతిరుగుబాటు ఈతని దినములలోనె జరిగెను. అప్పుడు చుట్టుముట్టుంగల దేశమంతయును అల్లకల్లోలమున మునుఁగుచుండ నీతఁడు మాత్ర మాంగ్లేయుల యందుఁ జలించని భక్తికలవాఁడయి ప్రవర్తించెను. తిరుగుబాటణఁగి పోయిన తరువాత నాంగ్లేయ ప్రభుత్వమువా రీతని నడతకు సంతసించి గుజరాతు క్రమవిరహితాశ్విక' సైన్యమునకయి గాయికవాడు చెల్లించుచుండిన మూఁడులక్షల రూపాయిలను మన్నించివేసి, జి. సి. ఐ. ఇ. బిరుదము నొసంగి దత్తుచేసికొనుట కధికారముగూడనిచ్చిరి. ఇతఁడు పదునాలుగు సంవత్సరములు రాజ్యభారము నిర్వహించి 1870 లో హఠాత్తుగ మరణముందెను. కావున నీతని తమ్ముఁడు గాయికవాడుగఁ బ్రకటింపఁ బడెను.

## మల్హారిరావు. (1870-1875)

ఇతని పూర్వచరిత్రగాని గాయికవాడు పదమునకు వచ్చిన తరువాతి చరిత్రగాని ఈతనియందెట్టి సద్గుణములను బయలు పఱచుట లేదు. 1857వ సంవత్సరమున నాంగ్లేయ ప్రభుత్వమును బరోడా సంస్థానమున నశింపఁజేయ వలయునను నుద్దేశముతోఁ బన్నఁబడిన యొకకుట్రయం దీతఁడు ముఖ్యాంగముగ నుండెను. అప్పుడు రెసిడెంటుగా నుండిన

సర్. ఆర్. షేక్స్పియరు యొక్క దయచేఁ దప్పించుకొనెను. 1863 వ సంవత్సరమున ఖండేరావును జంపించుటకే మల్హారి రావు మఱలనొక కుట్రజరిపెను. అదియును బయటపడెను. అప్పుడే ఇతఁడు పరలోకమున కనుపఁబడియుండును గాని అప్పటి రెసిడెంటు ఈతని పరమయి కరుణచూపినందున నితఁడు పాద్రాయందుఁ జెరసాలలో నుంచఁబడెను. ఖండే రావు వైకుంఠమున కేగినపిదప నాతనిస్థానమునకు వచ్చుటకు నితరులెవ్వరును లేమింజేసి ఈతఁడా కారాగృహము నుండియె తీసికొని రాఁబడెను.

ఇన్ని కష్టముల పాలయ్యును నితనికి బుద్ధిమాత్రము కుదిరినదికాదు. గాయికవాడుపదమునకు వచ్చిన తోడనె మునుపటి గుణమును మానక దుష్కార్యములకుఁ బ్రారంభించెను. ఖండేరావువలన నేమింపఁ బడియుండిన నౌకరులెల్లరును ఆయాపదములనుండి తొలఁగింపఁ బడిరి. ఆతని భార్య జమ్నాబాయి గర్భవతి ఇతనికి జడిసి రెసిడెంటు గారి సంరక్షణ మందొక కొంతకాలముండి ఆడబిడ్డనుగని రు 36,000 ల పెఁషను[1]తో మఱలబరోడా చూచుట తటస్థింప దనుకొనుచు పునహా పోయిచేరెను. మల్హారరావు

1. ఈవిషయమున మహారాజా హోల్కారుయొక్కయు నప్పుడాతని మంత్రిగనుండిన సర్ టి. మాధవరావుయొక్కయు పరిశ్రమ కొంతకలదు.



పనికిమాలిన మంత్రులను చేర్చుకొని అవాచ్యమగు నపరాధములనొనర్చుచు దుర్వ్యయము చేయ నారంభించెను.

ప్రజలు పన్నుల బరువునకుఁ దాళుట యసాధ్యమయ్యెను. రాజు కంటఁబడి స్త్రీలుమానమును దక్కించుకొనుట కష్టమయి పోయెను. క్రౌర్యము దలయెత్తికొని సంస్థానమున సంచరింప మొదలిడెను. ఇట్లుండ 1860 వ సంవత్సరమున బరోడా సంస్థానముపై నధికారము మఱల సంపాదించుకొని యుండిన బొంబాయి ప్రభుత్వమువారు కర్నలుఫేరెను రెసిడెంటుగాఁ బంపిరి. అతఁడు మల్హారిరావు లోపములను బూస గ్రుచ్చి నట్లెత్తి చూప మొదలిడెను. వానిని విచారించుకొఱకు యాజమాన్య ప్రభుత్వమువారు 1873లో నొకకమీషను నేర్పఱచిరి. కమీషనువారి యభిప్రాయము ననుసరించి కూడ మల్హారరావు ప్రభుత్వము మిక్కిలి నింద్యముగాఁ దోఁచెను. కావున నతఁడు దన రాజ్యములోని దోషములను 1875 లోపుగ దిద్దుకొననలసిన దని యుత్తరు వాయెను. మల్హారి రావు మంత్రులు పనికిమాలిన వారని ఇదివఱకే వ్రాయఁబడియెను గదా. వారిని దీసివేయుట విషయములోను, గాయికవాడు ప్రార్థన నంగీకరించి వచ్చియుండిన మన దాదాభాయి నౌరోజి మొదలగు వారలకు నిశ్చయమగు శక్తులనిచ్చు విషయములోను మల్హారిరావునకును ఫేరెకును భేదములు వచ్చినందున ఫేరె బరోడానుండి మారువఁబడెను. కాని అతఁడు వెడలి

పోవు నంతలో నాతనికి విసము పెట్టఁ బ్రయత్నములు సేయఁ బడెవనువార్త బయలుదేరెను. అది యట్లుండనిచ్చి ఆతఁడు మాత్రము వెడలి పోయెను.

ఆతని స్థానమున 'సర్ లూయిపెల్లి' వచ్చి చేరెను. దాదాభాయి మెత్తగ రాజీనామానిచ్చెను. రాజ్యకార్య నిర్వాహణ మంతయును 'పెల్లి'యె వహించెను. 'ఫేరె' కు విషము పెట్టఁ బ్రయత్నించిన విషయము విచారణకు వచ్చెను. ముప్వురు ఆంగ్లేయులును ముప్వురు స్వదేశీయులును న్యాయాధికారసభగ నియమింపఁబడిరి. మల్హారిరావు 1875 వ సంవత్సరము జనవరి 13 వ తేది బంధీకరింపఁబడెను. ఆంగ్లేయ ప్రభుత్వమువారు రాణీ జమ్నాబాయి పరమున గాయికవాడు రాజ్యమును పరిపాలింపఁ బ్రారంభించిరి.

'విసముఁబెట్టఁ బ్రయత్నింపు' వ్యాయోగమున ముప్వురు ఆంగ్లేయ న్యాయాధిపతులును మల్హారిరావు దోషియనియే తీర్మానించిరి. తక్కిన ముప్వురును నాతనిపయి ఆనేరము మోపుటకు వీలులేదనిరి. ఇంగ్లాండునందలి సామ్రాజ్యప్రభుత్వము వారు మఱియొక విధమునఁ దీర్మానించిరి. మల్హారిరావు పై దోషము సిద్ధపడినదని యొప్పుకొనమని నుడువుచు నతఁడు దుర్మార్గుఁడై దుష్కార్యములకుఁ బూని రాజ్యమరాజకము చేసి యుండినందున రాజ్యమున కనర్హుఁడని నిర్ధారణచేసిరి. కావున నాతఁడు మద్రాసునకుఁ బ్రవాసమున కనుపఁ బడెను. ఉచిత



విధముగ నాతనికిని ఆతని కుటుంబమునకు జీవనమార్గము గల్పింపఁబడెను.

1875వ సంవత్సరము మేనెల 2వ తేది జమ్నాబాయి బరోడాకు మగలివచ్చి ఆనెల 27వ తేది పదుమూఁడు సంవత్సరముల బాలుని దత్తుచేసికొనెను. ఆబాలుఁడే ప్రస్తుతము పరిపాలన మొనర్చుచున్న సయాజిరావు గాయికవాడు.

### సయాజిరావు III. గాయికవాడు.

ఇతఁడు గాయికవాడు వంశములోని ముఖ్యశాఖలలో నొక్కదానికిఁ జేరిన వాఁడేగాని ఈతని తలిదండ్రులు మాత్రము బీదలు. రెండవ సయాజిరావు అన్నదమ్ము లందఱును మగబిడ్డలు లేక చనిపోవుటచేను ఈతని శాఖ నెవ్వరును దలపెట్టలేదు. అయిన బరోడా రాజ్యపు మహాదదృష్టమువలన జమ్నాబాయి ఈశాఖనుండి సయాజిరావును బుత్రుఁడుగ స్వీకరించెను. ఈతఁడు దత్తు కుమారుఁడని ఏర్పడు సమయముననె గాయికవాడు సంస్థానమునకు సుప్రసిద్ధుఁడగు సర్. టి. మాధవరాయఁడు ముఖ్యమంత్రియయ్యెను.* మాధవరాయని చరిత్రను సంక్షేపముగ వర్ణింపవలసి యున్నది.

మాధవరాయఁడు మహారాష్ట్రబ్రాహ్మణుఁడు. 1828వ సంవత్సరమున జననమందెను. ఇతఁడు మద్రాసు సర్వకళాభవనమునవిద్య నభ్యసించి గణితశాస్త్రమున పట్టమందెను. కొంతకాల ముపాధ్యాయ పదముననుండి దానిని వదలి తన

తండ్రియుఁ బినతండ్రియు నెచ్చట దివానులుగఁ బనిచేసి కీర్తిఁ గాంచిరో ఆ తిరువాన్కూరు సంస్థానమునకు రాజకుమారు లిద్దఱకును విద్యనేర్పఁబోయెను. అచ్చటనె ముఖ్యమంత్రిసాహాయ్యుఁడుగనుండి తరువాత 1858లో ముఖ్యమంత్రియయ్యెను. అప్పులలోఁబడి మతాచార్యుల చేతులఁ జిక్కిపోయియుండిన ఆసంస్థానమును జక్కఁగసంస్కరించివెట్టెను. 1873లో మహారాజా హోల్కారుచే నాహూయమానుఁడయి యతనికి దివానుగనేగెను. అటనుండి బరోడాదుస్థితిందలంచి నాంగ్లేయ ప్రభుత్వమువారు పిలువ గాయికవాడు సంస్థానమునకు ముఖ్యమంత్రిగానుండి కార్యములు నడుపనంగీకరించెను

మల్హారిరావును గుఱించివ్రాయునెడ బరోడాయందెట్టి యల్లకల్లోలము లుండినదియును వ్రాయఁబడియెనుగదా! ఆయల్లకల్లోలములనణఁచి రాజ్యకార్యములను గ్రమమునకుఁ దెచ్చుటలో సీమాధవరావుచేసిన కృషిని, పడినపాట్లను, మాటలతో వర్ణించి మనసును సంతృప్తిపొందించుకొనుట దుర్లభము. మొట్టమొదట నతఁడు రెవెన్యూ విషయములయందు సంస్కారములకుఁ బూనెను. బరోడాసంస్థానము రెవెన్యూవసూలుకుగాను ఖండములు ఖండములుగ కొన్ని సంవత్సరములకు గుత్తలకియ్యఁబడుచుండెనని ఇదివఱకేనుడివితిమి. ఆగుత్తగాండ్రకే సరదారులనిపేరు. వీరుమఱల సాహుకారులకు తమ ఇజారా ప్రదేశమును చిన్నచిన్న భాగములుగ విభజించి యిచ్చు



చుండిరి. ఆసాహుకారులు సైనికుల సాహాయ్యముచేసికొని బీదలనక ధనవంతులనక ప్రజలపై దౌర్జన్యము నడపుచుండిరి. సరదారుల యొద్దనుండి అది వఱకే ప్రభుత్వమువారు కొంత ద్రవ్యమును దీసికొని యున్నందున పన్నులు వసూలుచేసికొను హక్కును మఱల తమకే మార్చుకొనుటకు న్యాయముగాన రాదయ్యెను. కావున సర్ మాధవరావు ఉచితమగు చట్టముల నిర్మించి సర్దారులకుంగల పన్నువసూలుచేసికొను హక్కులను వారుఅమ్ముకొనవలసినదని నిర్బంధ పెట్టెను. విశేషముగ మహారాష్ట్రులగు నాసర్దారులు సులభముగ లోఁబడరయిరి. వారికి న్యాయవాదులు సాయమయి సెక్రటరీ ఆఫ్ స్టేటు వఱకు అనఁగా ప్రీవీకౌన్సిలు వఱకు వ్యాజ్యెములు నడుపఁబడునని జంకించిరి. కాని మాధవరావు పట్టినపట్టు వదలకఁ గొందఱను ప్రవాసమునకుఁ బంపియుఁ గొందఱను మంచిమాటలతో లోఁబఱచుకొనియుఁ గార్యము నెరవేర్చుకొనెను.

ఇంతేగాక రాష్ట్రమున నీసర్దారుల హక్కులుగూడ విస్పష్టముగ నేర్పడియుండలేదు. రాజడిగి నప్పుడు ద్రవ్యసాహాయ్యముగాని సైన్యసాహాయ్యముగాని ఇచ్చుషర్తుమీఁద వీరు భూభాగముల ననుభవించుచుండినందున వీరిని ఆయాజమీనునుండి విడదీయుటకూడఁ జట్టములకు విరుద్ధమయికన్పట్టెను. వీరికి జమీనులపై సర్వస్వాతంత్ర్య మెంతకాలముండునో అంతకాలమును న్యాయపరిపాలన కలలోనివార్తగనుండెను.

కావున సర్ మాధవరావు న్యాయమునకును చట్టములకును వ్యతిరేకముగాని తెఱంగున వీరినిజమీనులనుండి విడదీయు మార్గమును ఆరయవలసినవాఁడయ్యెను.

ముందు సంవత్సరములలో సీసరదారులు రాజుగారడిగినప్పుడు ద్రవ్యసాహాయ్యముచేయక ఎగఁగొట్టఁ బ్రయత్నించియుండిరి. ఆవిషయమును స్థిరపఱచు ప్రాతకాగితముల నన్నిటిని వెదికియుంచి అవ్వానింబట్టి వారు రాష్ట్రీయ ప్రభుత్వమునకు బాకీపడిన మొత్తములను దేల్చి వెంటనే ఆమొత్తములను పదునేడు పదునెనిమిది సంవత్సరముల వడ్డితోఁగూడ కట్టవలసినదని యుత్తరువు చేసెను. వారుకట్టలేకపోయినందున వారి హక్కులు రద్దుచేయఁబడెను. అందు గొందఱు తిరుగఁబడఁజొచ్చిరి. కాని వారి యాటలు మాధవరావు కడసాగినవికావు. ఆతని యుత్తరువుల ననుసరించి వారందఱును వారణాసికిఁ బ్రవాసమునకుఁ గొనిపోఁబడిరి.

పేరునకు సైనికులని పిలువఁబడుచుండిన కొందఱరబ్బీలు మున్నగువారు దమ యాయుధములతో బయలు వెడలి దేశమున కుపద్రవముగలిగించుచుండిరి. వారిగార్జన్యముడుపుట గూడ సులభసాధ్యముగాదయ్యెను. అయినను మాధవరావు చాతుర్యముగ వారికి దివానీశాఖయందు నౌకరీల నిచ్చి ఒక్కఁడొక్కఁడుగ నాసైన్యమును దగ్గించి దాని పేరైనను లేకుండఁ జేసెను.



ఈ సంస్కారములతోపాటు మాధవరావు బరోడా సంస్థానమున న్యాయస్థానములును విద్యాలయములును బుస్తకభాండాగారములును, వైద్యశాలలును మున్నగు జనోపయోగస్థాపనలను నెలకొల్పి పనికిమాలిన చిల్లరపన్నులను రద్దుపఱచి బరోడా నగరమునందలి అనారోగ్యమయిన సందుగొందుల నిర్మూలముచేసి అటప్రభుత్వమువారి ద్రవ్యముతో బీదలకిండ్లు గట్టించియిచ్చి ప్రజారంజకుఁడయి వెలిఁగెను. ఆర్థికదుర్దశలోమునింగి యల్లకల్లోలముల పాలయినశింపనున్న బరోడా సంస్థానము ఈతని రాకవలన ముందురాఁగల దుర్భిక్షాదుల నివారించుటకయి ఒకటినరకోటిరూపాయిలు తన బొక్కసమున నిడుకొని కలకలలాడుచు సక్రమమగు రాజ్యాంగపద్ధతితో సంశోభిల్లఁగలిగెను. ఇట్టి పుత్రులు భారతమాతగర్భమున నప్పుడప్పుడయినను జనించుచుండుట వలనఁగదా భారతీయుల కింకను గొంచెము గౌరవ మున్నది? ఇట్టివారి సంఖ్య క్రమక్రమముగ హెచ్చినం గదా మన కెప్పటికైనను మోక్షము కలుగఁ గలదు? హెచ్చుచున్నదనుటకు మాధవరావుగారి శిష్యుండగు సయాజీరా**వే** తార్కాణము.

ఇతఁడు 1881 వ సంవత్సరము డిశంబరు నెల 28 వ తేది లార్డురిపన్ ప్రభువు కాలమున సంపూర్ణ స్వాతంత్ర్యములతో బరోడా సంస్థానమును బాలింప నియోగింపఁబడెను. ఇతని విద్యాభ్యాస విషయమునందు ప్రసిద్ధుఁడయిన ఎలియట్ దొర

యును సర్. టి. మాధవరావును పరిశ్రమచేసి రాజ్యభారనిర్వహణకార్యములకు వలయు జ్ఞాన మితనికి నలవడఁ జేసియుండిరి. కావున నీతఁడు భరతవర్షమునందలి స్వదేశసంస్థానాధీశ్వరు లందఱిలో రాష్ట్రపరిపాలనా సామర్థ్యమునకుఁ బేరువడసి మున్నెన్నఁడు నీదేశమున స్వప్రభుత్వమువారిచేతను నుపక్రమింపఁబడని ఉత్తమరాజకీయ సంస్కారములను ధైర్యముతోఁ బ్రారంభించి పొగడ్తఁగనియున్నాఁడు. ఇతఁడు పలుమారు విదేశములకు యాత్రనడపి అచ్చటచ్చటఁగల విశేషములు జాగరూకతతో విమర్శించి తన యనుభవములను రాష్ట్రోపయోగమునకయి వినియోగించి యున్నాఁడు. అనేకసందర్భముల నీతఁడిచ్చిన యుపన్యాసములు చదువఁజదువ రుచికరంబులయి మనంబునకు నాహ్లాదమొసంగుచున్నవి. వాని నెల్ల నిచట భాషాంతరీకరించి చదువరుల రంజింపఁజేయ లేకుండుట కొంతయుఁ జింతిల్లవలసియున్నది. ఒకటిరెండు బిందువులను చవిగొని రసాయనంపు మాధుర్యామల నెఱుంగు భంగి యీమహారాజు నుపన్యాసములలోని యొకటిరెండు వాక్యములతో నీతని విశాల హృదయమునొకకొంతకనుంగొననగు.

ఒకచో నీతఁడు "రాజకీయాధిక్యతగాని వాణిజ్యప్రాముఖ్యతగాని ఒక్కటేజాతితోనే పుట్టినవెల్లు కావు. అట్లే మతభేదముల వలనను సంఘమునందలి స్థానమువలనను మనదేశమున గలుగుచుండు విశేషాధికారాధిక్యములు ఆయామతము



లతోఁగాని ఆయాసంఘభాగములతోఁగాని జనించినవిగావు. అవి మధ్యకాలమున స్వస్వలాభమునకయి తెచ్చిపెట్టుకొనఁబడినవి. కావున వానిని మనము రద్దుపఱచవలెను. మనము స్వార్థత్యాగవైభవము ననుభవింప నేర్చుకొనవలయును. హీనజన్ములయిన మనసోదరులను మనంతటివారిని జేయవలయును. అస్వాభావికమగు విభేదములను దుడిచివేయవలెను. వాక్యశూరత్వమునకంటెఁ గార్యశూరత్వమె ఎక్కుడు ఫలప్రదంబని గ్రహించి మనము మనవాక్కులనుబరిపాలించుటకు వెనుదీయరాదు" అని వచించెను.

మఱియొకచో "సంఘమునందు సామాన్య జనులకుఁగల గౌరవమును బ్రాముఖ్యత యును వారు దెలిసికొనునంతటి జ్ఞానము గలవారగునట్లు చేసిననే తప్ప నిజమును శాశ్వతమును నయిన యభివృద్ధి గలుగఁ జాలదు. మనలో విద్యావంతులును ధనవంతులునునైన వారు సామాన్యజనులను బ్రబోధించి వారికిఁ బ్రోత్సాహ మొసంగి జ్ఞానములవడఁ జేయుటయె ప్రథమకర్తవ్యముగ నెన్నుకొన వలయునని నా యాశయము. వారు స్వాభివృద్ధికి పాటుపడుటకై వారికి మనము సాహాయ్యము చేయవలయును. వారి పయినాధిక్యమూనుట మాత్రమెప్పుడును తగదు. మనకుఁ బ్రస్తుతముముఖ్యతమముగ వలసినది సాహాయ్యసంయోగమే (Co-operation)గాని వారి

యెడ దాతృభావనా ప్రదర్శనముగాదు" అనియు నుడివి యున్నాఁడు.

ఈ పైవాక్యములకు వ్యాఖ్యానము వ్రాయఁ గడఁగినచో గ్రంథము నెంత యైనను పెంచవచ్చును. కాని ప్రస్తుత మది కార్యముగాదు. సయాజీరావుఉపక్రమించి జయప్రదముగ నడుపుచుండు సంస్కారములను వర్ణించినచో నాతఁడెట్లు తన వాక్యములను సార్థకపఱచినదియుఁ జదువరులకు విశదముగాఁ గలదు.

బరోడా రాజ్యమున నిప్పటిగాయికవాడు కాలమున జరిగిన సంస్కారఫలములు ముఖ్యముగ ప్రజలవిద్యను గుఱించినవియే యయియున్నవి. ఈసంస్థానమున 1880-81వ సంవత్సరములలో 180 స్వదేశభాషా విద్యాలయములుండెడివి. అందు 17,465 గురు విద్యార్థు లభ్యసించుచుండెడివారు. 1904 - 05 లో విద్యాలయములసంఖ్య 1243 అయి యుండెను. అందలి విద్యార్థులు 81, 649. ఈయభివృద్ధికి కారణమేమి? 1885 వ సంవత్సరమున నొక క్రొత్తయుత్తరువు బయలుదేరెను. దానివలన సంవత్సరమునకు 30 క్రొత్తవిద్యాలయములు గట్టింపవలసినదనియును విద్యాశాఖవారు (1) క్రొత్తవాచకగ్రంథముల సిద్ధపఱచుటయందును (2) బాలురకు వ్యాయామవిద్యల నేర్పుటయందును (3) బాలికాపాఠశాలలకు నుపాధ్యాయినులుగనుండ స్త్రీలను శిక్షించుటయందును (4) మధ్యజాతులవారికిని హీన



శ్రీయుత రమేశచంద్రదత్తు.

జాతులవారికిని విద్యనందఁజేయుట యందును (5) పాఠశాలల కొఱకు వస్తుప్రదర్శనాగారముల నెలకొల్పుట యందును (6) దేశభాషావాఙ్మయము నభివృద్ధి చేయుటయందును శ్రద్ధ పుచ్చుకొని పనిచేయవలసిన దనియును ఏర్పడెను.

నాఁటినుండియె విద్యాలయములు గట్టించుటకుగాను బరోడా సంస్థానప్రభుత్వమువారు సంవత్సరమునకు నించుమించుగ నరువదివేలు వ్యయపెట్ట నిశ్చయించుకొనిరి. ఈయుత్తరువు కొంతకాలముసాగి దాని ఫలములు గనుపించిన తరువాత 1893వ సంవత్సరమున గాయికవాడు నిర్బంధ విద్యాపద్ధతినిఅవలంబింప నిశ్చయించుకొని ఒక్క తాలూకాయం దంతయునుఁ దదనుగుణముగ పాఠశాలలస్థాపించున ట్లుత్తరువు చేసెను. ఏడు సంవత్సరములకు పైఁబడిన పిదప బాలురు పండ్రెండు సంవత్సరములవఱకును బాలికలు పదేండ్లవఱకును విద్యాలయములందువిద్యనభ్యసించి తీరవలసినదని నిర్బంధమగు కట్టుబాటు చేయఁబడెను. దాని నతిక్రమించిన తల్లిదండ్రులు కొద్దిపాటిజరిమానా నచ్చుకొనవలసినవారైరి. బీదసాదల కీ నిబంధనవలన గష్టములు గలుగకుండుటకయి మొదట నూటికి నలుబదిగురు బాలురవఱకును నుచితముగఁ పాఠశాలలయందుఁ జేర్చుకొనఁబడుచువచ్చిరి. కొంతకాలమైన పిదప నీ పాఠశాలలయందు నెల్లరకును ఉచితముగ విద్యగఱపఁబడఁజొచ్చెను. 1904వ సంవత్సరమున నిర్బంధ విద్యాపద్ధతిని రాష్ట్రమున కంతకును

వ్యాపింపఁజేయుచు గాయికవాడొక చట్టమును నిర్మించెను. దానివలన బాలురు 6 మొదలు 14 ఏండ్లప్రాయము వచ్చువఱకును బాలికలు 6 మొదలు 12 ఏండ్లప్రాయమువచ్చువఱకును విద్యాలయముల కనుపఁబడవలసినట్లేర్పడెను. కొన్ని సందర్భములయందు మాత్ర మీచట్టమును గఠినముగ నుపయోగింపకుండునట్లు నిర్ణయింపఁబడినది. ఇట్టి సందర్భములేవియు లేనిచోట బాలుఁడుగాని బాలికగాని పాఠశాలల కనుపఁబడనిచో వారి తలిదండ్రులు వారిని పంపువఱకును మాసమున కొక రూపాయి యపరాధము నిచ్చుకొనుచుండవలెను. ఈవిధముగ నుపక్రమింపఁబడిన నిర్బంధోచిత విద్యాపద్ధతిని గుఱించి సయాజిరావు గాయికవాడే నుడివినట్లు "రాఁగలవని జంకించిన కష్టములును నష్టములును రాఁజాలవని అనుభవముచే స్థిరపడినది."

మనగాయికవాడు మహారాజు మహమ్మదీయులకును హీనజన్ములకును విద్యాభ్యాసానుకూలము లేర్పఱచుటయందువిశేషముగఁ బరిశ్రమచేసి యున్నాఁడు. ఇప్పుడు విద్యాభ్యాసమునకు యుక్తమగు వయస్సుగల మహమ్మదీయ బాలురలో నూటికే బదిగురు విద్య నభ్యసించుచున్నారనిన గాయికవాడు పట్టుదల విశదముగాఁ గలదు. 1883వ సంవత్సరము మొదలు అంత్యజులకయి విశేష విద్యాలయము లభివృద్ధిఁ జెందుచు వచ్చుచున్నవి. జె. ఎన్. కాటనుగారు వ్రాసిన విద్యావిషయకమయిన పదు



నైదేండ్ల వర్తమానమును (Quinquennial Review of the Progress cf Education) గ్రంథమునం దీబరోడా సంస్థానమునందలి విద్యాభివృద్ధిని గుఱించి యిట్లు వ్రాయుచున్నాఁడు:—

"అమ్రేలియందు హీనజాతులకు విద్యగఱపుటకయి నెలకొల్పఁబడిన విశేషస్థాపనలును, నిర్బంధ విద్యాపద్ధతియును నిప్పుడనుభవమువలన ఫలప్రదము లయినవి."

ఇచ్చట హిందూస్థానమునందు మఱెచ్చటను గానరాని స్త్రీవిద్యాభివృద్ధియుండుటయు నొక విశేషాంశమె. ఇదే సందర్భమున భరతవర్షమునందు మొత్తముమీఁద నూరుగ్రామములకు 26.47లో విద్యాలయములుండ బరోడాయందు మాత్రము నూటికి 43.41 గ్రామములలో పాఠశాలలుండెననియును విద్యాభ్యాసమునకు ఉచితవయస్కులగు బిడ్డలలో మనదేశమంతటికిని విచారించినచో నూటికి 12.5% నుండ బరోడాయందు మాత్రము 25 % నుండెననియు, అందును బాలికలలో దేశమంతటికిని నూటికి 2. 10% నుండఁగ బరోడాలో 8.6% నుండెననియుఁ దెలియవచ్చుచున్నది.

ఇట్లు ప్రథమపాఠశాలల యెడ గృషిచేయుటతోడనే తృప్తినొందక సీమానవేంద్రుఁడు దరిద్రులకును ఇదివఱకు విద్యాభిరుచి ఎక్కుడుగలేని జాతుల వారికిని బ్రోత్సాహమొసంగుటకయి ఉన్నతవిద్యను నేర్పునట్టియు, పరిశ్రామిక విద్యను బోధించునట్టియు ఉత్తమ విద్యాలయము లేర్పఱచి

యందు అనేకము లయిన ఉపవేతనములును ఇతరానుకూలములును నగుసౌకర్యముల కలుగఁజేసియున్నాఁడు.

1888 వ సంవత్సరమాదిగ పరిశ్రామిక విద్యాలయములనేల కొల్పఁబడినవి. అందు ముఖ్యము బరోడాయందలి 'కళాభవన్' అనునది. అట (1) చిత్రలేఖన, వర్ణలేపనములును (2) వడ్రంగమును (3) యంత్రోపయోగవిద్యయు (4) రంగుపనియు (5) నేతపనియు (6) గడియారములు చేయుటయు మున్నగు విద్యలు శాస్త్రీయముగ నేర్పఁబడుచున్నవి.

ఇంతియెగాక విదేశములకు వెడలి (1) వ్యవసాయ శాస్త్రము (2) అరణ్య పోషణశాస్త్రము (Forestry) (3)వైద్యశాస్త్రము(4)దోహదశాస్త్రము (Horticulture) (5) విద్యుచ్ఛక్త్యుపయోగము (6) గానవిద్య (7) యంత్రశాస్త్రము (Engineering) (8)యంత్రనిర్మాణవిద్య (Machine Construction) (9) రసాయన సంశ్లేషణము (Chemical Analysis) (10) ద్రవ్యశాస్త్రము (Finance) (12) గడియారములు చేయుట (13) న్యాయశాస్త్రము మున్నగు విషయములయందు పరిశ్రమచేయనెంచిన వయోవంతులకు నితఁడు సర్వసాహాయ్యములు నమర్చి విద్యాభ్యాసానంతరము వారిని దనరాష్ట్రమునందు జనోపయోగకార్యములకు నియమించుచున్నాఁడు.

ఇట్లు సయాజీరావు గాయికవాడు "విద్యమూలంబు దేశాభివృద్ధికెల్ల" ననెడి మతమువాఁడు గానఁ దన యావచ్ఛక్తిని విద్యాభివృద్ధికయి వినియోగించుచున్నాఁడు.



ఇతర విషయములయందును నితఁడుత్తమాదర్శములుగలవాఁడయి ప్రఖ్యాతి వడసియున్నాఁడు. సంఘసంస్కారవిషయమున నీతఁడు చూపిన దారులవలన నీతఁడుత్తమ సంస్కర్తలలో నొకఁడుగ నెన్నఁబడవలసి యున్నది. విదేశములకుఁ బ్రయాణమగు విద్యార్థులకు సాయమొనర్చుట యటుండ నితఁడును నీతని యర్ధాంగలక్ష్మియు స్వయముగ నైరోపాఖండమును జుట్టివచ్చి యనేకాంశముల మనకు వెల్లడిచేసి యున్నారు.

వీరి పుత్రులును బుత్రికలును ఇంగ్లాండునందుఁ గొంత వఱకు విద్యనభ్యసించియో నభ్యసింపుచునోయున్నారు. అతిబాల్యవివాహముల సంగతి నెత్తికొంటిమేని యీతఁడా దురాచారమును దొలఁగించు నుద్దేశముతోఁ దన రాష్ట్రమున నొకచట్టము నేర్పఱచి యున్నాఁడు. దానివలన బండ్రెండేండ్లకు లోఁబడిన కన్యకలకు వివాహముసేయరాదు. వారికి ఆవయస్సు దనుక నిర్బంధవిద్యాభ్యాసముండుట వలన నీ అతిబాల్య వివాహశాసనము నుపయోగించు నవసరమేయుండఁ బోదనిన నంతసాహసముగాదు. ఆశాసనము వలనను నిర్బంధవిద్యాభ్యాసపద్ధతివలనను బాలురకుఁ గూడ నతిబాల్య వివాహములు నిషేధింపఁ బడినవి.

ఇఁక రాజకీయ విషయములఁ దడవితిమేని ఇతఁడు మిక్కిలి యుదారమగు మార్పుల నొనర్చి యున్నాఁడు. బహుకాలమునుండి మన మహాజనసభలు ఏ రాజకీయ సంస్కారమున

కంబు మొట్ట వెట్టుచున్నవో. ఆ రాజకీయ సంస్కారము - అధికార న్యాయశాఖల విభజనము - నీతఁడు దనరాష్ట్రమున నొనర్చె నిర్బంధవిద్య, అతిబాల్యవివాహశాసనము మున్నగు; విషయములందువలెనె తక్కుంగల భారతీయ ప్రభుత్వములకు మార్గదర్శకుఁడయి యున్నాఁడు. గ్రామ పంచాయతుల నభివృద్ధిచేసి తాలూకా బోర్డులకును జిల్లా బోర్డులకు నవి నిశ్చయ సంబంధము గలవగునట్లు చేయు తలంపుతో నతఁడు నిర్వాచనా పద్ధతులను తనదేశమున నుపక్రమించి యున్నాఁడు.

ఈ సంస్కారము లన్నియును మహారాజ గాయికవాడు సయాజిరావు దీర్చుటలోఁ దనకు సహాయులుగ నాతఁడు నియమించుకొనిన మంత్రులును మనదేశ చరిత్రమునందు మహనీయులే. అందు సర్. టి. మాధవరావునకుఁ దరువాత ముఖ్యుఁడు కీర్తిశేషుఁడగు రమేశచంద్రదత్తు. ఇతనినిగుఱించి విశేషించి యిట వ్రాయుటకు నవకాశములేదు. కాని యీతఁడు పరిపాలకులలోఁ బరిపాలకుఁడనియు గ్రంథకర్తలలో గ్రంథకర్తయనియు స్వదేశాభిమానులలో స్వదేశాభిమానియనియుఁ బేరువడసియున్నాఁడనిన నీతని విస్తారశక్తి వెలువడఁగలదు.

ఇట్టి చరిత్రగల బరోడా సంస్థానమింకను వృద్ధినొంది సర్వకాలమును భరతవర్షము నందలి యితరస్వదేశరాష్ట్రములకు మార్గదర్శకమగుచు వెలుంగుగాత!

---



# ఢిల్లీ దర్బారు.

## 5. మైసూరురాజ్యము.



శ్రీ మైసూరు మహారాజుగారు.

ఆఱవ ప్రకరణము.

# మైసూరురాజ్యము.

## ప్రవేశిక.

భరతవర్షమునందు స్వదేశరాజ్యములలో మూఁడవది యయి విరాజిల్లునది మైసూరు. తూర్పుకనుమలును పడమటి కనుమలును నొక్కటిగఁజేరు నీలగిరు లిద్దానికి శిరమని చెప్ప వచ్చును. అచ్చటినుండి ఈదేశము వెడల్పగుచు నుత్తరమునకు వ్యాపించుచున్నది. ఈశాన్య దిగ్భాగమున బొంబాయి రాజధానిలోని రెండుజిల్లాలును నైఋతి మూలన కొడగును దప్ప దీని కన్ని వైపులను మద్రాసు రాజధానియెయెల్ల. ఇందు ఉన్నతములగు పర్వతములును పురాతనములగు నడవులును 4,000-5,000 అడుగుల ఎత్తునకు దలలెత్తికొని గంభీరముగ నిలచియుండు అసంఖ్యాకములగు దుర్గములునుగలవు. కావేరి, తుంగభద్ర, పాలేరు, ఉత్తరపినాకిని, దక్షిణపినాకిని, మున్నగుప్రసిద్ధ నదీనదము లీదేశమున ప్రవహించుచున్నవి. ఇందు సొంపులుగురిపించు జలపాతము లనేకములు. వానిలో గెర్సొప్పా జలపాతము సుప్ర

సిద్ధము. ఈదేశ మీ విధమున నడవులు పర్వతములు నదులు జలపాతములు దుర్గములు మున్నగువానిచే నలంకరింపఁబడి యుండుటయేగాక భూగర్భ నిక్షిప్త వస్తు సంపత్తిచేతను, ఉత్తమ సస్య సంప్రాప్తివలనను, అపూర్వ జంతుజాల సమావేశంబునను వర్ణనీయమయి యున్నది. భరతవర్షమునం దింకెచ్చటను ఈసీమయం దుత్పత్తియగునంతటి బాగా రుత్పత్తియగుట లేదు. మంచి గంధపుచెట్లకును భద్రేభములకును నిది పుట్టినిల్లు. తేఁకుమ్రాఁకులును నిటమెండు. కొమ్ముగల పసువులును నిచ్చట విశేషము. కాఫీ పైరునకుఁగూడ నిదియే పట్టు. ఈరీతి నిది ప్రకృతి ఫలములవిషయమున ప్రఖ్యాతము. ఇఁక నిచ్చటి మానవ చరిత్రమునకు దిగితిమేని శంకరాచార్యులును రామానుజులును నిరువురును దీని నెదమ జీవనముచే పావనము చేసిరి. ఇంతియగాక దక్షిణ హిందూస్థానమున పరాక్రమమునకుఁ బేరుగాంచి రాజ్యము లేలిన కదంబులకును హొయిసణులకును బహుశః విజయనగరాధిపతులకును నిదియె జన్మస్థానము.

## రెండుభాగములు

ఇట్టి విశేషచరిత్రగల మైసూరు దేశమును స్వరూపమువలన రెండుభాగములుగ విభజింపవచ్చును. పడమటి కనుమల ననుసరించు పర్వతప్రదేశమగు పశ్చిమదిశాభాగమునకు మలనాడు అనిపేరు. పట్టణములు పల్లెలును గలిగి జనసమృద్ధితో నొప్పు తూర్పుభాగము మైదానములేక బయలు సీమయని



పిలువఁబడుచున్నది. మలనాడు చిత్రవిచిత్రములగు నరణ్యములచేతను పర్వతములచేతను గప్పఁబడి యున్నది. మైదానము నీటివసతినిబట్టి యనేకవిధములయి యున్నది. ఉత్తరముననుండు చదరమయిన నల్లరేగడి భూమి ప్రత్తిని జొన్నలను ఈనుచున్నది. నదులనుండి త్రవ్వఁబడిన కాలువల నీటి పారుదలగల దక్షిణ పశ్చిమభాగములు చెఱకునకును వరిపైరునకును సదనములయి పరగుచున్నవి. చెఱువులపై యాధారపడి యుండు భూములు టెంకాయ పోకతోఁటలచే నలంకరింపఁబడియున్నవి. తూర్పుదిక్కునందలి ఎఱ్ఱ భూమిలో రాగి మున్నగు కుష్కి పైరులు పండుచున్నవి. శిలామయమయిన విరివియగు మధ్య ప్రదేశము ముదుకగడ్డి బయలై అటనట చల్లని నీడనీను తోపులఁ బ్రదర్శింపుచున్నది.

## నామప్రసంశ.

సంస్థానమునకంతకును రాజధానింబట్టి మైసూరు అని పేరు. మైసూరుఅనునది మహిష - ఊరుఅను రెండుపదముల కూడికవలన నైనది. మహిషుఁడను * రక్కసుఁ డొక్కఁడా ప్రాంతముల నుండెడువాఁడఁట. వానిని చాముండియను పేరఁ బరగు ఈశ్వరసతి ద్వంద్వయుద్ధమునఁ బరిమార్చి ఆప్రాంతములందలి జనులకు సుఖముఁగూర్చి మహిషాసుర మర్దనియను

* విగ్రహములయందు మహిషుఁడు దున్నపోతు తలగలవాఁడుగఁ బ్రదర్శింపఁ బడుచున్నాఁడు.

బిరుదుపేరుతో నచ్చట నివాసమేర్పఱచుకొని నేఁటికిని అనేకులచే నర్చన లందుచున్నది. అట్టి యీ మహిషునికి చేరిన యూరగుటవలనను మహిష శబ్దము కన్నడమున మైసయని మారుటవలనను 'మైసూరు' అయినది.

## పురాతన నామము.

ఈదేశమునకు 'మైసూరు' అనుపేరు పూర్వమునందు హిందూవాఙ్మయమున నెచ్చటను వాఁడబడియుండలేదు. ఒక్క మహావంశమను బౌద్ధ గ్రంథమునందు మాత్రము మహిషమండలమని ఈప్రదేశము పేర్కొనఁబడి యున్నదేగాని ఇతర గ్రంథములందంతటను 'కర్నాటము', 'కర్నాటకము' అనుపదములే ఉపయోగింపఁబడి యున్నవి. ఇప్పుడీ కర్నాటకపదము మైసూరుసీమకు బొత్తిగా నన్వయింప కుండుటంబట్టియు అంతటితో నిలువక 'కర్నాటక' 'కనర' శబ్దములు వేరుప్రదేశముల కన్వయించుచుండుటం బట్టియు నీపదముల నొకకొంత ఇట చర్చింపవలసి యున్నది. 'కర్నాట' 'కర్నాటక' మను శబ్దముల కనేకు లనేక యుత్పత్తులఁ జెప్పుచున్నారు. పండితులిద్దానిని సంస్కృత పదమనుచున్నారు. సర్ వాల్టరు ఎలియట్ అను గ్రంథకర్త దీనికి 'శాతకర్ణి' * మున్నగు పదములలోని 'కర్ణ' 'కర్ణి' యను పదములతో సంబంధము గలదనియు కావున నిది ప్రాచీన ప్రభువుల వలన వచ్చిన దనుచున్నాఁడు. మఱికొందఱిది కర్ణ+ఆట

* వీరాంధ్రులు.



(అనఁగా చెవునకుపండువు) అని నిర్ణయించుచున్నారు. డాక్టరు గుండర్టు 'కార్' 'నాడు' అను రెండుపదములుచేరి కర్నాటమయిన దనియు 'కార్' అనఁగా నలుపుగావున నల్లరేగడి భూమివలన నీపేరీదేశమునకు వచ్చి యుండవచ్చుననియు నుడువుచున్నాఁడు. 'కార్' 'నాడు' అను పదద్వయ సమ్మేళనముచే వచ్చినదనుట సమంజసమే కాని డాక్టరుగుండర్టుగారి యర్థము సరియైనది మాత్రము కాదని చెప్పవచ్చును. కార్ శబ్దము తెలుఁగునందు 'కారు' అను రూపమునం గాననగును. మనభాషయందుఁ గూడ నీపదమునకు 'నలుపు' (చీఁకటి) అనియే యర్థము. నాడు శబ్దము రెండు భాషలకును సామాన్యమే. కావున కారునాడు లేక కర్నాడు లేక కర్నాటము అనఁగా చీఁకటిదేశమని యర్థము తేలుచున్నది. ఈచీఁకటిదేశము ఆంధ్రశబ్దము చే[1] సూచింపఁబడు దండకారణ్యముదక్క మఱియెద్ది కాఁగలదు? ఆకాలమున నిప్పటి మైసూరునందు విశేషభాగము దండకారణ్యము లోనిదేయని చెప్పుటకు సందియ మవసరము లేదుగదా![2] అట్టిచో 'ఆంధ్ర' మనునది సంస్కృత భాషావిదులచే, కర్నాట శబ్ద పర్యాయ పదముగఁ బ్రథమమున నుపయోగింపఁబడి పిదప విభేద మేర్పడిన తరువాతనది తెలుఁగు శాఖకు చెందెననుటలో సాహసమేమియు

1 ఆంధ్రశబ్దమున యుత్పత్తి నరయువారు మ. రా. రా. శ్రీ. చిలుకూరి వీరభద్రరావు గారిచేవిరచితమయిన ఆంధ్రులచరిత్ర పూర్వయుగమును జూచునది.

2 హిందూమహాయుగము. మూఁడవ ప్రకరణము చూచునది.

నుండఁజాలదు. ఆంధ్రులు కర్నాటకులని వర్ణింపఁబడి యుండుటకుఁగూడ నిదియె కారణమని తోఁచుచున్నది. మఱియొక కొద్ది యాధారముగూడ నున్నది. 'కన్నడ' మను శబ్ద స్వరూపమును మనకుఁ దోడుపడుచున్నది. ఇది కన్ - నాడు అను పదములనుండి వచ్చినదే. కన్ అనఁగా కన్నడభాషయందు చీఁకటి యనియే యర్థము. కావున నిదియు చీఁకటిదేశమను నర్థమునే ఇచ్చుచున్నది.

ఇట్లు కర్నాట శబ్దము దండకారణ్యమునకు తెలుఁగువారును కన్నడమువారును నట నైక్యమున నివసించు కాలమున వచ్చినదని చెప్పవచ్చును. మహమ్మదీయుల ప్రవేశముతోఁ గర్నాటకపదము దండకారణ్య ప్రదేశమునకు మాత్రముగాక మలదిగిన తరువాత దానికి దక్షిణమునను దూర్పునను నుండు భూభాగమునకుఁ గూడ వర్తింపఁజొచ్చెను. ఆంగ్లేయులు ప్రమాదవశమున నాపదమును మలదిగిన తరువాత నుండు బయళ్లకు మాత్రమె యన్వయింపఁ జేసిరి. కావున న్యాయముగఁ గర్నాటక మను పేరుతోఁ బరగవలసిన మైసూరునకు నాపేరు లేకుంటయు నితరప్రాంతముల కాపేరు వచ్చుటయుఁ దటస్థించినది.

### పురాణ ప్రసిద్ధమగు చరిత్రాంశములు.

మైసూరు నందు విశేషభాగము దండకారణ్యముగ నుండెనని వ్రాయఁబడియెను. పురాణములయందీ యరణ్యము



పలుమారు పేర్కొనఁబడుచుండుటవలన మైసూరు దేశపుఁ బూర్వచరిత్రయందొకకొంత పురాణగాథల నుండియే వ్రాయఁబడవలసి యున్నది. అగస్త్యుఁడు ఇల్వలవాతాపులను మడియించిన ఘట్టము నెలమంగళము వద్ద నర్కావతీ నది పయినుండు స్తంభోదధి (కమ్మసంద్రము) అను గ్రామమని చెప్పఁబడుచున్నది. ఇతరులగు ఋషులును నీదేశమున తపోధనులయినట్లు నుడువఁబడుచున్నది. గౌతముఁడు కావేరీ తీరమున శ్రీరంగపట్నమునందును కణ్వుఁడు చెన్నపట్నమునకు సమీపమున వేలూరు నొద్ది నదీతీరమునను, విభాండకుఁడు తుంగానది పయి శృంగేరికడను, మార్కండేయుఁడు భద్రానదిపై కాండేయము ఒద్దను, దత్తాత్రేయుఁడు బాబా బుడ్డను పర్వతముల మీఁదను తపశ్చరణము సల్పినట్లు ప్రతీతి కలదు.

ఆర్యులు దక్షిణాపథమునకు వచ్చునప్పటికి మైసూరు సంస్థాన ప్రదేశమున రాజ్యమేలుచుండిన వారలలో రాక్షసులని వారిచే బిలువఁబడిన స్థానిక రాజులుండినట్లు విశదమగుచున్నది. నిష్కర్షగ వీరలే యాకాలము వారని చెప్పుట కాధారములు లేవుగాని పురాణ గాథలను బట్టి తుంగభద్రమీఁది హరిహరము రాజధానిగ గుహాసురుఁడును, చిత్రదుర్గము ముఖ్యపట్టణముగ హిడింబాసురుఁడును, రహమను ఘురము నొద్ద బకాసురుఁడును, మైసూరను నామమునకుఁ గారణభూతుఁడగు

మహిషాసురుఁడు చాముండియందును ప్రబలులయిన ట్లూహింపవలసి యున్నది.

పరశురాముని జన్మాదికములకు గూడ మైసూరు భూమియే సదనమనుటకు నిదర్శనములున్నవి. జమదగ్ని సురభికి యజమాని యనుటయు, రేణుక తన మగనితోడ నగ్నిని ప్రవేశించుటయు, కార్తవీర్యుఁడు చంపఁబడుటయు, కశ్యపుఁడు క్షత్రియశేషమును గాపాడుటకయి పరశురాముని సముద్రతీరమునకు వెడలిపొమ్మని శాసించుటయు, పరశురాముఁడు సగరుని వేడి సప్తకొంకణముల సంపాదించుటయు మున్నగు విషయముల సూచించుటకు సురభితాలూకాయును, చంద్రగుత్తిలోని రేణుక దేవాలయమును, కోలారునందు కొల్హాలమ్మగుడియు, తీర్థహళ్లియును, సాగరను తాలూకాయును, హీరేమాగళూరులోని పరశు దేవాలయమును, హిరేమాగళూరునకుఁ బూర్వనామమగు భార్గవపురియును చాలియుండునని 'రైస్' అను చరిత్రకారుఁ డూహించుచున్నాఁడు.

రామాయణ కథ ననుసరించి కిష్కింధవదలి శ్రీరాముఁడు దక్షిణాభిముఖుఁడై లంకకుఁ దరలుట మన మెఱింగినదే. కిష్కింధలోనిదగు పంపాసరోవరము తుంగభద్రాతీరమందలి సుప్రసిద్ధమయిన విజయనగరముగదా. అచ్చటినుండి దక్షిణమున కేగుటకు మార్గము మైసూరు సంస్థాన భూమి ద్వారా యయి యుండవలయుననుటకు సందియము లేదు. జైన



రామాయణమునందు కిష్కింధ వానరధ్వజరాజ్యమని పిలువఁబడియున్నది. దానియందా రాజ్యచరిత్ర బాగుగ నియ్యఁబడినది. అదెల్లయు నిచట వ్రాయు టనవసరము. దానిననుసరించినచో మైసూరున పశ్చిమోత్తరభాగము రామాయణ కథలో ననేకాంశములకు పట్టుగనుండెనని తేలుచున్నది.

భారత కథయందును మైసూరు ప్రదేశము ప్రాముఖ్యత నందియున్నది. అర్జునుఁడు తీర్థయాత్ర సలుపునపుడు మహేంద్ర పర్వతముల దాఁటి మణిపురమును జొచ్చి అచ్చటిరాజు కూఁతును చిత్రాంగదను బెండ్లియాడి మూఁడేండ్లు వసించి బభ్రువాహనుఁడను కొడుకును బడసెనని చెప్పఁబడియున్నది. ఈమణిపురము శ్యామరాజ నగరమునకు సమీపమున నున్నట్లు నుడువఁబడుచున్నది.* దిగ్విజయసమయమున సహదేవుఁడు దక్షిణముపై దాడివెడలి కిష్కింధను దాఁటి కావేరికడ కేగి మహిష్మతి రాజగు నీలుని జయించుచున్నాఁడు. ఈమహిష్మతి మైసూరనియే చెప్పవలసియున్నది. అటనుండి అతఁడు సహ్యాద్రుల మార్గమున కొంకణ, గౌళ, కేరళ రాజులను వశవర్తులఁ జేసికొనెనని వర్ణించుటవలన నీయూహకుఁ గొంచెము దార్ఢ్యము కలుగుచున్నది. కన్నడభాషయందుఁగల జైమినీ భారతమున అశ్వమేధయాగవర్ణనలోఁ బేర్కొనఁబడిన కొన్ని స్థలములును

* బంగాళమునందలి మణిపురము బభ్రువాహనుని దనుచున్నారఁట గాని భారతమందలి వర్ణనలను బట్టి అదికాఁజాలదు.

మైసూరు దేశములోనివియని పరంపరగ జెప్పుకొనఁబడుచున్నది. బభ్రువాహనుని రాజధానియగు మణిపురమును గుఱించి పైనివ్రాయఁబడియెను. అశ్వమచ్చటికి వచ్చినతోడనె బభ్రువాహనుఁ డద్దానిని పట్టెను. అర్జునుని కుమారుఁడగుట వలన నతఁడు దానిని మహావైభవమునఁ దండ్రికి కర్పింపఁ బోయెను. విధివశమున నర్జునుఁడు పుత్రుని గుర్తింపలేక అతనిని తిరస్కరించెను. కావున వారిరువురకును యుద్ధము జరిగెను. దాని యందర్జునుఁడు మృతుఁడయ్యెను. బభ్రువాహనుని తల్లి యగు చిత్రాంగద అర్జునునితో సహగమనము సేయ సిద్ధపడెను. దానిమీఁదట బభ్రువాహనుఁడు ఉలూపిసాయమున నాగులయొద్ద సంజీవిని కలదని విని సామమున నది లభింపనందున వారితో యుద్ధముచేసి సంపాదించి తెచ్చి అర్జునుని బ్రతికించుకొనెను. తరువాత నాయజ్ఞపశువు రత్నపురమును అటు తరువాత కుంతలమును బ్రవేశించెను. ఈరత్నపురకుంతలములు కాడూరు జిల్లాలోని లక్వల్లియనియు శివమొగ్గ జిల్లాలోని కుబత్తూరు అనియు వాడుకొనుచున్నారు.

మైసూరు సీమయందింకనుకొన్ని పురాణగాథలలోని స్థలములున్నవని వాడుకలున్నవిగాని వాని నంతయును వివరించుట మన కార్యమున కవసరముగాదు. కావున నింతటితో పురాణగాథల నటుండనిచ్చి చారిత్రిక విషయములఁ బ్రారంభింతము.



హిందూదేశచరిత్ర కంతటికిని పోలె మైసూరునకుఁ గూడ కాలనిర్ణయ విషయములకు నిశ్చయాధారమయినది అలెగ్జాండరు దండయాత్రయె (క్రీ. పూ. 327.) అతఁడు హిందూస్థానమును వదలి తన దేశమునకుఁ దరలినతోడనె భరతవర్షమున నేకచ్ఛత్రాధిపత్యము వహించినవాఁడు చంద్రగుప్తుఁడు. ఇతఁడే మనదేశమునకుఁ బ్రథమచక్రవర్తియని చెప్పవచ్చును. ఈతని వంశము మౌర్యవంశము. ఈతని మనుమఁడే బౌద్ధమతోద్ధారకుఁడయి లోక ప్రసిద్ధిగాంచిన అశోకవర్ధనుఁడు. చంద్రగుప్తుఁడు జైనుఁడు. జైనమత సిద్ధాంతముల ననుసరించి అతఁడు తన జీవయాత్రాంతమున రాజ్యాధికములను వదలుకొని ప్రఖ్యాతుఁడగుభద్ర బాహుఁడను గురువు నాజ్ఞలఁ జెల్లించుచు తపశ్చరణ మొనర్చుటకుగాను అతనితోడంగూడ బయలు దేరెను. ఉజ్జయనీ నగరమున పండ్రెండు సంవత్సరముల కఱవు రానున్నదని భద్రబాహుఁడు దన దివ్యజ్ఞానముచే నెఱింగి శిష్యులనందఱను వెంటఁ బెట్టుకొని దక్షిణాభిముఖుఁడై వెడలెను. మైసూరు సీమలోని శ్రవణబెళగొళము నొద్దకు వచ్చునప్పటికి భద్రబాహువునకు మృత్యువుసమీపించుట యెఱుకయయ్యెను. కావున నతఁడచ్చట నొక్కశిష్యునితో నిలచి తక్కినవారలను బ్రయాణము సాగింపుఁడనెను. అట్లు గురువుతో నుండిపోయిన యొంటరిశిష్యుఁడే చంద్రగుప్తుఁడని తెలియవచ్చుచున్నది. శ్రవణబెళగొళమునందు

భద్రబాహుండు పరలోకమున కేగువఱకును నతనికి సపర్య లొనర్చి పిదప పండ్రెండేండ్లు మునివృత్తినుండి భరతవర్షపు ప్రథమచక్రవర్త్తి పరమపదమునందె ననుచున్నారు. ఈకథకుం బ్రోద్బల మొసంగుటకు వలయు స్థలనామములును ఆలయము లును శాసనములును శ్రవణ బెళగొళమునందుం గలవు. ఈకథ మనము విశ్వసించినను విశ్వసింపకున్నను రైసుగారి వలన మైసూరు మండలమున ఈశాన్యభాగమునందు గనిపట్టంబడిన అశోకుని శాసనములను బట్టి ఆభాగము మౌర్యుల రాజ్యములోం జేరియుండెననుట మాత్రము దప్పక సిద్ధించుచున్నది. అశో కుండు మహిష మండలమునకును (మైసూరు) వనవాసికిని (మైసూరు మండలమునందు వాయవ్య భాగము) తన మత ప్రచారకులను బంపెను. ఈరెండును నతనిరాజ్యపు సరిహద్దున కావలనుండిన ప్రదేశములని చెప్పవలసియున్నది. షికారు పురమండలి బండనిక్కె గ్రామముకడనుండు పండ్రెండవ శతా బ్దపు శాసనమొక్కటి కుంతలమును మౌర్యుల రాజ్యములోని భాగముగ వర్ణించుచున్నది. ఇది రమారమి పడమటి కనుమలు పశ్చిమమున నెల్లగాంగలిగి భీమా వేదవతుల మధ్యభాగమున నుండు భూభాగము. ఇందు శివమొగ్గ, చిత్రదుర్గము, బళ్లారి, ధార్వాడ, బిజాపురము జిల్లాలును వీని సరిహద్దులనుండు బొం బాయి రాజధాని నైజాము ఇలాకా భూములును నిమిడి యున్నవి.



ఈవిధమున మౌర్యుల సామ్రాజ్యమున నుత్తర మైసూరు భూములు నుండెనని విస్పష్టముగ నేర్పడుచున్నది. పురాణ గాథల ననుసరించి మౌర్యవంశజులు 137 సంవత్సరములురాజ్య మేలినట్లు తెలుచున్నది. ఆశాఖలో గడపటివాఁడగు బృహద్ర థుని అతని సేనానియగు పుష్యమిత్రుఁడు చంపించి సంగవంశ మును స్థాపించెను. వీరు 112 సంవత్సరములు రాజ్యమేలిరి. కాని ఆకాలములో కడపటి భాగమున కణ్వవంశమువారు వీరిని మించిన ప్రఖ్యాతి గలవారయి 45 ఏండ్లు సర్వస్వతంత్రు లయి పరగిరి. వీరు సంగభృత్యులని కూడ పిలువంబడి యుండు టచే వీరు మొదట సుంగరాజులకు లోంబడినవారయి యుండినను నుండవచ్చును. సుకర్ముఁడను కడపటి కణ్వరాజు ఆంధ్రభృత్య వంశమునకు స్థాపకుఁడగు సీముకుని (శ్రీము ఖుని) చేనోడింపంబడెను. ఈ యాంధ్రభృత్య వంశమున కే శాతవాహనులనియు తచ్ఛబ్ద ప్రాకృతమగు శాలివాహను లని యుపేళ్లు. ఈ శాలివాహనులకు ముఖ్య రాజధాని కృష్ణాతీర మున నుండు ధారణికోట. వీరికి మరియొక రాజధాని కూడనుండె డిది. అది గోదావరీతీరమున (నిప్పటి నైజాము రాజ్యములోని) పైఠణ్ పురము. దీనికే ప్రతిష్ఠానమని పేరు. ఈ శతవాహను లుత్తర మైసూరుసీమను ఏలిరనుట శాసనములవలనను నాణ్య ముల వలనను నిశ్చయింపంబడి యున్నది. ఇచ్చట రాజ్య

* ఈ పేరును బట్టియే శాలివాహన శక మేర్పడినది.

భారము వహించిన రాజులకు శతకర్ణియనునది బిరుదు నామముగఁ గాన్పించు చున్నది. శాలివాహన వంశపు శాఖలోని వారగు నీ శతకర్ణుల కాలము క్రీ॥పూ॥ రెండు శతాబ్దములును అటుతరువాత రెండు శతాబ్దములును నని చెప్పవలసి యున్నది. శాలివాహనుల శక్తి తగ్గిపోవుట తోడనే, మైసూరు సంస్థానప్రదేశమున ననేకు లితరవంశములవారు వేరువేరు భాగముల నాక్రమించుకొనిరి.

## కదంబులు

క్రీస్తునకు వెనుక మూఁడవ శతాబ్దమునకు వచ్చునప్పటికి మైసూరు సీమలో వాయవ్య దిగ్భాగమున కగంబులు రాజ్యమేలుట గానవచ్చు చున్నది. వీరితోఁగూడ మైసూరున రాష్ట్రకూటులును మహా బలులును పల్లవులునుగూడఁ జూపట్టు చున్నారు. ఇంచుమించుగ నీకాలమునకు వచ్చునప్పటికి నిశ్చయాధారములు వలసినన్ని పొడఁగట్ట నారంభించు చున్నవి.

కదంబుల రాజ్యమున పశ్చిమ మైసూరును, ఇప్పటి ఉత్తరకన్నడము జిల్లాయును తుళువమనంబడు దక్షిణకన్నడము జిల్లాయును జేరియుండెను. వీరి రాజధాని వనవాసి.

కదంబనామమును గుఱించి చిత్రమగు కథయొకటి గలదు. పరశురాముఁడు సాగరమునుండి హైగ * తుళువముల సంపాదించిన కొంతకాలమునకుఁ దరువాత నీనూతన భూప్రదే

* ఉత్తరకన్నడ జిల్లాకిది ప్రాచీననామము.



శమును జూచుకొనుటకు సహ్యాద్రులకు అనఁగా పడమటికనుములకు పార్వతీ పరమేశ్వరులు విచ్చేసిరి. వారివలన నచ్చట నొక కదంబ వృక్షముపీడన నొక బాలుఁడు పుట్టెనఁట. దానివలన నాసంతతికి కదంబ నామమయ్యె నందురు. ఇంకొక వాడుకననుసరించి ఈశ్వరుఁడు త్రిపురాసురులఁ జంప పరిశ్రమ చేయుచో నతని ఫాలమునుండి స్వేదము కదంబ వృక్ష మూలమునకుఁ బారెననియు ఆస్వేద బిందువులచే నొక బాలుఁడు పుట్టెననియుఁ జెప్పుకొనఁ బడుచున్నది. ఎటులైననేమి బాలుఁడు పుట్టెననిమాత్రము రెండు గాథలును నుడువు చున్నవి. ఆ సమయమున నా దేశమునకు రాజుండలేదఁట. కావున రాజు నేర్పఱచుటకై సంస్థానేభముయొక్క తొండమునకుఁ బూమాల నిచ్చి విడిచిరఁట. అది ఆమాలను గొనిపోయి అద్భుత జన్మచరిత్రగల పైబాలుని కంఠమున నైచెననియు నతఁడే రాజయ్యెననియుఁ బరంపరగ నుడువఁబడుచున్నది.

ఈపుక్కిటి పురాణకథయొక్క యుద్దేశముమాత్రము స్పష్టము. కదంబులను వారు బయటినుండి వచ్చినవారుగాక ఆసీమయందె పుట్టినవారని సూచించుటకిది కల్పింపఁబడి యుండనోపునని రైసు అభిప్రాయపడు చున్నాఁడు. కదంబ యను పేరువచ్చుటకొకవేళ ఈ వంశము వారుదమ కుల దేవతయగు మాధుకేశ్వరునికిఁ బ్రియమైన పుష్పమునీను

ఈవృత్తమును దమకు కులనామముగఁ జేకొనిరి గాఁబోలు. వీరు బ్రాహ్మణులు.

కదంబులలో మొదటివాఁడగు నీపైఁ జెప్పిన బాలునిపేరు జయంతుఁడనియును త్రిలోచన కదంబుఁ డనియును, త్రినేత్ర కదంబుఁడనియును గానవచ్చుచున్నది. ఇతని వంశపురాజులు క్రీ. శ. రెండవ శతాబ్దము మొదలు ఆఱవ శతాబ్దమువఱకును స్వతంత్రులయి రాజ్యమేలినట్లును అనేకాశ్వమేధము లొనర్చి నట్లును గానవచ్చుచున్నది. వీరికిని నాగులకును బద్ధవైరముండె డిది. పల్లవులును వీరికి శత్రువులే. కావున కదంబులకును నాగులకును యుద్ధములు హోరాహోరిగ జరుగుచుండెను. కదంబులు పల్లవులచే నోడింపఁబడి తమబలమును గోలుపోయి యుండిరి. కాని మయూరశర్మయను కదంబుఁడు మఱలకదంబ వంశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించి తనశక్తి సామర్థ్యముల వలన మహాప్రసిద్ధ వడసెను. పోయియుండిన వైభవమును మరల్చినవాఁ డగుటవలన వాడుకలోనుండు కొన్నికథల ననుసరించి ఇతఁడే కదంబవంశ స్థాపకుఁడుగవర్ణింపఁ బడు చున్నాఁడు. నాగులప్రతాపమును వర్ణించుటకుఁ గాని వారి చరిత్రను వ్రాయుటకుఁగాని యిది యదనుకాదు. వారిపేరుఁ జెప్పిన కాశ్మీరముగూడ యదరుచుండె నౌన * వారెంతటి శత్రువు లనునదియు విశదముకాఁగలదు. వారినికదంబులలో

* రాజతరంగణింజూచునది



నెక్కఁడగు కృష్ణవర్మ జయించినట్లు అతని వంశజుఁడగు దేవవర్మని శాసనమువలనఁ దేలుచున్నది. ఈతనికి తరువాత నాగులు కదంబులకు సామంతులయి ప్రవర్తించిరి. కదంబవంశపు స్థానము చాళుక్యు లాక్రమించుకొనుటతో నాగులువారికి సామంతులయిరి (క్రీ॥ శ॥ 556). విజయనగర సామ్రాజ్యము ప్రారంభమగు వఱకును కదంబులు సంపూర్ణముగ నశింపలేదు. చాళుక్యులకు సామంతులును ప్రతినిధులును నై అప్పుడప్పుడు మఱలమఱల ప్రాముఖ్యతగాంచుచుండిరి. ఈ వంశపు శాఖ లలో నొక్కటి 'గోవా' ను రాజధాని చేసికొనిరాజ్య మేలు చుండెను. కాని విజయనగర విజృంభణముతో నెల్లరును పేరైనలేక నశించిపోయిరి.

## మహాబలులు.

రమారమి కదంబులు మైసూరునందు వాయవ్య మూలనఁ గానవచ్చు కాలముననె మహాబలులు తూర్పు దిశయందు గాన నగు చున్నారు. వీ రాంధ్రదేశమునకు పశ్చిమ దిగ్భాగ మున 12,000 గ్రామములపై యధికారము వహించి ఏడునర లక్షల భూమిని ఏలిరని వీరి శాసనములవలనఁ దెలియవచ్చు చున్నది. వీరి ముఖ్యమండలము ముళబాగులు. వీరు బలి[1]చక్ర వర్తి బాణాసురుల సంతతివారని చెప్పుకొను చున్నారు.

1 ఇతని రాజధాని మహాబలిపురము. మహాబలుల కిదియ మొదటి రాజధానియేమొ?

ఆకథలనెల్ల నిట వివరింపఁబనిలేదు. ఈవంశపురాజులకు బాణరసులనియు పేరుగలదు. వీరు పదియవ శతాబ్దమునంతము వఱకును స్వాతంత్ర్యమున రాజ్యభారము వహించి తరువాత పల్లవులకు లోఁబడి పోయినట్లు శాసనముల వలనఁ దేలుచున్నది. పదమూఁడవ శతాబ్దమునను పదునేనవ శతాబ్దమునను వీరు మరల ప్రఖ్యాతికి వచ్చుచున్నారు. ఉత్తర ఆర్కాటు జిల్లాయందును తిరునల్వేలియందును అక్కాలమున వీరి శక్తి వెలింగినట్లు కానవచ్చుచున్నది. కావున వీరు పల్లవులచే నోడింపఁబడిన తరువాత వీరిలోని సాహసికులు గొందఱు దూరదేశములకుఁ బోయి పరిశ్రమచేసి మరలఁ గీర్తి సంపాదించిరని నిర్ణయింపవలసియున్నది

## పల్లవులు.

మహాబలులతోఁ గూడ తూర్పుమైసూరునందు రాజ్యభారము వహించి తరువాత మిక్కిలి ప్రఖ్యాతి వడసినవారు పల్లవులు. వీరు భారతీయ జన్మమును బురస్కరింపఁ జూచుకొనిరిగాని చారిత్రికవిషయములను బట్టి వీరు పరదేశీయులనుట మనకిప్పుడు విశదమయి యున్నది. వీరు మొదట పారసీకమునుండి హిందూస్థానమును జొచ్చిన యొక తెగవారు. క్రమక్రమముగ దక్షిణహిందూస్థానమును జొచ్చి వీరు మొదట ఆంధ్రదేశమున స్థానమేర్పఱచుకొనఁ జూచిరి. కాని గోతమపుత్రుఁడను ఆంధ్రరాజు వీరి నోడించెను. కావున వీరింకను దక్షిణదేశమునకుఁ దరలవలసినవారై తుట్టతుదకు రమారమి క్రీస్తునకు తరువాత మూఁడవశతాబ్దమున కాంచీపురమునకు వచ్చి చేరి యచ్చట రాజ్యమేల మొదలిడిరి. పారసీకమునుండి కాంచీపురమునకు వచ్చునప్పటికి బహుకాలము పట్టియుండుననుట వేరుగ వ్రాయవలసిన పని లేదు. మొదట నీపల్లవులమతమేమయినదియు మన మెఱుఁగము. మనకుఁ దెలిసినంతవఱకు వీరు కాలదేశముల ననుసరించి మతమును మార్చుకొనుచు శైవులును వైష్ణవులును బౌద్ధులును జైనులు నైనట్టులు వీరి చరిత్రము వలనఁ గన్పట్టుచున్నది. శాతవాహనుల ప్రభ తగ్గిపోవుటతో పల్లవులు వారి రాజ్యములో తెలుఁగు దేశముగనుండిన భాగము నాక్రమించుకొనిరి. నాలుగవ శతాబ్దమున కంచినేలిన విష్ణుగోపుని కాలమునకు వీరు దక్షిణహిందూస్థానమున బలవంతులయి యుండిరని చెప్పవచ్చును. అప్పటినుండియే వీరికిని కదంబులకును వీరికిని చాళుక్యులకును యుద్ధములు విశేషము జరుగ నారంభించెను. ఇందు పల్లవులకును చాళుక్యులకును జరిగిన యుద్ధములే అత్యుగ్రములని తోఁచుచున్నది. 640 వ సంవత్సరమున హియోను స్యాంగను చీనాప్రవాసికుఁడు కాంచీపురమును దర్శింపవచ్చెను. అతని వ్రాతల ననుసరించి ఆపురమయిదుమయిళ్లచుట్టుకొలతకలదయి యుండెను. అచ్చట భూభాగము సారవంతమయి పైరు పెట్టఁబడి మంచి ఫలముల నీనుచుండెను. ఉష్ణము మాత్రమధికముగ నుండెడిది.

జనులు ధైర్యవంతులుగ నుండిరి. వారు సూనృతపరులై నిష్కపటులుగనుండి విద్యలయం దాసక్తిగల వారుగ నుండిరి. 10,000 బౌద్ధమతాచార్యులును, 80 బ్రాహ్మణ దేవాలయములును అనేకులు జైన నిర్గ్రంథులును నుండిరి. ఇట్టి రాజధానిగల పల్లవులను 733 లో చాళుక్యులలోని రెండవ విక్రమార్కుఁడు మహాయుద్ధమున నోడించెను. నాఁటినుండి పల్లవుల బలము విచ్ఛిన్నమయ్యెను. అట్లుండియు వీరు 'నోలంబు'లను పేరుతో మైసూరునందు పదియవశతాబ్దము చివర దనుకను రాజ్యభారము వహించి అప్పుడు దక్షిణ హిందూస్థానములోని పూర్వభాగము నంతయును ఆవరింపఁ జొచ్చియుండిన చోళులకుఁ లోఁబడి పోయిరి.

పల్లవులును వారి శాఖయగు నీనోలంబులును చాళుక్యులకును చోళులకును సామంతులుగఁ దరువాతి కాలమునఁ గానవచ్చుచున్నారు.

## గంగులు.

కదంబులతోను పల్లవులతోను రమారమి సమకాలికులుగ మధ్యమైసూరును దక్షిణమైసూరును ఏలుచుండినవారు గంగులు. వీరుత్తరదేశమున గంగాతీరమునందుండి వచ్చిన జాతివారనుట కేమియు సందేహము లేదు. ఈజాతివారే గంగాముఖమునఁ గొంతప్రదేశమును చంద్రగుప్తుని సామంతులుగ నేలుచుండిరి. ఈశాఖవారే కళింగమునుగూడఁ గొంతకాలమేలి రనుటకు



నిదర్శనము లున్నవి. మైసూరునకు వచ్చిన గంగులు పదునొకండవ శతాబ్దముప్రారంభము వఱకును అట రాజ్యభారమును నిర్వహించి రాజేంద్రచోళునిచే **1004** లో నోడింపఁబడిన తరువాత వారలలో నొక కొందరు మఱల కళింగము వంకకు నడచి గంజాము విశాఖపట్టణము జిల్లాలలో స్వతంత్ర రాజ్యముల సంపాదించుకొనిరి. మైసూరునకు వచ్చిన గంగులు 'దాడిగ' 'మాధవు'లను రాచకొమరులును వారి పరిజనము నని చెప్పవచ్చును. సింహనందియను జైనముని సాయమువలన వీరు క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమునకు వలాల (కోలారు)ను నందగిరి (నందిదుర్గమును) సాధించి మైసూరునందు రాజ్యమును స్థాపించుకొనిరి. ఆరాజ్యమునకు గంగవాడి యనిపేరు గలిగెను. ఈగంగులు మొదటినుండియు జైనులగుటవలన దక్షిణ హిందూస్థానములోఁ బేరుగనిన జైనవంశములలో వీరిదె ప్రఖ్యాతము. ఈవంశములోని రాజులెల్లరకును 'కొంగుని వర్మ' యనునది బిరుదునామము. వీరిలో మూఁడవవాఁడు రాజధానిని కావేరీ తీరముననుండు తలకాడునకు మార్చెను. ఏడవవాఁడగు దుర్వినీతుఁడు పల్లవుల నోడించి వారి భూములఁ గొన్నిటి నాక్రమించినదే గాక పూర్వదక్షిణభాగములఁ దన రాజ్యమును వ్యాపింపఁ జేసెను. ఎనిమిదవ శతాబ్దమధ్యమునకు గంగుల రాజ్యము మహా వైభవమంది శ్రీరాజ్యమని పిలువంబడుచుండెను. శ్రీపురుషుఁడను వాఁడప్పుడు రాజు. అతఁడు రాజధానిని

మాన్యపురము (మన్నె యను నెలమంగళము తాలూకాలోని గ్రామము) నకు మార్చెను. ఆతఁడు గజశాస్త్రమను గ్రంథమును గూడ వ్రాసెనఁట. ఈతనికొడుకు శివమారుఁడు రాజ్యమునకు వచ్చిన తరువాత నీగ్రంథమునే విపులముచేసి గజాష్టకమను మఱియొక గ్రంథము వ్రాసెనఁట. ఇతని కాలమున రాష్ట్రకూటులు ప్రబలులై యాతని నోడించి చెరపెట్టిరి. రాష్ట్రకూట ప్రభువు మారుటతోనే యితఁడు విడువఁబడెను గాని మఱల నీతఁడు రాష్ట్రకూటచాళుక్య హైహయులనందఱ నెదుర్చుటచే రెండవమారు పట్టుఁబడినట్లు గానవచ్చుచున్నది. కాని రాష్ట్రకూటులకు మిత్రులు కావలసి వచ్చినందునను శివమారుఁడు స్నేహము చేసికొనినందునను గంగుల సంతతికి మఱల స్వాతంత్ర్యము గలిగెను. ఈప్రకారము నెయ్యురయిన రాష్ట్రకూటగంగులకును తూర్పు చాళుక్యులకును 108 యుద్ధములు జరిగెను. ఈమధ్యకాలమున గంగులు మహాబలవంతులయిరిగాని తుదకు 1004న వీరు చోళులచే లోఁబఱచుకొనఁబడి యిదివఱకు చెప్పినపగిది చాళుక్యులను హొయిసణులను ఆశ్రయించిరి.

## చాళుక్యులు.

వీరిజన్మభూమి యేదియైనదియుఁ జక్కఁగ విశదపడలేదు. వీరయోధ్యనుండి వచ్చినట్లును చంద్రవంశము వారయి హారితి సంతతివారయినట్లును పుక్కిటి పురాణములు గలవు.



కాని అవి యవిశ్వసనీయములు. పేరును బట్టి చూడ నిది శెల్యూకియా’ యను నామము మారుటవలన వచ్చినట్లు దోఁచుచున్నది గావున వీరు చంద్రగుప్తచక్రవర్తి మామయగు శెల్యూకసు తెగకుఁ జేరినవారయి యుండవచ్చుననియును అట్లయినచో ఆ తెగవారికిని పల్లవుల పూర్వికులని మనమనుకొనియెడి పారసీకదేశపు తెగవారికిని భారతవర్షమున కావలనే వైరము లుండుటంబట్టి దక్షిణహిందూస్థానమున నీపల్లవులకును చాళుక్యులకును జరిగిన ఘోరయుద్ధములు అనాదిశత్రుత్వము వలననైనవని యూహింపవచ్చుననియు రైసు వ్రాయుచున్నాఁడు. కాని దీని నెంతవఱకు మనమాదరింపవచ్చు ననుట ముందు కాలమున తీర్మానము కావలసినదే. వీరి జన్మభూమి యెచ్చట నున్ననేమి. వీరు మాత్రము దక్షిణ హిందూస్థాన చరిత్రమునందు నాలుగైదు శతాబ్దముల కాలము ప్రాముఖ్యులలో నొక్కరుగఁ గన్పించుచున్నారు. వీరిలో మొదటివాఁడు జయసింహుఁడు. ఇతఁడు రాష్ట్రకూటులతో యుద్ధముచేసివారిని జయించెను. కాని పల్లవులతోఁ బోరుటలో మృతినొందెను. ఇతని భార్య గర్భవతి పారిపోయి విష్ణుసోమయాజియను బ్రాహ్మణుని శరణుఁ జొచ్చెను. ఆయమ కుమారుఁడగు మొదటి పులికేశి పల్లవులను జయించి బాదామి(వాతాపి)రాజధానిచేసికొనెను. అతని పుత్రుఁడు కీర్తివర్మ మౌర్యులను కదంబులను వశవర్తులను జేసికొనెను. అతని యాత్మజుఁడు

మంగళేశుఁడు కళచుర్యులను జయించెను. ఇతని కొడుకగు రెండవపులికేశి కాలముననే చాళుక్య సామ్రాజ్యము మిక్కిలి విరివినందెను. ఇతఁడు రాజ్యమేలు నప్పుడే వేంగిపురము చాళుక్యులకు ప్రాప్తమయినది. ఆపట్టణము లభించుటతో చాళుక్యవంశము రెండుపాయలయి పోయెను. రెండవపులికేశి రాజుగ పశ్చిమ చాళుక్యులును కుబ్జవిష్ణువర్ధనుఁడు రాజుగఁ దూర్పు చాళుక్యులును పేరుగాంచఁ దొడంగిరి. తూర్పుచాళుక్యులు వేంగియు రాజమహేంద్రవరమును ముఖ్యపట్టణములుగఁ బదునొకండవ శతాబ్దము వఱకును రాజ్యమేలి చోళులకు లోఁబడిపోయిరి. పశ్చిమ చాళుక్యులు మనకథకు వలసినవారు గాన వారి చరిత్రనిట కొంచెము విరివిగ వ్రాయవలసి యున్నది.

రెండవపులికేశి కన్యాకుబ్జమునకు రాజగు హర్షవర్ధను నోడించిపరమేశ్వర బిరుదమును సంపాదించెను. అతనికిఁ దరువాత విక్రమార్కుఁడను రాజు655లో సింహాసనమునకు వచ్చు వఱకును పల్లవులు చాళుక్యులను బాధలుపెట్టు చుండిరని యూహింపవలసి యున్నది. ఈవిక్రమార్కుఁడు మహాశౌర్య సంపన్నుఁడు. రణరశికుఁడని ఇతనికి బిరుదు. ఇతఁడు పాండ్య, చోళ, కేరళ కలభ్రులను జయించి నట్లును పల్లవరాజు నోడించికంచి నాక్రమించుకొని నట్లును దెలియుచున్నది. ఇతని కుమారుఁడును మనుమఁడును మునిమనుమఁడును గూడ మిక్కిలి వీరత్వమున రాజ్యమేలి నట్లు గన్పించుచున్నది. కాని ఇతనిసంతతి



వారు పల్లవులతోఁ బోరాటము పెట్టుకొని దూరదేశమగు కాంచీపురము వంకనే దృష్టులేకాగ్రచిత్తులయి సాగించుచు వచ్చినందున వీరికిఁ బూర్వవిరోధులయి వీరివలన నోడింపఁబడి వీరికిలోఁబడి వీరిపొరుగున నివసించుచుండిన రాష్ట్రకూటులు సమయము వేచియుండి వీరిని కబళించివేసిరి. కావున ఎనిమిదవ శతాబ్దము మధ్యమునకు రాష్ట్రకూటులు బలవంతులయి రెండు శతాబ్దముల కాలము చాళుక్యుల పేరును బైకిరాకుండఁ జేసిరి.

## రాష్ట్రకూటులు.

ఇట్లు చాళుక్యులను అణఁగద్రొక్కి, శాసనములను బట్టి చూడ, మైసూరునందు మిక్కిలి బలవంతులయి రాజ్యమేలిన యీరాష్ట్రకూటు లెవరు? వీరి చరిత్రయెట్టిది? అనెడియంశములు మన మిట విచారింప వలసియున్నది. వీరికి రాజపుత్ర రాఠర్లతో సంబంధముండిన నుండవచ్చుననియు రెడ్లు అనువారు వీరి సంతతివారుగ నెన్నఁబడు చున్నారనియు చరిత్రకారులు వ్రాయుచున్నారు. వీరుదక్షిణ హిందూస్థానమున బహుకాలముగనుండి యుండవచ్చును. కాని వీరి చరిత్రయందు, మనకుఁ దెలిసిన వఱకు, మొదటిరాజు చాళుక్యులచే నోడింపఁబడిన కృష్ణుఁడు. ఈవంశములోని మఱియొక కృష్ణుఁడు మొదటికృష్ణుఁడనువాఁడు తన మేనల్లునితోఁ జేరి చాళుక్యులను చెండాడి **754**వ సంవత్సర ప్రాంతమున రాష్ట్రకూట రాజ్యమును స్థాపిం

చెను. ఈరాష్ట్రకూటులకే రాట్టులనియు వీరిరాజ్యమునకే రాట్టవాడి యనియుఁ బేళ్లుగలవు. వీరిరాజధాని మొదట నాసిక జిల్లాలోని మయూరఖండముగ నుండెడిది గాని తొమ్మిదవ శతాబ్దమున నయ్యాది నైజాము ఇలాకాలోని మాన్యఖేటము (ప్రస్తుతపు మాల్ఖేడు) నకు మారుపఁబడెను.

ఎనిమిదవ శతాబ్దమునంతమున ధృవుఁడు లేక ధారవర్షుఁడు అనంబడు ఈవంశపురాజు పల్లవరాజునోడించి యతఁడుదనకుఁ గప్పముగట్టు నట్లొనర్చెను. గంగులరాజును గూడ చెఱపట్టెను. కాని యాతనికిఁ దరువాతి వాఁడగు గోవిందుఁడు గంగరాజునకు స్వాతంత్ర్య మిచ్చుట ఇదివఱకే వ్రాయఁబడియెను. తొమ్మిదవ శతాబ్దములో రాష్ట్రకూట రాజ్యమేలిన అమోఘవర్షుఁడను నృపతుంగ మహీపాలుఁడు బహుకాలము రాజ్యము చేసి కన్నడభాషయం దభిరుచికలవాఁడై గ్రంథములు వ్రాసి కర్నాటక భాషయందును కర్నాటక జనులయందును దనకుగల యాదరణమును జూపి పరలోకమున కేగెను. అతనికిఁ దరువాతి వాఁడగు అకాలవర్షుఁడు తూర్పు చాళుక్యులతో ఎడతేని విగ్రహము జరిపెను. కాని వీరు పదియవశతాబ్దమున చోళులకులోఁబడి పోవుటవలన చోళులకును రాష్ట్రకూటులకును విగ్రహము ప్రారంభమయ్యెను. అప్పటికి రాష్ట్రకూటులకు గంగులసాయ ముండినందున చోళులోడింపఁబడి వారి రాజుచంపఁబడెను. తరువాత రాష్ట్రకూటులకును గంగులకును



విభేదములు వచ్చినట్లున్నది. కావున రాష్ట్రకూటుల శక్తితగ్గుచు వచ్చినందున వారు పశ్చిమ చాళుక్యులకు 973 వ సంవత్సరమున లోఁబడిపోయిరి.

## పశ్చిమచాళుక్యులు.

మఱల చాళుక్యసామ్రాజ్యము ప్రారంభ మయ్యెను. ఆహవమల్ల బిరుదాంకితుఁడయిన తైలపుఁడు పశ్చిమచాళుక్య సామ్రాజ్య పునఃస్థాపకుఁడు. ఇతఁడు కక్కలుఁడను రాష్ట్రకూటుని జయించి యాతని బిడ్డను పెండ్లాడి రెండువందల సంవత్సరముల కాలము దినదిన ప్రవృద్ధిం గాంచి మించునట్లు దైవముచే నియోగింపఁబడిన సామ్రాజ్యమును సంపాదించి పెట్టి స్థిరకీర్తినందెను. ప్రథమచాళుక్య వంశమువారు పల్లవులతోవలె నీతని సంతతివారు చోళులతోఁ బోరాడవలసి వచ్చెను. క్రమక్రమముగ పల్లవులను జయించి కంచిని గొని ఇతరరాష్ట్రముల నాక్రమించుకొనఁ జొచ్చియుండిన చోళులు గొంతకాలము దూర్పు చాళుక్యమండల మరాజక మయినందున నదియదను చేసికొని పశ్చిమ చాళుక్యుల లోఁబఱచుకొనఁ బ్రయత్నించిరి. ఈ పోరాటము రెండు పక్షముల వారికిని జయాపజయములు నిశ్చయములుగాక బహుకాలము జరిగెను. ఇరువాగుల వారి సీమలకును యుద్ధములవలన మహానష్టములు సంభవించెను. విగ్రహమధ్యకాలమున చాళుక్య రాజధాని కల్యాణునకు మార్పఁబడెను.

1076 వ సంవత్సరమున ఆఱవ విక్రమాదిత్యుఁడు సింహాసనమునకు వచ్చెను. ఇతఁడు మహాపరాక్రమశాలి. చాళుక్య విక్రమార్కశక మితని వలనఁబుట్టినదే. బిల్హణుని 'విక్రమాంక దేవచరితము'[1]నకు కథానాయకుఁ డీతఁడే. ఈతని విజయముల వలన పశ్చిమ చాళుక్యరాజ్యము మహోన్నత్య మందెను. ఈతఁడు రాజకీయశాంతి కొఱకు ఇతరవంశముల వారితో విరివిగ సంబంధ బాంధవ్యములు చేసికొనినట్లు గానవచ్చుచున్నది. విజ్ఞానేశ్వరుఁడితని కాలము నందె యుండి మన హిందూ ధర్మశాస్త్రమునకు ముఖ్యాధారములలో నొక్కటగు మితాక్షరన్యాయమును వ్రాసెను. ఇతఁడు "భువిపై కల్యాణముపోలు నగరము ఇదివఱకుండినదిగాదు. ఇప్పుడు లేదు. ఇక నెప్పటికిని ఉండఁజాలదు. విక్రమార్కునివంటి నృపాలుని గుఱించి వినినదిగాని అట్టివానిని గనినది గాని లేదు" అని వ్రాసియున్నాఁడు. ఈవిక్రమార్కుని రాజ్యాంతముననే ముందుచాళుక్యశక్తి నిర్మూలకులుగా నున్న హొయిసణులుగను పట్టిరిగాని ఇతనిదండనాయకునిచే వారుపరాజితులయిరి. అయిన కాలప్రవాహము నిలుచునదిగాదు. విక్రమార్కుని యనంతరము చాళుక్యప్రతాపము చల్లఁబడఁ జొచ్చెను. 1157 వ సంవత్సరమున చాళుక్య సైన్యాధిపతిగనుండి రానురాను బలవంతుండయి

1 ఇది తిరుపతి వెంకటేశ్వరకవులచే రసవత్తరముగ తెలుఁగులోనికి భాషాంతరము చేయఁబడి సరస్వతి పత్రికయందు ముద్రింపఁబడినది.



యుండిన కళచుర్యవంశపువాఁడగు బిజ్జలుఁడు దన ప్రభువుపైఁబడి యతనిరాజ్యము నాక్రమించుకొనెను. ఇంతటితో చాళుక్యశక్తి నామావశేషమై పోయెను.

## కళచుర్యులు.

కళచుర్యు లిరువదియారు సంవత్సరములకంటె నెక్కుడు కాలము రాజ్యభారమును వహించలేదు. లింగాయతమతము బిజ్జలునిబావమరంది యగు బసవనిచే స్థాపనమందుటయు జైనమతమునకును దానికిని వివాదములు పుట్టుటయు మున్నగు విషయములన్నియు నీకళచుర్యుల కాలముననే తటస్థించుట వలన వీరివంశమునకుఁ గొంచెము ప్రాముఖ్యత గలిగినది. వీరిని 1183వ సంవత్సరమున హొయిసణులు మ్రింగివేసిరి.

## హొయిసణులు.

కదంబుల వంశమువలెనే హొయిసణవంశమును మైసూరుదేశము జన్మస్థానముగఁ గలది. హొయిసణులు తాముయాదవుల మని చెప్పుకొనియెదరు. దాని వలననె వీరు చంద్రవంశము వారయినట్లుప్రతీతి. వీరి మూలపురుషుని గుఱించి యొక కథగలదు. ప్రస్తుతము ముద్గెరి తాలూకాలో పడమటి కనుమల ప్రాంతమున నంగడియను గ్రామముండు స్థానమున శశకపురముండెడిది. సళుఁడనువాఁడు ఆగ్రామసమీపమున నటవియందాలయమున దమ కులదేవతయగు వసంతికను ఒకనాఁడు పూజింపుచుండ నతిరౌద్రాకారము వహించిన యొక పులియతని వంకకు

దాఁటులు వైచుచువచ్చెనఁట. దానింజూచిఅచ్చటి యాచార్యుఁడీసణునకు 'హొయి! సణ' యనుచు నొక సలాకి నందిచ్చెనఁట. ఇతఁడు దానితో నేసి వ్యాఘ్రమును జంపుటవలన నీవంశమువారికి హొయిసణులనిపేరు వచ్చెనందురు. వీరి పతాకము శార్దూల పతాకమగుటకుఁగూడ నిదియె కారణముగ నెన్నఁబడుచున్నది.

ఈవంశపుఁ బ్రథమనృపాలురు జైనమతస్థులు. హొయిసణులు ప్రారంభదశయందు చాళుక్యులకు సామంతులుగ నుండిరి. వీరికి మొదటి ముఖ్యపట్టణము ద్వారసముద్రము (ఇప్పటి బేలూరు తాలూకాలోని హళేబీడు). ఈవంశమునకు మూలపురుషుఁడగు హొయిసణుని గుఱించి మనకంత విశేషముగఁ దెలియదు. కాని యాతని కుమారుఁడగు వినయాదిత్యుఁడు మలపులను అనఁగా కొండదొరలనుజయించి కొంత రాజ్యమును ఆక్రమించి విస్తీర్ణమగు రాజ్యము నేలినట్లు దెలియుచున్నది. అతఁడు చెఱువులు త్రవ్వించుట యందును దేవాలయములు కట్టించుట యందును మిక్కిలి శ్రద్ధఁజేసెనని వ్రాయఁబడియున్నది. ఆలయముల గోడలకయి ఇటుకకాల్చుటకుగాను మట్టిత్రవ్విన ప్రదేశములు తటాకములుగ నేర్పడెననియు రాళ్లకయి భేదింపఁబడిన పర్వతములు నేలతో సమమయ్యెననియు వర్ణింపఁబడియుండుట వలన నీతఁడెంత యాసక్తితోఁ బనిచేసినదియు మన మూహింపఁగల్గుదుము. ఇతఁడు కట్టించిన హళేబీడులోని హొయిసణేశ్వర దేవాలయము నేఁటికిని ఈతని కాలమందలి శిల్పకళాచాతుర్య



మును ప్రకటించుచున్నది. ఇతఁడు క్రీ॥ శ॥ 1047 మొదలు 1100 వఱకును ఏబదిమూఁడు సంవత్సరములు రాజ్యమేలుటవలన నితని కుమారుఁడు బహుకాలము యువరాజపట్టమును ధరించి యితనికంటె ముందు పరలోకప్రాప్తిఁజెందెను. అయిన నీ యువరాజు చాళుక్యులకు కుడిభుజముగనుండి చోళమాళవ కళింగులను ఓడించి అరిభయంకరుఁడయి ప్రవర్తించినట్లు నుడువఁబడియున్నది. కావున వీరికిని చాళుక్యులకును అన్యోన్య మైత్రియుండుట గాక వీరు గొంతరాజ్యము సంపాదించిన తరువాతఁ గూడ చాళుక్యులకు విడువరాని సహాయులుగ నుండిరని తేలుచున్నది.

వినయాదిత్యుని మరణానంతరము అతని ముగ్గురి మనుమలలో నిద్దఱుబహుస్వల్ప కాలము రాజ్యభారము వహించిరి వారికిఁదరువాత నందు రెండవ వాఁడును దక్కిన వారు పోఁగా బ్రతికియున్న వాఁడును నైన బిట్టదేవుఁడు ప్రభుత్వమునకు వచ్చెను. ఇతఁడును చాళుక్య నృపతుల సైన్యములలోఁ బేరునందిన వాఁడే. ప్రసిద్ధినొందిన చాళుక్య విక్రమాదిత్యుఁడీతనినిగుఱించి 'హొయిసణుఁడొక్కఁడె అజేయుఁడగు రాకొమరుఁడు గాఁగలఁడు' అని తీర్మానముగఁ బల్కియుండెనఁట! ఈవాక్కునకను గుణముగ బిట్టదేవుఁడు దిగ్విజయముఁ జేసి తన ప్రభుత్వమును తలకాడు, కొంగు, నంగలి, గంగదోడి, నొలంబవాడి, మాసవాడి హుళిగేరి, హాళసిగె, వనవాసి, హానుంగల్ అనునీ మండలము

లపై నెగడఁ జేసెను. ప్రస్తుతపు నామముల ననుసరించి ఈ రాజ్యము మైసూరుసీమయు, సేలము, కోయంబుత్తూరు, బళ్లారి, ధార్వాడ జిల్లాలలో నెక్కుడు భాగమును అగుచున్నది. ఇతఁడు సంపూర్ణ స్వాతంత్ర్యమును స్థాపించుకొనెననియే చెప్పవచ్చును గాని ఈతని రాజ్యమునందుత్తర భాగమున దొరకిన శాసనములను బట్టి 1172 వ సంవత్సరము దనుకను హొయిసణులు చాళుక్యులను అధిరాజులుగ నొప్పుకొనుచుండినట్లు విశదపడుచున్నది.

1117వ సంవత్సరముబిట్టదేవుని రాజ్యకాలమున మిక్కిలి ముఖ్యమయినది. ఆసంవత్సరమున నతఁడు శైవులగు చోళులచేఁ దరుమఁబడి హొయిసణ రాజ్యముఁ జొచ్చిన శ్రీ రామానుజాచార్యుల ప్రోత్సాహమువలన వైష్ణవుఁడయి విష్ణువర్ధనుఁడను నామమును ధరించెను. ఇతని కుమారుఁడు రాజ్యము సేయునపుడు దేశమంతయును శాంతిమై యుండెను. ఆతనిపుత్రుఁడు నరసింహుఁడు సింహాసనము నధిష్ఠించినతోడనె యాదవులపై కరిగి వారిని జయించి తుంగభద్రాతీరమందలి దుర్గములను సాధించి పంద్రెండు సంవత్సరములకాలము చోళులకుసాధ్యముకాని ఉచ్చంగియను పాండ్యరాజధానిని లోఁబఱచుకొని తనరాజ్యమును కృష్ణాతీరమువఱకును వ్యాపింపఁ జేసి వీరబల్లాళుఁడను పేరువడసెను. ఈతనివలననే హొయిసణులకు బల్లాళులనియు నామము కలిగినది. ఇతని కొడుకగు సోమేశ్వరుఁడును యాదవులనోడించె



నని యున్నదిగాని వీరబల్లాళుఁడు యాదవులనుండి కొనిన ప్రదేశము మఱల వారికిఁ జెందినట్లువారిసేనానులవాక్కులవలన దెలియుచున్నది. అయిన సోమేశ్వరుఁడు దక్షిణమున స్వతంత్రుఁడయి చోళరాజ్యములోని విక్రమపురమునందు నివసించుచుండెను.

హొయిసణులు పాండ్యరాజ్యవిధ్వంసకులుగను చోళరాజ్యసహాయులుగను వర్ణించుకొనుటచే చోళులకును వీరికిని మిక్కిలి మక్కువ యుండినట్లూహింపవలసి యున్నది. ఈసోమేశ్వరున కిద్దఱు కుమారులు. ఇతని మరణముతో వారిరువురును రాజ్యమును పంచుకొనిరి. మూఁడవనరసింహుఁడు ద్వారసముద్రమునను రామనాథుఁడు దక్షిణమున అరవదేశమునను పరిపాలించుచుండిరి. వీరికాలము శాంతిమయియే జరిగిపోయెను. నరసింహుని కుమారుఁడు మూఁడవ బల్లాళుఁడు రాజ్యమునకు వచ్చిన తరువాత రెండుగా జీలిపోయిన హొయిసణరాజ్యము మఱల నొకటి యయ్యెను. కాని యతనికిఁ బ్రబలవిరోధులు గనుపించిరి. 1310 వ సంవత్సరమున అల్లాఉద్దీన్ సేనాని మాలిక్ కాఫుర్ దండెత్తివచ్చి ద్వారసముద్రమునుముట్టడించి రాజును పట్టుకొని పట్టణము కొల్లఁగొట్టి మోయలేనంత సువర్ణమును బట్టించుకొని వెడలి పోయెను. నరసింహుఁడు రాజధానినిమఱలఁ గట్టనారంభించెనుగాని మఱియొక మహమ్మదీయ సేనాని వలనది 1326లో పూర్తిగ నశింపుచేయఁబడెను. ఇంతటితో

హొయిసణబల మడంగెను. 1336వ సంవత్సరమున విజయనగర సామ్రాజ్యము ప్రారంభమగుటతో హొయిసణ నామమునం దులో మునిఁగిపోయెను.

## విజయనగరసామ్రాజ్యము.

దక్షిణ హిందూస్థానమున స్థాపితమయిన ప్రసిద్ధసామ్రాజ్యములలో విజయనగర సామ్రాజ్యము కడపటి దనుట మా చదువరు లనేకులకుఁ దెలిసిన విషయమే. ఆసామ్రాజ్యమును గుఱించి విపులములగు గ్రంథములు వ్రాయఁబడి యున్నవి. కావున మాచదువరులకీ విషయము క్రొత్తదిగనుండఁ జాలదు. ఇట వీనిం గూర్చివిరివిగవ్రాయుటయుఁ బొసఁగదు. ప్రస్తుతోపయోగమునకు వలసిన వఱకు సంక్షేపముగ నిచ్చుట వ్రాసెదము. విజయనగర సామ్రాజ్య స్థాపకులుగ నెన్నఁబడవలసిన వారు మువ్వురు. చంద్రవంశజులై యాదవసంతతికిఁ జేరిన హక్కఁడు బుక్కఁడు నను ఇరువురన్నదమ్ములును శ్రీశంకరాచార్యులమఠమునకధ్యక్షుఁడుగ నక్కాలముననుండినవిద్యారణ్యాబిరుదాంకితుఁడగు మాధవాచార్యులును. హక్క బుక్కలిరువురునుసంగమునికుమారులు. హక్కఁడు హరిహర రాయలను పేరునవ్యవహరింపఁ బడుచున్నాఁడు. మహమ్మదుతుగ్లుకుయొక్క క్రౌర్యముచేఁబుట్టిన అల్లకల్లోల సమయమున స్వదేశీయులును బహుశః హొయిసణులకు సామంతులుగ నుండినవారును నయిన వీరిరువురును మాధవాచార్యుల సాయముచే తుంగ



భద్రాతీరమునఁ బూర్వము కిష్కింధా నగరముండిన ప్రదేశమునందు విజయనగరమును గట్టుకొని అదివఱకు మహమ్మదీయుల వశమయి పోయియుండిన ద్వారసముద్రమును, వరంగల్లును సాధించిరి. మాధవాచార్యులు సాహాయ్యము చేయుటకు ముఖ్యకారణము జైనులయొక్కయు జంగము వారి యొక్కయు సంఖ్య యభివృద్ధి యగుచుండుటయు మహమ్మదీయ మహాప్రవాహము క్రమక్రమముగఁ దమ్ము నావరించు కొన నుంకించుచుండుటయు నీరెండు విరోధవాహినులను నెదుర్చుటకుఁ దమరేదేని యొక ప్రబలసాధనము సంపాదించు కొనవలెనను ఆశ వారికిఁ బుట్టుట యేయనియు విల్సను వ్రాయుచున్నాఁడు. ఇది యూహ యేయైనను సరియైనయూహ యనియే అంగీకరింప వచ్చును.

విజయనగర సంస్థానాధీశ్వరుల కులదైవము విరూపాక్షుఁడు. ఈవిరూపాక్షుని పేరిటనే విజయనగరాధీశ్వరులు దానధర్మాదుల నొనర్చుచుండిరి. హరిహరుఁడు మొదటిరాజు. బుక్కరాయలు రెండవవాఁడు. వీరు దక్షిణదేశమున కంతటికిని ప్రభువులైరి. కాని 1347 వ సంవత్సరమున బహమని రాజ్యము సంస్థాపింపఁ బడుట వలన వీరుత్తరమున దిగ్విజయము సలుపుటకు వీలులేక పోయెను. ఇంతియకాక బహమని సుల్తానులకును విజయనగర రాజులకును ఎడతెగని విగ్రహము ప్రారంభమయి లెక్కలేనియుద్ధములు నడచుచుండెను. మొదటి

సంగముని సంతతిలో నెనమండ్రుగురు రాజులు రాజ్యమేలిరి. వారిలో రెండవ హరిహరరాయల కుమారుఁడు దేవరాయలు ప్రతాపదేవరాయలను బిరుదుపేరు నందెను. ఈతని కాలమున విజయనగరమును దర్శింప నేతెంచిన ఇటాలియాదేశస్థుఁడగు 'నికలోడికాంటి' యను నతఁడును పారసీకదేశీయుఁడగు అబ్దుర్‌రజాకును విజయనగర సామ్రాజ్య రాజధాని సంపద్వైభవములను వర్ణించియున్నారు.

సంగమ రాజులలో కడపటివారి కాలమునకు బహమని సుల్తానులలో నొక్కఁడగు రెండవ మహమ్మదుషాహ విజయనగర సంస్థానమునం దెక్కుడు భాగము నాక్రమించుకొనఁ జొచ్చెను. అప్పుడతని నెదురుకొని జయించినవాఁడు సాళువనరసింహుఁడు. ఇతఁడు సంగరాజుల ప్రతినిధిగ తెలుఁగునాఁడును పరిపాలించుచుండిన సేనానియగుటం జేసి క్రమక్రమముగ నీతనిశక్తి యభివృద్ధియై యుండెను. ఇతఁడు మహమ్మదీయుల నోడించిన తరువాత నచిరకాలములోనే విజయనగర సింహాసనము నాక్రమించుకొనెను. కాని యీతని సంతతికైనను ఆసామ్రాజ్యము నిలిచినదికాదు. ఈతని కడముఖ్యసహాయులుగ నుపచరించుచుండిన తుళువవంశజులగు నీశ్వరుఁడును నరసింహుఁడును మహాబలవంతులయి యుండిరి. ఈతనికిఁ బిదప విజయనగర సంస్థానమును నరసింహుఁడు కైవసముచేసికొని ఏల మొదలిడెను. ఆతని పుత్రుఁడే లోక



ప్రసిద్ధిగాంచిన శ్రీకృష్ణదేవరాయలు. ఈతని కాలమున నుండిన విజయనగర సామ్రాజ్యముతోఁ దులఁదూఁగఁగల్గు సామ్రాజ్యము మఱియొక్కటి దక్షిణహిందూస్థానమున నెప్పుడును స్థాపింపఁబడలేదు. కృష్ణదేవరాయలకుఁ దరువాత విజయనగర సామ్రాజ్యము రాను రాను అరాజకమగుచు వచ్చెను. కొంతకాలము గడచిన వెనుక అళియరామరాజు సంపూర్ణస్వతంత్రాధికారియయ్యెను. అతఁడు మహావిక్రమశాలియై దక్షిణహిందూస్థానముపై కృష్ణదేవరాయనిం బోలియె నిజశక్తిని వ్యాపింపఁజేసెను. విడిపోయిన బహమనిరాజ్యశాఖలలో విభేదములు గూడఁ బుట్టించి వారిమీఁద నధికారము సంపాదించెను. కాని ఇతఁడు గొంచెము గర్వముగలవాఁడై ప్రవర్తించుటచే మహమ్మదీయ సుల్తానులుమేల్కాంచి ఒక్కటిగఁ జేరి 1565వ సంవత్సరమునఁ దలికోటకడ నీతని నెదిర్చి జయించి చంపివేసిరి. విజయనగరసామ్రాజ్య మంతటితో నంతరించెను. రామరాజు సోదరులు తిరుమలరాజును వెంకటాద్రియును వరుసగ పెనుగొండ యందును చంద్రగిరి యందును స్థానము లేర్పఱచుకొనిరి.



శ్రీకృష్ణదేవరాయలు.

## పాళేగారులు.

ఇట్లు విజయనగర సామ్రాజ్యమును రూపుమాపిన మహమ్మదీయ సుల్తానులు దమలోఁ దమకుంగల ఈర్ష్యలవలన నాసామ్రాజ్య స్థానము నాక్రమించుకొన లేరైరి. విజయనగరాధీశ్వరులు పూర్ణశక్తితో పరిపాలించుచుండిన పదునారవ శతాబ్దమున నుత్తరదేశ మంతయును జక్రవర్తిగారి వలననే పరిపాలింపఁ బడుచుండెను. దక్షిణభాగము, ముఖ్యముగ మైసూరుసీమ, అనేక ఖండములుగ విభజింపఁబడి అచ్చటి సామంతరాజుల ఆధీనమున కియ్యఁబడి యుండెను. వీరు చక్రవర్తిగారికి కప్పములుగట్టుచు యుద్ధసమయముల సేనల నమర్చుచుండిరి. వీరందఱపై శ్రీరంగపట్టణమున చక్రవర్తిగారి ప్రతినిధి యుండెడివాఁడు. విజయనగర సామ్రాజ్యము తలికోట యుద్ధముతో విరియునప్పటికి శ్రీరంగపట్నమున శ్రీరంగరాయలు ప్రతినిధిగా నుండెను. సామ్రాజ్యవిచ్ఛిన్న మయిన తరువాతఁ గూడ నీప్రతినిధికిని పెనుగొండ యందలి చక్రవర్తిగారి కుటుంబమునకును సామంతరాజులుగ నుండినవారు కొంతకాలము పేరునకు గౌరవము గనుపఱచుచు వచ్చిరి. కాని బలవంతులగు సామంతులందఱును నొక్కరొక్కరుగ స్వతంత్రులుగాఁ జొచ్చిరి. ఇట్లు స్వతంత్రులైన వారలే పాళేగారులని పిలువఁ బడుచున్నారు. ఇప్పటి మైసూరువంశము అట్టి పాళేగారులలో నొక్కనిమూలమున నేర్పడినది. కావున నిట మైసూరు రాజవంశ చరిత్ర నిక ప్రారంభింతము.



## మైసూరు రాజవంశము.

వాడుకననుసరించి మైసూరు రాజవంశమునకు మూలపురుషులు విజయ కృష్ణులను ఇద్దఱుసోదరులు. యదుసంతతివారగు వీరు ద్వారకనుండి బయలుదేరి దక్షిణమున నెచ్చటనైన రాజ్యమేర్పఱచుకొనవలెనను ఇచ్ఛగలవారయి ప్రయాణము చేయుచుండిరి. ప్రస్తుతము మైసూరు నగరముండు ప్రదేశమున కనతి దూరమున హదినాడు అను గ్రామముండెడిది. వీరిరువురును అచ్చటికి వచ్చునప్పటికా గ్రామపుప్రభువునకు మెదడు చెడినందున నతఁడు దేశమువదలి పోయియుండెను. అతనికొకే కుమార్తె గలదు. ఆమెను వివాహమాడ వలెనను దురాశ ప్రక్కగ్రామమగు కారుగహళ్ళి ప్రభువునకుఁ బుట్టియుండెను. అతఁడు హీనజన్ముఁ డయినందున హదినాడువారు దమబిడ్డ నతని కియ్యనిష్టములేని వారయియుండిరి. అందువలన నతఁడు సమయము వేచియుండెను. హదినాడు ప్రభువు మనోచాంచల్యమున నెటనేనియు నేగుట తోడనె ఆవంశమువారికి దిక్కులేనందున కారుగహళ్ళి ప్రభువు వారిబిడ్డను బల్లాత్కారమున సంపాదింప జంకించెను. కావున వారు దమకన్యనతని కియ్యనియ్యకొనిరి.

వివాహమునకు సకల సన్నాహములును జరుగుచుండెను. ఆగ్రామ సమీపమునకు వచ్చియుండిన ఈ విజయకృష్ణు లిరువురును విషయములెల్లయును విని హదినాడు వారికిసాహాయ్యము చేయ నియ్యకొని మాయోపాయమున కారుగహళ్లి ప్రభువుపైఁ బడి అతనిని మడియించి అతని గ్రామమును స్వాధీనము చేసికొనిరి. హదినాడుప్రభువునకు పుత్రిక తమ వంశమునకు రక్షకులయియే తెంచిన ఈ విజయకృష్ణులకుఁ గృతజ్ఞురాలయి విజయుని వరించెను. కారుగహళ్లిహదినాడులు రెండును విజయుని సొమ్మయ్యెను. అప్పుడతఁడు 'ఒడయరు' అను బిరుదమును ధరించి లింగాయతమతమును స్వీకరించెను. ఈతనివంశీకులే నేఁటికిని మైసూరు సంస్థానము నేలుచున్నారు. ఇతనినుండి నేఁటివఱకును రాజ్యమేలిన వారి నామముల దెలుపు పట్టికయొకటి మైసూరు సంస్థానమువారిచే సిద్ధపఱుపఁబడియున్నది. దాని క్రిందఁ బొందుపఱచితిమి.

| | | |
|---|---|---|
| యదురాయఁడు విజయుఁడు | క్రీ. శ. | 1399-1423 |
| హిరేబెట్టదశ్యామరాజ ఒడయరు I | | 1423-1458 |
| తిమ్మరాజ ఒడయరు I | | 1458-1478 |
| ఆరుబెరళుహిరేశ్యామరాజ ఒడయరు II | | 1478-1513 |
| బెట్టదశ్యామరాజ ఒడయరు III | | 1513-1552 |
| తిమ్మరాజ ఒడయరు II (అప్పన్న) | | 1552-1571 |
| బోళశ్యామరాజ ఒడయరు IV | | 1571-1576 |



| | |
|---|---|
| బెట్టదశ్యామరాజఒడయరు V | 1576-1578 |
| రాజఒడయరు I | 1578-1617 |
| శ్యామరాజ ఒడయరు VI | 1617-1637 |
| ఇమ్మడిరాజ ఒడయరు II | 1637-1638 |
| రణధీర కంఠీరవ నరసరాజ ఒడయరు | 1638-1659 |
| దొడ్డదేవరాజ ఒడయరు | 1659-1672 |
| చిక్క దేవరాజ ఒడయరు | 1672-1704 |
| కంఠీరవ ఒడయరు (మూకరసు) | 1704-1713 |
| దొడ్డకృష్ణరాజ ఒడయరు I | 1713-1731 |
| శ్యామరాజ ఒడయరు VII | 1731-1734 |
| కృష్ణరాజ ఒడయరు II | 1734-1766 |
| నంజరాజ ఒడయరు | 1766-1770 |
| బెట్టదశ్యామరాజ ఒడయరు VIII | 1770-1776 |
| ఖాసశ్యామరాజ ఒడయరు IX | 1776-1796 |
| కృష్ణరాజఒడయరుIII | 1796-1868 |
| శ్యామరాజేంద్ర ఒడయరు X | 1868-1894 |
| కృష్ణరాజ ఒడయరు IV | 1895 |

ఈజాబితాలోని మొదటి నలువురను గుఱించియు మనకు విశేషాంశము లెవ్వియుఁ దెలియవు. మూఁడవ శ్యామరాజ ఒడయరు మాత్రము దనరాజ్యమును మువ్వురుకుమారులకుఁ బంచిపెట్టెను. అప్పన్నయను తిమ్మరాజునకు హెమ్మన

హళ్లియు, కృష్ణరాజునకు కెంబళయును, బోళశ్యామరాజునకు మైసూరును ఇచ్చెను. మొదటి ఇద్దఱకును సంతతిలేకపోవుటవలన మైసూరు శాఖవారికే మరల రాజ్యమంతయుఁ జెందిపోయెను. కాని ఒకశాఖ నిలిచిపోయినపుడు రాజ్యము ఇతరశాఖల వారి కందుచు వచ్చుచున్నది. బాధుత్వములును నీమూఁడుశాఖలలోనె జరుగుచున్నవి. విజయనగరసామ్రాజ్యము విచ్ఛిన్నమగు సమయమున మైసూరునందు పరిపాలకుఁడుగ నుండినవాఁడు బోళశ్యామరాజ ఒడయరు. ఇతఁడు శ్రీరంగపట్నములోని విజయనగర సంస్థానప్రతినిధికిఁ గప్పము గట్టక చల్లఁగ నెగవేయ మొదలిడెను. ఇతనికి తరువాత రాజఒడయరు 1610 వ సంవత్సరమున శ్రీరంగపట్న ప్రతినిధియగు ముసలి తిరుమల రాజును తలకాడునకుఁ బారదోలి ఆ పట్నమును స్వాధీనముచేసికొనెను. అదే రాజఒడయరు 1613లో ఉమ్మత్తూరును లోఁబఱచుకొని దాని యిలాకా భూములను మైసూరునకుఁ జేర్చుకొనెను. అంతటితోఁ దృప్తినొందక ఇతఁడుత్తరమున జగదేవరాయని పాలమునుగూడ కొంత ఆక్రమించుకొనెను. స్థానికప్రభువుల నణంచి రైతులను దనవారుగఁ జేసికొను యోగ్యత ఇతనికిఁ గలుగుటం జేసి యీతఁడు విజయుఁడగుచు వచ్చెను. ఇతఁడే వైష్ణవ మతమవలంబించిన మైసూరు రాజులలో మొదటివాఁడు. ఇతని తరువాత రాజ్యమునకు వచ్చిన ఆరవశ్యామరాజ ఒడయరును ఇతని విధమునఁ బ్రవర్తించి 1630 వ సంవత్సరమున చెన్నపట్టణ భూములను వశపఱచుకొని మైసూరు రాజ్యమునకు జగదేవరాయని పాలములన్నిటినిఁ జేర్చివేసెను.



### కంఠీరవనరసింహుఁడు.

ఇతనికిఁ దరువాత ఇమ్మడిరాజు రాజ్యమునకు వచ్చెనుగాని అతఁడు విక్రమరాజను మంత్రివలన విషముచేఁ జంపఁబడెను. బెట్టదశ్యామరాజ ఒడయరు కుమారుఁడు కంఠీరవ నరసరాజు రాజ్యమునకు నిర్వాచింపఁ బడెను. కాని మంత్రి విక్రముఁడుమాత్ర మీతనికిఁ బట్టాభిషేకము చేయకుండెను. అయిన నితఁడు బుద్ధిశాలియు బలవంతుఁడును నైనందున విక్రముని చర్యలను కనిపట్టి వానిని తన మనుష్యులచేఁ దుదముట్టించి స్వతంత్రముగ రాజ్యభారము వహించెను. ఇట్లుసింహాసనము నెక్కిన కంఠీరవనరసరాజు మహాపరాక్రమశాలి. ఈతనికాలమునకు బిజాపురసంస్థానము బలవంతమయియుండెను. అహమ్మదు నగరము మొగలాయీల వలన నశింపఁ జేయఁబడినందున ఢిల్లీ బాదుషాహాకు లోఁబడినదే యయినను విజాపురము మాత్రము దక్షిణహిందూస్థానములలో మిన్నయై వెలుంగుచుండెను. అట్టి విజాపురపు దండులు రండుల్లాఖానుఁడును శ్రీశివాజి తండ్రియైన షాజియును నడుప శ్రీరంగపట్నముమీఁదికి ఎత్తివచ్చెను. కంఠీరవ నరసింహుఁడా బలముల నెదిర్చి చెండాడెను. దీనికిఁ దరువాత

నితఁడు దన సైన్యములతో బయలుదేరి దక్షిణమున మధుర నాయకునుండి సత్యమంగళమున్నగు ప్రదేశములను, పశ్చిమమున చెంగల్వులపరాజితులఁ జేసి ప్రియపట్నమును అర్కాలగూడెమును, ఉత్తరమున (ఇప్పటి సేలములోని) హోసూరును, దీసికొని మాగిడికధ్యక్షుఁడగు కెంపెగౌడుని ఎలహంక కడనోడించి యాతనిచేఁ గప్పము గట్టించుకొనెను. ఇట్లు రాజ్యమును విస్తరింపఁజేసి శ్రీరంగపట్నప్రాకార కుడ్యములను బలపఱచి తన పేరిట నాణ్యములు ముద్రింపించెను. కంఠీరవ హొన్నులనియు పణములనియు ఆనాణ్యములె మైసూరు సీమయందు హైదరాలీకాలమువఱకుఁ జెల్లుచుండెను. ఈకంఠీరవ నరసింహుఁడు గ్రామాధికారుల పొగరణఁచుటకై వారిపైపన్నులధికముగ వేయుచుండెను. ఇతఁడు మహాదానపరుఁడు. అనేక దేవాలయములకు ఈతఁడుపెట్టిన మాన్యములె ముఖ్యాధారములు. మైసూరురాజధానిలో నేఁటికిని జరుగుచుండు దసరాయుత్సవము లీతనివలన నుపక్రమింపఁబడినవే.

దొడ్డదేవరాజు.

కంఠీరవ నరసింహుఁడు సంతానములేని వాఁడయినందున రాణియు సేనానియుఁ జేరి బోళశ్యామరాజు మనుమని దొడ్డదేవరాయని రాజుఁ జేసిరి. ఈతనికాలమున విజయనగర సామ్రాజ్యపు రాజులలో గడపటివాఁడగు శ్రీరంగరాయలు బెద్నూరునందు సర్వాధికారము నడుపుచుండిన శివప్పనాయకు



నాశ్రయించెను. అతఁడీతనినిసాకుచేసికొని దక్షిణముపయిదాడి వెడలి వచ్చెను. కాని మైసూరు సైన్యములతనినిఁ దిరుగఁగొట్టి సక్కరపట్నము, హాసను మున్నగుఁ బ్రదేశములనుస్వాధీనము చేసికొనెను. ఇవి యిట్లుండ మధురనాయకుఁడు మైసూరుపైకిదండెత్తివచ్చెను. అతఁడు దొడ్డదేవరాయనిచేఁ బరాజితుఁడగుటయేగాక కొసరునకు ఈరోడ్డు, ధారాపురములను మైసూరునకప్పగింపవలసిన వాఁడాయెను. తిరుచినాపల్లియు నితర ముఖ్య పట్టణములును దొడ్డదేవరాయని సైన్యములకు వలసినంతధనమును ఈనవలసివచ్చెను. ఇట్లీతని కాలమున మైసూరు రాజ్యమున తూర్పుపడమరల సక్కెరపట్నము మొదలు సేలమువఱకును ఉత్తరదక్షిణముల చిక్కనాయకునిహళ్లి మొదలు ధారాపురము (కోయంబుత్తూరుజిల్లా) వఱకును వ్యాపించియుండెను.

చిక్కదేవరాజు.

దొడ్డ దేవరాజునకుఁ బిమ్మట రాజ్యమునకు వచ్చిన వాఁడు చిక్కదేవరాజు. దొడ్డ దేవరాజునకు సింహాసన మిచ్చునప్పుడీతఁడును నద్దానికర్హుఁడుగ నుండెను. కాని అప్పుడీతని హక్కు విచారింపఁ బడదయ్యెను. దొడ్డదేవరాజు ప్రభువగుటతోడనె ఇతఁడును ఈతనితండ్రియు హంగళములో చెఱయుంచఁబడిరి. ఇతనికి బాల్యమున ఎళందూరు నందుండ విశాలాక్షపండితుఁడను జైనుని స్నేహముగలిగి యుం

డెను. అతఁడును చిక్కదేవరాయల నెప్పుడును విడిచి యుండలేదు. హంగళమునకుఁ గూడ వెంబడి యరిగియుండెను. కావున చిక్కదేవరాజు రాజగుటతోడనె విశాలాక్ష పండితుఁడు మంత్రియయ్యెను. మతమునుబట్టి అతనియెడఁ గొంతయసంతుష్టి దేశమునఁ బుట్టెను. కాని రాజు యొక్కయు మంత్రియొక్కయు సామర్థ్యమువలన నట్టి యసంతుష్టి అణఁగి పోయెను. ఈచిక్కదేవరాజు మైసూరు రాజులలోని మహా యశోవంతులలో నొక్కఁడు. ఇతఁడు రాజ్యమారంభించిన కొలఁదికాలములో దేశమంతటను తపాలావసతులను నిర్మించెను. తపాలాధికారులే గూఢచారులుగనుపచరించుచుండిరి. వారాయా జిల్లాలలోని ఆంతర్యవిశేషములనుగనిపట్టివ్రాసిపంపునట్లు కట్టుదిట్టములుసేయఁబడెను. 1675 మొదలు 1678 వఱకును చిక్కదేవరాజు రాష్ట్రమును పెంచుటయందుద్యుక్తుఁడయి మద్గిరి భాగములను సంపాదించెను. అటు తరువాత పన్నులలో మార్పులనేకములు చేయఁదొడంగెను. ఇతఁడు నేలపన్ను ఎక్కుడు చేయఁగూడదను నిర్ణయము చేసికొని ద్రవ్యమార్జించవలెనను అభిలాష మాత్రము విడువక చిల్లరపన్నులు విశేషము ప్రజలపై మోప మొదలిడెను. దానివలన నెక్కుడ సంతుష్టి పుట్టనారంభించెను. అది జంగమాచార్యులు ప్రేరేపణవలన నెక్కుడయ్యెను. రైతులు భూములు దున్నుట మానివేసి రాజీనామా లిచ్చి దేశమువిడిచి లేచిపోవ సన్నద్ధులయిరి.



దీనినంతయును గనిపట్టి చిక్కదేవరాజు జంగమాచార్యులను నాలుగువందలమందిని తనతో సంభాషించి పోవుటకై కొలువుకూటమునకుఁ బిలుపించిన పగిది పిలువంబంచి కొలువుకూటమునకు వెనుకప్రక్కన ఇతరులకుఁ దెలియరాకుండ పెద్దగోతి నొకదానిని దీసి యటహంతకుల నేమించియుంచి యప్పటి యాచారమున కనుగుణముగ రాజుతోఁ బ్రసంగించి వెనుకటి భాగమునకు జంగము లొక్కఁడొక్కఁడుగ విందారగించు కుతూహలమునఁబోవ వారిని ఒక్కని తరువాత నొక్కనిగఁ జంపించివేసెను.

ఈవిధమున నతిక్రూర సాహసమొనర్చి అతఁడప్పటి యసంతుష్టిని మరల్పఁ గలిగెను. కాని యాతని మంత్రియె యింతటి కార్యములకుఁ గారకుఁ డని యెంచి ప్రజలతనిపయి విరోధమూని యొక కుట్రపన్ని అతనిని మడియించిరి. ఆతఁడు ప్రాణములు విడుచుచు తిరుమల అయ్యంగారు అను వానిని తన ప్రభువునకు సిఫార్సు చేసెను. చిక్కదేవరాజు మంత్రిమరణమునకు మిక్కిలి వగచెనని వేరుగ వ్రాయవలసిన పనిలేదు.

ఇప్పటికి మొగలాయి చక్రవర్తులు విజాపురము నాక్రమించుకొని (1687) దానికి లోఁబడియుండిన కర్నాటకభాగములను స్వాధీనముచేసికొన నారంభించియుండిరి. శిరామండలము ఏర్పడఁ జొచ్చియుండెను. చిక్కదేవరాజు శిరామండలమున ప్రతినిధిగ నేర్పడిన ఖాసింఖానునితోడను అతని మూల

మున ఔరంగజేబుతోడను మిక్కిలి మైత్రి సంపాదించి బెంగుళూరునుకొని మొగలాయీలకు నష్టముగాని మార్గములఁ దన రాజ్యమును వ్యాపింపఁజేసికొనఁ గడంగెను. మొదటి సంవత్సరమున తుంకూరును, బారామహాలు సేలములలో నెక్కుడు భాగమును ఇతని స్వాధీనమయ్యెను. 1690-1694 ల లోపలఁ బశ్చిమమున బెద్నూరు ప్రభువు భూములను బాబాబుడన్ పర్వతములవఱకును నితఁడు వశపఱచుకొనెను. 1694 వ సంవత్సరమున నతనితో సంధి చేసికొని అందు కొద్ది భాగము మాత్ర మతనికి నిచ్చివేసెను.

1696 వ సంవత్సరమున చిక్కదేవరాజు మధురనాయకుని పైకి దాడి వెడలి తిరుచినాపల్లిని ముట్టడించెను. అయిన మహారాష్ట్ర సైన్యములు సమయము కనిపట్టి తన రాజధాని పైకెత్తి వచ్చుటవలన నీతఁడు తిరుచినాపల్లి ముట్టడిని వదల్చ వలసిన వాఁడయ్యెను. 1697 లో ఔరంగజేబు కొలువున చిక్కదేవరాజు స్నేహితుఁడుగనుండిన ఖాసింఖానుఁడు గతించి పోయెను. అందువలనఁ దాను నవీనముగ గడించిన భూభాగముపైఁ దనహక్కు స్థిరపఱచుకొను నుద్దేశముతో చిక్కదేవరాజు ఢిల్లీకి రాయబారమంపెను. పాదుషాహ రాయబారులకు అహమ్మదు నగరముననే కానవచ్చినందున వారతండీయ తమ ప్రభువునకొక నూతనముద్రయు, జగద్దేవరాజను బిరుదమును, దంతపు సింహాసనము నధిష్ఠించి కొలువుండుట కుత్తరువును



గొని వచ్చిరి. ఇంతియకాక వారు మొగలాయీల రాజ్యాంగ వ్యవస్థను బరిశీలించి దానిం గుఱించిన అమూల్య జ్ఞానమును గూడ సంపాదించుకొని వచ్చిరి. అద్దాని ఫలముగ మైసూరునందును వేరు వేరు కార్యములకు వేరువేరు రాజ్యాంగములు సంఖ్యకు పదునెనిమిది ఏర్పడెను. పన్నులు కాలక్రమమునఁ దప్పక వసూలు కాఁజొచ్చెను. ప్రతిదినమును రెండువేలపూల వరహాల మొత్తమును తన బొక్కసములో నిలువ పైకమునకుఁ జేర్చుటకు మున్ను చిక్కదేవరాయఁడు ప్రాతఃకాలభోజనము చేయుచుండలేదని యొకవాడుక. అట్లు ధనము చేర్చిన వాఁడుగావుననే అతనికి నవకోటి నారాయణుఁడని పేరు. అతఁడు 76 సంవత్సరముల వయస్సున 1704 వ సంవత్సరమున పరమపద మందెను. ఆతఁడు మృతినొందునప్పటికి మైసూరు రాజ్యము దక్షిణమున పళని అన్నామలలు మొదలు ఉత్తరమున మిడగేశి వఱకును, తూర్పున కర్నాటక ఘురము మొదలు పడమట కొడగు బాలముల సరిహద్దులవఱకును వ్యాపించియుండెను.

## దొడ్డకృష్ణరాజు.

దొడ్డకృష్ణ రాజుకాలమున (1713-31) శీరామండలము సంకుచితము చేయఁబడెను. ఆర్కాటు నవాబొక్కఁడు క్రొత్తఁగ నేర్పడెను. మైసూరు సంస్థానము ద్రవ్యవంత మయినందున నీరెండు మండలములలోని మహమ్మదీయ ప్రతినిధులును మైసూరు పైకి దృష్టులు నెగడింప మొదలిడిరి. మొగలాయి

పాదుషాహాలు నామమాత్రులగుచు వచ్చుటవలన దక్షిణ హిందూస్థానమున వారి ప్రతినిధులుగ నుండినవారు స్వతంత్రులయి యొకరితో నొకరు పోట్లాడు కొనుటయు మహారాష్ట్రులు మరల బలవంతులయి చూపట్టుటయుఁ దటస్థించెను. అందుచే మైసూరు రాజులు అందఱకును దలయొగ్గి వారు దండెత్తివచ్చినప్పుడు కప్పము లిచ్చి తప్పించుకొనవలసివచ్చెను. బొక్కసములోని ద్రవ్యము కర్చుపడి పోవుటయేగాక ఒక తరుణమున పీష్వాగారిని సమాధానపఱచుటకయి యాతనికిఁ గొన్ని తాలూకాలు జామీనుగ నొసంగవలసివచ్చెను (1757). ఇట్టిదురవస్థ కాలమున మైసూరు రాజుల ముఖ్యవంశము నిలచిపోవుటయు వేరు శాఖలలోనుండి వచ్చినవారైనను బుద్ధిమంతులు గాక పోవుటయు సంభవించుటచే రాష్ట్రములోని బలమంతయు మంత్రుల చేతులలో దొరకిపోయెను.

## మంత్రులే రాజులు.

అట్టి మంత్రులలో దేవరాజ నంజరాజులు మన కథకు నవసరము. ఇందులో నంజరాజు అప్పుడు ముజఫరుజంగు నాజరుజంగుల మూలమునను చందాసాహెబ్ అన్వారుద్దీనుల మూలమునను ఫ్రెంచివారికిని ఆంగ్లేయులకును జరుగుచుండిన పోరాటములలో రెండు ప్రక్కలను సమయానుకూలముగ సంబంధములు గలుగఁజేసికొని పనిచేయుచుండెను.



అతని సైన్యములు దేవనహళ్లియను కోటను ముట్టడించుచుండిన కాలమున హైదరు దన ధైర్యముచేతను సాహసముచేతను అతనిని మెప్పించి కొంత సైన్యమునకు నాయకుఁడయ్యెను. ఆ పదమున నుండి ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని నగుచుండిన యల్లకల్లోలములలోఁ దన బలమును, వృద్ధిపఱచుకొనఁ జొచ్చెను. మైసూరు దళవాయి*చే తిరుచినాపల్లి కడ మహమ్మదాలీకి సాహాయ్యార్థము తీసికొని పోఁబడినప్పుడు హైదరు మహాసామర్థ్యము చూపి దిండిగల్లుకు ఫౌజుదారుగ నేమింపఁబడెను. తిరుచినాపల్లి ముట్టడినుండి దళవాయి నంజరాజు మైసూరునకు వచ్చి చేరెను. అప్పటికి మైసూరునందు దళవాయిపై తిరుగు బాటునకు సర్వ విషయములును సిద్ధపడి యుండెను. దేవరాజు ఉద్యోగము వదలుకొని శాంతిమై కాలము గడప నేగియుండెను.

నంజరాజు దుర్భరమగు గర్వముతో రాజ్యకార్యముల నడపుచుండుటవలన రాజున కాతని యెడ నసూయ పుట్టి యుండె. కావున రాచమందిరము వారందఱును జేరి దళవాయిని వెడలఁగొట్ట ప్రయత్నము లుపక్రమించి యుండిరి. వారు దమకు సాయము కొఱకు హైదరాలీని రమ్మని వేఁడిరి. అతఁడు నంజరాజును లోఁబఱచుకొని కొంతకాలమతఁడు తౌజీ † దీసికొని నిరుద్యోగతనుండునట్లు చేసెను. ఇట్లు

* మంత్రి నంజరాజు

† పింఛను అని యర్థము.

నంజరాజును వదలించిన తరువాత నతఁడు చేయుచుండిన సర్వ కార్యములకును హైదరే నియమింపఁబడెను.

ఇతఁడు చదువువ్రాత లేమియు నెఱుఁగని వాఁడు. కాని జ్ఞాపకశక్తియు, యోచనాదార్ఢ్యమును గలవాఁడు. అందుచే నీతఁడు మొదటినుండియు ఖండేరావు అను మహారాష్ట్ర బ్రాహ్మణుని చదువరిని వెంటఁ బెట్టుకొని పనులు నెరవేర్చుకొనుచు వచ్చెను. ఆతఁడు గొంత ద్రోహము చేయనెంచుటచే హైదరతనిని మాయోపాయమునఁ దీర్చివేసెను. ఇట్లు యెవ్వరును దలయెత్తికొని తిరుగఁగలవారు లేక పోవుటవలన సర్వశక్తులును హైదరునకే చేఁజిక్కెను. మహారాష్ట్రులును శీరానవాబును మైసూరుపై పలుమారు దాడి వెడలుచుండుటవలనను మైసూరు సైన్యములను అదపులో నుంచుకొనవలసి వచ్చినందునను ఆర్థికసైనిక స్వాతంత్ర్యమంతయును హైదరుదే యయ్యెను. నాఁటినుండియు హైదరు పేరునకు మాత్రము దళవాయియే యైనను నిజమునకు స్వతంత్రుఁడే యయి రాజ్యభారము నిర్వహించుచు రెండవ కృష్ణరాజు మృతినొందిన మీఁదట నతని స్థానమున మఱియొక పసివానిని తానే నేమించెను. హైదరు రాజునేర్పఱచుటం గుఱించి ఈ క్రింది కథ చెప్పఁబడుచున్నది.

## హైదరు రాజు నేరుట.

రెండవ కృష్ణరాజు మరణానంతరము రాజు పదమునకుఁ



బుట్టుక వలన అర్హతగల బాలురెల్లరును గొలువు కూటమునకు రా నియోగింపఁబడిరి. వారు వచ్చిచేరునప్పటికి ఆస్థానము, మిఠాయి, పండ్లు, కాయలు, పూలు, ఆటవస్తువులు, పుస్తకములు మున్నగు పదార్థములతో నింపఁబడి యుండెను. వారు చేరిన పిదప హైదరు వారినందఱిని కలయఁగనుఁగొని యెవ్వరికిష్టమయినది వారెత్తుకొనవచ్చునని వారితో నుడివెను. అంత కొందఱు మిఠాయియు మఱికొందఱు పండ్లను ఆటవస్తువులను ఈప్రకారమనేకులనేక పదార్థములను స్వీకరించిరి. కాని యొక్క కుఱ్ఱఁడు మాత్రము ఒక్కమూల నిడఁబడి మెఱుఁగులీనుచుండిన పిడికత్తి నొకచేతను నిమ్మపండు నొకదానిని మఱియొకచేతను దీసికొనెను. దానింజూచి హైదరు "అల్లనె. ఆబాలుఁడె రాజు. అతనికి మొదటిపని దేశసంరక్షణము. రెండవది సస్యాభివృద్ధి. అతనినిటు తెండు. నను గాఁగలించుకొననిండు" అని యాతనిని ప్రశంసించి యతనికిఁ బట్టాభిషేక మహోత్సవము జరిగించెను.

## హైదరు ప్రభుత్వము.

ఇట్లు రాజును నియమించినను సర్వాధికారము హైదరుదేయయియుండెను. ఆంగ్లేయ చరిత్రకారుల వలన నితఁడు లోకమున జనియించిన మహారాజ్య నిర్మాతలలో నొక్కఁడుగఁ బరిగణింపఁబడు చున్నాఁడు. ఇతని కాలమున మైసూరు సంస్థానము ఉత్తరమున కృష్ణవఱకును దక్షిణమున దిండిగల్లువఱ

కును వ్యాపించి యుండెను. రాజ్యమును నలువైపులఁ బెంచుట సులభసాధ్యముగాదు. అందున హైదరుకాలమున దక్షిణహిందూస్థానము నందు నైజామును, మహారాష్ట్రులును, ఆంగ్లేయులును బలవంతులయియుండిరి. వీరందఱితోడను పోరాతనికిఁదప్పినదిగాదు.

మొదటమొదట హైదరునకును ఆంగ్లేయులకును స్నేహమే కానవచ్చుచున్నది. 1763-వ సంవత్సరమున హైదరు బెడ్నూరును సాధించి అదివఱకు నామకార్థముండిన రాజును అతని తల్లిని చెఱసాలయందుంచిన పిదప ఆంగ్లేయుల కొంక కొన్ని వర్తకపు హక్కులను ఇచ్చినట్లు నిదర్శనములున్నవి. 1766లోఁ గూడ హైదరు ఆంగ్లేయులకు మళయాళములో వర్తక విషయమునఁ గొన్ని సదుపాయము లేర్పఱచుకొనుటకును అనుమతి నిచ్చియున్నాఁడు. కాని అతఁడు సమయమున కందఱితో స్నేహము చేయుచు అది కానప్పుడు శత్రుత్వము వహించుచున్నట్లు నిర్ధారణ చేయవలసియున్నది. మొత్తముమీఁద నతఁడు ఫ్రెంచివారితోడనే యెక్కుడు మైత్రిగలిగియుండెను. అందుచే నతఁడాంగ్లేయులతో నిరంతరము పోరాడుచునే యుండవలసి వచ్చెను. మనకుఁ దెలిసినవఱకు నతనికిని ఆంగ్లేయులకును యుద్ధము ప్రాప్తమగుటకు మొదటికారణము నైజాము హైదరుపయి కెత్తిపోవు తరుణమున నాంగ్లేయులు నైజామునకు సాయపడుటయే. నాఁటినుండియే



మైసూరుప్రథమ విగ్రహము ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును. దానిలో జరిగిన యుద్ధములలో హైదరనేక పర్యాయము లపజయమంది సంధిఁజేసికొనఁ జూచెనుగాని ఆంగ్లేయులు పడనిచ్చినవారుగారు. కావున నతఁడు వీరిని మహాసాహసమున నెదిరి వీరికి దిగ్భ్రమ పుట్టించి వీరిని లోఁబఱచుకొను ఉద్దేశముతో 1769 వ సంవత్సరమున నాకస్మికముగ మద్రాసునకు సైన్యముతోఁగూడ వచ్చిచేరెను. అచ్చటి ఆంగ్లేయ పరిపాలకులకిది అశనిపాతము వోలెఁగానుపించెను. కావున వెంటనే స్నేహసంధికి నియ్యకొనిరి. యుద్ధమునకుఁ బూర్వమిరువాగుల వారికిం గలిగిన రాజ్యము వారివారికిఁ జెందునట్లును అకారణముగ మఱి మూఁడవరాష్ట్రము వారెవ్వరైన తమలో నొక్కరిపై దాడివెడలి వచ్చినచో రెండవవారు తోడ్పడవలసినదనియును షరతు లేర్పఱుపఁ బడెను. ఈకడపటి షరత్తే మఱల హైదరునకును ఆంగ్లేయులకును విగ్రహము కలుగుటకుఁ గారణమాయెను.

1771 వ సంవత్సరమున చౌతుకప్పము గట్టలేదను గారణమున మహారాష్ట్రులు హైదరుపైకి దండువెడలి వచ్చిరి. కొంతకాలము స్వాంతముగ పోరి హైదరు మద్రాసు సంధిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని ఆంగ్లేయులను సాయము కోరెను. హైదరున కెప్పుడును ప్రతిపక్షముగాను చుండిన ఆర్కాటు నవాబగు మహమ్మదు ఆలీ బోధనలవలన నాంగ్లేయులు హైదరుపైకి

మహారాష్ట్రులు ఎత్తివచ్చుట అకారణముగఁ గాదు కావున తాము సాహాయ్యమియ్యవలనుపడదని ప్రత్యుత్తరమిచ్చిరి. అందుచే హైదరు మహారాష్ట్రులకు లొంగి మిక్కిలినష్టపడి వారిని మంచితనమునకుఁ దెచ్చుకొనవలసి వచ్చెను. ఇట్టి విపత్కాలమునఁ జేయి విడిచిన ఆంగ్లేయపరిపాలకులపై అతనికి కినుక పుట్టి వృద్ధియగుచుండెను. అయిన నతఁడు మహాయుక్తిమంతుఁడు గావున దానినంతయును నప్పటికణఁచిపెట్టుకొని 1772 లో కొడగురాజ్యమును ఆక్రమించి సమయము దొరకినప్పెల్ల మహారాష్ట్రులకుఁ దా మున్నర్పించిన భూభాగమును వశపఱచుకొనుచుండెను. ఇదికనిపట్టి 1773 లో మహారాష్ట్రప్రభువు రఘోబా హైదరును మర్దింపనేతెంచెను. కాని అతఁడుఁ దైన్యము వహించి రఘోబాను పేష్వాపట్టమున కొప్పుకొనుట కభినయించి కొంతపైక మిచ్చెదనని వాగ్దానము చేసి తప్పించుకొనెను.

1778 వ సంవత్సరమున అమెరికాయందు ఆంగ్లేయ ప్రభుత్వము పై తిరుగుబాటు చేసి తన్మూలముననేఁటి ప్రసిద్ధ సంయుక్తరాష్ట్ర మేర్పఱచిన అధినివేశప్రజలకు ఫ్రెంచివారు సాయము చేసినందున ఇంగ్లాండునకును ఫ్రాంసునకును విగ్రహము ప్రారంభమయ్యెను. భరత వర్షములోని ఆంగ్లేయ సైన్యములకు ఫ్రెంచివారి పట్టణములను ముట్టడించుట కర్తవ్యమయినందున నొక ఆంగ్లేయపటాలము 'మాహీ' యను పశ్చిమ



తీరమందలి పురమును బట్టు నుద్దేశముతో పంపఁబడెను. కాని 'మాహీ' హైదరునకు లోఁబడిన ఒకసామంతరాజు దైనందునను హైదరు రాజ్యములోనుండి పటాలములు పోవలసియున్నందునను హైదరు 'మాహీ' పైఁ దనధ్వజమును ఫ్రెంచివారి ధ్వజముతోఁగూడ నెక్కించి ఆంగ్లేయులు 'మాహీ' వంకకుఁ బోకూడదని శాసించెను. కాని ఈతఁడొడ్డిన యాటంకము నిలచినది కాదు. 'మాహీ' ని ఆంగ్లేయులు పట్టుకొనిరి. దీని వలన హైదరునకుఁ గలిగిన ఆగ్రహమును వర్ణింప నలవిగాదు.

ఆ సమయముననే నైజామునకును ఆంగ్లేయులకును గుంటూరు సర్కారు విషయమున భేదములు ప్రారంభమయ్యెను. ఉత్తరహిందూస్థానమునను బొంబాయియందును ఆంగ్లేయులకు దురవస్థలు వాటిల్లుచుండెను. కావున వారు హైదరును శాంతపఱచుటకు అనేక విధములఁ బ్రయత్నించిరి. మధ్యవర్తులనంపి చూచిరి. బహుమతు లిచ్చి తనియింప నెంచిరి. ఎన్ని పాట్లుపడినను హైదరు వారిని మన్నించినవాఁడుగాఁడు. అతని ఏర్పాటులన్నియుఁ దీరినతోడనే 1780 వ సంవత్సరమున డెబ్బది ఎనిమిదేండ్ల వయస్సున నతఁడు కులవైరుల నిర్మూలము చేసెదనని పట్టుపట్టిన యౌవనుఁడగు కుమారునితోఁ గూడ 90,000 సైన్యమును నడపికొని ప్రజల సంపూర్ణాశీర్వాదములఁ గొనుచు సమర్థులగు నధికారులు గొలువ నాంగ్లేయులమీఁద వెడలెను. నైజామును మహారాష్ట్రులును నితనికి సాహాయ్యము రానేర్పడి

యుండెను. కాని మహారాష్ట్రులు దమకు వచ్చిన కష్టములు దప్పించుకొన పాటుపడుచుండిరి. గవర్నరు జనరలుగారి సామ వాక్యములచేతను చాతుర్యముచేతను నైజాము ఆంగ్లేయుల పరమయి హైదరును చేరఁడయ్యెను. కావున ఇతనికిని ఆంగ్లేయులకును జరిగిన విగ్రహము మహాఘోరమయ్యెను. హైదరాంగ్లేయులను ఆంగ్లేయులు హైదరును ఓడింపఁ జొచ్చిరి. ఇట్లు హైదరు జయాపజయములను గొనుచు దీక్షతోఁ బని చేసి ఆంగ్లేయులతో రెండుమారులు విగ్రహము నడిపి మైసూరు సంస్థానమునకుఁ గొఱంతరాకుండునట్లు నిలిపి 1782వ సంవత్సరమున రెండవ మైసూరు విగ్రహము జరుగుచుండఁగనే మృతి నొందెను.

## టిప్పూ సుల్తాను.

హైదరు మరణానంతరము అతని కుమారుఁడైన టిప్పూ సుల్తాను రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు విద్యావంతుఁడేగాని మతావేశముగలవాఁడు. 1784 సంవత్సరమున ఆంగ్లేయులతో సంధి చేసికొని మహారాష్ట్రులను నైజామును జయించి ఇతఁడు దక్షిణ హిందూస్థాన పశ్చిమ తీరమునకు దండెత్తిపోయి రాజ్యముల నాక్రమించి అందలి ప్రజలను మహమ్మదీయులు గావలసినదని నిర్బంధపెట్టఁ బ్రారంభించెను. వారట్టి పని కంగీకరింపనిచో వారిని చిత్రవధపాలు చేయుచువచ్చెను. ఇంతియెకాదు. ఇతనికిని ఆంగ్లేయులకును బద్ధవైరము. వారి సంరక్షణయం



ధుండిన తిరువాన్కూరు రాష్ట్రము నితఁడు ముట్టడింపఁబోయెను. కావున నాంగ్లేయ ప్రభుత్వమువారికిని ఇతనికిని మఱల విగ్రహము ప్రారంభమాయెను. మహారాష్ట్రులును నైజామును ఆంగ్లేయులకు సాయమేతెంచిరి. గవర్నరు జనరలుగా నుండిన లార్డు కార్న్వాలీసే స్వయముగ సైన్యముల నడపుకొని వచ్చెను. కొంత పోరాటముమీఁద టిప్పూ పరాజితుఁడయి శ్రీరంగపట్నము వద్ద సంధి చేసికొనెను (1792). దానివలన నతని రాజ్యములో సగబాలును మూఁడుకోట్లముప్పది రూపాయలును శత్రువులకుఁ జెందిపోయెను. అతని కుమారులిరువురు ప్రతిభులుగా నొసంగఁబడిరి.

ఈ దురదృష్టమునకుఁ దరువాత టిప్పూ ఆంగ్లేయుల నెల్లను భరతఖండమునుండి పారఁదోలవలయునని బహుభంగుల ప్రయత్నము చేయ నారంభించెను. ఆఫ్గనిస్థానము, తుర్కీ, అరేబియా, పారసీకము మున్నగు మహమ్మదీయ విదేశములకు ఉత్తరములు వ్రాసెను. ఢిల్లీ, అయోధ్యా, హైదరాబాదు, పునహా, యోధపురము, జయపురము, కాశ్మీరము మున్నగు భారతేయ సంస్థానములకుఁ దనప్రతినిధుల నంపెను. ఫ్రెంచి వారిని పలుమారు సాహాయ్యము వేఁడెను. వారికి నాయకుఁడయి యూరోపాఖండము నంతయు వడఁకఁ జేయుచుండిన నెపోలియను బోనపార్టునకును ఇతనికి గూడ నుత్తర ప్రత్యు

త్తరములు జరిగెను. కాని నెపోలియను నావిక సైన్యము 'నెల్సను' అను ఆంగ్లేయ నావికావీరునిచే నోడింపఁబడినమీఁదట నెపోలియను దూర్పుదేశముల పైకి వచ్చు నుద్యమము మానుకొనవలసి వచ్చెను. టిప్పూసుల్తాను చర్యలనంతటిని గని పట్టి యుండిన గవర్నరు జనరలు అతనిని సమాధాన మడిగెను. అతఁడును సరియయిన ప్రత్యుత్తర మీయనందున అతనిపై విగ్రహము చాటింపఁబడెను. నైజామును మహారాష్ట్రులును టిప్పూసుల్తాను గెలిచినచో నతఁడు దమ్ము నెచ్చట మ్రింగివేయునోయను భయమున నాంగ్లేయుల పరమయిరి. విగ్రహము ప్రారంభమయ్యెను. ఒకటి రెండుయుద్ధములకుఁ దరువాత నాంగ్లేయులు శ్రీరంగపట్నమును ముట్టడించిరి. టిప్పూ సంధిచేసికొనుటకుఁ బ్రయత్నించెను. కాని రెండు పక్షములవారికిని పరత్తులు కుదిరినవి కావు. కావున ముట్టడి బలముగసాగదొడఁగి 1799 వ సంవత్సరము మేనెల 4 వ తేది శ్రీరంగపట్నము ఆంగ్లేయుల చేతిఁ జిక్కెను. టిప్పూసుల్తాను యుద్ధమున బహు సాహసముతోఁ బోరి మడిసి పడి యుండెను. ఆతనితో మైసూరునందు మహమ్మదీయరాజ్య మంతరించి పోయెను.

ఈవిగ్రహమున నాంగ్లేయులకు సాయముచేసిన స్వదేశీయ పరిపాలకుఁడు నైజామొక్కరుఁడె. మహారాష్ట్రులు యుద్ధరంగమున కే రా లేదు. కాని టిప్పూసుల్తాను పరాజితుఁడయి మృతినొందిన తరువాత నాతని దేశమును బంచుకొను సమ



యమున నాంగ్లేయులు వీరిని దలపెట్టవలసిన వారయిరి. టిప్పూ రాజ్యమును దామును నైజామును విభజించుకొన యత్నించిన పక్షమున మహారాష్ట్రులకుఁ దప్పక ఈర్ష్యజనించును. అంతమాత్రమె గాదు. నైజామునకు విశేషమగు భూభాగము చేరిపోయి అతని శక్తి యెక్కుడయి పోవును. అది అప్పటి స్థితిలో ఆంగ్లేయ ప్రభుత్వము వారి కంతఫలప్రదముగాఁ గన్పించ లేదు. కావున మిక్కిలి యోచనమీఁద మైసూరు మండలమునందుఁ బూర్వహిందూరాజ వంశమును నెలకొల్పునట్లును టిప్పూనకు సంబంధించిన ఇతరదేశభాగమును దామును నైజామును మహారాష్ట్రులును విభజించుకొనునట్లును నైజాముతో 1799 లో చేసికొనిన సంధివలన ఏర్పఱుపఁబడెను. అందుచే 'బూర్వ హిందూవంశమునకుఁ జేరిన కృష్ణరాజ ఒడయరు ఐదు సంవత్సరముల బాలుఁడు మైసూరునకు రాజుగా నేమింపఁబడెను. అతనితో నదే తరుణమున నొక సాహాయ్యసంధి (Subsdiary treaty.) తీర్చుకొనఁబడెను.

ఈసంధివలన మైసూరునం దాంగ్లేయులు మహారాజునకు సాహాయ్యార్థము హైదరాబాదు మొదలగు ఇతర సంస్థానములందు వలెనే సాహాయ్య సైన్యమును నిలుప నిర్ణయించుకొనిరి. దానికగు వ్యయమునకు గాను మైసూరురాజు సంవత్సరమున కేడులక్షల పూలవరహాల నియ్యనంగీకరించెను. ఇతర రాష్ట్రములతోఁ బోరుకలిగినప్పుడు ఆంగ్లేయుల సాయమునకైవలసిన

త్తరములు జరిగెను. కాని నెపోలియను నావిక సైన్యము 'నెల్సను' అను ఆంగ్లేయ నావికావీరునిచే నోడింపఁబడినమీఁదట నెపోలియను దూర్పుదేశముల పైకి వచ్చు నుద్యమము మానుకొనవలసి వచ్చెను. టిప్పుసుల్తాను చర్యలనంతటిని గని పట్టి యుండిన గవర్నరు జనరలు అతనిని సమాధాన మడిగెను. అతఁడును సరియయిన ప్రత్యుత్తర మీయనందున అతనిపై విగ్రహము చాటింపఁబడెను. నైజామును మహారాష్ట్రులును టిప్పుసుల్తాను గెలిచినచో నతఁడు దమ్ము నెచ్చట మ్రింగివేయునోయను భయమున నాంగ్లేయుల పరమయిరి. విగ్రహము ప్రారంభమయ్యెను. ఒకటి రెండుయుద్ధములకుఁ దరువాత నాంగ్లేయులు శ్రీరంగపట్నమును ముట్టడించిరి. టిప్పు సంధిచేసికొనుటకుఁ బ్రయత్నించెను. కాని రెండు పక్షములవారికిని షరత్తులు కుదిరినవి కావు. కావున ముట్టడి బలముగసాగదొడఁగి 1799 వ సంవత్సరము మేనెల 4 వ తేది శ్రీరంగపట్నము ఆంగ్లేయుల చేతిఁ జిక్కెను. టిప్పుసుల్తాను యుద్ధమున బహుసాహసముతోఁ బోరి మడిసి పడి యుండెను. ఆతనితో మైసూరునందు మహమ్మదీయరాజ్య మంతరించి పోయెను.

ఈవిగ్రహమున నాంగ్లేయులకు సాయముచేసిన స్వదేశీయ పరిపాలకుఁడు నైజా మొక్కరుఁడె. మహారాష్ట్రులు యుద్ధరంగమున కే రా లేదు. కాని టిప్పుసుల్తాను పరాజితుఁడయి మృతినొందిన తరువాత నాతని దేశమును బంచుకొను సమయమున నాంగ్లేయులు వీరిని దలపెట్టవలసిన వారయిరి.



టిప్పు రాజ్యమును దామును నైజామును విభజించుకొన యత్నించిన పక్షమున మహారాష్ట్రులకుఁ దప్పక ఈర్ష్యజనించును. అంతమాత్రమె గాదు. నైజామునకు విశేషమగు భూభాగము చేరిపోయి అతని శక్తి యెక్కుడయి పోవును. అది అప్పటి స్థితిలో ఆంగ్లేయ ప్రభుత్వము వారి కాతఫలప్రదముగాఁ గన్పించ లేదు. కావున మిక్కిలి యోచనమీఁద మైసూరు మండలమునందుఁ బూర్వహిందూరాజ వంశమును నెలకొల్పునట్లును టిప్పునకు సంబంధించిన ఇతరదేశభాగమును దామును నైజామును మహారాష్ట్రులును విభజించుకొనునట్లును నైజాముతో 1799 లో చేసికొనిన సంధివలన ఏర్పఱుపఁబడెను. అందుచే 'బూర్వ హిందూవంశమునకుఁ జేరిన కృష్ణరాజ ఒడయరు ఐదు సంవత్సరముల బాలుఁడు మైసూరునకు రాజుగా నేమింపఁబడెను. అతనితో నదే తరుణమున నొక సాహాయ్యసంధి (Subsdiary treaty.) తీర్చుకొనఁబడెను.

ఈసంధివలన మైసూరునం దాంగ్లేయులు మహారాజునకు సాహాయ్యార్థము హైదరాబాదు మొదలగు ఇతర సంస్థానములందు వలెనే సాహాయ్య సైన్యమును నిలుప నిర్ణయించుకొనిరి. దానికగు వ్యయమునకు గాను మైసూరురాజు సంవత్సరమున కేనులక్షల పూలవరహాల నియ్యనంగీకరించెను. ఇతర రాష్ట్రములతోఁ బోరుకలిగినప్పుడు ఆంగ్లేయుల సాయమునకై వలసిన

సైన్యముల కగువ్యయమునుగూడ గవర్నరు జనరలుగారి తీర్మానముచొప్పున మైసూరురాజు భరింప వలసి యుండుననియు నొక్క షరత్తు ఈసంధిలోఁ జేర్పఁబడియెను. అయిన నీషరత్తు 1807 వ సంవత్సరమున మార్పునందెను. అప్పుడు మైసూరు సైన్యమేర్పడెను.అదియే ఆంగ్లేయుల సాయమునకుఁ గాను కొన్నినిబంధనల ననుసరించి ఉపయోగింప నియమింపఁబడెను. ఈ రెండుసేనలకు అనఁగా సాహాయ్యసైన్యమునకును మైసూరు సైన్యమునకును అగువ్యయములు రాజు భరింపనంతటి స్థితికి వచ్చినచో ఆంగ్లేయ ప్రభుత్వమువారు పరిపాలనాపద్ధతులను మార్చియో కొంతదేశమును ఆక్రమించుకొనియో లేక సర్వమును తమ యాధిపత్యమునకు మార్చుకొనియో తమ చిత్తమునకువచ్చినట్లు ప్రవర్తింపఁగలరనియు అట్లు రాజ్యము తీసికొనఁబడినచో రాజునకు సంవత్సరమునకు ఒకలక్షరూపాయిలును రాజ్యపునికరాదాయములో ఐదవవంతును ఇయ్యఁబడుననియును ఈ సంధివలనఁ దీర్మానింపఁబడెను.

## పూర్ణయ్య.

కృష్ణరాజఒడయరు బాలుఁడుగ నుండినందున ఈ సంధిపత్రములో అతనివ్రాలును అతని తల్లివ్రాలును దివాను పూర్ణయ్యవ్రాలును గానవచ్చుచున్నవి. ఇట దివాను పూర్ణయ్య ఎవ్వరయినదియు మాచదువరు లొకకొంత ఎఱుంగుదురుగాత. ఇతఁడు కోయంబుత్తూరు జిల్లాలోని యొకమాధ్వవంశమునకుఁ



జేరినవాఁడు. హైదరుకాలమున నతనికడ ఇతఁడు పనికికుదిరి సామర్థ్యము చూపినందున ఇతఁడు ఆతనిచే మంత్రిగ నేమింపఁబడియెను. హైదరాలీ ఆంగ్లేయులపై యుద్ధమునకు బయలుదేరినప్పుడు అతని సైన్యములకు వలయు సామగ్రినంతయు వెంట నడపి తన యజమానికి ప్రబలసాహాయ్య మొనర్చినవాఁడీ పూర్ణయ్యయే. హైదరు మరణానంతరము టిప్పును బారదోలి హైదరురెండవ కుమారుని సింహాసనారూఢుం జేయ వలయునని ప్రయత్నించినవారిని విఫలమనోరథులనొనర్చి టిప్పుసుల్తానునకు మైసూరు రాజ్యమును దక్కించినవాఁడును ఈపూర్ణయ్యయే. కావున నితఁడు హైదరునకును టిప్పునకును మిక్కిలి ముఖ్యుఁడుగ నుండెను. టిప్పుయొక్క మతావేశము ఇతని వఱకును వ్యాపించెనుగాని అతని తల్లిగారి హెచ్చరికమీఁద టిప్పు పూర్ణయ్యగారియొద్ద మతపుమాటయె యెత్తుకొనుట మానివేసెను. శ్రీరంగపట్నపుముట్టడిలో టిప్పు నిహతుఁడయిన పిదప ఇతఁడును ఆంగ్లేయుల చేతులలోఁ జిక్కెను. కాని టిప్పుసుల్తాను కడ నెరవేర్చుచుండిన ఆర్థికమంత్రిత్వకార్యమునే కృష్ణరాజఒడయరు కడఁగూడ నెరవేర్ప నియ్యకొనుటవలన నాంగ్లేయప్రభుత్వమువారు పూర్ణయ్యను ఉద్యోగమునందుండ నియమించిరి.

పూర్ణయ్యదివానుగను రాజ్యపాలకుఁడుగను నేర్పఱుపఁబడెను. కర్నలు క్లోసు అనునతఁడు రెసిడెంటయ్యెను. కర్నలు ఆర్థరు వెల్లస్లీ (తరువాత వెల్లింగ్టను ప్రభువయి నెగడినవాఁడు)

సేనానాయకుఁడుగ నేమింపఁబడెను. ఇట్లేర్పడిన ఈముగ్వురి చేతులలో మైసూరురాజ్యము క్షేమముగ జీవయాత్ర మొదలిడెను. అచ్చటచ్చట తిరుగఁబడియుండిన ప్రభువు లణఁచి వేయఁబడిరి. దేశములోని సంగతులన్నియును జక్కఁగ నెఱిఁగినవాఁడుగాన పూర్ణయ్యరాజ్యములోని వరుంబడి మార్గముల బాగుగ నుపయోగింపఁ జొచ్చెను. టిప్పుసుల్తాను మంచిగంధపు చెక్క ఎగుమతికాకూడదని ఉత్తరువుచేసియుండెను. కావున రాజ్యభవనములందు నది కొల్లలుగఁ జేరియుండెను. తెలిసినవాఁడుగాన పూర్ణయ్య దానిని అమ్మి ఎక్కుడు ధనమును బొక్కసమునకుఁ జేర్చెను. ఇతఁడు రాజ్యభారము నిర్వహించినంత కాలమును ఆంగ్లేయ ప్రభుత్వమువారు మైసూరు పరిపాలనయందు జోక్యము కలుగఁజేసికొనవలసిన యంశ మొక్కటియును రాలేదు. దీనిచే పూర్ణయ్య ప్రభుత్వమున లోపములు లేవని చెప్పుటగాదు. కానిపూర్వపద్ధతుల నవలంబించుచు నిరంకుశముగ రాజ్యపాలనముచేసినను అతని కాలమున నేలాటి కష్టములును దటస్థింపకుండుట ఆతని పరిపాలనా శక్తిని వ్యక్తీకరించుచున్నదని మాత్రము అందఱును దోఁచకపోదు. అతఁడు 1811 వ సంవత్సరములోపల బొక్కసమున రెండుకోట్ల రూపాయలు చేర్చిపెట్టెననినచో నతఁడు ఆర్థిక విషయముల నెంత జాగరూకతతోఁ బనిచేసినదియు వెల్లడియగుచున్నది. అతని పద్ధతులలోని ఒక్కలోపమును మాత్రమిచ్చట నె చూపుట గర్తవ్యము. పన్నువసూలున కతఁడేర్పఱచిన మార్గము ముందుకాలమున బాధను దెచ్చి పెట్టునదయ్యెను. అతఁడు అమల్దారులనేర్పఱచి వారిని తాలూకాలకనిపి నిర్ణీతమగు మొత్తమును వసూలుచేయవలసినదని యుత్తరువిచ్చెను. వారు తక్కువ వసూలుచేసినచో స్వంతధనమిచ్చుకొని తీరవలయుననియు ఎక్కువవసూలుచేసినచో రాజుగారి ధనాగారమునకంపవలసినదనియు వారికి ననుజ్ఞ. ఈపద్ధతి దివాను స్వయముగ జాగరూకుఁడయి న్యాయమతిక్రమింపక కార్యములను గమనించినంత కాలమును దుఃఖములను దెచ్చిపెట్టదయ్యెను. కాని రాజునకుఁ బైకముకావలసివచ్చినప్పుడును దివాను కఠినుఁడయినప్పుడును దీనివలన ననర్థములు జరుగవీలుండెను. అట్టి కష్టదశ ముందు వర్ణితమగును. పూర్ణయ్యనిరంకుశముగ పరిపాలించెనని పైనవ్రాసితిమి. ప్రజలకుమాత్రమె అతఁడు నిరంకుశుఁడు గాఁడు. రాజు విషయమునఁగూడ నతఁడు అట్టి విధముగనె ప్రవర్తించుచుండెను. కావునఁ జుట్టుముట్టుంగల పరిజనుల బోధనలచే రాజునకతనిపై నసూయజనించెను. అందువలన కృష్ణరాజ ఒడయరు 1811 వ సంవత్సరమున నాంగ్లేయప్రభుత్వము వారికిఁ దానే రాజ్యభారము నిర్వహించుకొందునని తెలియఁజేసెను. రెసిడెంటు పూర్ణయ్యను దివానుగానిలుపనెంచెనుగాని అతఁడియ్యకొనఁడయ్యెను. ఆతరువాతి సంవత్సరమే శ్రీరంగపట్టణమున పూర్ణయ్య వైకుంఠప్రాప్తిఁ జెందెను.

## కృష్ణరాజఒడయరు.

పూర్ణయ్యను దొలఁగించి కృష్ణరాజ ఒడయరు రాజ్యమా నేలమొదలిడెను. బొక్కసము సంపూర్ణముగ నిండియుండిన స్థితిలో పదునాఱేండ్ల బాలుఁడగు నీభూపాలుఁడు పరిపాలనము ప్రారంభించి మూఁడుసంవత్సరములలో రాజ్యమును దారిద్ర్యమునకు దెచ్చివిడిచెను. స్తోత్రపాఠకులును, పరాన్నభుక్కులును, ఇతనికి ప్రాణ మిత్రులగుటవలన రెసిడెంటుగారి సంభాషణములును రాజ్యములోని భారతీయపౌరుల నీతివచనములును ఇతనిచెవుల కెక్కినవికావు. ఆంగ్లేయప్రభుత్వమువారు కొంతకాలమీతనిని జంకించిచూచిరి. అప్పటికిని ఇతఁడు తనమార్గమునువదలినవాఁడుగాఁడు. ద్రవ్యము లెక్కలేక వెచ్చపెట్టఁబడుచుండుటవలనను సైన్యమునకై అప్పులు పెరుగఁజొచ్చియుండుటవలనను పూర్ణయ్యచే నుపక్రమింపఁబడిన వసూలుపద్ధతిలోని పైకనుపఱచిన లోపముచే నది మహాక్రూరముగ నుపయోగింపఁబడుట ప్రారంభమయ్యెను. ఉత్తమోద్యోగము లన్నియును ఏలములో నమ్మఁబడ మొదలిడెను. ఇంతియెగాక న్యాయ తీర్మానముల విషయమునఁ గూడ ప్రజల కరాజకము సంభవించెను. ఏన్యాయాధిపతికిని శిక్ష వేయు నధికార ముండినదిగాదు. అతఁడు ముద్దాయి నేరస్థుఁడని తీర్మానించిన తరువాత రాజు స్వయముగనే శిక్షవిధించుచుంటయాచారము. కాబట్టి రాజు సోమరియగుటతోడను న్యాయతీర్మానములయందు భరింపరాని ఆలస్యముపొడసూపెను.



ఇప్పగిది ఒక్కటిపై నొక్కటిగ నష్టములు ప్రజలకు సంభవింప నారంభించినందునఁ గ్రమ క్రమముగ నసంతుష్టి ప్రబలెను. 1830 వ సంవత్సరమునఁ దిరుగు బాటులు ప్రారంభమయ్యెను. ఆంగ్లేయ సైన్యము లవ్వానినణఁచుటకు సాయము పోవలసి వచ్చెను. నగరము తాలుకాలో జరిగిన తిరుగుబాటును ఎదుర్చుటకు సాహాయ్య సైన్యమంతయును వలసి వచ్చెను. మిక్కిలి కష్టము మీఁద తిరుగు బాటు సైన్యములు విరిసిపోయి శాంతి సమకూరెను. తిరుగు బాటునకుఁ గారకులయిన ఒకరిద్దరు నాయకులు మాత్రము కొన్ని నెలలకాలము విడువక మైసూరు సీమను వేధించిరి. ఇట్టి స్థితిలో గవర్నరు జనరలుగారు కృష్ణరాజ ఒడయరును సింహాసనమునుండి తొలఁగించుట శ్రేయస్కరమని యెంచి ఆసంగతిని అతనికిఁ దెలియఁ జేసి ఇద్దరు కమిషనరులను రాజ్యభారమునకు నియోగించెను. రాజు వారిచేతికిఁ దనదేశము నప్పగించి మైసూరు నందలి తన నగరులోఁ గాలముఁ గడపఁగడఁగెను.

## కమిషను పరిపాలన.

మైసూరు రాష్ట్రము ఈవిధముగ 1831- మొదలు 1881 వఱకును సంపూర్ణముగ ఆంగ్లేయుల ప్రభుత్వము క్రిందికి వచ్చెను. ఈయేబది సంవత్సరములను పరిపాలనాపద్ధతుల ననుసరించి మూఁడు భాగములుగ విభజింప వచ్చును. మొదటి భాగమున పూర్ణయ్యచే నుపక్రమింపఁబడిన పద్ధతులే న్యాయ

మార్గమున ననుసరింపఁబడెను. రెండవ భాగమున నాంగ్లేయ పరిపాలనా పద్ధతులు గొంచెము కొంచెముగ నవలంబింపఁబడఁ జొచ్చెను. మూఁడవ భాగమున సంపూర్ణముగ నాంగ్లేయ పద్ధతులే నెలకొలుపఁబడియెను. ఆంగ్లేయ ప్రభుత్వము మైసూరు నం దారంభమగు నప్పుడు "కమీషనరుల క్రింది యుద్యోగస్థులందఱును స్వదేశీయులుగ నుండ వలెను. ప్రస్తుతముగల స్వదేశీయస్థాపనలు తప్పకసాగించవలెను" అని గవర్నరు జనరలు గారి యాజ్ఞ. దాని ననుసరించి మొదట నేపనికైనను స్వదేశీయులే నేమింపఁబడుచు వచ్చిరి. కాని పరిపాలనా పద్ధతి నంతయు మార్చవలసిన యవసరము గానవచ్చుటం బట్టి ఆయనుజ్ఞ నతిక్రమించవలసెను. స్వదేశీయులుగ నుండుచువచ్చిన ఫౌజుదారులను మండలాధికారుల స్థానములకు నలుగురు ఐరోపియనులు నేమింపఁబడిరి. తరువాత క్రమక్రమముగ సహాయోద్యోగులును ఐరోపియనులే యగుచువచ్చిరి. 1854వ సంవత్సరమున నాంగ్లేయ రాజ్యాంగముల ననుసరించి విద్యాశాఖయు (Public Instruction) నిర్మాణశాఖ (Public works) యు నేర్పఱుపఁ బడెను.

మొదటి కమీషనరులలో పేరుఁ గన్నవాఁడు 'కుబ్బను'. ఇతఁడు పన్నువసూలుపద్ధతులను సంస్కరించి ప్రజలకు బాధ లేకుండఁ జేసెను. కుల్నాడు సీమలోఁ బ్రబలముగ నుండిన బానిస వ్యాపారమును రద్దుచేసెను. న్యాయవిచారణ విషయమున జరుగుచుండిన దురాచారములను దొలఁగించెను. ఈరీతి నీతని కాలమున మైసూరు జనులు శాంతి నందఁగలిగిరి. ఇతఁడు అనేకములగు చిల్లర పన్నులను త్రోసివేసి నేలపన్ను నుగూడ తగ్గించినను వసూలు పద్ధతులలో చేసిన మార్పులవలన మొదటికంటె పన్నెక్కుడుకాఁగడంగెను. 1861వ సంవత్సరమున నితనికి వ్యాధి తటస్థించినందున పనికిరాజీనామానిచ్చి ఇంగ్లాండునకుఁ బయనమై పోవుచు సూయెజు వద్ద మృతి నొందెను.



1862 వ సంవత్సరమున మైసూరు సంపూర్ణముగ నాంగ్లేయ పద్ధతుల ననుసరించియే ఏలఁబడఁజొచ్చెను. సీమయంతయు మూఁడు డివిజనులుగను ఎనిమిది జిల్లాలుగను విభజింపఁబడెను. డివిజనులపై సూపరింటులును జిల్లాలపయి అసిస్టంటుసూపరింటులును నేమింపఁబడిరి. ఆర్థికాంగము (Financial dept.) గొప్పసంస్కారములందెను. ఆదాయవ్యయగణన పత్రములును (బడ్జెటులును) లెక్కతనికీలును (ఆడిట్టులును) ఉపయోగమునకుఁ గొనితేఁబడెను. 1863 వ సంవత్సరమున సర్వేసెటిలుమెంటులు ప్రారంభమయ్యెను. నేలపన్ను 30 సంవత్సరములకొక పర్యాయము పరిశీలింపఁబడు పద్ధతి యుపక్రమింపఁబడెను. ఇనాం కమీషను నొకటి ఏర్పడెను. నీటికాలువలును అడవులునుదగురీతిని అభివృద్ధి నందెను. న్యాయతీర్మానాది కార్యములు పెరుగుచు వచ్చినందున జిల్లాలలో న్యాయాధికారులు నియమింపఁబడిరి. విద్యాలయములు నెలకొల్పఁబడెను. (మ్యునిసిపాలిటీలు) గ్రామరక్షక

సంఘములు ప్రారంభమాయెను. అంచె తపాలుపోయి నూతన తపాలా పద్ధతి నెగడెను. ఇట్లు ఆంగ్లేయ ప్రభువులచేఁ బరిపాలింపఁబడుచుండు మండలములో నే యేవిశేషములు గలవో అవియెల్లయు మైసూరునందుఁగూడ నయ్యెను. కాని ఈమార్పుల వలన మొదట చేసికొనిన నేమమును మాత్రము ఆంగ్లేయ ప్రభుత్వమువారు విడువవలసి వచ్చెను. వారు ఐరోపీయను అధికారులను అనేకులను నేమింపవలసినవారైరి.

### శ్యామరాజేంద్ర ఒడయరు దత్తువచ్చుట.

కృష్ణ రాజేంద్ర ఒడయరు ఆంగ్లేయాధి కారులకు రాజ్యము నప్పగించిన తరువాత మూఁడు పర్యాయములు ప్రభుత్వమువారికి అర్జీలిచ్చుకొని మఱల తన్ను రాజ్యమునకు నధికారిం జేయవలసినదని వేఁడుకొనెను. అతఁడు కనుపఱిచిన కారణములు మిక్కిలి యుక్తియుక్తములుగా నున్నవి. కానిఫలమేమియు లేదయ్యెను. 1866 వ సంవత్సరమునఁ బెట్టుకొనిన అర్జీలో దాను రాజ్యభారమువహించు నప్పటికి పదునారేండ్ల పసివాఁడయినందునను దన విద్యాభ్యాసమునఁ గొంత స్వాతంత్ర్యాకాంక్ష ఆంగ్లేయోపాధ్యాయుల వలననే నేర్పఁబడినందునను దాను అనుభవలోపమునఁ జేసి తప్పుత్రోవలఁ ద్రొక్కినది నిజమేయనియును, రానురాను దన యధీనమునుండి రాజ్యమును దొలఁగింపవలసి వచ్చుట ఆంగ్లేయులకుఁ దప్పక సంభవించినదేయనియును, కాని లోపములు దిద్దిన పిదపఁ దన్ను



మఱల రాజ్యాధిరూఢుం జేయకుండుట వ్యాధిగ్రస్తుఁడయిన వానిని రోగముకుదిరిన తరువాతఁ గూడమంచమునకుఁ గట్టిపెట్టినట్లున్నదనియును, తనకు రాజ్యము నిచ్చినది నైజామును ఆంగ్లేయులును నైనందున ఆంగ్లేయులు దన్ను శాశ్వతముగ పదభ్రష్టుం జేయుట అన్యాయమనియును ఒకవేళఁ దనకు ఆంగ్లేయుల దయవలన మాత్రమే రాజ్యము చేకూరియున్నను ఆప్రభుత్వమువారు ఇచ్చినది మఱల పుచ్చుకొనుట ధర్మవిరుద్ధమనియును వ్రాసి పంపెను. అందులోనె అతఁడు తాను దత్తుచేసికొనిన పుత్రుఁడగు శ్యామరాజేంద్రఒడయరునకు ముందు రాజ్యము లభింపవలసి యుండుటను గుఱించియు మొఱవెట్టికొనెను. ఆంగ్లేయ ప్రభుత్వమువారి చేతులలోనికి మైసూరు పోయినదాదిగ ఆసీమను మఱల స్వదేశీయ ప్రభువుల కప్పగింప పనిలేదను వాదమొక్కటి వెలువడి యుండెను. కావున భరతఖండమునందలి ఆంగ్లేయ ప్రభువులు కృష్ణరాజ ఒడయరు దత్తు చేసికొనుటకుఁగూడ నాటంకములు దెచ్చిపెట్టఁ బ్రయత్నించుచుండిరి. కాని విక్టోరియా మహారాజ్ఞిగారి ఉదార హృదయమునకు మాత్ర మీపద్ధతి సరిపడినది కాదు. అందుచే నాయమయొక్క ఇష్టమున కనుగుణముగ కృష్ణరాజ ఒడయరుచే దత్తపుత్రుఁడుగ స్వీకరింపఁబడి యుండిన శ్యామరాజేంద్ర ఒడయరును ఆంగ్లేయ ప్రభుత్వమువారు మైసూరునకు భవిష్యత్పరిపాలకుఁడుగ నొప్పుకొనిరి.

నాఁటినుండి శ్యామ రాజేంద్రుని విద్యాభ్యాసము ప్రారంభింపఁ బడెను. ఆవిషయమునఁ గూడ కృష్ణరాజ ఒడయరు నకును స్థానికాంగ్లేయ ప్రభువులకును గొంత దూరము చర్చ జరిగెను. కాని కృష్ణరాజ ఒడయరు అభిప్రాయమే కడపట ఆమోదింపఁ బడెను. అయిన నతనిచే శ్యామరాజేంద్రునకు నుపాధ్యాయుఁడుగ నిర్ణయింపఁబడిన లెష్ఠనంటు కర్నలు హేయిన్సు అనునతఁడు 1869వ సంవత్సరమున రాజీనామా నిచ్చెను. అతనికిఁ దరువాత నతని స్థానమున ప్రసిద్ధచరిత్రకారుఁడగు కర్నలు జి. బి. మాలిసను నేమింపఁబడెను. అతనికి సహకారులుగఁ దరువాత దివానుపదమును సమర్థతతో నలంకరించిన రంగాచార్యులును, శ్యామరాజేంద్రుఁడు చదువుచుండిన బడిలోని ప్రధానోపాధ్యాయుఁడగు జయరామరావును నియమింపఁబడిరి. వీరును దరువాత మఱికొందఱును గఱుప శ్యామరాజేంద్రుఁడు వలసిన జ్ఞానమును సమకూర్చుకొనెను. కృష్ణరాజ ఒడయరు 1868లోనె మృతినొంది యుండెను. అప్పుడు శ్యామరాజేంద్రుఁడు పదునెనిమిదేండ్ల వయస్సు వాఁడయిన తోడనె అతఁడు విద్యాదికములచే నర్హుఁడనితోఁచిన యెడల గొన్ని నిబంధనలతో సింహాసనమునకు రాగలఁడని ఆంగ్లేయ ప్రభుత్వమువారు చాటియుండిరి. కావున యుక్తవయస్కుఁడయినపిదప 1881వ సంవత్సరమున శ్యామరాజేంద్ర ఒడయరున కాంగ్లేయులు మైసూరురాజ్య పరిపాలనము నిచ్చివేసిరి.



అప్పుడేర్పడిన నిబంధనల ననుసరించి సాహాయ్యసైన్య వ్యయములకుగాను మైసూరు మహారాజు సంవత్సరమునకు ముప్పదియైదులక్షల ద్రవ్యము నిచ్చునట్లును, అతఁడు అంతః పరిపాలనకయ్యు స్వసంరక్షణకయ్యు నియమించుకొను సైనికుల సంఖ్య గవర్నరుజనరలుగారి అనుమతి ననుసరించి తీర్చుకొన వలసినట్లును, అతఁడు పరరాష్ట్రములతో సంబంధములు కలిగించుకొనకుండు నట్లును, అన్నివిషయములందును గవర్నరు జనరలుగారి బోధనలను మహారాజు గమనింప వలసినట్లును, నిబంధనలను మించి అతఁడు ప్రవర్తించినచో నాంగ్లేయులకు రాజ్యము స్వాధీనమగునట్లును, దీర్మానింపఁ బడెను. ఇట్టికట్టుదిట్టములతో శ్యామరాజేంద్రుఁడు రాజ్యభారమును వహింపఁ బ్రారంభించు నప్పటికి మైసూరునకుఁ గొన్ని దురవస్థలు సంఘటిల్లి యుండెను. ఏబది సంవత్సరము లాంగ్లేయులు ప్రభుత్వము నెఱపి సంస్కారముల నొనర్చి ఆదాయము నెక్కుడుచేసి యుండిరనుట సత్యమేకాని 1876వ సంవత్సరమున సంభవించిన మహాక్షామమువలన బొక్కసమున నిలువయుండిన రెండుకోట్లు అదృశ్యమయి యుంటయేకాక ఆంగ్లేయులకు మైసూరు మహారాజు 80 లక్షల రూపాయలు అప్పుపడి యుండెను. రాజ్యములోని ప్రజలలో నైదవవంతు దుర్భిక్షమువాతఁ బడి మరణమొంది యుండిరి. కావున శ్యామరాజేంద్రునకు మొదటి కర్తవ్యము ముందు క్షామములు రాకుండ నాపుటకు వలయు నదుపాయ

ములనొనర్చుట యయియుండెను. అందువలన నతఁడు నీటి వసతుల నేర్పఱచుట యందును రైలుమార్గముల నిర్మించుట యందును అత్యంత పరిశ్రమసేయ కడఁగెను. అతనికా కార్యములనెల్ల సహాయుఁ డగుటకు నతనిచే దివానుగ నెన్నుకొనఁ బడియుండిన రంగాచార్యులకంటె నెక్కుడు సమర్థుఁ డెవఁడు గలఁడు?

కృష్ణరాజేంద్రుఁడు పరమపదమందిన వెంటనే అతని నగరునందలి ద్రవ్యరాసులను భూషణావళులను పరులుదోఁచుకొనకుండఁ గాచుటయందును, రాజభవనసేవకసమూహమును సంస్కరించి ఉచితభంగిని దీర్చుటయందును, శ్యామరాజేంద్రుని దత్తత నెదుర్కొని రాజ్యమపహరింప నేతెంచిన దురాత్ములను విఫల మనోరథులుగఁ జేయుటయందును, సంపూర్ణహృదయముతోఁ గార్యములు నెరవేర్చిన ఈరంగాచార్యులు అతనికిఁ దోడునీడయయి నేఁటి మైసూరు సంస్థానమందలి ఉత్తమస్థాపన లన్నిటికిని విత్తునాటిన వాఁడని చెప్పవచ్చును. శ్యామరాజేంద్రుఁడు సింహాసనము నెక్కుటతోడనే దివాను అధ్యక్షుఁడుగ మఱి ఇరువురు సభ్యులంజేర్చి యొక ఆలోచన సభ నేర్పఱచెను. వీరికే చట్టముల నిర్మించు నధికారముగూడ నియ్యఁబడెను. రంగాచార్యులవారి కృషిచే కొలఁదికాలములోనే మైసూరు ప్రతినిధి సభయేర్పడెను. దీనికిని దివానే అధ్యక్షుఁడయ్యెను. ఇందలి సభ్యులు మొదటమొదట మహారాజు



గారివలననే నిర్వాచింపఁ బడుచుండిరిగాని ఇప్పుడు ప్రజలకు నిర్వాచనశక్తు లియ్యఁబడినవి. ఇంతియగాక శ్యామరాజేంద్రుని కాలమున బంగారు గనులఁ బనిచేయుట ప్రారంభింపఁ బడెను. దానివలన మైసూరున కిప్పటి యాదాయము వరుంబడి పద్దులలో ముఖ్యమగు పద్దుగ నెన్నఁ బడుచున్నది. మైసూరునందు స్త్రీ విద్యకుఁగూడ ప్రారంభము 1881వ సంవత్సరముననె. సంపాదన విషయమునసేమి, విద్యావిషయమునసేమి పరిపాలనా సంవిధానముల విషయములనేమి ఇట్లన్ని విధముల శ్యామరాజేంద్రుఁడును రంగాచార్యులును మైసూరు రాజ్యమును దినదిన ప్రవర్ధమానముగఁ జేయగలుగు మార్గముల వెదకి అవలంబించిరి. 1883వ సంవత్సరమున రంగాచార్యులు మద్రాసునందు పరలోకప్రాప్తిఁ జెందెను.

అతని స్థానమునకు సర్. కె. శేషాద్రి అయ్యరుగారు నియమింపఁబడిరి. ఇతఁడును రంగాచార్యుల పథముననే రాజ్యపరిపాలన మొనర్చెను. ఈతనికాలమున ప్రతినిధి సభకును దానికధ్యక్షుఁడుగ నుండుచువచ్చిన ఈతనికిని ఈవిధమగు ప్రతిష్ఠాపనయొక్క ప్రథమావస్థ యందును స్వాభావికమైన కొద్దిపాటి సంఘర్షణ దప్పినదికాదు. కాని ఇతఁడధికారము వహించిన పదునెనిమిది సంవత్సరములలో (1883-1901) నీప్రతినిధి సభ అనుభవ జ్ఞానముల సంపాదించె ననుటకుసందియము లేదు.

## కృష్ణరాజ ఒడయరు.

శేషాద్రి అయ్యర్ దివానుగ నుండఁగనె 1894వ సంవత్సరాంతమున శ్యామరాజేంద్రుఁడు వైకుంఠవాసి యయ్యెను. అప్పటికి ఆతని కుమారుఁడగు ప్రస్తుతపు మహారాజు కృష్ణరాజ ఒడయరు పదిసంవత్సరముల బాలుఁడుగ నున్నందున వీరితల్లి పరిపాలకురాలుగ నేమింపఁ బడెను. ఆమెకు ఎప్పటియట్ల ఆలోచనసభవారు, అనఁగా దివాను శేషాద్రి అయ్యరును మఱియిద్దఱు సభ్యులును, సహాయులుగ నుండిరి. 1901 వ సంవత్సరమున సర్. పి ఎన్. కృష్ణమూర్తి దివానయ్యెను. అతనికాలమునరాజకీయోద్యోగస్థులకును మైసూరు ప్రతినిధిసభలోని సభ్యులకును పరస్పర విశ్వాసానురాగములు వృద్ధిపొందెను. 1902వ సంవత్సరమున విద్యావంతుఁడును యుక్తవయస్కుఁడును నయియుండిన కృష్ణరాజ ఒడయరు లార్డుకర్జనుచే సింహాసనమునకుఁ బ్రకటింపఁ బడెను.

నాఁటినుండి యీమహారాజు రాజ్యాంగవిషయములఁ జేసిన పరిశ్రమ మిక్కిలి యద్భుతము. ఈతనికి మొదట సర్ పి. ఎన్. కృష్ణమూర్తియుఁ దరువాత.వి.పి. మాధవరావును దివానులుగ నుండిరి. ఇప్పటి దివాను టి. ఆనందరావు. వి. పి. మాధవరావు కాలమున శాసననిర్మాణసభ ప్రారంభమయ్యెను. అందు రాజుగారి ఆలోచన సభలోని మువ్వురు సభ్యులును జనులచే నిర్వచింపఁబడు నితరసభ్యులును గలరు. వీరు వివాహ



విషయములను బాలుర విషయములను ఇంకను ఇతర సాంఘిక విషయములను గూర్చిమిక్కిలి యుపయోగకరమగు కొన్ని శాసనముల నిర్మించియున్నారు. 1906-1907లో ఇదేమాధవరావుగారి కాలమున గ్రామిక విద్యాలయములలో బాలురకు బడిజీతములు పుచ్చుకొనక చదువు నేర్చుకొను నట్లు త్తరువయ్యెను. కావున నేడు మైసూరులో బాలురకు స్వదేశభాషయందు ఉచితముగ విద్యాదానము చేయఁబడుచున్నది. ఇటీవల మహారాజుగారు తమదేశమందలి చేతిపనులు మున్నగువానిని వృద్ధిపఱచు నుద్దేశముతోఁ బ్రజలసాయము లేక ఆపని సాగదనుటను జక్కఁగగుర్తెఱింగినవారుగాన ప్రజలసంఘము నొకదానిని ఆర్థికసభ యనుపేర దమయాజమాన్యముక్రింద నెలకొల్పియున్నారు. దాని పరిశ్రమవలన మైసూరు భరతవర్షమున నున్నత స్థానము నందగలదని కొందఱకైనను దోఁచకతప్పదు. ఇట్టియూహ కెడమిచ్చు చిహ్నములనేకములు ఇప్పుడే గానవచ్చుచున్నవి. స్త్రీవిద్యకై మైసూరు మహారాణిగారి కలాభవనము గాంచిన ప్రఖ్యాతి హిందూస్థానమునందలి మఱియే స్త్రీవిద్యాలయమును గాంచియుండలేదు. కొంతకాలముక్రిందట బెంగుళూరునందు జె. ఎన్. తాతాగారి యౌదార్యమువలన ప్రారంభింపఁబడిన అన్వేషణ విద్యాగారము (Research Institute) అసీమకంతటికిని వన్నెఁ బెట్టవేచియున్నది. దినదినమునకు సంఖ్యయందుఁ బెంపొందుచుండు యంత్రశాలలు అసీమవెలుపటి ప్రాంతమునగల

ఆంగ్లేయసీముల ప్రజలకాశ్చర్యము గలిగించుచున్నవి. ఆర్థికసభ
వారు జాగరూకులయి పట్టుదలతోఁ గార్యమునకు గడంగ
నచో కృష్ణరాజఒడయరు బహదూరుగారి మనోరథము
సిద్ధించగలదు. దైవము సహాయుండగుగాక!





ఢిల్లీ దర్బారు.

# ౬. దర్బారుల చరిత్రము.

ఏడవప్రకరణము.

# పూర్వపుదర్బారులు.

---

రాజులేలు దేశములం దంతటను నొక్క ఏలికగతించి తరువాతి ప్రభువు రాజ్యమునకు వచ్చినమీఁదట నాతని రాజ్యభార నిర్వహణారంభమును సూచించుటకయి యొకవిశేషోత్సవము తప్పక జరుగుచు వచ్చుచున్నది. మానవునకు సంబంధించిన యుత్కృష్టవిషయములన్నిటికినివలె దీనికిని మతవిషయికభక్తియే సర్వసాధారణముగ మూలాధారమయి కన్పట్టుచున్నది. ఆంగ్లేయభాషయందు నీయుత్సవమునకు 'కారొనేషన్' అనఁగా 'కిరీటధారణము' అను నామము ప్రవర్తించుచున్నది. పేరుం బట్టిచూడ నిద్దానికి మతవిషయికార్థమేమియు నుండునట్లు తోఁచదు. కాని యచ్చటి ఆచారములను బరిశీలించినచో నచ్చటను నీయుత్సవమునకు విశేషార్థముగలదని తోఁచకమానదు. అటకిరీటమును రాజునొదల నిడుటకేర్పడినవాఁడు మహామతాచార్యుఁడు. ఇతఁడు రాజునురాజిని ప్రజలకుఁ బ్రదర్శించి 'కిరీటధారణోత్సవము' ను బ్రారంభించును. తరువాత రాజుపైఁ బరమాత్ముని కృపనిలుచుగాతమని ప్రార్థన లొసంగఁ బడును. ఉత్తమమతాచార్యుఁడు రాజునకొక కొంతహితబోధ నొనర్చును.

రాజు దేశమును చట్టములననుసరించియు న్యాయము ననుసరించియు పరిపాలింపఁ బ్రతిన నంగీకరించును. తదనంతర మమూల్య సుగంధద్రవ్యములోఁ గాచిననూనియచే మహామతాచార్యుఁడు రాజునడినెత్తిమీఁదను, హృదయము మీఁదను అఱచేతుల మీఁదను సిలువ ఆకారములను నిర్మించును. దీనివలన రాజుదన తలంపులను, హృదయమును, కార్యములను పరమాత్మునిపని యందే వినియోగింపుటకు సంస్కారమందెనని యర్థము. ఇది ముగిసినవెనుక మహామతాచార్యుఁడు రాజునకు ననేకవిషయముల సంకేతించు నుపకరణములనొసంగి కిరీటము నాతని శిరమునవిడును. ఇదియె 'కిరీటధారణోత్సవము'న ముఖ్యభాగము. దీనికిఁబిదప నెల్లరును రాజునకు వినమితులయి తమవిధేయతం దెలుపుదురు. రాజుతనకిరీటమును దీసియుంచి మోకాళించికూర్చుండి ఈశ్వరునిఁ బ్రార్థించి రాజ్యమాతనివశముఁ జేసి లేచి మఱల కిరీటముం ధరించును.

ఈ పైవర్ణనవలన ఆంగ్లేయ 'కిరీటధారణోత్సవము' నకుంగూడ మతవిషయిక సంబంధముగలదని విశదమగుచున్నది.

ఆవిషయమున మనదేశమునందలి పూర్వకాలపుఁ బట్టాభిషేకమహోత్సవము' లో నయ్యది తులఁదూఁగఁ జాలదు. పూర్వకాలమున నిచ్చటి పట్టాభిషేకములలో నుత్తమములు రాజసూయాశ్వమేధయాగములు. అట్టి యాగములలో ధర్మ



రాజుచే నింద్రప్రస్థపురమునజరుపఁబడినది మనమెఱింగినవానిలో ముఖ్యముగ నెన్నఁబడవలసియున్నది.[1] దానితోఁదులఁదూఁగు నది మరల నాతఁడే హస్తినాపురమున నొనర్చిన అశ్వమేధ యాగము.

ధృతరాష్ట్రుఁ డనుమతింప ధర్మరాజు ఇంద్రప్రస్థపురము రాజధానిగ రాజ్యమేల మొదలిడి మయునిచే సభాభవనమును గట్టించెను. అచ్చట ధర్మరాజు మొదటిదర్బారును రాజసూయ యాగమును జరిపెను.

దర్బారుజరిగినది సభాభవనప్రవేశదివసముననని తెలియ వచ్చుచున్నది. నాఁడు భూరిభూసురసమాజమును ధర్మసుతుఁడు భక్తితోడఁ బూజించి ధనార్థులఁదన్పి యశంబుగాంచిన వెనుక

మ. మదమాతంగతురంగకాంచన లసన్మాణిక్యగాణిక్యసం
పదలోలింగొనివచ్చి యిచ్చి ముదమొప్పంగాంచి సేవించిర
య్యుదయాస్తాచలసేతు శీతనగమధ్యోర్వీపతుల్ సంతతా,
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితుజగత్పూర్ణప్రతాపోదయున్."

ఆత[illegible]ణమున మహామునులనేకులు సభారంగము నలంకరించియుండిరి. అందు నారదుండును నుండెను. అతఁడు ప్రోత్సాహింప "నారాయణదేవుచేత ననుజ్ఞాతుండయి తమ్ములయు ధౌమ్యద్వైపాయనాదులయు ననుమతంబున ధర్మరాజు

1. ఈయాగముల వర్ణన మహాభారతమున సభాపర్వమునందును శాంతిపర్వమునందును గననగును.

రాజసూయంబుసేయ" నుపక్రమించెను. సహదేవుఁడు సర్వసన్నాహములును జేయ నియోగింపఁబడెను. యజ్ఞోపకరణ తతులు సిద్ధమాయెను. సర్వసంభారములు నిండిపోయెను. ఇంద్రప్రస్థంబు చుట్టును సకలదిక్కులను అపారభూరిబహువిధాగారములును ప్రమదవనములును వెలయ నాపురమపరభూతలమయియొప్పెను. ధర్మతనయుఁడు క్రతుదీక్షవహించెను. భూపాలకులందఱును వివిధోపాయనములు దెచ్చి యతని శ్రీపాదముల కెఱఁగిరి.

ఇదేవిధమున నశ్వమేధయాగ సమయమున

"విద్వత్సమూహంబు వివిధదేశాధీశ, సంఘంబుఁ గార్యవిచారపరులు
నర్థార్జనాదికృత్యంబులవారలు, బహుపరిచర్యలఁ బరఁగుజనులు
వైశ్యప్రముఖపౌరవర్గంబులును ముఖ్య, హాలికాదిజానపదావలులును
వైణికగాయకవాంశికాద్వివినోద, కవులును వారసుందరులులోను
గాఁగ నేగుదెంచి కాంచియవ్విభునిస
త్కారములఁ బ్రమోదితంబులగుచు
భావములుదలిర్ప సేవించియుండన
క్కొలువుసాలనొప్పె" చెలువుమెఱసె.

తదనంతరము యమనందనుఁడు మురారియు నానాపృథివీశ్వరులును వెంటరాఁగ, ద్రౌపది ఓషధులుగొనినడువఁ దాపసకోటి మంత్రములు పఠింపుచుండ, నాలు వృషభములను బూన్చినమేటి నాగటితోఁ నధ్వరభూమిని దున్ని సిద్ధముచేసెను.



స్వకాయకష్టము త్తమమనిచూపుటకును రాజును హాలికునితో సమానుఁజేయని చాటుటకును నింతకంటె బలమగు నుదాహరణము కావలెనా?

ఇట్లు యజ్ఞభూమి సంస్కరింపఁబడిన తరువాత నట చేరినరాజులును వారి కళత్రములును ప్రసవగంధపూజితములయిన స్వర్ణకుంభములను మోసికొనిపోయి జాహ్నవీతోయములనుగొనివచ్చిరి. అంతకుమున్నె ధౌమ్యుఁడు అలంకృతమగు వేదికాతలంబున నుత్కృష్ట సన్నాహములతో భద్రపీఠంబు నొకదానిఁ బ్రతిష్ఠించియుండెను. యమునాజలములు సంసిద్ధమైనంతోడనె యుధిష్ఠురుఁడు మంగళారావములతో గొనితేఁబడి ఆపీఠంబున నుండనియోగింపఁబడియెను. శోభనాలంకరణము వలన నభిరామయయియుండిన పాంచాలిని అతని వామపార్శ్వమున నాసీనఁజేసిరి. అంత శుభముహూర్తంబగుడు మహానుభావుఁడు కృష్ణుడు అదివఱకు సంస్కారమొందియుండిన శంఖమునం దుదకములనించి "పృథివికధిపతివిగన్ము"ని జాయా సహితుఁడగు ధర్మజునకు అభిషేక మొనర్చెను. శంఖానక దుంధుభి ప్రభృతి మంగళ తూర్యారావంబులును వీరనాదంబులును చెలంగెను. అచ్చటఁ జేరిన రాజలోకంబును బెద్దలును కలశములలోని పవిత్రాంబువులతో ధర్మరాజు నభిషేకించిరి. ఇదియే ఆయాగమున మనకు ముఖ్యభాగము. ఈయభిషేకమువలననె సర్వసామంతులును ధర్మరాజు సార్వభౌమత్వమును సంపూర్ణముగ

నొప్పుకొనిరి. దీని కనంతరము దిగ్విజయ పరిపూర్తిని సంకేతించు యజ్ఞము నడచెను. దాని నిటవర్ణించు టనవసరము. అదినడచినంత కాలమును నటచేరిన సర్వజనులును సార్వభౌముని యతిథులయి సన్మానంబందిరి. దాని ముగింపుసమయమున "సామ్రాజ్య పదస్థుండైన యుధిష్ఠిరుండు భూసురదీనానాథ ప్రముఖపాత్రంబులకు వివిధధనంబులొసంగెను." ఈపదముల ప్రయోగముంబట్టి ధర్మరాజ చక్రవర్తియును దనప్రజకు నుత్తమవరము లొసంగెనని యూహింపవచ్చును.

## ఔరంగజేబుపట్టాభిషేకము.

యుధిష్ఠిరునకుఁ దరువాత ఢిల్లీనగరమున పట్టభద్రులయిన సార్వభౌములలో మొగలాయీలు ముఖ్యులు. అందును ఔరంగజేబు 'సింహాసనారోహణోత్సవము' వర్ణనీయము. 'సింహాసనారోహణోత్సవము' అను పదముపయోగించుట మహమ్మదీయచక్రవర్తులకాలమునందలి పట్టాభిషేకోత్సవమునకును ఇతరకాలములందలి పట్టాభిషేకోత్సవములకును గల తారతమ్యమును సూచించు నుద్దేశముతోడ నని గ్రహించునది. మహమ్మదీయులయుత్సవమున ముఖ్యతమభాగము చక్రవర్తిసింహాసనముపయిఁ గూర్చుండుటయె. అభిషేకముగాని కిరీటమును ధరించుటగాని వారికాచారముగాదు. ఔరంగజేబు 1658 వ సంవత్సరమున రాజ్యమునకువచ్చెను. కానియతఁడు సర్వశత్రువులనడంచి 1659వ సంవత్సరమున సింహాసనారోహణోత్సవము జరిపెను.

ఆసంవత్సరము మేనెల 12 వ తేది సార్వభౌముఁడైన యౌరంగజేబు గొప్పయూరేగింపుతో ఢిల్లీనగరమునుజొచ్చెను. భేరీమృదంగకాహళముల శబ్దములతో భూనభోంతరాళముల నించుచు సేవకాబృందంబులు ముందునడచె. వాని వెనుక మఖమలుతోడను వెండిబంగారు జరీలతోడను చకచకలీను మణులతోడను నలంకరింపఁబడిన ఝూలులతో గప్పఁబడిన మదగజంబులు రజతశృంఖలములకు వ్రేలు సువర్ణకింకిణులు మొరయ మందగమనంబున బారులుదీరి ఏగుదెంచుచుండెను. అవ్వానిమీఁద సార్వభౌమచిహ్నంబులయిన గోళములతోఁ గూడిన టెక్కెములు మోసికొని భటులుగూర్చుండియుండిరి. ఈపేనుంగులకు వెనుక బంగరుజీనులతోడను అలంకరింపఁబడిన కల్లెపువారులతోడను నొప్పు పారశీకాశ్వములును అరబ్బీహయములును వరుసదీరియుండెను. వాని వెంబడి కరుణులమొత్తంబులును లొట్టిపిట్టతండంబులునునుండె. వీనిపిరుంద ధగధగలీను ఉత్తమాయుధముల ధరించిన కాల్బలములు పటాలములు పటాలములుగనే నడచుచుండెను. వీనివెన్క ప్రభువులును మంత్రులును గుంపులుగూడి చుట్టుఁగొలువ నెల్లర దృష్టులనాకర్షించుచు నచ్చటిజనంబులందఱకును విభుండయిన యౌరంగజేబు తనగజశాలయందలి యుత్తమ భద్రేభంబుపైనునిచిన బసిఁడి యంబారియందాసీనుఁడయి యేతెరుచుండె.

ఇట్లూరేగింపుతో దరలి యౌరంగజేబు ఢిల్లీకోటయందు

నాఁటి యుత్సవమున కేర్పడిన పట్టాభిషేక భవనముం జొచ్చెను. దాని పేరు 'దివాని ఆమ్.' అద్దాని లోకప్పును నలువది స్తంభములును వెండిబంగారు జరీపనిచేనొప్పు పారశీకదేశపు ముఖ్మలు గుడ్డచేతను పేరుగాంచిన గుజరాతుదేశపు సరిగెబుటా వేసిన పట్టుచేతను, గప్పఁబడియుండెను. ప్రతి కమానునుండియు క్రిందికి దిగజారు బంగారు గొలుసులకు రత్నఖచిత సువర్ణగోళములు వ్రేలుచుండెను. భవనమధ్యమునఁ గొంతభాగము చదరముగ పైడికమ్ముల కటాంజనముచే వేరుచేయఁ బడియుండెను. దాని నడుమ తన్నలంకరించు వజ్రములును కెంపులును పద్మరాగములును మహాప్రకాశ పరంపరలనీనలోకమునందలి విచిత్రములలో నొక్కటని ప్రసిద్ధిగాంచిన మయూరాసనము సంస్థితమై యుండె. అద్దాని పురోభాగంబున సుందరతమమగు వితానంబొండు నాల్గు రత్నమయ దండముల ప్రాపున నెలకొల్పఁ బడియుండె. అందు ముక్తాహారములె పగ్గములయి యుపకరించుచుండె. మయూరాసనమును జుట్టివచ్చు కటాంజనమునకు ముందటి రెండువైపులను వ్రేలు ముత్యపుగుచ్ఛములతో నలంకరింపఁబడిన భూరిచ్ఛత్రముల జతయుండెను. సార్వభౌముని సింహాసనమున కిరుప్రక్కలను శృంగారమైన భర్మ్యనుంచకము లిడఁబడియుండెను. వీని యన్నిటికిని వెనుక స్వర్ణమయ పీఠములపయి నవరత్నఖచిత ఖడ్గములును, శుద్ధకాంతుల ప్రసరింపఁజేయు డాలులును, ఈటెలును, మున్నగు చక్రవర్తిగారి యాయుధములు ప్రదర్శింపఁబడి



యుండెను. పట్టాభిషేకభవనమునందలి బయలు ప్రదేశ మంతయును ముఖుములు గుడారములచే నావరింపఁబడి యుండెనని చెప్పవచ్చును. ఆగుడారములలో చిత్రమగు రత్నకంబళములు పరువఁ బడియుండెను. ఇప్పగిది ఎబ్భాగమునకుఁ దిరిగినను నవరత్నముల ప్రభలును వెండిబంగారముల కాంతులును ముఖుమలు పట్టుల శోభలును చూపరుల కానందము గొలుపుచుండెను.

శుభముహూర్త మాగతమైనదని జ్యోతిష్కులు తెలుపుటతోడనే తెరమరుగున సంపూర్ణ సన్నాహములతోఁ గూర్చొనియుండిన ఔరంగజేబుచక్రవర్తి లేచివచ్చి సింహాసనము నధిష్ఠించెను. మంగళ శబ్దములును ఘనతూర్యారావములును చెలంగె. అంతట నొకగాయకుఁడు ముందుకువచ్చి యున్నత పీఠంబుపై నిలుచుండి చక్రవర్తిగారి నామధేయమును బిరుదులును మున్నగువానితోఁ జేరిన 'ఖుత్బా' యను ప్రకటనను గంభీరస్వరమునఁ జదివెను. సామంతులెల్లరును చక్రవర్తికి నతులొనర్చిరి. రాజసేవకులు పన్నీరును బుడ్లుబుడ్లుగ సభాసదులెల్లర మీఁదను కురిపించిరి. తాంబూలము తట్టలతోఁ బంచిపెట్టఁబడియె. అత్తరు, పునుఁగు, జవ్వాది, అగరు, కస్తూరి, మొదలగు సుగంధద్రవ్యముల పరిమళము సభాభవనమున గుప్పుగుప్పుమని ప్రసరింపుచుండెను.

ఆనాఁడే ఔరంగజేబుపేరునఁ గ్రొత్త నాణ్యములు ముద్రింపఁబడెను. సామ్రాజ్యము నందలి వివిధ రాష్ట్రములకును ఈసింహాసనారోహణ వార్తం దెలుపుచు నుత్తరములు పంపఁబడెను.

ఇట్లు ముఖ్యసభాభవనమున నుత్సవము ముగిసిన పిదప నౌరంగజేబు అంతఃపురమున నొకదర్బారును మఱియొక ఆంతరంగిక దర్బారును నడిపెను. మొదటిదానికి స్త్రీలును, రెండవదానికి నాహూయమానులయి యుండిన యొకకొందఱును, మాత్రమే రానియ్యఁబడిరి. అవ్వానియందు చక్రవర్తి తన కుచితమని తోఁచిన విధమునఁ దనవారలకు బహుమానము లిచ్చెను.

ఔరంగజేబు సింహాసనారోహణ సమయమున అక్బరుచే నుపక్రమింపఁ బడియుండిన నౌరోజుశకమును[1] రద్దుపఱచి మరల హిజిరాశకమును బ్రారంభింప నియమించెను. త్రాగుబోతుతనము మున్నగు దురాచారములను మాన్పుటకు నధికారుల నేర్పఱచెను. చిల్లరపన్నుల నేకములను దుడిచివైచెను. ధాన్యముపై బాటలలో వేయఁబడుచుండిన సుంకములను పోలీసునకని వసూలుచేయఁ బడుచుండిన పన్నులను తొలఁగించెను. ఇవియే ఆతఁడిచ్చిన వరములు.

1. ఇది పారశీకుల సంవత్సరాది. వారికిని ఈదేశపు మహమ్మదీయులకును భేదములుగలవు. కావున మార్పు.



ఒకవారము దినములు పండుగలు నడచెను. సామంతరాజులును ప్రభువులును సార్వభౌమునకుఁ గానుకలఁ దెచ్చియిచ్చిరి. అతఁడును వారికి నాతిథ్యమొసఁగి వారిని బిరుదులచేతను, గౌరవసూచక వస్త్రసమితిచేతను, దర్జాలను హెచ్చించుటచేతను, ఏనుఁగులు గుఱ్ఱములు రత్నఖచితాయుధములు మొదలుగాఁ గల బహుమాన వస్తువులచేతను, దనియించెను.



## ఎనిమిదవ ప్రకరణము.

# బ్రిటిషు దర్బారులు.

ఔరంగజేబునకుఁ దరువాత మనయైదవ జార్జిచక్రవర్తికాలము వఱకును ఢిల్లీనగరమునఁ బ్రసిద్ధ సార్వభౌము లెవ్వరును బట్టాభిషేక మహోత్సవము నందలేదు. కాని విక్టోరియా మహారాజీగారి ప్రతినిధిగ లిట్టను ప్రభువును, సప్తమయెడ్వర్డు చక్రవర్తి ప్రతినిధిగ లార్డుకర్జనును, నచ్చట దర్బారుల నడపియున్నారు. వారివలననే ఈ 'దర్బారు' పదమున కింత ప్రాముఖ్యత కలిగినది.

## 1877వ సంవత్సరపు దర్బారు.

1858 వ సంవత్సరమున భరతవర్షపుఁ బ్రభుత్వము ఆంగ్లేయవర్తక సంఘమువారినుండి విక్టోరియా మహారాజీగారికి మారునఁ బడియెను. అట్టిమార్పువలన మనదేశమునకు నొక్క విశేషగౌరవము గలిగెను. ఏదోయొక వర్తక సంఘమువారి పరిపాలనకును నుత్తమ జన్మమంది యలరారు మహారాజీ పరిపాలనకును నెంత తారతమ్యము గలదియు వర్ణించుటయే యనవసరము. ఆసమయమున విక్టోరియా మహారాజీ రాజ్యమునకు వచ్చినప్పోడనె మనకీక్రింది వాక్యములుగల స్వాతంత్ర్య పత్రమును బ్రకటించి యెల్లరయుల్లముల నాచంద్ర తారార్కముగ నాకర్షించి వైచెను.

“క్రైస్తవ మతముయొక్క సత్యమును మేముదృఢముగా నమ్మినవారమయ్యు మతమువలనఁ గలిగెడు చిత్తశాంతిని మేము కృతజ్ఞతతో నొప్పుకొనుచున్న వారమయ్యును, మావిశ్వాసములను మాప్రజలలో నెవరిమీఁదను నిర్బంధించు కోరికగాని స్వాతంత్ర్యముగాని మాకు లేదని చెప్పుచున్నాము. తమమతను మతవిశ్వాసములనుబట్టిగాని యాచారములనుబట్టిగాని యెవ్వరునే విధముగాను మావలన నిగ్రహమునుగాని యనుగ్రహమునుగాని పొందక యందఱును సమానముగా ధర్మశాసనములవలని సంరక్షణమును నిష్పక్షపాతముగాఁ బొందవలయునని మాయభిమతమును మాకు సంతోషకరమునని మేము ఘోషించుచున్నాము. మాప్రజలలో నెవ్వరియొక్క మతవిశ్వాసములలోను పూజావిధానములలోను తామేవిధమయిన సంబంధమును మాక్రింది యధికారు లెవ్వరును కలుగఁజేసికొనఁగూడదనియుఁ గలుగఁజేసికొన్న యెడల మాయాగ్రహమునకు పాత్రులగుదురనియు మేముదృఢముగా విధించుచున్నాము.

మా ప్రజలయినంతవఱకు వారేజాతివారైనను వారే తెగ వారైనను సామర్థ్యము వలనను సద్వర్తనము వలనను మాము చక్కఁగా నిర్వహించుట కర్హులయినవారు మా ప్రభుత్వములోని పనులకు యథేచ్ఛముగాను నిష్పాక్షికముగాను చేర్చుకొనఁబడవలయుట మాచిత్తమయియున్నది. * * * *

ఈశ్వరానుగ్రహామువలన దేశములో స్వస్థత మరల కలిగింపఁబడినప్పుడు హిందూదేశము యొక్క నెమ్మదియైన కర్మలను ప్రోత్సాహపఱచుటయు జనోపయుక్తములును వృద్ధికరములునునైన పనులను పెంపుచెందించుటయు దేశములో నున్న సర్వప్రజలయొక్క లాభముకొఱకు పరిపాలనము జరపుటయు మాయత్యంతాభిలాషయయి యున్నది. మాబలము వారి సంపదలోను మా క్షేమము వారితృప్తిలోను మాయుత్తమ ప్రతిఫలము వారికృతజ్ఞతలోను, ఉండును. సర్వశక్తుఁడయిన ఈశ్వరుఁడు మాకును మాక్రింద నధికారములో నుండువారికిని మాయీ యభీష్టములను ప్రజలమేలు కొఱకు కొనసాగించుటకు శక్తిని బ్రసాదించునుగాక!"[1]

ఇట్టి యుత్కృష్టభావములతో భరతవర్షమును బరిపాలింప మొదలిడిన శ్రీవిక్టోరియా మహారాజిగారు మనదేశముతోడి సంబంధమును దెలుపు బిరుదునెద్దానినిం గూడ నీ 1877 వ

1. రావుబహదూరు క. వీరేశలింగము పంతులుగారి విక్టోరియా రాజ్ఞీ చరిత్రము, (84-85 పుటలు).



సంవత్సరపు దర్బారువఱకును వహించినదిగాదు. అట్టిబిరుదు లేనందున నామె సార్వభౌమత్వమును సంకేతించు సాధనము లేక పోవుచుండుటను గమనించి 'భరతవర్ష చక్రవర్తిని' యను పట్టము నామె ధరించినదని ప్రకటించుటకే దర్బారు ఢిల్లీయందు జరిగెను. అప్పుడు సర్వసామంతులును ప్రజలును గొందఱు పరదేశ రాజులును సభామంటపము నలంకరించిరి. లార్డ్ లిట్టను ఆమహోత్సవమున విక్టోరియా మహారాజిగారు 'భరతవర్ష చక్రవర్తిని' బిరుదమును వహించిరని ప్రకటించి ఆమె భరతవర్షపు ప్రభువులకును బ్రజలకును నంపిన యనురాగపూరిత మయిన యుత్తరమును జదివెను. జయజయారావములతో దర్బారు ముగింపునందెను. నాఁటినుండి చక్రవర్తిని గారి ప్రతినిధి స్వదేశసంస్థానాధీశ్వరులకంటె నున్నతమగు దర్జా నందెను.

## 1903 వ సంవత్సరపు దర్బారు.

1903 వ సంవత్సరమున ఢిల్లీయందు సప్తమైడ్వర్డు చక్రవర్తిగారి యనుమతి ననుసరించి లార్డుకర్జను దర్బారు నడపెను. అతఁడు దానికయి చేసిన వ్యయమును గుఱించి యనేకులు ఖండించుచు వ్రాసియున్నారు. కాని దర్బారుమాత్రము చూపరులకు మిక్కిలి యద్భుతముగఁ గన్పించెననుటకు సందియము లేదు. లార్డుకర్జను గారు ఢిల్లీని జొచ్చినప్పటి ఏనుంగుల

తోడి యూరేగింపు పౌరవాత్య సంపదయిట్టిదని బాహాటముగఁ జాటుచుండెనఁట.

ఈదర్బారు సమయమున సప్తమైడ్వర్డు చక్రవర్తి ప్రజలకనురాగవాక్యములం డనప్రతినిధి ముఖమున నంపెను. ఈ దర్బారునకంటెను సప్తమైడ్వర్డు చక్రవర్తిగారు 1908 వ సంవత్సరము నవంబరు నెల 4వ తేది సామ్రాజ్యసంచాశద్వార్షికోత్సవ సమయమున మనకనిపిన ఈ క్రిందివాక్యములుగల సందేశము వలన నెక్కుడు మనకు స్మరణీయులయి యున్నారు.

"మొదటినుండియు ప్రతినిధిస్థాపనా పద్ధతి క్రమక్రమముగ ప్రచారమునకు తేఁబడెను. ఆపద్ధతిని వివేకముతో పెంపొందింప సమయము వచ్చినదని నాప్రతినిధియగు గవర్నరు జెనరలు గారికిని తక్కిన నామంత్రులకును తోఁచియున్నది. బ్రిటిష్ పరిపాలనచే వర్ధిల్లి ప్రోత్సాహపఱుపఁబడిన యభిప్రాయములు గలవారగు మీలో ముఖ్యతరగతులవారు పౌరత్వ సమానత్వమును శాసననిర్మాణ రాజ్య పరిపాలనములందు మఱికొంత యెక్కువ స్వాతంత్ర్యమును కోరెదరు. అట్టి కోరికను వివేకముతో నెరవేర్చుటచే ప్రకృతాధికారబలములు దృఢములగునుగాని క్షీణింపవు. పరిపాలనము జరపు నుద్యోగస్థులు, అట్టి పరిపాలనమునకు లోఁబడినవారితోడను, దానివిషయమై జనసామాన్యాభిప్రాయమునకు ప్రేరకులై దాని ప్రతిఫలింపఁజేయు వారితోడను, ఎడతెగని సాంగత్యము కలిగియుండు



టకు నిప్పటికంటెను నెక్కువగ సందర్భములున్నచోఁ బరిపాలన మింకను కార్యకారియై యుండును. ఈయుద్దేశములకై యిప్పుడు జాగరూకతతో చేయఁబడుచున్న నేర్పాటులను గుఱించి నేను ప్రస్తావింపను. అవి మీకు త్వరలో తెలుపఁబడి హితకారియయిన మీవ్యవహారాభివృద్ధికి ప్రధాన లక్షణముగా నుండునని నాకుమిక్కిలి నమ్మకము. * * * *

హిందూదేశక్షేమము విక్టోరియామహారాజ్ఞిగారి హృదయమునందలి యత్యంతప్రియవిషయములలో నొకటి. 1875 వ సంవత్సరమునందు నేను హిందూదేశమును సందర్శించిన నాఁటనుండి ఆదేశముయొక్కయు, అందలి ప్రభువులయొక్కయు, ప్రజలయొక్కయు యోగక్షేమములను చిరకాలత్వ కారణముచే క్షీణింపని యనురాగముతో కూడిన యుత్సాహముతోడ కనిపెట్టి యున్నవాఁడను. నాయనుంగుఁ గొడుకగు వేల్సు ప్రభువుగారును, వేల్సుప్రభ్విగారును మీతో కొన్ని దినములు నివసించి మీదేశమునందు అమితానురాగమును, తదీయ సౌఖ్యసంతోషములయందు నిజమయిన ఆసక్తిగల శ్రద్ధయును, గలవారయి మరలివచ్చిరి. నా రాజకుటుంబమునకును నావంశపరంపరకును హిందూదేశవిషయమునకున్న అత్యంతానుభావాపేక్షలుగల యీమనోభావములు ఈరాజ్యమునందలి ప్రజలయొక్క గంభీరమయిన యేకాభిప్రాయమును ఉద్దేశమును వాస్తవముగా తెలుపనే తెలుపుచున్నవి.

అతిదీర్ఘకాలము పాలించిన యేరాజ్యము నందుఁగాని సామ్రాజ్యము నందుఁగాని ప్రభువులకును ప్రజలకును విధింపఁబడినట్టి మహనీయ కార్యమును నెరవేర్ప నావశ్యకములయిన వివేకమును పరస్పర సద్భావమును దైవరక్షణానుగ్రహములచే వర్ధిల్లుగావుత."[1]

## శ్రీ జార్జిపట్టాభిషేకము.

గత సంవత్సరము డిసెంబరు మాసము 12 వ తేది ఢిల్లీ నగరమున నడచిన మనజార్జిసార్వభౌముని పట్టాభిషేకదర్బారు మహోత్సవము భరతవర్షమున జరిగిన ఇట్టి మహోత్సవము లన్నింటిలో నగ్రస్థానము నందఁదగియున్నది. నాఁటి దినము మనచరిత్రమున సుదినము. కొంతకాలము పాశ్చాత్య పౌరవాత్య సభ్యత్వములు రెండును మన యీభరత వర్షమున ముఖాముఖియయి చెలంగి భారతేయులగు మనకు నూతనోజ్జీవము నొసంగెను. ఆయుజ్జీవమును బోషించుట మనప్రభువులకు ధర్మమేయయి యుండెను. అయిన వారలలో నుత్తముఁడగు దాను దన యుదారహృదయమును విప్పి గనుపఱచినఁగాని వారి కవసరమగు బలంబు చేకూరదని తలంచి మనజార్జి సార్వభౌముఁడు నూతనపథంబున జాయాసమేతుండయి తన సామ్రాజ్యమకుటంబున శిరోరత్నంబగు నీభరతఖండంబునకు

1. Quotation fom Fort St. George Gazette.



విచ్చేసి ప్రాచీనవైభవోపేతయగు నీదేశమును గౌరవించి చారిత్రిక ప్రసిద్ధిగాంచిన ఢిల్లీపురంబున సింహాసనంబు నధిష్ఠించి ప్రజలకు సంతసంబొసంగ నొక కొన్నివరంబులఁ బ్రసాదించి మనకికముందు మునుపటికంటె నెక్కుడు శ్రేయస్సు గలుగఁ గలదను నమ్మకమును ప్రజలయందు గల్గించినాఁడు. కావున నాఁటి యుత్సవము నిచ్చట సంగ్రహముగ వర్ణించెదము. 12 వ తేది ప్రాతఃకాలమయి కాకముందె ఢిల్లీదర్బారు రంగమునందలి భవనములయందును పటకుటీరముల యందును జనుల కలకలము వినవయ్యెను. సూర్యోదయ మగునప్పటికి సైన్యము లెల్లయును దమకు నియమితమయియుండిన స్థలములలో గాయక బృందములతో బారులు దీరెను. ధూమశకటపంక్తులును, గుఱ్ఱపు బండ్లును, మోటారు బండ్లును, రిక్షాలును లక్షలు లక్షలుగ, జూపరులను దర్బారు రంగమునకుఁ గొని వచ్చి వదల మొదలిడెను. సామాన్య ప్రజలు ఇసుకరాల్చినఁ గ్రిందికి పడనియక తండోపతండములుగఁ బాదచారులయి రాఁజొచ్చిరి. 9. 30 గంటలకు పట్టాభిషేకమంటపమునకుఁ బ్రజ సాగిపోవఁ బ్రారంచిరి. పదిగంట లగునప్పటికి సర్వమును సిద్ధమయ్యెను. దూర దేశాగతులయిన నానారాజ్యప్రతినిధులును భూషణావళులచే నలంకరింపఁబడిన స్వదేశసామంతరాష్ట్రాధిపతులును, అధికారులును, నాహూయమానులయి యుండిన ప్రజానాయకులును తమ తమ స్థానముల నాసీనులయి యుండిరి. 20 వేలు

సైనికులు మధ్యభాగమున నెల కొల్పఁబడియుండిరి. 11 గంటల సమయమున మన గవర్నరు జనరలుగారగు హార్డింగు ప్రభువును ఆతని యర్ధాంగి హార్డింగు ప్రభ్వియుఁ బ్రవేసించిరి. 80,000 లు జనులు అనిమిషలోచనులయి పంచమజార్జిచక్రవర్తిరాకకయి యెదురు చూచుచుండిరి. ఫిరంగుల మ్రోతలును దూరమున వినవయిన ఆనందఘోషములును చక్రవర్తి చక్రవర్తినులు దమ నివసించు నగరునుండి వెలువడిరనుటఁ దెలిపెను. కొన్ని నిమేషములలో జయఘోషము ఆ మండపము నందే మహారావముగ వినవయ్యెను. అచ్చటి ప్రజలెల్లరును లేచి నిలువంబడిరి. సైన్యములు గౌరవసూచకముగఁ దమ యాయుధముల నమర్చిరి. గాయక బృందములు రాజకీర్తనను దమ వాద్యములచేఁ బలికించిరి. మంటపమధ్యమున నిర్మింపఁబడి యుండిన జయస్తంభముపై నాంగ్లేయ సామ్రాజ్యపుబావుటా ఎత్తఁబడెను. 101 ఫిరంగుల మ్రోత* ప్రారంభమాయెను.

పంచమజార్జిచక్రవర్తిగారి స్యందనము దర్బారు రంగము వద్దనిలచెను. సార్వభౌముఁడును సార్వభౌమియును నవతరించిరి. గవర్నరు జనరలు వారికి స్వాగతమిచ్చెను.

గొప్పయుత్సవముతో పడికట్లనెక్కి-వీరిరువురును కిరీటముల నొదలలనిడికొని పట్టాభిషేకమంటపమున నమర్పఁబడిన సింహాసనములపై నాసీనులయిరి.

* ఇది రాజుగారి గౌరవార్థమేర్పడినది.



ఫిరంగుల మ్రోతనిలచుటతోడనే ఆపనికయి నియోగింపఁబడియుండిన యుద్యోగస్థుఁడొకఁడు చక్రవర్తిగారి యనుమతిఁ బడసి దర్బారు ప్రారంభమయ్యెనని తెలియఁ జేసెను. జయజయధ్వానములు చెలంగె. గాయక బృందముల ఆరావము లాగుటయే యాలస్యముగ మన జార్జిసార్వభౌముఁడు ఈక్రింది వాక్యములఁ బల్కెను.

"నేను నేఁడు మీయందఱ మధ్యమునందు నుండుట కెంతయు సంతసించుచున్నాఁడను. ఈసంవత్సరము నేనును చక్రవర్తినియు ననేకానుస్థానములయందు నిమగ్నులమయి యున్నందున సంతోషకరమగు విశేష పరిశ్రమ చేయవలసి వచ్చినది. మేము మున్ను ఈదేశమునకు వచ్చినప్పుడు మామనముల నెలకొని మమ్ముల కృతజ్ఞులం జేసిన సువిషయజ్ఞానము వ్యవధి యెక్కుడుగ లేకున్నను దూరము మిక్కుటమే యైనను మమ్ము మరల నీభూమికి రాఁబురికొల్పెను. కావున మే మేదేశమును ప్రేమింప నేర్చియుంటిమో ఆదేశమునకు నిచ్చట నప్పటింబలె స్వగృహసౌఖ్య మబ్బఁగలదను సంపూర్ణాశచే బయలుదేరి వచ్చినారము. పరమాత్ముని కృపామహిమచే గడచిన జూన్ మాసము 22 వ తేది మావంశమునకుఁ బరంపరగ వచ్చుచుండు కిరీటము ప్రాచీనాచారముల ననుసరించియు నుచితపద్ధతులం బట్టియు 'వెస్టుమినిస్టరు అబి' యందు నామా దలపై నిడఁబడియె. ఆసమాచారమును నేను స్వయముగ మీ

కందఱకును బ్రకటించెదనని గడచిన జూలై మాసమున దెలియఁ జేసితిని. ఇట్లు నేనిచ్చిన వాగ్దానము నాయిప్పటిరాకవలన పరిపూర్ణమయినది. రాజభక్తియుతులగు భాగతీయ సామంత ప్రభువులకును విశ్వాసపూరితులగు భారతపుత్రులకును మాయనురాగముం గనుపఱచుటకును భరతవర్షసామ్రాజ్యపు క్షేమమును సౌఖ్యమును మేమెంత మనఃపూర్వకముగఁ గోరునదియు వెల్లడి సేయుటకును మహదిచ్ఛగలవాఁడనయి గూడ చక్రవర్తినితోడ బయలుదేరి వచ్చినాఁడను. ఇంతియగాక మా కిరీటధారణోత్సవ సమయమున (నింగ్లాండున) నుండలేకపోయిన వారికి ఢిల్లీపురమున మాపునరాభిషేకమునుం జూచు నవకాశము గలిగించవలయు నని నా కిష్టము గలిగినది.

నా గవర్నరులును, విశ్వాసపాత్రులగు నాయితరాధికారులును, నాసామంతప్రభువులును, ప్రజాప్రతినిధులును, నా భరతవర్షసైన్యములలోని ముఖ్యభాగములును గల యీ మహాసభం జూచి నాకు పరమానందమయినది.

వారు శ్రద్ధమైనాకుఁ జూపఁదలఁచికొనిన రాజభక్తి, సమ్మాననతులను సంపూర్ణ హృద్గత సంతోషముతో స్వీయముగ నంగీకరింపనున్నాఁడను.

సానుభూతిసంకలిత మనోగతియును ప్రేమాపూర్వక సుహృద్భావమును ప్రభువులను బ్రజలను నాతోడం గూడ



సి సుసందర్భమున నైక్యమొనర్చు చున్నవను దృఢభావము నాకు గల్గియున్నది.

ఇట్టి మనోభావములను బ్రదర్శించు నుద్దేశముతో నా విశేషానుగ్రహ విశేషవివేచనలం దెలుపు కొన్ని కార్యములచే నాపట్టాభిషేకమహోత్సవమును స్మరణీయము సేయఁ దలంచినాఁడను. అవ్వానిని నాగవర్నరు జనరలు ముందీమహాసభకుఁ దెలుపఁ గలఁడు.

మీహక్కులను స్వాతంత్ర్యములను గౌరవించు విషయమున నాకు వందనీయులగు నా పూర్వికులచే నుడువఁబడిన స్థిరవాక్యములను స్వీయముగ దృఢపఱచుటకును మీక్షేమమును శాంతిని సంతుష్టిని హృదయపూర్వకముగఁ గోరుచుండుటను దెలియఁ జేయుటకును నాకీ తరుణమబ్బినందులకు సంతసించుచున్నాఁడను.

కృపామయుండగు నాపరమాత్ముండు నాప్రజలను గాచుచు వారికి సౌఖ్యమును నభివృద్ధిని గలుగఁ జేయుటకు నాకు సాహాయ్యముం బ్రసాదించుగాత!

ఇచ్చటంగల సామంత ప్రభువులకును నాప్రజకును మేము ప్రేమాపూర్వకస్వాగత మిచ్చుచున్నారము."

సర్వ జనులకును సమానముగ వినిపించునట్టిసుస్వనమున నిట్టిసూక్తులు చక్రవర్తిగారి ముఖము నుండి వెలువడి

నప్పుడా మహాసభవారు ముదితాత్ములయి యఖండముగ జయజయధ్వానముల సలిపిరి.

తరువాత సమ్మాననతులు ప్రారంభమాయెను. మొదట గవర్నరు జనరలును, నున్నతసేనానాయకుండును, గవర్నరు జనరలుగారి యధికారసభా సభ్యులును నొకరి తరువాత నొకరు చక్రవర్తిగారికి నుచితవిధమున వినమ్రులయిరి.

వీరికిం బిదప మొదటియంతస్థు స్వదేశసంస్థానాధిపతులు విచ్చేసిరి. అందు హైదరాబాదు, బరోడా, మైసూరు ప్రభువులు మొదటి మువ్వురు. వీరిపిరుందఁ దక్కుంగలవారు.

వారికివెనుక నితరసంస్థానాధీశ్వరులును మాండలిక ప్రతినిధులును నధికారులును దమతమ దర్జాననుసరించి సార్వభౌమున కెఱంగిరి.

ఇది యంతయుముగిసి మఱికొన్ని సుకర్మలుజరిగిన తరువాత మంగళధ్వానములుచెలంగ ముఖ్యసందేశవాహకుండు (Chief herald) ఈక్రింది ప్రకటనం జదివెను.

రాజుగారి ప్రకటన

"శ్రీజార్జి మహారాజచక్రవర్తి.

మా ప్రభుత్వపు ప్రథమ సంవత్సరమగు, క్రీస్తుశకము వేయిన్ని తొమ్మనూ్నట పదవసంవత్సరపు జూలై నెల ది 19వ తేది గలిగినట్టియు నవంబరు నెల ది 7వ తేది గలిగినట్టియు మా రాజప్రకటనముల మూలమున, వేయి తొమ్మనూ్నట పదునో



కండవ సంవత్సరపు జూను నెల ది 22వ తేదిని సర్వశక్తుండగు భగవంతుని కృపాప్రసాదములచే మా రాజపట్టాభిషేక మహోత్సవమును జరుపగలందులకు మా రాజచిత్తమును ప్రకటించి వ్యక్తపరచియుంటిమిగావునను; గడచిన జూను నెల ది22వ తేది గురువారమున సర్వశక్తుండగు భగవంతుని కృపాప్రసాదమువలన, పైనిచెప్పిన మహోత్సవమును జరుపగలిగితిమి గావునను, పైనిచెప్పిన మహోత్సవ మట్లుజరిగినదని మా హిందూరాష్ట్రములలోని ప్రేమగల మా ప్రజలకు మేము స్వయముగా తెలియపరచుటయును, మా గవర్నరులను లెఫ్టినెంటు గవర్నర్లను; మా యితరఆఫీసర్లను, మా సంరక్షణలోనున్న స్వదేశ రాజులను, సంస్థానాధిపతులను, ప్రభువులను, మా హిందూసామ్రాజ్యపు పరగణా లన్నిటిలోను ఉన్న మా ప్రతినిధులను, మా సన్నిధికి బిలుచుటయును, మా ఆపేక్షయు అభిలాషయునై యున్నవని మేము మా ప్రభుత్వపు ప్రథమ సంవత్సరమగు క్రీస్తుశకము వేయిన్ని తొమ్మనూ్నట పదునొకండవ సంవత్సరపు మార్చి నెల ది 22వ తేదిగల మా రాజప్రకటనము మూలమున విశదపరచి యుంటిమిగావునను;

ఇప్పుడు మేము మా రాజప్రకటనమగు దీనిమూలమున దానిని విశదపఱచుచు మా ఆఫీసర్లందరికిని, ఢిల్లీలో సమావేశమయియున్న రాజులకు సంస్థానాధిపతులకు ప్రజలకు అందరి

కిని, మహారాజ చక్రవర్తిగా మా మంగళాశీర్వాదము లొసంగి ఇండియాసామ్రాజ్యము నెడల మాకుగల గాఢవాత్సల్యమును అందలి క్షేమాభ్యుదయముల విషయమున మాకు ఉన్నట్టియు సర్వదా ఉండు నట్టియు, శ్రద్ధను దృఢముగా స్పష్టపఱచుచున్నాము.

మా ప్రభుత్వపు ద్వితీయసంవత్సరమైన వేయిన్ని తొమ్మన్నూట పదునొకండవ సంవత్సరపు డిశంబరు నెల ది 12వ తేదిని, ఢిల్లీపట్టణములో మాయాస్థానమునుండి సాదరు చేయబడినది.

శ్రీమహారాజ చక్రవర్తిగారిని భగవంతుఁడు రక్షించుగాక!"*

జయజయధ్వానములు చెలంగె. సైనికులు గౌరవచిహ్నముగఁ దమయాయుధములఁ దగురీతి నిలిపిరి. సభయంతయు లేచి నిలువంబడియె. 101 ఫిరంగులు జార్జిసార్వభౌముఁడయ్యెనని నల్దిక్కులకుఁ జాటె. దర్బారు రంగమునకు వెలుపటనుండిన సైన్యములు సంతోషమును జూప మందులో నించిన బందూకుల ప్రేల్చిరి. అంతయు నొక్కయానందఘోష సముద్రం బయ్యెను.

పిదప గవర్నరు జనరలు గారగు హార్డింగు ప్రభువు చక్రవర్తిగారి విశేషోత్తరువులఁ బ్రకటించిరి.

* Quotation from Fort St. George Gazette.



అందు ఇతర వరములతోఁ గూడ ప్రథమవిద్యకు 50 లక్షల రూప్యము లియ్యఁబడెనను సువార్తయుండెను.

హార్డింగుప్రభువు కూర్చొనిన వెనుక చక్రవర్తి చక్రవర్తినులకు నాయురారోగ్యైశ్వర్యంబు లగుగాతమని ముమ్మారు సభవారందఱును ఆశీర్వదించిరి.

సభను ముగింపుచేయుచు శ్రీపంచమజార్జి సార్వభౌముఁడు అత్యద్భుతముగఁ బ్రజలు దలంపనైన దలంపని, రెండు వరంబుల నిచ్చెను. చిరకాలము ప్రజలమనోవ్యథకుఁ గారణంబయియుండిన వంగదేశ విభజనము రద్దయిపోయె. భరతవర్షపు రాజధాని కలకత్తానుండి సుప్రసిద్ధమగు ఢిల్లీకి మారుపఁబడియె. భారతీయుల మనంబులలరె.

ఈవరముల గుఱించియు నీదర్బారును గుఱించియు నిఁక బెంచి వ్రాయనలసిన పనిలేదు.

సౌహార్దయమున సామ్రాజ్య పరిపాలనకుం గడంగియుండు మన జార్జిమేరీలకు నాయురారోగ్యైశ్వర్యంబులు పరమాత్ముఁడిచ్చి కాపాడు గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

# శుద్ధపత్రిక.

| పుట. | వరుస. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 14 | 3 | యతని | అతని |
| 15 | 7 | యిది | ఇది |
| 34 | 1 | పించుట | యుంట |
| 42 | 2 | గలరుహైంగవ | గలరు.దీనిపుట్టకహైం |
| 43 | 8 | దెలుపుటయే | దెలిపుటయే * (దవ |
| 47 | 2 | జేర్చిరి" * | జేర్చిరి" |
| 47 | 21 | * ఫెర్గుసనుగారి | 63వపేజీలో మొదటి పారాకన్వయించుకొనునది. |
| 69 | 2 | నాగిన | సాగిన |
| 71 | 7 | కయినలంక | కయివానినలంక |
| 71 | 21 | శ్రేయోదాయమగు | శ్రేయోదాయకమగు |
| 73 | 4 | వెల్లడించుచు, తన | వెల్లడించుచు, "తన |
| 73 | 6 | దనయెడలను దన | దనయెడలను. |
| 78 | 10 | భ్యయెంత | భ్యాకినంత |
| 110 | 13 | నగుటయతని | నగుటయునతని |
| 117 | 6 | 1799 | 1803 |
| 145 | 14 | వీరుబన్న | వీరుపన్న |
| 147 | 10 | ఆంట్లేయులకు | ఆంగ్లేయులకు |
| 152 | 11 | రింగూడను. | రికింగూడ |
| 155 | 10 | యుధ్యోగస్తులు | యుద్యోగస్థులు |
| 173 | 3 | యుపక్రమించిన | ఉపక్రమించిన |
| 199 | 9 | విక్ర-ఉల్ | విక్రమ్-ఉల్ |
| 209 | 6 | సంస్థాన | సంస్థాన |

| | | | |
|---|---|---|---|
| 212 | 8 | శతాబ్దపు, గుజ | శతాబ్దపుగుజ |
| 214 | 20 | స్వారులకునాయ | స్వారులనాయ |
| 217 | 2 | సేవింప | సేవింపఁ |
| 244 | 7 | అ | ఆ |
| 244 | 21 | నామంతులకు | సామంతులకు |
| 246 | 18 | చేసిన | చేసికొనిన |
| 248 | 2 | స్వాతంత్ర్యత | స్వాతంత్ర్యము |
| 249 | 9 | సాహాయ్యుఁడయి | సహాయుఁడయి |
| 258 | 6 | పుత్రుఁడు | పుత్రుఁడు. |
| 276 | 2 | ములునునగుసౌకర్య] ములకలుగ | ములునుకలుగ |
| 278 | 18 | వృద్ది | వృద్ధి |
| 287 | 16 | వీరలే | వీరలీ |
| 295 | 14 | చున్నవి | చున్నవి. |
| 314 | 10 | వీనిం | దీనిం |
| 316 | 19 | రుఁడను | రుఁడును |
| 319 | 13 | కారుగహాళ్లిప్రభువు | కారుగహాళ్లియొక్క [ప్రభుకు |
| 320 | 6 | ప్రభువునకుపుత్రిక | ప్రభుపుత్రిక |
| 323 | 18 | ములలో | ములో |
| 331 | 16 | రాచమందిరము | రాజమందిరము |
| 332 | 9 | యెవ్వరును | ఎవ్వరును |
| 340 | 1 | నావికసైన్యము | నావికాసైన్యము |
| 349 | 5 | వన్నెక్కుడు | పన్నెక్కుడు |
| 357 | 5 | నేర్చుకొను | నేర్చు |
| 366 | 5 | యుధష్టిరుఁడు | యుధిష్ఠిరుఁడు. |

# ప్రకటనలు.

# విజ్ఞానచంద్రికాపరిషత్తు.

ప్రతిసంవత్సరము జూలై నెలలో సాహిత్యము, చరిత్ర, ప్రకృతిశాస్త్రములలో పరీక్ష జరుపబడును. అందు కృతార్థులైన ఉత్తమ విద్యార్థులకు రు. 316-0-0 లు 9 బంగారుపతకములు బహుమానముగా నీయబడును. వీనిలో రు. 100-0-0 లు, 5 బంగారుపతకములు ప్రత్యేకము స్త్రీలకొఱకు ఉద్దేశింపబడినవి.

**1912 వ సం॥ పఠనీయగ్రంథములు.**

| | |
|---|---|
| రుక్మిణీకల్యాణము (భాగవతములోనిది) | రు. అ. |
| టీకాతాత్పర్యసహితము. | 0-6-0 |
| విమలాదేవి(నవల). | 1-2-0 |
| సంగ్రహవ్యాకరణము. | 0-5-0 |
| మహమ్మదీయమహాయుగము. | 1-12-0 |
| మహాపురుషులజీవితములు. | 0-12-0 |
| రసాయనశాస్త్రము. | 1-4-0 |
| ఆరోగ్యశాస్త్రము. | 1-4-0 |

☞ వివరములు తెలిసికొనగోరువారు పరిషత్కార్యదర్శిగారికి వ్రాయవలెను. వలయువారికి అచ్చువేసిన దరఖాస్తు ఫారములు దొరకును. ప్రవేశరుసుము విజ్ఞానచంద్రికా మేనేజరుగారికి పంపునది. పుస్తకములకు క్రింది విలాసమునకు వ్రాయవలెను.

విజ్ఞానచంద్రికాబుక్కు డిపో.
చింతాద్రిపేట-మద్రాసు.

# ప్రకటననియమములు.

**1.** మాకు 3000 మంది చందాదారులు కలరు. ప్రతి గ్రంథమునొక్క 4000 ల ప్రతులు అచ్చువేయించుచున్నాము. మాగ్రంథములు స్త్రీలు, పురుషులు చదువుదురు. మాపుస్తకములు కొన్ని యూనివర్సిటీ పరీక్షలకు నియమించియున్నారు. కొన్ని పాఠశాలలలో పఠనీయములుగా నేర్పరచి చదివించుచున్నారు. ఈగ్రంథమాలకుగల వ్యాపకము మరియే గ్రంథమునకును, ఏగ్రంథమాలకును లేదు. కావున దీనియందు ప్రకటనలు వేయువారికి అత్యంతలాభకారి యని మేము వేరుగ వ్రాయనక్కరలేదు.

**2.** ప్రతిగ్రంథముయొక్క చివర కొన్ని ప్రకటనలు వేయుదుము. ఈప్రకటనలు కేవలము భాషావిషయకములు మాత్రమే యయియుండును. మందులు మొదలగునవి మేము ప్రకటించము. ఆంధ్రభాషలోని సత్కృతులు, కావ్యములు, నాటకములు, నవలలు, ప్రహసనములు, దేశచరిత్రలు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు మొదలగు వానినిగూర్చి ఏమి తెలిసికోవలసి వచ్చినను, ఒక్కచోట చెప్పన గనుపడునటుల చేయదలచినారము. కావున గ్రంథకర్తలు, పత్రికాధిపతులు తమ తమ గ్రంథములను, పత్రికలను, ఇందు ప్రకటించి ఎక్కువలాభమును బడయుదురని నమ్ముచున్నాము.

**3.** మాప్రకటనల తమ పత్రికలో వేయు పత్రికాధిపతుల ప్రకటనలు మా పుస్తకముల చివర నుచితముగా వేయగలవారము.

**4.** ఇతరులు ఒకసారి ఒకపుట ప్రకటన వేయుటకు రు. 10-0-0లు ఈయవలెను. అరపుటకు 6-0-0 లు. ఒక్కసారి నాలుగుపుటలు వేయువారికి రేటు తగ్గించబడును. అరపుటకన్న తక్కువ ప్రకటన తీసికొనబడదు.

**5.** మాకు ప్రతిదినము క్రొత్తక్రొత్త చందాదారులు వచ్చుచున్నందునను, మాగ్రంథములు ఆంధ్రభాషలో శాశ్వతముగ నుండునవి గనుకను ఇందొకసారి ప్రకటన వచ్చినయెడల అది భాషలో శాశ్వతముగనుండును. వారపత్రికల, మాసపత్రికలవలె అప్పుడు మాత్రము చదివి ఆవల, పారవేయునట్టివి మాగ్రంథములుకావు గనుక వీనియందు ప్రకటనలు వేయువారికి మిక్కిలి లాభముండునని చెప్పవచ్చును.

మేనేజరు, విజ్ఞానచంద్రిక,
చింతాద్రిపేట, మద్రాసు.

# A NEGLECTED EMPEROR-POET.

*(A Critical Review of Amuktamalyada on modern lines.)*

BY

G. HARISARVOTTAMA RAU M.A.

with an introduction

BY

P. RAMARAYANINGAR M.A. F.M.U.

---

**PRICE 0-8-0.**

---

A right estimate of Krishna Devaraya as a poet.—The only book of its kind in the market. Most highly appreciated by eminent Scholars.

---

*Apply to:—*

VIGNANA CHANDRIKA BOOK DEPOT.

CHINTADRIPET.

*MADRAS.*

# హిందూసుందరి.

ఇది తెలుగు స్త్రీలకొఱకు ప్రచురించబడు మాసపత్రిక. శ్రీమతి మొసలికంటి రామాబాయమ్మగారు దీనికి సంపాదకురాలు. ఇందు స్త్రీల కుపయోగకరములగు పలువిధములైన వ్యాసములు స్త్రీలచే వ్రాయబడు చుండును. నారీమణుల జీవితములు, కుట్టుపనులు నేర్చువిధము, గృహనిర్వాహక విధులు మొదలగునవి యిందు ప్రచురింపు చుందుము. ఈ కార్యాలయమునందు స్త్రీలవశ్యముగా పఠించవలసిన గ్రంథము లనేకములుగలవు.

చిరునామా:—సత్తిరాజు శీతారామయ్య, కంతేరుపోస్టు, కృష్ణాజిల్లా.

# దేశమాత.

ఇది యొక వారపత్రిక. సంవత్సరమునకు చందా మూడు రూపాయలు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ఈపత్రికకు అధిపతి. ఇందు విదేశవృత్తాంతములు, స్వదేశవార్తలు చిత్రకథలు, హాస్యములు, ప్రకృతిశాస్త్రవిషయములు మొదలగునవి ప్రకటింపబడు చుండును.

చిరునామా:—

దేశమాతపత్రికాధిపతిగారు, రాజమహేంద్రవరము.

# తెలుగులాజర్నలు.

ఇది యొకమాసపత్రిక ఇందులో లావర్తమానములు చట్టములు, హైకోర్టులయొక్కయు, సివిల్ క్రిమినల్ తీర్పుల సంగ్రహములున్ను, ప్రీవికౌంసిలు తీర్పులున్ను, చట్టనిర్మాణ సభలలోని చర్చలున్ను, ప్రచురింపబడును. దీనిని చదువువారికి వ్యవహారజ్ఞానము చక్కగా కలుగును. ఈ పత్రిక ఇంగ్లీషు భాష తెలియని ప్లీడరు గుమస్తాలకును, ప్రైవేటు వకీళ్ళకును, గ్రామవుద్యోగస్తులకును, చాలనుపయోగము. చందా సంవత్సరమునకు రు. 3-0-0 అర్థ సంవత్సరమునకు 1-12-0 విడిపత్రిక 0-5-0 లు.

చిరునామా:— తురగా పురుషోత్తం పంతులు,

ప్లీడరు & ఎడిటరు, తెలుగు లాజర్నలు, మచిలీపట్నము.

# ప్రకటన

ఇప్పుడు సంపుటములుగా ముద్రింపఁబడియున్న రావుబహాదూరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారి పుస్తకములు పది సంపుటములును విక్రయమునకు సిద్ధముగానున్నవి. 26 పౌనుల గ్లేజుకాగితముమీఁద ముద్రింపఁబడి కాలికోగుడ్డతో నిండుగా బైండుచేయఁబడిన సంపుటములు ప్రత్యేకముగా నీ క్రింద వెలలకు దొరకును.

| | | | రు. | అ. |
|---|---|---|---|---|
| 1 | సంపుటము. | ప్రహసనములు. | 2 | 8 |
| 2 | ,, | నాటకములు. | 2 | 8 |
| 3 | ,, | భాషాంతరీకృతనాటకములు. | 3 | 0 |
| 4 | ,, | వచనప్రబంధములు, పద్యకావ్యములు. | 3 | 0 |
| 5 | ,, | స్త్రీలకుపయోగించు కథలు. | 3 | 0 |
| 6 | ,, | స్త్రీలకుపయోగించు పుస్తకములు. | 3 | 0 |
| 7 | ,, | ఉపన్యాసములు. | 2 | 8 |
| 8 | ,, | ఉపన్యాసములు, జీవనచరిత్రములు. | 3 | 0 |
| 9 | ,, | సాహిత్యప్రకృతిశాస్త్రగ్రంథములు. | 3 | 0 |
| 10 | ,, | కవిచరిత్రములు. | 3 | 8 |

అంచెకూలి కొనువారే పెట్టుకొనవలయును. ఈ సంపుటములపై గిల్టక్షరములు వేయబడియున్నవి. సంపుటములన్నియు మొత్తముగాఁ గొనువారికి సంపుటములు పదియు నిరువది (రు. 20-0-0) రూపాయలకే యియ్యఁబడును. విడిపుస్తకములుకూడ దొరకును. వలయువారు రావు బహదూరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారు రాజమహేంద్రవరము అని వ్రాసికొనవలయును.

# ఆంధ్రభాషాభివర్ధనీసంఘము.

(లిమిటెడ్) బందరు.

ఆంధ్రభాషయందు, సనాతనాధుని కేతిహాసములు, ప్రకృతిశాస్త్రములు, అన్యదేశాదర్శనిక గ్రంథములు, మహాపురుషుల జీవితములు, గణితశాస్త్రములు, రాజనీతిశాస్త్రములు, అర్థికశాస్త్రములు, వృత్తులను, పరిశ్రమలను, వాణిజ్యమును నడుపువిధమును దెల్పు గ్రంథములు, నవలలు, లేనిలోపమును నివారింపనెంచి రూ. 10,000-0-0 మూలధనముతో నీ కంపెని స్థాపింపబడినది.

## విక్రయమునకు సిద్ధమయిన గ్రంథములు.

1. భారతధర్మదర్శనము.—(ద్వితీయముద్రణము) మనోహరాలంకారశోభ యొదవ దేశెలోలకు తీయనిపలుకులం జదువరుల నమందానందపరాధీననిర్మగ్నచేతస్కులం గావించుచుండును. నిర్మల దేశానురాగమును ప్రబోధించు పద్యకావ్యము, వెల 0-2 0, చందాదారులకు రు. 0—1—6,

3. పీష్వానారాయణరావు వధ.—(ద్వితీయముద్రణము) శోకకరుణాదిరసపూరితంబై చదువరుల మనసుగరగునట్లు చక్కఁగా వ్రాయబడిన వచనకావ్యము. వెల రు. 0—2—0, చందాదారులకు 0—1—6

7. రామమోహనరాయలచరిత్ర —నిర్మలబ్రహ్మజ్ఞాన ప్రభాకరోదయంబు గావించి, అనాథలగు యువతులనుబట్టి బలవంతముగఁ గాల్చివేయు "సతి" యనుభయంకరాచారంబునడంచి తనమాతృభూమియగు భరతవర్షంబు నుద్ధరింపదత్పూర్వ మెన్నఁడు హిందువులెవ్వరును వెళ్ళుటకు సాహసించని ఖండాంతరమున కనేకమాసములు మహార్ణవముపై బయనమొనర్చి యచట మనకొరకనేక యుపన్యాసములనిచ్చి కార్యవిజయము గాంచుకొరకు పాటుపడుచుండిన మహాపురుషుని పూజచారిత్రము. 198 పుటలుగల గ్రంథము. పటముతో వెల రు. 0—12—0 చందాదారులకు 0—8—0

8. స్వాతంత్ర్యదర్శనము.— ఇంగ్లాండునందు రాజకీయ తత్వశాస్త్రజ్ఞుడని ఘనతకెక్కిన, జాన్ స్టూవర్టు మిల్లుగారిచే రచింపబడిన గ్రంథమునకు సరియగు తెలుగు, వెల రు. 0—12—0, చందాదారులకు 0—7—0.

9. మహారాష్ట్రచరిత్ర.— ప్రథమభాగము. ఒకప్పుడు భరతఖండమున కాభరణముగానుండిన మహారాష్ట్ర సామ్రాజ్య సంపాదకులైన శివాజీమహారాజు మున్నగు వీరులసచ్చరిత్రము, ప్రశస్తమైన యీ రాష్ట్ర నిర్మాణముయొక్కయు ప్రవర్తనముయొక్కయు, క్షీణదశయొక్కయు కారణములు సహేతుకములుగ చర్చింపబడియున్నవి. శైలిసుబోధకమై ప్రస్తుతమునన దేశీయచరిత్ర పాఠకార్థులైనవారికి మహారాష్ట్రచరిత్ర సుప్రమాణమయినదిగ నున్నది. ఇందు 22 చిత్రపటములును, భరతవర్షపు పెద్దపటమును గలిగి అనేక కథావిశేషములతోడను రాజనీతి విచారములతోడను నీగ్రంథము విరాజిల్లుచున్నది. సామాన్యచదువరులకు రంజకముగను, విమర్శకులకు కావలసినంత చరిత్రసామగ్రియు బొందుపరుపబడియున్నవి. 500 పుటలు క్యాలికో బైండు వెల రు. 1—14—0 చందాదారులకు రు. 1—4—0.

10. ఆంగ్లేయరాజ్యాంగ నిర్మాణచరిత్ర.— గ్రంథకర్త మద్రాసు గవర్నమెంటు తెలుగు ట్రాంసులేటరుగారగు గోటేటి కనకరాజు పంతులుగారు, బి. ఎ., బి ఎల్., ఇంగ్లండు దేశీయుల రాజపరిపాలన, నాగరికతయు విపులముగ నిందు వర్ణింపబడియున్నవి ప్రాచీనవృత్తాంతము, విదేశరాజుల పరిపాలనము, స్వాతంత్ర్య నిర్ణయ మహాశాసనము, నిరంకుశప్రభుత్వమునకు పార్లమెంటునకు పోరాటము, ప్రజాప్రభుత్వము, అమెరికాయుద్ధము, శిల్పకళల ప్రాభవము, పార్లమెంటు సంస్కారము, విక్టోరియామహారాజ్ఞి, కాలనీలు, హిందూదేశము స్వరాజ్యము మొదలగు విషయములుగలిగిసుబోధకముగానున్నది. క్యాలికో బైండు, వెల రు 1—4—0 చందాదారులకు 0—12—0.

11. ఆరోగ్యశాస్త్రము.— గ్రంథకర్త డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు. బి. ఏ. యం. బి. సి, యం. అమూల్యమయినగ్రంథము. ప్రతిబాలుడును, ప్రతి ఉపాధ్యాయుడును, ప్రతి వైద్యుడును పఠింపవలసిన గ్రంథము. కాలికో బైండు వెల రు. 1—4—0, చందాదారులకు 0—10—0.

# జీవితచరిత్రావళి.

(మొదటిభాగము)

ఇందు మహాపురుషులగు ఉమేశచంద్రబనర్జీ, రమేశచంద్రదత్తు రంగారావుగార్ల జీవితములు చక్కని వచనశైలిని రమ్యముగా వర్ణింపబడినవి. దేశముకొరకును, భాషకొరకును, అనేకవిధముల తమజీవితముల ధారపోసిన యీ మహనీయులుమనకందరికిని వంద్యులు. ఇంక వీరిజీవితములు పఠనార్హములని వేరుగనుడువవలెనా?

ఆర్టుపేపరుమీద ముద్రించబడిన యీదేశభక్తుల రూపపటములతో సొగసైన అట్టబైండుచేయబడి, నూరుపుటలకు పైగానుండు నీగ్రంథము వెల రు. 0-4-0 మాత్రమే. పోష్టుకర్చులు కొనువారే భరించవలెను.

చిరునామా:— విజ్ఞానచంద్రికా బుక్కుడిపో,

చింతాద్రిపేట - మదరాసు.

# మనోరమ.

ఇది బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారిచే బ్రచురింపబడు తెలుగు మాసపత్రిక. ఇందు వినోదములు దేశమునకు మతమునకు మహోపకారము చేసి కీర్తిశేషులయిన మహాపురుషుల జీవనచరిత్రలు సృష్టియందలి వైచిత్ర్యములను దెలియజేయు మహాద్భుతములు, రసవంతములైన మృదుపదసంయుక్తములై యొప్పు నాటకములు నూతన కల్పనలతో నిండియుండి చదివిన కొలది చదువబుద్ధిపుట్టు చక్కనికథలు, చిత్రకల్పనలతో రచియించిన చిత్రవచన కావ్యములు (Novels) ప్రచురింపబడుచుండును. ఈమాసపత్రికను జదివిన వారందరు దీనిని భాషాప్రౌఢిమగల పత్రికలలో నొకటియనియుం బండితులకు బామరులకు స్త్రీలకు బాలురకు సత్యంలో పయుక్తమనియు నీతిదాయకమనియుం దలంపక పోరు. చందా సంవత్సరమునకు మూడు రూపాయలు, వలయువారు "మనోరమ పత్రికాధిపతిగారికి రాజమండ్రి" యని వ్రాసిన బడయగలరు.

# విజ్ఞానచంద్రికాబుక్కుడిపో,

చింతాద్రిపేట, మదరాసు.

| శతకములు. | రు. | అ. |
|---|---|---|
| నరసింహశతకము | 0 | 2 |
| భాస్కరశతకము | 0 | 4 |
| కుమారిశతకము | 0 | 2 |
| వేంకటేశ్వరశతకము | 0 | 2 |
| మాతృశతకము | 0 | 1 |
| మానసబోధశతకము | 0 | 2 |
| ముకుందశతకము | 0 | 4 |
| భర్తృహరి నీతిశతకము పుష్పగిరితిమ్మనది. | 0 | 2 |
| సుమతిశతకము (సటీక) | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | 0 | 1 |
| దాశరధీశతకము | 0 | 4 |
| హరహరేశ్వరశతకము | 0 | 4 |

| నవలలు. | | |
|---|---|---|
| రాణీసంయుక్త | 0 | 12 |
| విమలాదేవి | 1 | 12 |
| ఐవాన్ హో | 0 | 6 |
| కళావతి | 0 | 12 |
| మదాలస | 0 | 10 |
| సురస | 0 | 8 |
| రాధారాణి | 0 | 4 |
| దుర్గేశనందని | 1 | 0 |
| లలితచంద్రహాసము | 0 | 14 |
| యుగళాంగుళీయము | 0 | 8 |
| వసుమతీవసంతము | 1 | 8 |
| శుక్తిమతి | 0 | 12 |
| మాధవీకంకణము | 1 | 8 |
| అహల్యాబాయి | 0 | 8 |
| రామచంద్రవిజయము | 0 | 8 |
| సౌందర్యతిలక | 1 | 0 |
| తారాబాయి | 0 | 12 |
| చంద్రశేఖరము | 0 | 12 |
| సువర్ణమాల (నాటకము) | 0 | 8 |

| వచనగ్రంధములు. | | |
|---|---|---|
| మహాపురుషుల జీవితములు. | రు. | అ. |
| ,, మొదటి భాగము | 0 | 12 |
| ,, రెండవ ,, | 0 | 10 |
| ,, మూడవ ,, | 0 | 12 |
| వినోదములు | 0 | 2 |
| నందచరిత్ర | 0 | 4 |
| వివేకానందజీవితము | 0 | 1 |
| శంకరాచార్యులు | 0 | 2 |
| రామకృష్ణపరమహంస | 0 | 2 |
| అనిబిసంటు | 0 | 1 |
| జపానుచరిత్ర | 0 | 8 |
| బాలగంగాధర తిలక | 0 | 2 |
| పంచతంత్రము | 0 | 6 |
| వచనభాగవతము 1-వభాగము, వచనభాగవతము 2-వభాగము, ,, 3-వభాగము | 7 | 8 |
| శ్రీకుమారాభ్యుదయవిమర్శనము | 0 | 4 |
| మనుచరిత్ర పీఠిక పైఖండనము | 0 | 4 |
| స్త్రీవ్రతకథలు 1-వ భాగము | 0 | 6 |
| ,, 2-వ భాగము | 0 | 6 |
| ప్రశ్నోత్తర జీవకళా విద్యాభివదీపిక | 1 | 6 |
| యక్షప్రశ్నములపీఠిక | 0 | 4 |
| రావుబహదూరు వీరేశలింగముగారి స్వీయచరిత్రము. | 1 | 8 |
| B. R. S. కామేశ్వరరావు కృతులు. | 0 | 6½ |
| పర్వతసందర్శనము | 0 | 2 |
| అవతారచరిత్ర | 0 | 5 |
| రసాయనశాస్త్రము | 1 | 4 |
| భౌతికశాస్త్రము | 1 | 8 |
| జంతుశాస్త్రము | 0 | 9 |
| శారీరశాస్త్రము, ఆరోగ్యబోధిని | 0 | 11 |
| సివిక్సు | 0 | 10 |
| భౌతికశాస్త్ర ప్రథమపాఠములు | 0 | 9 |
| విశ్వేశ్వరీయ కృతివిమర్శనము | 0 | 4 |
| హిందూమహాయుగము | 1 | 0 |
| మహమ్మదీయ మహాయుగము | 1 | 12 |
| ఆంధ్రులచరిత్రము | 1 | 4 |
| కన్యాశుల్కము | 0 | 12 |

| నాటకములు. | | |
|---|---|---|
| ఉన్మత్తరాఘవము | 0 | 8 |
| స్నుషావిజయము | 0 | 8 |
| విచిత్రబిల్హణీయము | 0 | 8 |
| మణిమాల | 0 | 10 |
| చంద్రగుప్త | 0 | 10 |

| సంస్కృతగ్రంధములు. | | |
|---|---|---|
| జ్ఞానవాసిష్ఠము | 6 | 0 |
| సుభాషితమణి కంఠహారము | 1 | 0 |
| కలివిడంబనము | 0 | 4 |
| సౌభాగ్యలక్ష్మి | 0 | 8 |
| విదురమహానీతి | 2 | 0 |
| శైవసిద్ధాంతసంగ్రహము | 0 | 6 |
| బ్రహ్మతర్కస్తవము | 1 | 0 |
| శివకర్ణామృతము | 0 | 8 |
| రామాయణతాత్పర్య సంగ్రహము | 0 | 4 |
| శ్రౌతస్యైవశైవచిహ్నాని | 0 | 8 |
| భగవద్గీతలు (తాత్పర్య సహితము) | 0 | 6 |
| జాతకఫలమణిమంజరి | 1 | 4 |
| పంచరత్నస్తుతి | 0 | 2 |
| శిష్టాస్య శ్వాశీలం ప్రపంచాః | 0 | 8 |
| శ్రౌతమేవహిధారణంలింగస్య | 0 | 8 |
| భారతసార సంగ్రహము | 0 | 8 |
| చతుర్వేదతాత్పర్యసంగ్రహము | 0 | 4 |

విజ్ఞానచంద్రికాబుక్కుడిపో.

చింతాద్రిపేట, మదరాసు.

# విజ్ఞానచంద్రికా బుక్కుడిపో.

చింతాద్రిపేట, మద్రాసు.

## పద్యకావ్యములు.

| | | |
|---|---|---|
| ఆముద్రితగ్రంథచింతామణి మయూఖము | 7 | 0 |
| సటీక హరిశ్చంద్ర నలోపాఖ్యానము | 3 | 0 |
| ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము | 2 | 0 |
| మిత్రవిందా పరిణయము | 1 | 0 |
| చంద్రాంగదచరిత్రము | 1 | 0 |
| యాదవ రాఘవ పాండవీయము | 1 | 0 |
| ద్విరేఫవర్ణదర్పణము | 1 | 0 |
| శ్రీకృష్ణాభ్యుదయము | 0 | 8 |
| త్రైపదేంద్రగురు చరిత్ర శరత్తారావళి | 0 | 8 |
| ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 4 |
| సటీక శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్ర | 0 | 8 |
| ప్రాస్తావిక పద్యావళి | 0 | 8 |
| మనుచరిత్ర ద్విపద | 0 | 4 |
| భోగినీదండకము | 0 | 4 |
| రంగారాయచరిత్ర.ది. నారాయణ కవిప్రణీతము | 0 | 8 |
| ఆముక్తమాల్యద(అట్టబైండు) | 2 | 8 |
| సరస భూపాలీయము క్యాలికో బైండు | 0 | 12 |
| రసికజన మనోభిరామము క్యాలికో బైండు | 0 | 12 |
| డిటో అట్టబైండు | 0 | 8 |
| విజయ విలాసము. పేపరు బైండు | 0 | 4 |
| నీలాసుందరీ పరిణయము | 0 | 4 |
| పారిజాతాపహరణము | 0 | 4 |
| కళాపూర్ణోదయము | 1 | 8 |
| ప్రబంధ సంబంధ బంధని బంధనము | 0 | 4 |
| శృంగారనైషధము పేపరు బైండు | 0 | 10 |
| డిటో అట్టబైండు | 1 | 0 |
| రాఘవ పాండవీయము క్యాలికో బైండు | 1 | 8 |
| ప్రశ్నోత్తర దీపము | 0 | 5 |
| సీమరాణి | 0 | 8 |
| లక్షణాపరిణయము | 0 | 4 |
| కఠోపనిషత్తు | 0 | 2 |
| చిత్రకథాసుధాలహరి | 0 | 6 |
| ప్రభుభక్తిగీతములు | 0 | 1 |
| చంద్రసేనవిజయము | 0 | 2 |
| రుక్మిణీపరిణయము | 0 | 6 |
| సుభద్రార్జునీయము | 0 | 12 |
| గజేంద్ర మోక్షణము టీకా తాత్పర్య సహితము పేపరు బైండు | 0 | 6 |
| డిటో క్యాలికో బైండు | 0 | 8 |
| రంగనాథ రామాయణము ద్విపద క్యాలికో బైండు | 2 | 8 |
| భాస్కర రామాయణము | 2 | 8 |
| రుక్మిణీకల్యాణము క్యాలికో బైండు | 0 | 8 |
| డిటో పేపరు బైండు | 0 | 6 |
| కుచేలోపాఖ్యానము | 0 | 6 |
| అప్పకవీయము అట్టబైండు | 1 | 6 |
| ,, క్యాలికో బైండు | 1 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము ఆంధ్ర నామ శేషము సాంబనిఘంటువు టీకాసహితము అట్టబైండు | 0 | 10 |
| డిటో క్యాలికో బైండు | 0 | 12 |
| సులక్షణసారము టీకాసహితము | 0 | 8 |

## కొటికలపూడి సీతమ్మగారి

### గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| అహల్యాబాయి (పద్యములు) | | రు. | 0—4—0 |
| లేడిజేన్‌గ్రే | ,, | రు. | 0—2—0 |
| సాధురక్షకశతకము | ,, | రు. | 0—2—0 |
| ఉపన్యాస కుసుమమాలిక | | రు. | 0—8—0 |

N. B. ఈ గ్రంథములు స్త్రీలకు మిక్కిలి యుపయోగము. అన్నియు ఒక్కసారి కొనువారికి రు॥ 0—12—0 లకే యియ్యబడును.

## ఇంగ్లీషు తెలుగు నిఘంటువు

Modern English Telugu Dictionary with Technical terms ... ... ... 2 8 0

విజ్ఞానచంద్రికా బుక్కుడిపో.

చింతాద్రిపేట, మద్రాసు.

# లక్ష్మీనారాయణీయము

అను

## శుద్ధాంధ్రప్రతిపదార్థ పర్యాయపదనిఘంటువు.

అపూర్వమైనది! ముద్రితమై సిద్ధముగనున్నది. వెల రు. 4-0-0

ఇది పదార్థ జిజ్ఞాసువులకును, పర్యాయపద గ్రహణాసక్తులకును, నిఖిల విద్యాశాలలలోని బోధకులకును, పరీక్షలనిచ్చు విద్యార్థులకును, భాషల పెంచు కవులకును, ప్రతిపదార్థములం దెలుపు పౌరాణికులకును, వాచకముమీద సర్వనామక్రియాది భేదములం గ్రహించు క్రిందితరగతులం జదువు విద్యార్థులకును, చక్కగ మాటలాడ నేర్చుకొను ప్రతివారికిని యథాకాంక్ష్యముగ నుపయోగించుటకై సుమారు 40 వేల పదములకు అకారాదిగ కూడినంతవరకు సంస్కృతపదములతో ప్రతి పదార్థములును, అందునే యర్థముప్రక్క నకారాదినానార్థ నిఖిల పర్యాయ పదములును, అందలి మధ్యపర్యాయపదములం శీర్షికలైనప్పుడు వానికడనుకూడ పర్యాయములం దెలియుటకు (చూ) యను వర్ణముతో తద్గణాద్యపదతదర్థ సంఖ్యలను, ప్రత్యర్థమునకు నిఘంటుప్రమాణ భాషాభాగాదులును, గూఢపదములకు ప్రయోగములును, వైకృత ముఖ్య ప్రకృతులును, వలయువ్యాకరణాద్యంశములును, అచ్చికపద స్ఫురణలేనప్పుడు తత్సమపదములనుబట్టి పర్యాయములం గ్రహించుటకు అకారాదిగ నొక యనుబంధమును చేర్చి యపూర్వప్రక్రియను 824 పుటల గ్రంథమును ముద్రింపించి పూర్తిగావించిరి.

ఇట్లు,

కరప. కాకినాడ తా॥ గోదావరిజిల్లా | గ్రంథకర్తగారైన కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రులవారి కుమారుఁడు శ్యామల కామశాస్త్రి.

# ప్రఫుల్లముఖి.

ఇదిమిక్కిలి చిత్రమైనయొకనవల. తేనెలొలుకు తీయని తేటతెలుఁగు మాటలతో నతిమనోహరముగా వ్రాయబడినది. మిక్కిలి నీతిబోధక మగుటచే బాలురను బాలికలును తప్పకచదువవలసిన గ్రంథమనినొక్కి చెప్పవలసియున్నది. ఇందు గలవేదాంత రహస్యములు అమూల్యమైనవి. సకలపరమార్థ బోధకంబగునిట్టినవల నాంధ్రభాషలో మనము చదివియుండము. దీనినిగూర్చి పండితులు వ్రాసినయభిప్రాయ సూచకవాక్యములఁ గొన్నింటినిఁగ్రిందఁబొందుపఱిచితిమి:—

1. వేదము - వేంకటరాయశాస్త్రిగారు :— ఇదిచదువరులను గొప్పనీతిమంతులనుగా జేయగల్గు స్వభావముకలది......చదువుటకు హాయిగానుండినది.

2. ఆకొండి - వ్యాసమూర్తిశాస్త్రిగారు :— కథాసౌందర్య మందఱను దుదదనుక నానందముతోఁ జదివింపఁజాలును.

3. కొక్కొండ - వేంకటరత్నముపంతులుగారు:— ప్రఫుల్లముఖియనుకృతి తనయనన్య సామాన్యగుణగరిమచేఁ దానుబద్మినియగుటయేగాక స్వకర్తృనామమును సార్థకముచేయుచున్నది.

4. వడ్డాది - సుబ్బారాయుడుగారు:— పెక్కుతెలుగునవలలఁ గంటెనిది ప్రౌఢతరమగు రచనాకౌశలము గనఁబఱచుచున్నది......వర్ణనలలోని జాత్యుపమాదులు హృద్యములు...బహువిధనీతుల నుపదేశింప సమగ్రమయియున్నది.

5. కట్లూరి - వెంకటశాస్త్రిగారు :— నవరసంపుంబలుకుల సుధారసంబొలుకునట్లు రచియింపఁబడినది. వేదాంతసంప్రదాయాంశంబులు శ్రోతలకు నీతివిరాగంబులు ముప్పిరిగొనఁజేయును.

6. ప్రయాగ - వేంకటరామశాస్త్రిగారు :— ఉల్లంబు పల్లవింపఁజదువరుల నెల్లబ్రఫుల్లముఖులంజేయఁ జాలునీప్రఫుల్లముఖి సకలజనసమాదరణీయమై యలరారుచున్నది.

7. చెళ్లపిళ్ల - వేంకటశాస్త్రిగారు :— కాంపొజిషనునందు శక్తిసంపాదింపఁ గోరుబాలురకు మిక్కిలిచేయూత నొసఁగఁగలదు.

8. చెన్నాప్రెగడ - భానుమూర్తిగారు .— శైలిమృదుమధుర పదఘటితమై కథారచన చమత్కారయుతము హృదయంగమమునై ......నయాప్రవర్తనముఁగఁ గన్పట్టుచున్నది.

9. **Head Master Hithakarini High school, Rajahmundry:**—The novel is very interesting and highly instructive presents a character in every way.

10. **Head Master, Proddatur High school:**— very Interesting and eminently suited to the needs of the Matriculation boy.

11. **Chairman, Telugu Board of studies, A. E. L. M. College, Guntur:**—It is written in chaste language, intrest of the reader is sustained to the end;.....,amusing and instructive.. I thank the author for the intellectual pleasure he has given me.

12. **M.R.Ry. K. Gopala Krishnayya garu, Pleader Vice President of the Taluk Board, Bezwada:**—The arangement of the plot and the sustained and insatiable taste are worthy of the name of the author. Your Telugu rendering is highly appreciable and is deserving of high approbation.

ఈగ్రంథము కలయువారు "క॥ భాస్కరరావు బీ.యే. బెజవాడ" అని వ్రాయవలయును. 210పుటల గ్రంథము వెల 12 అణాలు.

# శశిలేఖా కార్యస్థానము.

జార్జిటవున్, మద్రాస్.

ఈ కార్యస్థానములో నీగ్రంథములు, వార్తాపత్రిక విక్రయింపబడును.

## 1. శశిలేఖ.

ఇది [illegible] సం॥ల నుండి ప్రచురింపబడు చున్న తెనుగు వార్తాపత్రిక. వారమునకు రెండు, అనగా, ప్రతిమంగళ శుక్రవారములలో ప్రచురింపబడు చున్నది. సం॥నకు చందా పోషకులకు రు. 12—0—0 లు, ఇతరులకు సం॥రమునకు 6—0—0 ఆరునెలల చందా రు 3—0—0 లు.

## 2. వాల్మీకిరామాయణము.

ఆంధ్రతాత్పర్య విశేషములుగల, యింత సరసమైన గ్రంథములను నిదివరకెవరును ముద్రించియుండలేదు.

| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| బాలకాండ | 1 | 8 | ఆంధ్రతాత్పర్యముగల సంస్కృత భారతములోని సభాపర్వము | 2 | 4 |
| అయోధ్యకాండ | 2 | 5 | | | |
| అరణ్యకాండ | 1 | 3 | | | |
| కిష్కింధకాండ | 1 | 4 | విరాటపర్వము | 2 | 4 |
| సుందరకాండ | 1 | 4 | శ్రీరామానుజ భాష్యానుసారముగ ఆంధ్రతాత్పర్యముగల భగవద్గీత | 0 | 14 |
| యుద్ధకాండ | 2 | 5 | | | |
| ఆంధ్రమహాభారత రత్నములు | 0 | 10 | రైతు పత్రిక రెండు వాల్యూములు | 4 | 8 |
| వాల్మీకి రత్నములు | 1 | 7 | | | |

గట్టుపల్లి. శేషాచార్యులు,
మేనేజరు.

12. అశోకచరిత్ర.—కాలికోబైండు వెల రు. 1—4—0, చందాదారులకు 0—13—0 ఇందు 8 చిత్రపటములును 1 దేశపటము గలవు.

13. ప్రభావతి— చరిత్రవిషయకమయిన నవల కాలికోబైండు. చందాదారులకు 0-12-0 లు. ఇతరులకు రు. 1-4-0.

14. పశుశాస్త్రము.—చందాదారులకు 0—12—0 లు. ఇతరులకు రు. 1—4—0

### పునర్ముద్రణలోనున్న గ్రంథములు.

(2) అక్బరుచరిత్ర. (4) వివేకానందస్వామిజీవితము. (5) సిక్కులచరిత్ర. (6) విద్యాసాగరునిచరిత్ర.

### ముద్రణమందున్న గ్రంథములు.

(15) జ్యోతిశ్శాస్త్రము, (16) చీనాచరిత్ర (17) ఔరంగజేబు చరిత్ర.

### ముద్రింప బడవలసిన గ్రంథములు.

ఆంధ్రచరిత్ర, మహారాష్ట్రచరిత్ర రెండవభాగము, అమెరికాచరిత్ర, జపానుచరిత్ర.—

శాశ్వతపు చందాదారులకు 100 పుటలు 0—4—0 చొప్పున నిచ్చుచుందుము, 0—4—0 ప్రవేశరుసుము చెల్లించవలెను. దరఖాస్తులు చేయువారు విలాసము వివరముగ వ్రాయవలెను.

3844 మేనేజరు,
ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము,
మచిలీపట్టణము.

అపూర్వము!   అచ్చులోనున్నది!!   హాస్యరసప్రధానము!!!

# చంద్రరేఖావిలాపము

కూచిమంచి జగ్గకవి ప్రణీతము

సుప్రసిద్ధములై, సలక్షణములై, చరిత్రాత్మకములై, నీతిబోధకములై, శృంగారేతరరస ప్రధానములై విలసిల్లు నిట్టిప్రౌఢప్రబంధ మాంధ్రమున లేదు.

చింతలపాటి నీలాద్రిరాజు, తాను కథానాయకుండుగను వారకాంత యగు చంద్రరేఖ కథానాయికగను, జగ్గకవిచే చంద్రరేఖావిలాసమును వ్రాయించి దాని నక్రమముగ నిరాకరించినందున కవి కుపితుండై దానిని చించివైచి మూఁడాశ్వాసములలో దీనిని రచించి పగదీర్చుకొనెను. ఇంతి పట్టుదలతో చెప్పఁబడుటచేతనే యిందలి ప్రతిపద్యమును హాస్యరసముతో నిండియున్నది. మఱియు "ఈకృతికి సమముగాఁ గృతి లేకపోయిన కొన్నా జాల రిది బిరుదము" అని కవియే దీనినిగూర్చి వ్రాసికొనియున్నాఁడు.

గ్రంథకర్త సుభద్రాపరిణయాద్యనేకకావ్యములు రచించిన సుప్రసిద్ధుఁడు. విశేషించి జగద్విఖ్యాతుఁ డగు తిమ్మకవిసార్వభౌముని తమ్ముఁడు. అచ్చటచ్చట బూతుమాట లుండుటచే నీగ్రంథము లోకుల కలభ్యముగా నున్నది. మేము బూతుమాటలను రసభంగము గాకుండ సవరించి నిర్దుష్టమగు ప్రతిని ప్రకటింపఁబూనుకొన్నారము. ఇప్పు డెందఱును దీనిని చదువ వచ్చును. ఇం దాంధ్ర భాషోజ్జీవకుఁ డగు సీ. పీ. బ్రౌన్ దొరగారి చరిత్రాత్మక మగు పీఠిక కూడ చేర్పఁబడును.

ఇది 1912-వ సం॥ జూన్ నెలలో వెలువడును. అంచెకూలి గాక ప్రతి 1-కి దీనివెల రు. 1-0-0. ఏప్రిల్ నెల ముగియులోపల రు. 0-1-6 పోస్టుస్టాంపులను పంపుచు వీ.పీ. దరఖాస్తు చేయువారికి దీనివెల పోస్టేజితో రు. 0-12-0 లే. అదే గడువులోపల రు. 0-10-0 లు పంపువారికి కిది రిజిస్టరు పోస్టులో ఫ్రీగా పంపఁబడును. 10 ప్రతులు కొనువారి కొకటి యుచితముగా నీయఁబడును. కొలఁది ప్రతులే యచ్చుపడును; తొందరపడినచో కోరికఁగలవు.

గ్రంథసంపాదకుఁడు: కాళ్లకూరి - గోపాలరావు

4 ఆచారప్పన్ లేన్, జార్జిటౌన్, మదరాసు

# మహమ్మదీయమహాయుగము.

రెండవకూర్పు. (Mahammadan Period.) క్యాలికో బైండు.

**500 పుటలు 50 పటములు.**

ఇందు ఆఱుప్రకరణములుగలవు:—1 ముసల్మానులయుత్పత్తి; వారిదేశమునకు వచ్చుట. 2 ఆఫ్‌గాన్ రాజులు. 3 మొగల్ ప్రభుత్వము. 4 దక్షిణములోని మహమ్మదీయరాజ్యములు. 5 రాజపుత్రులశౌర్యాగ్ని. 6 విజయనగర సామ్రాజ్యము.

కొందఱు తలచినట్లు హిందూదేశము మహమ్మదీయులకు సులభముగా వశము కాలేదనియు, హిందువులు అభిమన్యునివలెనే యపరిమితపరాక్రమమును జూపి మోసమునకును, స్వామిద్రోహమునకు లోనై గూడిపోయి రనియు నీగ్రంథమునందు సప్రమాణముగా జూపబడినది.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు, పృథ్వీరాజు, రాణాప్రతాప్, అక్బరు మానసింగ్, నానక్ మొదలయిన మహాత్ములదివ్యమైన పటములు కలవు

శ్రీయుత కె. వి. లక్ష్మణరావు. ఎం. ఎ. గారిచే రచింపబడినది.

చందాదారులకు పోస్టేజితో 1-8-0 ఇతరులకు పోస్టేజి కాక 1-12-0

# ఆంధ్రులచరిత్రము.

ఇది ప్రథమభాగము. శౌర్యమునందును పాండిత్యాతిశయంబునందును, రాజ్యవిస్తారంబునందును పూర్వపు ఆంధ్రులు హిందూదేశములోని యితరదేశములవారికి దీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది! ఇప్పటి యాంధ్రులవలె మన పూర్వపు టాంధ్రులు గూడ కూపస్థమండూకములు అనుకొంటిరా? ఆంధ్రు లొకప్పుడు మగధ సామ్రాజ్యమును, ఇంకొకప్పుడు మహారాష్ట్రమును, మఱియొకప్పుడు యవనద్వీపమును, వేఱొకప్పుడు పాండ్యచోళదేశంబులను జయించి రని మీరు కలనైన నెఱుంగుదురా? ఎఱుఁగనియెడల నీగ్రంథముం జదువుఁడు.

శ్రీయుత చిలుకూరి-వీరభద్రరావు గారిచే రచింపబడినది.

చందాదారులకు పోస్టేజితో 1-0-0 ఇతరులకు పోస్టేజిగాక 1-4-0

---

మేనేజరు విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మదరాసు.

రావుబహద్దూర్ కం. వీరేశలింగముగారి

# స్వీయచరిత్రము.

తెలుఁగు భాషలో స్వీయచరిత్రములు (Auto-Biographics) లేనిలోపమును దీర్చినదీ గ్రంథమే. పంతులవారీ గ్రంథమునందు తమచరిత్రమును ఉన్నది యున్నట్లు వ్రాసియున్నారు. సత్యమునిచ్చక నీగ్రంథము నవలవలె నుండును. అనేకులు మెచ్చుకొని యున్నారు. లోకమాన్యులగు పంతులవారి వచనరచనాపటిమను గూర్చి మేము వేరుగ వ్రాయవలెనా?

మహనీయుల పటము లనేకములు గలవు.

చందాదారులకు పోస్టేజితో రు-1-0-0 ఇతరులకు పోస్టేజిగాక రు-1-8-0

# ఢిల్లీదర్బారు.

పట్టాభిషేక సమయము ! ఇప్పుడే తయారయినది !!

1911 సంవత్సరము డిశంబరు 12 వ తేదీనాఁడు ఢిల్లీనగరమున జరిగిన శ్రీపంచమ జార్జిసార్వభౌముని పట్టాభిషేక గౌరవార్థము ప్రకటింపబడినది. ఇందు ఢిల్లీనగర చరిత్రయు, రాజవంశముల జీవితములును, స్వదేశసంస్థానముల చరిత్రయు, దర్బారుల వర్ణనమును బహురమ్యముగా వ్రాయబడినది. కట్టడములయొక్కయు, రాజులయొక్కయు, పటము లనేకములు గలవు.

చందాదారులకు పోస్టేజితో 1-0-0 ఇతరులకు పోస్టేజిగాక.

మేనేజరు — విజ్ఞాన చంద్రిక, చింతాద్రిపేట. మద్రాసు.

